# బైబులుభాష్య సంపుటావళి

## మూడవ సంపుటం

# బైబులు వాక్యామృతం



Copies : 3,000
First Edition : December 25, 2003

పర్యవేక్షణ :

**Fr. THANAM MARREDY**
Parish Priest
St. Peter's Cathedral
Tarapeta
VIJAYAWADA - 520 001
A.P. INDIA

ముద్రణానుమతి :

**Rt. Rev. MALLAVARAPU PRAKASH**
Bishop of Vijayawada

ప్రచురణ :

**St. PETER'S CATHEDRAL**
Education Desk For The Children
Tarapeta
VIJAYAWADA - 520 001
A.P., INDIA

# మనవి మాట

బైబులు భాష్యం సంచికలను 1972లో ప్రారంభించాం. ఇప్పటికి 157 సంచికలు ముగిసాయి. వీటినే యిప్పుడు పది బైబులుభాష్యం సంపుటాలనుగా ముద్రించాం. ఈ సంచికల్లో ఓ 60 మాత్రం ఇదివరకే "బైబులు గ్రంథమాల" అనే పేరుతో పుస్తక రూపాన్ని సంతరించుకొని పలు ముద్రణలు పొందాయి.

ప్రస్తుతం ఈ 157 సంచికలను, వీటిల్లో వచ్చే అంశాలనుబట్టి, ఓ క్రమపద్ధతిలో అమర్చాం. ఈ సంపుటాల్లో వుంది ప్రధానంగా బైబులు వివరణలు, దైవశాస్త్ర విషయాలు, ప్రార్థనాంశాలు. మన క్రైస్తవ భక్తివిశ్వాసాలను బలపరచేది ముఖ్యంగా ఈ యంశాలే. ఎందరో వేదపండితుల భావాలు ఈ పుస్తకాల్లోకి వచ్చాయి. ఆ మహానుభావులందరికీ వందనాలు.

ఈ పుస్తకాలు మన క్రైస్తవమత సత్యాలను లోతుగా అర్థంచేసికోవడానికీ, ప్రార్థన జేసికోవడానికీ, ఇతరులకు బోధించడానికీ గూడ ఎంతో వుపయోగపడతాయి. కనుక మన గురువులు, మఠకన్యలు, ఉపదేశులు, గృహస్థులు మొదలైనవాళ్లు ఎవరైనాసరే వీటిని వినియోగించుకొని ఆధ్యాత్మిక లాభాన్ని పొందవచ్చు.

చాల సంవత్సరాల పొడుగున కొనసాగించిన రచనలు కనుక ఈ గ్రంథాల్లో పునరుక్తులు అనివార్యమయ్యాయి. పాఠకులు మన్నింతురుగాక. మొదటవ్రాసిన సంచికలకు తర్వాత వ్రాసిన వాటికీ శైలిలోకూడ భేదం వుంది.

మన క్యాతలిక్ సమాజంలో పఠనాభ్యాసం లేదు. ఇది మనం అవశ్యం సవరించు కోవలసిన ప్రధానలోపాల్లో వొకటి. ఇందుకే ఈ గ్రంథాలను చౌకధరకే విక్రయిస్తున్నాం. ఈ పుస్తకాలు మన సాహిత్యరాశిని పెంచి మన ప్రజల్లో పఠనాభిరుచిని ప్రోదిచేస్తాయని ఆశిస్తున్నాం. అసలు తెలుగులో మనకున్న క్యాతలిక్ సాహిత్యమే చాల తక్కువ.

ఫాదర్ టి.మర్రెడ్డిగారి ఆర్థిక సహాయంలేందే ఈ సంపుటాలు ఇప్పుడు, ఈ రూపంలో వెలుగు చూచేవి కావు. ప్రభువు ఆ మహనీయుని దీవించి ఆయన కృషిని సఫలీకృతం జేయునుగాక. విజయవాడ మేత్రాసనం తరపుననే ఈ పుస్తకాలను ప్రచురిస్తున్నాం.

ఈ సంపుటాల్లో రచయిత 31 ఏండ్ల పొడుగున కొనసాగించిన అవిరళకృషి దాగివుంది. కరుణామయుడైన ప్రభువు యెరూషలేం దేవాలయంలోని సాయంకాలపు ధాన్యబలినివలె ఈ సాహిత్యబలిని గూడ నెనరుతో స్వీకరించునుగాక.

ఈ పుస్తకాలకు పరిచయవాక్యాలు వ్రాసియిచ్చిన విజయవాడ పీఠాధిపతులు, పూజ్యులు, మహాఘనత వహించిన డాక్టరు ఎం.ప్రకాష్‌గారికి నమస్సుమాంజలులు. వీటిని సర్వాంగసుందరంగా ముద్రించిన శ్రీ పి.సాంబిరెడ్డిగారికి వారి సిబ్బందికి, ఓపికతో ప్రూఫులు దిద్దిన శ్రీ వి. గోపాలరెడ్డిగారికి మా కృతజ్ఞతలు.

– గ్రంథకర్త

# ముందుమాట

ఫా.జోజయ్య గారు తమ రచనల ద్వారా ఆంధ్ర శ్రీసభకు సుపరిచితులు. వారి అవిరళకృషి, సేవాతత్పరత, తెలుగులో చక్కని సాహిత్యాన్ని రాయాలనే తపన, దానికితగిన అంకితభావం వేనోళ్ల కొనియాడదగింది. వీరు రచించిన చిన్నచిన్న పుస్తకాలను సంకలనం చేయడం అనే ప్రక్రియ వీరి జీవితకాలంలోనే జరగకపోయినట్లైతే, ఈ గొప్ప సాహిత్యాన్ని కోల్పోయే అపాయం వుండేది. అరుదుగా పాఠకులకు తెలుగులో లభ్యమయ్యే బైబులును మరియు కతోలిక వేదాంతమునకు సంబంధించిన అంశాలను క్షుణ్ణంగా పరిశోధన జరిపి చక్కని భాషలో ఆంధ్ర కతోలిక సంఘానికి గత ముప్పది సంవత్సరాలపైగా అందించారు ఫా.జోజయ్య గారు.

తెలుగు కతోలిక శ్రీసభకు, బైబులును క్రైస్తవ సిద్ధాంతాలను అర్థం చేసుకోవాలన్న కోరిక గల క్రైస్తవేతరులకు ఫా.జోజయ్య గారు గొప్ప వరమని నేను భావిస్తున్నాను. వీరి రచనలు సత్యాన్ని అన్వేషించడం యెడల ఆయనకున్న పట్టుదలకు, అందరికి జ్ఞానోదయాన్ని కలిగించాలన్న తపనకు, మరియు ఆంధ్ర శ్రీసభ పురోభివృద్ధి యెడల ఆయనకున్న తృష్ణకు నిదర్శనాలు. సరళమైన స్వచ్ఛమైన, సామాన్య ప్రజలకు అర్థమయ్యే తెలుగుభాషలో రచింపబడిన ఈ పుస్తకాలను చదివి, ఆధ్యాత్మిక జీవిత వికాసానికి క్రైస్తవ సిద్ధాంతాలను లోతుగా అర్థం చేసికోవటానికి వీటిని వినియోగించుకోవాలని కోరుతున్నాను. ఎంతో నేర్పుతో, క్రమపద్ధతిలో విభజింపబడిన రచనలను "బైబులు భాష్య సంపుటావళి" అన్న పేరుతో పదిసంపుటాలుగా అచ్చు వేస్తున్నందుకు అభినందిస్తున్నాను. ఈ గ్రంథాల ప్రచురణ బాధ్యతను తన భుజాలపై వేసికొని, సమయాన్ని వెచ్చించి, వలసిన ఆర్థిక వనరులను చేకూర్చినందుకు, ఆంధ్ర శ్రీసభకు ఉపయోగకరమైన ఈ సాహిత్యాన్ని ప్రజలకు అందించాలనే మంచికార్యాన్ని చేపట్టి విజయంతంగా పూర్తి చేసినందుకు ఫా.మర్రెడ్డి గారిని నా హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

ఆణిముత్యాల్లాంటి ఈ రచనలను ఆధ్యాత్మిక సంపత్తిగా అందరూ గుర్తించాలని, కతోలిక క్రైస్తవ సమాజమంతా ముఖ్యంగా మేత్రాణులు, గురువులు, మఠవాసులు అందరు ఈ కృషిని అభినందించాలని, ఆదరించాలని నా ఆకాంక్ష. మన ప్రజల స్తోమతకు తగినట్లుగా వీటి వెల కూడ చాల తగ్గించడమైనది. కావున ప్రతి ఒక్కరు, గ్రంథాలయాలు, ఆశ్రమాలు, మఠాలు, కతోలిక కేంద్రాలు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని నా మనవి.

ఫా.జోజయ్య గారు చేసిన ఈ కృషిని మరోసారి అభినందిస్తూ, వారు ఇంకా ఆంధ్ర శ్రీసభకు తమ అమూల్యమైన సేవలను రానున్న కాలంలో అందించాలని మనసారా కోరుకుంటూ, ప్రార్థిస్తూ...

ఇట్లు
మీ జ్ఞానతండ్రి
**+ మల్లవరపు ప్రకాష్**
విజయవాడ పీఠాధిపతులు

# 1. ప్రవక్త



**విషయసూచిక**



## 1. ప్రవక్తల పిలుపు

ప్రభువు తనకు సేవలు చేయడానికి వివిధ మనస్తత్వాలు గల ప్రవక్తలను ఎన్నుకొన్నాడు. వీళ్ళు చాలమంది వున్నారు. ప్రస్తుతం కొందరిని గూర్చి విచారిద్దాం.

### 1. సమూవేలు

క్రీస్తు పూర్వం పదవ శతాబ్దంలో ప్రభువు సమూవేలును పిల్చాడు. అప్పుడు యూదులు షిలోనగరంలో గుడారాన్ని పెట్టుకొని అక్కడే ప్రభువుని ఆరాధిస్తూండేవాళ్ళు. ఆ రోజుల్లో ఏలీ పెద్ద గురువుగా వుండేవాడు. సమూవేలు చిన్న బాలుడుగా దేవళంలో సేవలు చేస్తున్నాడు. ఓనాడు అర్థరాత్రిలో సమూవేలు మందసంవద్ద పండుకొని నిద్రపోతుండగా ప్రభువు అతన్ని పిల్చాడు. సమూవేలు ఏలీయే తన్ను పిలుస్తున్నాడేమో ననుకొని ఆ ముసలివాని వద్దకు వెళ్ళి అతన్ని తట్టి లేపాడు. కాని యేలీ "నాయనా! నేను నిన్ను పిలువలేదు. వెళ్ళి పండుకో" అన్నాడు. ఈలా మూడుసార్లు జరిగింది. మూడవమారు ఏలీ ప్రభువే బాలుణ్ణి పిలుస్తున్నాడేమోనని శంకించాడు. దేవుడు మళ్ళా పిలిస్తే పిల్లవాడు ఏమి చెప్పాలో గూడ నేర్పించాడు. రాత్రిలో నాల్గవమారు దేవుడు మళ్ళా సమూవేలుని పిల్చాడు. ఆ బాలుడు "ప్రభూ! నీ దాసుడు ఆలించడానికి సిద్ధంగానే వున్నాడు, సెలవీయి' ' అన్నాడు. అప్పుడు ప్రభువు సమూవేలుకి తన సందేశం విన్పించాడు. అప్పటి నుండి అతడు ప్రభువు ప్రవక్తగా నియుక్తుడయ్యాడు - 1సమూ 3,1-10.

## 2. యెషయా

ఎన్మిదవ శతాబ్దంలో ప్రభువు యెషయాను పిల్చాడు. అతడు ఓ దినం సాయంకాలం దేవాలయానికి ఆరాధనకు వెళ్ళాడు. దేవళంలో అతనికి ప్రదర్శనం లభించింది. ప్రభువు రాజఠీవితో సింహాసనం మీద ఆసీనుడై వున్నాడు. అతని చుట్టూ దేవదూతలు కైవారం చేస్తూ "మా ప్రభువు పరిశుద్ధుడు పరిశుద్ధుడు పరిశుద్ధుడు" అని గానం చేస్తున్నారు. యెషయా నా కంటితో ప్రభువుని దర్శించాను ఇక నేను నాశమైపోతానేమోనని భయపడ్డాడు. అప్పుడు ఓ దేవదూత బలిపీఠం మీద కణకణమండే నిప్పుకణికను తెచ్చి అతని పెదవులను కాల్చాడు. దానితో ప్రవక్త దోషం పరిహారమైంది, అతడు శుద్ధిని పొందాడు. అంతట ప్రభువు నా తరపున ప్రవక్తగా ఎవడు వెళ్తాడు అని ప్రశ్నింపగా యెషయా నేనున్నాను గదా నన్ను పంపమని ముందుకు వచ్చాడు. ఆ రీతిగా అతడు ప్రభువు ప్రవక్త అయ్యాడు - యెష 6, 1-8.

## 3. యిర్మీయా

ప్రభువు ఏడవ శతాబ్దంలో యిర్మీయాను పిల్చాడు. "నీవు మాతృగర్భంలో రూపొందక మునుపే నిన్ను గూర్చి నాకు తెలుసు. నీవు పుట్టకమునుపే నిన్ను పవిత్రుణ్ణి చేసి జాతులకు ప్రవక్తగా నియమించాను" అన్నాడు. యిర్మీయా ప్రభూ! నేను పసివాణ్ణి. నాకు ఏలా మాట్లాడాలో తెలీదు. నీవు మరొకణ్ణి ఎన్నుకో అని వెనుకంజ వేసాడు. కాని ప్రభువు అతన్ని ప్రోత్సహించి "నేను పంపదలచుకొన్న వాళ్ళందరివద్దకు నీవు వెళ్ళాలి. నీవు వాళ్ళకు భయపడవద్దు. నేను నీకు తోడై యుంటాను" అని చెప్పాడు. అటుపిమ్మట ప్రభువు తన వాక్కుని తీసి యిర్మీయా నోటిలో పెట్టాడు. దానితో అతడు ప్రభువు ప్రవక్త ఐపోయాడు - యిర్మీ 1,4-10.

## 4. యెహెజ్కేలు

యెహెజ్కేలు ఓ దర్శనంలో ప్రభువు చేయిచాపి ఓ వ్రాతప్రతిని తన కందిస్తూండగా చూచాడు. ప్రవక్త ఆ గ్రంథాన్ని భుజించాలనీ అటుపిమ్మట యిస్రాయేలీయుల వద్దకు వెళ్ళి వాళ్ళకు బోధించాలనీ ప్రభువు ఆజ్ఞ యిచ్చాడు. దేవుడు చెప్పినట్లే ప్రవక్త ఆ పుస్తకాన్ని భక్షించాడు. అది అతని నోటికి తేనెలాగ తీయగా వుంది. ఆ గ్రంథ భక్షణంతో అతడు ప్రవక్త అయ్యాడు - యెహె 2,8-3,3. ఈ దర్శనం భావం ఏమిటి? ప్రవక్త చెప్పే సందేశం అతనిది కాదు. అతడు మొదట దేవుని నుండి ఆ సందేశం వింటాడు. దాన్ని చక్కగా జీర్ణం చేసికొంటాడు. అటుపిమ్మట ప్రజల వద్దకు వెళ్ళి వాళ్ళకు ఆ సందేశాన్ని విన్పిస్తాడు. అనగా ప్రవక్త సొంత సందేశాన్ని కాక, దేవుని సందేశాన్ని విన్పించేవాడని భావం.

## 5. ఆమోసు

ప్రభువు ఎన్మిదవ శతాబ్దంలో ఆమోసును పిల్చాడు. ఇతడు చదువు సంధ్యలు లేని అనాగరికుడు. గొర్రెల మందలను కాచుకొంటూ అంజూరపు నారు పెంచుతూ బ్రతికేవాడు. ఐనా ప్రభువు ఈలాంటివాణ్ణి ప్రవక్తగా ఎన్నుకొన్నాడు. కనుక అతడు ప్రవచనం చెప్పడం ప్రారంభించాడు. ఆ ప్రవక్త తన అనుభవాన్ని ఈలా చెప్పుకొన్నాడు. సింహం గర్జిస్తే ఎవరైనా భయపడకుండా వుంటారా? ప్రభువు ఆదేశిస్తే ఎవరైనా ప్రవచనం చెప్పకుండా వుంటారా? ప్రభువు తన భక్తులైన ప్రవక్తలకు ముందుగా తెలియజేయకుండా ఏకార్యమూ చేయడు" - ఆమో 7,14-15 ; 3,7-8.

## 6. నూత్నవేద ప్రవక్తలు

పైన పూర్వవేద ప్రవక్తలను కొందరిని చూచాం. ఇక నూత్న వేద ప్రవక్తలు కూడ వున్నారు. తొలినాటి క్రైస్తవులకు యెరూషలేము ఒక కేంద్రంగాను అంతియొకయ మరియొక కేంద్రంగాను వుండేది. అగబు అనే ప్రవక్త యెరూషలేము నుండి అంతియొకయ కేంద్రానికి వచ్చి దేశమంతటా కరువు వస్తుందని ముందుగానే ప్రవచనం చెప్పాడు. అతడు చెప్పినట్లుగానే క్లౌదియా చక్రవర్తి కాలంలో ఈ కాటకం సంభవించింది - అ చ 11,27-28.

తొలిరోజుల్లో క్రైస్తవ మతంలో చేరినవాళ్ళంతా యూదులు. అన్యజాతి జనులైన గ్రీకులు రోమనులు ఇంకా క్రైస్తవ మతాన్ని పుచ్చుకోలేదు. వాళ్లకు క్రీస్తుని బోధించవలసిన వాడు పౌలు. కనుక పరిశుద్ధాత్మ అంతియొకయ సమాజంలో వున్న ప్రవక్తలను ప్రేరేపించి వాళ్ళచేత పౌలుని గూర్చి ప్రవచనం చెప్పించింది. వాళ్లు లేచి "నేను నియమించిన పనికై పౌలును బర్నబాను పంపండి" అని ప్రవచించారు. ఆ ప్రవచనానికి విధేయులై పౌలు బర్నబాలు అన్యజాతి జనులకు క్రీస్తుని బోధించడానికై బయలుదేరి వెళ్ళారు - అచ 13, 1-3.

పౌలు మూడు ప్రేషిత ప్రయాణాలు చేసి గ్రీసు రోమను రాజ్యాల్లో అన్యజాతి ప్రజలకు క్రీస్తుని బోధించాడు. అతడు మూడవ ప్రయాణంలో తూరు పట్టణంలో వుండగా అక్కడి విశ్వాసులు పౌలుకు యెరూషలేములో బాధలు కలుగుతాయని ప్రవచించారు. అక్కడికి వెళ్ళవద్దని అతన్ని హెచ్చరించారు - అ చ 21,4. కొంతకాలానికి పూర్వం అలాంటి హెచ్చరికనే మరికొందరు ప్రవక్తలు కూడ అతనికి విన్పించారు - అ చ 20,23.

పౌలు మూడవ ప్రేషిత ప్రయాణం ముగించి యెరూషలేము చేరకముందు కైసరియాలో ఫిలిప్పు అనే సువిశేష బోధకుని యింట బసచేసాడు. ఈ ఫిలిప్పుకి నల్గురు

కుమార్తెలున్నారు. వాళ్లందరూ అవివాహితలూ, ప్రవచనం చెప్పేవాళ్ళు. పౌలు అక్కడ బస చేస్తుండగానే యూదయా నుండి అగబు ప్రవక్త వచ్చాడు. అతడు పౌలు తోలు నడికట్టు తీసికొని తన కాళ్ళుచేతులు బంధించుకొన్నాడు. "ఈ నడికట్టు ఎవరిదో అతనిని యూదులు యెరూషలేములో ఈలాగే బంధించి అన్యజాతి జనులకు అప్పగిస్తారు" అని ప్రవచనం చెప్పాడు. అతడు చెప్పినట్లుగానే తర్వాత యూదులు యెరూషలేములో పౌలుని బంధించారు - అ చ 21,8-11.

పై సంఘటనలు ప్రవక్తల పిలుపునీ వాళ్ళు చేసిన పనులనీ తెలియజేస్తాయి.

## 7. ప్రవక్త లక్షణాలు

ప్రవక్త అంటే చక్కగా మాట్లాడేవాడని వ్యుత్పత్త్యర్థం. అనగా అతడు దేవుని తరపున ప్రజలతో మాట్లాడేవాడు. దేవుని సందేశాన్ని ప్రజలకు విన్పించేవాడు. దేవుని దూతగా, వార్తావహుడుగా వ్యవహరించేవాడు. "అప్పుడు ప్రభువు దూతయైన హగ్గయి ప్రభువు సందేశాన్ని ప్రజలకు ఈలా విన్పించాడు : ప్రభువు నేను మీకు తోడై యుంటాను అని పల్కుతున్నాడు" - హగ్గ 1,13. ఈ వాక్యంలో ప్రవక్త లక్షణాలన్నీ వున్నాయి. మామూలుగా ప్రవక్తలు చెప్పే వాక్యాలు ఈలాగే వుంటాయి.

యిర్మీయాకు ఓమారు కపట ప్రవక్తలతో వివాదం వచ్చింది. యథార్థమైన ప్రవక్త ఎవడు అన్న ప్రశ్న వచ్చింది. ప్రభువు వాక్యాన్ని స్వయంగా విన్నవాడే ప్రవక్తగాని ఎవడు పడితే వాడు కాదు అన్నాడు యిర్మీయా. "ఈ ప్రవక్తల్లో ఎవడూ ప్రభువు సభలో పాల్గొనలేదు. ఎవడు కూడ అతని వాక్యాన్ని వినలేదు, అర్థం చేసికోలేదు., ఆలించి చూడలేదు" అన్నాడతడు - యిర్మీ 23,18. ఇక్కడ "ప్రభువు సభలో పాల్గొనడం" అంటే ఆ ప్రభువు విన్పించే సందేశాలను వినడం. ప్రభువు కొలువుదీర్చి భక్తులకు తన వాక్కును విన్పిస్తాడు. అనగా నిజమైన ప్రవక్తకు దేవుడు తన సందేశాన్ని తెలియజేస్తాడు. యిర్మీయా ప్రభువు వాక్కు ఈలా విన్నాడు. దేవుని వద్ద నుండి విన్న సందేశాన్ని తాను మళ్ళా ప్రజలకు విన్పించాడు. ప్రభువు ప్రవక్త హృదయంలోనే ఈ సందేశాన్ని విన్పిస్తాడు. కాని కపటి ప్రవక్తలు ఈలా దేవుని సందేశాన్ని వినరు. వాళ్ళు దేవుని కొలువులోకి రానేలేదు. కనుక వాళ్లు చెప్పేవి కేవలం వాళ్ల భావాలు మాత్రమే.

దేవుని సందేశాన్ని విన్పించడం ప్రవచనానికుండే ముఖ్య లక్షణం. కాని వాళ్ళు ఈ దివ్య సందేశాన్ని ఏలా వినగలిగారు? ప్రవక్తలు పవిత్రాత్మచే ప్రేరితులై దేవుని సందేశాన్ని చెప్పారు - 2పేత్రు 1,21. ఆత్మశక్తి ప్రవక్తల్లో బలంగా పనిచేస్తుంది. ఆ శక్తితోనే వాళ్ళు ప్రవచనం చెప్పారు. కనుకనే ప్రవక్త చెప్పిన పలుకు నెరవేరి తీరేది.

ఓమారు ప్రభువు ఆత్మ బాబిలోను ప్రవాసంలో వున్న యెహెజ్కేలు ప్రవక్తను ఓ యుద్ధభూమికి కొనిపోయింది. ఆ రణరంగంలో చాలయేండ్ల క్రితమే వీరులు పోరాడి మరణించి వున్నారు. వాళ్ల ఎముకలు కుప్పలుగా పడివున్నాయి. ఆత్మ ప్రవక్తను ఆ యెముకలు సజీవులైన మానవులయ్యేలా ప్రవచింపమంది. అతడు అలాగే ప్రవచించాడు. వెంటనే ఆ యస్థులన్నీ పూర్వపు నరుల దేహాలను పొందాయి. కాని ఆ దేహాల్లో ఇంకా ప్రాణంలేదు. ఆ శరీరాల్లోకి ప్రాణం కూడ రావాలని ప్రవక్త మళ్ళా రెండవమారు ప్రవచించాడు. వెంటనే ఆ వీరులంతా సజీవులై లేచి నిలబడ్డారు.

ఈ సంఘటనమంతా ఓ సంకేతం. ఆ యెముకల గూళ్లు సజీవులైన మానవులైనట్లుగానే ప్రవాసంలో వున్న యిస్రాయేలు ప్రజలు కూడ చైతన్యం పొందుతారు. వాళ్లు బాబిలోనులో తమ ప్రవాసం ఇంకా యెన్నాళ్ళు కొనసాగుతుందో అని నిరుత్సాహ పడుతున్నారు. అక్కడ వాళ్ళు చచ్చి సమాధి చేయబడిన వాళ్ళలాగ నిరుత్సాహంగా రోజులు సాగిస్తున్నారు. కాని ప్రభువు వారిని ఆ ప్రవాసమనే సమాధిలో నుండి బయటికి తీస్తాడు. తన ఆత్మను వాళ్లమీద కుమ్మరించి వాళ్లను సజీవులను చేస్తాడు. ఆ యెముకల్లాగే ఆ ప్రజలు కూడ జీవంతో లేస్తారు, చైతన్యంతో యెరూషలేముకు తిరిగివెళ్తారు – యెహె 37.

ఇక్కడ ఆత్మశక్తితో ప్రవక్త పల్కిన వాక్కు వీరుల అస్థిపంజరాలకు జీవం కలిగించింది. ప్రవక్త వాక్కులో అంత శక్తి వుంటుంది. ఆ శక్తికి కారణం ఆత్మే.

ఈలాగే ప్రభువు ఆత్మ యెషయా ప్రవక్తను ఆవేశించింది. ఈ యాత్మ ప్రేరణంతో అతడు పీడితులకూ బాధితులకూ సువార్తను ప్రకటించడానికి పూనుకొన్నానని చెప్పుకొన్నాడు – 61,1. క్రీస్తుకూడ తన బహిరంగ జీవితారంభంలో నజరేతుకు వెళ్ళినపుడు అక్కడి ప్రార్థనామందిరంలో హీబ్రూ బైబులునుండి ఈ ఘట్టాన్నే యెత్తి చదివాడు. అది తనకు అక్షరాల వర్తిస్తుందని చెప్పాడు. అతడు గూడ ఆత్మచే ప్రేరితుడై బోధించిన మహాప్రవక్త గదా! – లూకా 4,18–21.

మీకా తన ప్రవచనాన్ని గూర్చి యీలా చెప్పుకొన్నాడు :

"ప్రభువు నన్ను తన ఆత్మతో నింపి బలాఢ్యుణ్ణి చేసాడు
ధైర్యమూ న్యాయబుద్ధీ నాకు దయచేసాడు
కనుక యిస్రాయేలీయులకు నేను
వాళ్ళ తప్పిదాలను ఎరుకపరుస్తాను"

– మీకా 3,8.

ఈలాంటి సందర్భాలను బట్టి ప్రవక్త ఆత్మచే ప్రేరితుడై ప్రవచనం చెప్పాడని అర్థం చేసికోవాలి.

మన క్యాతలిక్ సంప్రదాయంలో ప్రవక్తను "దీర్ఘదర్శి" అంటాం. దీర్ఘదర్శి అంటే భవిష్యత్తును తెలియజెప్పేవాడని అర్థం. ప్రవక్తలు ఒకోమారు భవిష్యత్తును గూడ తెలియజేసారు. కాని అది వాళ్ళ ప్రవచనంలో ముఖ్యాంశం కాదు. ముఖ్యమైంది దైవసందేశాన్ని ఎరిగించడం, అంతే. కనుక దీర్ఘదర్శి అనేమాట కంటె ప్రవక్త అనే పదం మెరుగైంది.

## 2. ప్రవక్తల సేవలు

ప్రవక్తలు యిస్రాయేలు సమాజానికి రకరకాల సేవలు చేసారు. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

### 1. ప్రభువు ఉద్యమాన్ని నడిపించారు

పూర్వవేదంలో ప్రభువు సీనాయి కొండ దగ్గర యూదులతో ఒడంబడిక చేసికొన్నాడు. మోషేద్వారా వాళ్ళకు ధర్మశాస్త్రాన్ని ప్రసాదించాడు. కాని యూదులు మాటిమాటికి ప్రభువుని విస్మరించి ఈ ధర్మశాస్త్రాన్ని మీరుతుండేవాళ్లు. అలాంటప్పుడు ప్రవక్తలు ప్రజలను చీవాట్లు పెట్టి ఈ ధర్మశాస్త్రాన్ని పాటించమని హెచ్చరిస్తుండేవాళ్లు. ఉదాహరణకు జనులు ధర్మశాస్త్రాన్ని మీరి పేదప్రజలను పీడిస్తుండగా ఆమోసు ప్రవక్త

"నీతి ఓ నదిలా పొంగిపారాలి
న్యాయం ఓ జీవనదిలా ప్రవహించాలి"

అని ప్రవచించాడు - 5,24. సాంఘిక న్యాయాన్ని గూర్చి అతడు చేసిన హెచ్చరికల వలన నాటి సమాజంలో కొంత మార్పు వచ్చింది.

అలాగే అగబు ప్రవక్త రోమను సామ్రాజ్యంలో రాబోయే కరువును గూర్చి ముందుగానే హెచ్చరించాడు. ఈ కరువు 49-50 సంవత్సరాల్లో వచ్చింది. పౌలు అతని శిష్యులు ఈ కరవును పురస్కరించుకొని పేదలకు సహాయం చేయడానికి పూనుకొన్నారు. డబ్బును ప్రోగుజేసి యెరూషలేములోని పేదవారికి సహాయంగా పంపారు. ఈ సహాయోద్యమానికి అగబు ప్రవచనమే నాంది - అ చ 11,27-30. ఈలా ప్రవక్తలు ప్రభువు ఉద్యమాలను నడిపించారు.

### 2. ప్రభువు వాక్యాన్ని విన్పించారు

ప్రవక్త ప్రభువు వార్తావహుడు అన్నాం. కనుక అతడు ప్రభువు వాక్యాన్ని ప్రజలకు విన్పిస్తాడు. ఉదాహరణకు హిజ్కియారాజు జబ్బుగా పడివున్నాడు. ప్రభువు యెషయా ప్రవక్త ద్వారా అతడు చనిపోతాడని చెప్పించాడు. ఆ మాటలకు రాజు దిగులుపడి

కన్నీళ్లు కారుస్తూ తన్ను కాపాడమని ప్రభువుని ప్రార్థించాడు. యెషయా అప్పుడే రాజుని వీడ్కొని రాజప్రాసాదం మధ్యకు వచ్చాడు. వెంటనే ప్రభువు వాణి అతనితో “నీవు మళ్ళా వెనక్కుపోయి నా భక్తుడైన హిజ్కియాతో అతడు మరణింపడని చెప్పు. నేను అతని ఆయుస్సును ఇంకా పదునైదేండ్లు పొడిగించానని కూడ చెప్పు” అంది. యెషయా ఆ సందేశాన్ని రాజుకి విన్పించాడు. అతడు చెప్పినట్లే రాజు బ్రతికాడు కూడ - 2 రాజులు 20,1-6.

ఇదే యెషయా యిస్రాయేలును కాయలు కాయని తోటతో ఉపమించాడు. ప్రభువు యిస్రాయేలీయులను ఓ ద్రాక్ష తోటను లాగ గారాబంగా పెంచినా వాళ్ళు మూర్ఖులై సత్ఫలితాల నీయడం లేదు. కనుక ప్రభువు వాళ్ళను దారుణంగా శిక్షిస్తాడు అన్నాడు ప్రవక్త - యెష 5,7. ఈలా ప్రవక్తలు రకరకాల రూపాల్లో ప్రభు వాక్యాన్ని విన్పించేవాళ్ళు.

ప్రభువుకి ప్రజల మీద కోపం వచ్చినపుడు వాళ్ళను కరువుతో శిక్షిస్తాడు. ఈ కరువు కూటికీ గుడ్డకీ గాదు. ప్రభు వాక్యానికే. అనగా ప్రవక్తలు ప్రభువు వాక్యాన్ని ప్రజలకు విన్పించరు. ప్రభువు వాక్యం విన్పడకపోవడ మనేది అన్ని కరవులకంటె పెద్ద కరవు - ఆమో 8,11.

## 3. ప్రజలను ప్రోత్సహించారు

ప్రవక్త పల్కిన ప్రవచనం తన నాటి జనాన్ని ప్రోత్సహించేది. వాళ్ళను కార్యాచరణకు పురికొల్పేది. బాబిలోను ప్రవాసం ముగియగా యూదులు క్రీస్తు పూర్వం 538 ప్రాంతంలో పాలస్తీనా దేశానికి తిరిగి వచ్చారు. పడిపోయిన నగర ప్రాకారాన్ని పునర్నిర్మించి దేవళాన్ని మళ్ళా కట్టడానికి పూనుకొన్నారు. కాని శత్రువులు అంతరాయం కల్గించడం వల్లా, ప్రజల్లో నిరుత్సాహం పేరుకొని పోవడం వల్లా దేవాలయ నిర్మాణం చురుకుగా కొనసాగడం లేదు. అప్పుడు హగ్గయి అనే ప్రవక్త ముందుకు వచ్చి ప్రజలను ప్రోత్సహిస్తూ ప్రవచనం చెప్పడం ప్రారంభించాడు. ప్రభువు మీకు చేదోడు వాదోడుగా వుంటాడు, మీరు మాత్రం వెనుకంజ వేయకుండా దేవాలయం కట్టండి అన్నాడు. దానితో నాటి రాష్ట్రాధికారియైన సెరుబ్బాబెలుకూ ప్రధాన యాజకుడైన యోషువాకూ పౌరులకూ ప్రేరణం కలిగింది. వాళ్ళంతా మిన్నులు ముట్టిన ఉత్సాహంలో కదలివచ్చి దేవాలయ నిర్మాణానికి పూనుకొన్నారు, దాన్ని కట్టి ముగించారు కూడ - హగ్గ 1,13-15.

ప్రవక్త చెప్పే ప్రవచనం వలన ప్రజలకు ప్రోత్సాహమూ ఆదరణమూ కలుగుతాయన్నాడు పౌలు - 1కొ 14,3. సీలా, యూదా అనే ప్రవక్తలు అంతియోకయ లోని క్రైస్తవులను ప్రోత్సహించి బలపరచారని కూడ వింటున్నాం - అ చ 15,32.

## 4. తప్పులను సరిదిద్దారు

దావీదు రాజు ఊరియా అనే సైనికుని భార్య బత్షేబాను మోహించాడు. ఉరియాను యుద్ధంలో మొదటి వరుసలో పోరాడ నియమించి మోసంతో చంపించాడు. అప్పుడు ప్రభువు ఉగ్రుడై ఆ రాజును చీవాట్లు పెట్టించడానికి నాతాను ప్రవక్తను పంపాడు. ప్రవక్త రాజుకు ఓ కథ చెప్పాడు. ఓ నగరంలో ఓ పేదవానికి చాల మందలున్నాయి. ఓదినం ఆ ధనవంతుని యింటికి చుట్టం వచ్చాడు. ధనవంతుడు తనకు అన్ని గొర్రెలున్నా బలత్కారంగా పేదవాడి గొర్రెపిల్లను తీసికొని చుట్టానికి విందు చేయించాడు - అన్నాడు. ఆ మాటలకు దావీదు మండిపడి అలాంటి అన్యాయానికి పాల్పడినవాడు నాల్గంతలు నష్ట పరిహారం చెల్లించాలి అన్నాడు. అప్పుడు ప్రవక్త ఈ దుష్కార్యం చేసింది నీవే. నీకు ఇందరు భార్యలుండగా ఊరియా భార్యను అపహరించావు. ఆ పాపం చాలదో అన్నట్లు ఆమె భర్తను కూడ వంచనతో యుద్ధంలో చంపించావు అన్నాడు. దావీదుకు కనువిప్పు కలిగింది. అతడు పశ్చాత్తాపపడ్డాడు, ప్రభు క్షమాపణం పొందాడు - 2సమూ 12. ఈ విధంగా ప్రవక్తలు తమ ప్రవచనంతో దుష్కార్యాలు చేసినవాళ్ళను మందలించారు. వాళ్ళ తప్పులను సరిదిద్దారు.

ఆమోసు తన నాటి న్యాయమూర్తులు లంచాలు తీసికొంటూండగా వాళ్ళను ఖండించాడు. నాటి ధనవంతులు పేదలను పీడించే తీరును నిశితంగా విమర్శించాడు :

“అన్యాయపు న్యాయమూర్తులు లంచాలు తీసికొని
మంచివాళ్ళను అమ్మివేస్తున్నారు
ఒక జోడు చెప్పులు లంచంగా పుచ్చుకొని
పేదవాణ్ణి అమ్మివేస్తున్నారు
ధనవంతులు దరిద్రులను క్రింద పడవేసి
కాలితో త్రొక్కుతున్నారు
వాళ్ళను త్రోవనుండి ప్రక్కకు నెడుతూన్నారు
తండ్రీ  కొడుకూ ఒకే స్త్రీని కూడి
ప్రభువు నామం అపవిత్ర పరుస్తూన్నారు” - 2,6-7

కాని ప్రవక్తలు చీవాట్లు పెట్టినవాళ్ళంతా తమ తప్పులను సవరించుకోలేదు. అహాబురాజు కాలంలో నాబోతు అనే రైతు వుండేవాడు. అతని పొలం రాజు మేడకు ఆనుకొనివుంది. రాజు నేను కూరగాయలు పండించుకొంటాను ఆ పొలం నా కమ్మమని అడిగాడు. కాని నాబోతు అది పిత్రార్జితమైన భూమి కనుక నేను అమ్మను అన్నాడు. అహాబు భార్య యెసెబులు కుట్ర పన్నింది. ఇద్దరు దుర్మార్గుల చేత నాబోతు దేవదూషణం

పలికాడని కూటసాక్ష్యం చెప్పించింది. అతన్ని రాళ్ళతో కొట్టి చంపించింది. ఆపిమ్మట నాబోతు పొలాన్ని అహాబు స్వాధీనం చేసికొన్నాడు. అప్పుడు యేలీయా ప్రవక్త ప్రభువు ప్రేరణంతో రాజు దగ్గరికి వచ్చి "నీవు ఓ పేదవాణ్ణి చంపించి వాడి పొలాన్ని ఆక్రమించుకొన్నావు. సరే విను. నాబోతు నెత్తుటిని కుక్కలు నాకిన తావుననే నీ నెత్తురు కూడ శునకాలు ముడతాయి. కుక్కలు యెసెబెలు శవాన్ని కూడ పీకుకొని తింటాయి" అన్నాడు. తర్వాత ప్రవక్త చెప్పినంత జరిగింది– 1రాజులు 21. ఈలా ప్రవక్తలు దుర్మార్గపు పనులు చేసినవాళ్ళను మందలించేవాళ్ళు. అసలు వాళ్ళకు "యిస్రాయేలు అంతరాత్మ" అని పేరు. ఎప్పుడైనా మనం పాడుపనులు చేస్తే మన అంతరాత్మ మనలను హెచ్చరిస్తుంది కదా! అలాగే యిస్రాయేలీయులు ధర్మశాస్త్రానికి వ్యతిరేకంగా కాని పనులు చేసినపుడు ప్రవక్తలు వాళ్ళను హెచ్చరించేవాళ్ళు. కనుకనే వాళ్ళకు "అంతరాత్మ" అనే పేరు సార్థకమైంది.

## 5. అధికారులకు సలహా యిచ్చారు

పాలస్తీనా దేశం బాబిలోనియా ఐగుప్తు అనే రెండు పెద్దదేశాలకు మధ్య వున్న చిన్నదేశం. ఆవులు ఆవులు పోట్లాడు కొంటే మధ్యలో దూడలు కాళ్ళు విరిగి చస్తాయి కదా! అలాగే బాబిలోనియా ఐగుప్తు పోట్లాడుకొనేప్పుడెల్ల పాలస్తీనా దేశం నాశమయ్యేది. ఓమారు పై రెండు దేశాలు పోరాడుకొంటున్నాయి. యిస్రాయేలు రాజైన సిద్కియా ఐగుప్తు గెలుస్తుందన్న తలంపుతో ఆ దేశపు రాజుతో సంధి చేసికోబోయాడు. కాని యిర్మీయా దైవప్రేరితుడై బాబిలోనియా గెలుస్తుందని చెప్పాడు. బాబిలోను ప్రభువైన నెబుకద్నెసరుతో సంధి చేసికొమ్మని సిద్కియాకు సలహా యిచ్చాడు. ఐనా రాజు మూర్ఖుడై ప్రవక్త సలహాను పాటింపలేదు.

ఆ రోజుల్లో హనన్యా అనే దొంగ ప్రవక్త కూడ వుండేవాడు. అతడు రాజు మెప్పు పొందగోరి ప్రభువు రెండేడ్లల్లో బాబిలోను రాజును ఓడిస్తాడని దొంగ ప్రవచనం చెప్పాడు. యిర్మీయా అతనిమీద ఆగ్రహం తెచ్చుకొని ఈలా అబద్ధాలు చెప్పి ప్రజలను అపమార్గం పట్టించినందులకు ఆయేడు ముగియక ముందే హనన్యా చస్తాడని ప్రవచించాడు. యిర్మీయా పలికినట్లే ఆ కపట ప్రవక్త ఆయేడే చనిపోయాడు – యిర్మీ 28.

ఈలా ప్రవక్తలు ఆనాటి ప్రజలకూ అధికారులకూ సలహా యిస్తూండేవాళ్ళు. నూత్న వేదాన అపోస్తలుల కాలంలో అగబు ప్రవక్త దేశంలో కరువు వస్తుందనీ ప్రజలంతా తగిన చర్యలు తీసికోవాలనీ సలహా యిచ్చాడని ముందే చెప్పాం – అ చ 11,28–29. క్రీస్తు తర్వాత 75లో రోమను సైన్యాధిపతి యైన టైటసు యెరూసలేమును ముట్టడించి నేలమట్టం చేసాడు. కాని క్రైస్తవ ప్రవక్తలు ఆ సంఘటనను గూర్చి ముందుగనే ప్రవచనం

ద్వారా నగరంలో హెచ్చరికలు చేసారు. కనుక నగరంలోని క్రైస్తవ భక్తులంతా ప్రక్క పట్టణమైన పెల్లాకు పారిపోయి ప్రాణాలు రక్షించుకొన్నారు. ఈలా ప్రవచనం ద్వారా ప్రభువు తన భక్తులకు సలహా యిస్తూండడం కద్దు.

## 6. వాగ్దానాలు చేసారు

ప్రవక్తలు చేసిన ఓ గొప్ప సేవ ప్రభువుపేర వాగ్దానాలు చేయడం. దావీదురాజు వైభవంతో రాజప్రాసాదంలో వసిస్తున్నాడు. కాని ప్రభువు మందసం మాత్రం ఇంకా గుడారంలోనే పడివుంది. కనుక అతడు ప్రభువు మందసానికి ఓ మందిరం కట్టించాలని కలప సిద్ధం చేసి వుంచాడు. ఐవా దావీదు యుద్ధాలు చేసి నెత్తురు ఒలికించినవాడు కనుక అతని చేతిమీదిగా దేవాలయం కట్టించుకోవడానికి ప్రభువుకి యిష్టం లేదు. (1 దినవృ 28,3) దావీదుకు బదులుగా అతని కుమారుడు సొలోమోను దేవాలయం కట్టాలని ప్రభువు నిశ్చయించుకొన్నాడు. ఐనా దేవాలయాన్ని కట్టిద్దామనే మంచి కోరికను కోరుకొన్నందుకు ప్రభువు దావీదును సత్కరించాలని కూడ కోరుకొన్నాడు. కనుక అతడు నాతాను ప్రవక్తను పంపి దావీదుతో ఈలా చెప్పించాడు. "నీవు నాకు మందిరం కట్టనక్కర లేదు. నేనే నీకో మందిరం కట్టిపెడతాను. నీకు పుట్టబోయే కుమారుడు నాకు దేవళం కడతాడు. నేనతని సింహాసనాన్ని కలకాలం వరకు స్థిరపరుస్తాను" - 2సమూ 7,11-13. ఇక్కడ ప్రభువు దావీదుకు కట్టిపెట్టే మందిరం అతని రాజవంశమే. ఈ రాజవంశం దావీదు సొలోమోనుల నుండి మెస్సియా కాలం వరకు అవిచ్ఛిన్నంగా కొనసాగుతుంది. ప్రభువు దావీదు వంశాన్ని కలకాలం వరకు స్థిరపరుస్తాననడంలో భావం యిదే. ఈ దావీదు రాజవంశం నుండే మెస్సీయా ఉద్భవించేది. మెస్సీయా దావీదు రాజవంశంలో పుడతాడు అనే ప్రవచనాల్లో ఇదే మొట్టమొదటిది. ఈలా యిక్కడ నాతాను ప్రవక్త మెస్సియాను గూర్చి వాగ్దానం చేసాడు.

## 7. ప్రజల తరపున ప్రార్థన చేసారు

ప్రవక్తలు ప్రార్థనామూర్తులు. యిస్రాయేలీయులు ఎడారిలో ప్రయాణం చేస్తూ రెఫిదీము దగ్గరికి వచ్చారు. అక్కడ అమాలెకీయులు వారిని ఎదిరించి పోరాడారు. యోషువా వాళ్ళతో యుద్ధం చేస్తున్నాడు. మోషే కొండయెక్కి చేతులెత్తి యిస్రాయేలు తరపున ప్రార్థనం చేసాడు. అతడు చేతులెత్తి నంతసేపు యిస్రాయేలీయులు గెలిచారు. కాని మోషే చేతులు బరువెక్కి వాటిని దించగానే అమాలెకీయులు గెలిచారు. అప్పుడు మోషే అన్న అహరోను, యోషువా తండ్రి హూరు మోషేకు అటుప్రక్కా యిటుప్రక్కా నిలబడి అతని చేతులు

ఎత్తిపట్టుకొన్నారు. మోషే ఓ జెండాలాగ నిశ్చలంగా నిలబడి ప్రార్థనం చేసాడు. ఆ ప్రార్థనా ఫలితంగా కొండ క్రింద యోషువా శత్రువులను జయించాడు - నిర్గ 17,8-13.

ఇంకోమారు, కాదేషు బార్నెయా వద్ద యిస్రాయేలీయులు ప్రభువు మీద తిరగబడ్డారు. ప్రభువు ఆగ్రహించి వారిని సర్వనాశం చేయాలనుకొన్నాడు. కాని మోషే నలుబదినాళ్ళు దేవుని ముందట చాగలిపడి ప్రజలను క్షమింపమని వేడుకొన్నాడు. "ప్రభూ! నీవు యిప్పుడు ఈ ప్రజను నాశం జేస్తే ఐగుప్తీయులు నిన్ను ఆడిపోసికొంటారు. యావే యిస్రాయేలీయులను కనాను మండలానికి చేర్చలేకపోయాడు. అసలు ఆ ప్రజలంటే అతనికి గిట్టదు. కనుకనే వాళ్ళని మోసంతో ఎడారిలో చంపివేసాడు - అని నిందలు మోపుతారు" అన్నాడు. అతని మొర ఆలించి ప్రభువు యిస్రాయేలీయులను చంపకుండా వదలివేసాడు - ద్వితీ 9,25-29. ఈలా ప్రవక్తలు ప్రజల తరపున ప్రార్థనలు చేసేవాళ్ళు.

## 3. ప్రవచన ప్రక్రియలు

ప్రవచన ప్రక్రియలు రకరకాల రూపాల్లో వుండేవి. నోటితో మాట్లాడ్డం వాటిల్లో ఒక్క ప్రక్రియ మాత్రమే. ఈ క్రింద ప్రవచన రూపాలను కొన్నిటిని పరిశీలిద్దాం.

### 1. దైవవాక్కు

ఒకోమారు ప్రవక్త దేవుని సందేశాన్ని సంగ్రహమైన వాక్కుతో చెప్తుంటాడు. కొన్నిసారులు ఇది మూలంలో ఛందోబద్ధంగా గూడ వుంటుంది. సౌలు అమాలెకీయుల మీదికి యుద్ధానికి పోయాడు. ప్రభువు వారి ప్రజలనూ, జంతువులనూ శాపం పాలు చేసి సర్వనాశం చేయమని చెప్పాడు. కాని సౌలు అమాలెకీయులను ఓడించిన తరువాత వాళ్ళ రాజైన అగాగును చంపకుండ వదలివేసాడు. పైగా వాళ్ళ పసుల్లో పోతరించిన వాటినన్నిటినీ తాను తీసికొని బక్కచిక్కినవాటిని మాత్రం చంపించాడు. ఈలా అతడు దేవుని ఆజ్ఞ మీరాడు. అప్పుడు సమూవేలు ప్రవక్త వచ్చి

"నీవు ప్రభువు మాట త్రోసిపుచ్చావదవు కనుక
ప్రభువు నీరాచరికాన్ని త్రోసివేసాడు"

అన్నాడు - 1 సమూ 15,20. తరువాత సౌలు ఎంత మొత్తుకొన్నా లాభం లేకపోయింది. ఈలాంటి ప్రవచనాలను దైవవాక్కులు అంటాం.

### 2. ఓదార్పు వాక్యాలు

ప్రవచనంలో ఓ ముఖ్యాంశం కష్టాల్లో వున్నవారిని ఓదార్చడం. తల్లి బిడ్డను ఓదార్చినట్లుగా ప్రవచనం భక్తులను ఓదారుస్తుంది. యూదులు బాబిలోను ప్రవాసంలో

చిక్కి క్రుగ్గిపోతున్నారు. పాలస్తీనా దేశాన్ని మళ్లా కంటితో చూస్తామోలేదో అని నిరుత్సాహ పడుతున్నారు. అప్పుడు యెషయా ప్రవక్త శిష్యుడొకడు ప్రభువు పేర ఈ ఓదార్పు వాక్యం విన్పించాడు.

"ప్రభువు బాహుబలంతో
పరిపాలనం చేయడానికి వస్తాడు
తాను విముక్తులను చేసిన ప్రజలను
అతడు తనతో తీసికొని వస్తాడు
గొర్రెలకాపరి మందను లాగ
అతడు తన ప్రజలను కాపాడతాడు
గొర్రెపిల్లలను ప్రోగు జేసి
వాటిని తన రొమ్ము మీద మోసికొని వస్తాడు
వాటి తల్లులను మెల్లగా అదలించుకొని వస్తాడు"

గొర్రెల కాపరి మందను తోలుకొని వచ్చినట్లుగా ప్రభువు తన ప్రజలను బాబిలోను నుండి తరలించుకొని వస్తాడని పై ప్రవచనం భావం. ఈ వాక్యాలు ఆ ప్రభువు కరుణనూ దయాళుత్వాన్నీ సూచిస్తాయి. ఈలాంటి వాక్యాలతో ప్రవక్తలు బాధలో వున్న ప్రజలను ఓదార్చారు - యెష 40,10-11.

## 3. ప్రార్థనలు

ఒకోమారు ప్రవక్తలు ఆత్మవలన ప్రబోధితులై ప్రజల తరపున ప్రార్థనం చేయడం కూడ కద్దు. ఎజ్రా యిస్రాయేలు ప్రజలను బాబిలోను ప్రవాసం నుండి తీసికొనివచ్చాడు. కాని వాళ్లు యెరుషలేమును చేరుకొన్న పిదప ఆ వచ్చిన వాళ్లల్లో చాలమంది అన్యజాతి స్త్రీలను పెండ్లాడారని తెలియవచ్చింది. అది మోషే ధర్మశాస్త్రానికి విరుద్ధం. కనుక యెజ్రా దిగులుతో చతికిల బడ్డాడు. ప్రజలను క్షమింపమని ప్రభువుకి పశ్చాత్తాప ప్రార్థన చేసాడు. ఆ ప్రార్థన వలన మనసు కరిగి యూదులు ఆ యన్యజాతి స్త్రీలను పరిత్యజిస్తామని మాట యిచ్చారు - యెజ్రా 9,10-15. ఇక్కడ ఈ ప్రార్థన యిస్రాయేలీయుల్లోని ఓ దురాచారాన్ని పరిష్కరించడానికి ఉపయోగపడింది. ఈలాగే నూత్నవేదంలో జెకర్యా, సిమియోను పల్కిన ప్రవచనాలు కూడ ప్రార్థనలే - లూకా 1,67-80 ; 29-32.

## 4. పాటలు

ప్రార్థనలతో లాగే, ఓదార్పు వాక్యాలతో లాగే, ప్రవక్త ఒకోమారు పాటతో గూడ ప్రవచనం చెప్తాడు. యెషయా ఈలా పాట కట్టాడు.

"నా స్నేహితుణ్ణి గూర్చి అతని తోటను గూర్చి
పాడతాను వినండి
సారవంతమైన కొండమీద
నా మిత్రునికి వో ద్రాక్షతోట వుంది
అతడు ఆ కొండమీది నేలను త్రవ్వి రాళ్లేరి
శ్రేష్ఠమైన ద్రాక్షలు నాటాడు.
ఆ తోటలో వో బురుజు కట్టించి
రసం తీయడానికి ఓ తొట్టికూడ తొలిపించి
పండ్ల కోసం ఎదురుచూచాడు
కాని ఆ తోట పిచ్చికాయలు కాచింది"

ఈ పాటలోని ద్రాక్షతోట యిస్రాయేలు ప్రజలే. ప్రభువు ఎంత అనురాగంతో ఆదరించినా ఆ ప్రజలు ఏవో కోతి పనులు చేస్తూనే వున్నారు. ఇక్కడ ద్రాక్షతోట పిచ్చికాయలు కాచిందంటే యిస్రాయేలు ప్రజలు పాడుపనులు చేస్తున్నారని భావం - యెష 5,1-2. కీర్తనల గ్రంథం లోని కీర్తనలు చాల ఈలా పాటలుగా చెప్పిన ప్రవచనాలే.

## 5. రహస్యాలు వెల్లడి చేయడం

ప్రవక్తలు ఒకోమారు రహస్యాలను వెల్లడి చేస్తూ కూడ ప్రవచనం చెప్పేవాళ్ళు. సిరియా సైన్యాధిపతియైన నామాను కుష్ఠరోగియై చికిత్స కోసం యెలీషా ప్రవక్త వద్దకు వచ్చాడు. ఎలీషా అతని కుష్ఠను నయం చేసాడు. నామాను కానుకలు అర్పింపబోయాడు గాని ప్రవక్త అంగీకరింప లేదు. ఇదంతా గమనించిన ఎలీషా శిష్యుడు గేహసీ పయనమైపోతూన్న నామాను వెంటబడి మా గురువు గారు కానుకలు అడుగుతున్నాడని బొంకి అతనివద్ద నుండి రూకలూ పట్టుబట్టలూ పుచ్చుకొని వచ్చాడు. తరువాత అతడు ఎలీషాకు సేవ చేయడానికి రాగా ప్రవక్త "ఓయి! నా మనసు నీ వెంటవచ్చి నీవు దురాశతో లంచాలు పుచ్చుకోవడం చూచింది. కనుక ఆ నామానుకు పట్టిన కుష్ఠ తరతరాల వరకూ నిన్నూ నీ అనుయాయులనూ పట్టి పీడిస్తుంది పో" అన్నాడు. వెంటనే గేహసికి కుష్ఠ సోకింది - 2రాజులు 5,20-28. ఈలా యెలీషా దురాశకు లొంగిన సేవకుని రహస్యాన్ని బట్టబయలు చేసాడు.

ఓమారు యేసు సమరియా రాష్ట్రంలోని సుఖారు గ్రామంలో బావిచెంత కూర్చుండి వుండగా ఓ రంకులాడి నీళ్లకు వచ్చింది. ప్రభువు ఆమెతో "నీవు ఇంతకుముందు ఐదుగురిని కట్టుకొన్నావు. ఇప్పుడున్న ఆరవవాడు కూడ నీ పెనిమిటి కాదు" అన్నాడు. ఆమె

ఆశ్చర్యపోయి "అయ్యా! నీవు ప్రవక్తలాగున్నావు" అంది - యోహా 4,18. ఈలా రహస్యాలను తెలిసికొనే శక్తి ప్రవక్తలకు అబ్బుతుంది.

## 6. దర్శనాలు

ప్రవక్తలు దర్శనాలు చూడ్డం కద్దు. ఆ దర్శనాల్లో ప్రభువు వాళ్లకు ఏదో సందేశం విన్పిస్తాడు. తరువాత ప్రవక్తలు ఆ సందేశాన్ని ప్రజల కెరిగిస్తారు. పూర్వవేదంలో యెహెజ్కేలు దానియేలు ఈలాంటి దర్శనాలను చాల ఉదహరించారు. నూత్న వేదంలో చివరిదైన దర్శన గ్రంథం కూడ వీటిని వర్ణిస్తుంది. ఉదాహరణకు యెహెజ్కేలు ప్రవచనం ఈలా ప్రారంభమౌతుంది. "ఇరువదియవయేటి నాల్గవ నెలలోని ఐదవ రోజున నేను తోడి యూదులతో గలసి బాబిలోనియా లోని కేబారు నది తీరాన ప్రవాసంలో వుండగా ఆకాశం తెరువబడింది. నేను దేవుణ్ణి దర్శించాను" - 1,1.

ఓమారు మోషే చెల్లెలు మిర్యాము అతని అన్న అహరోను అతని మీద తిరగబడ్డారు. అప్పుడు ప్రభువు మోషే కోపు తీసికొని ఆ యన్నా చెల్లెళ్ళను చీవాట్లు పెట్టాడు. "మీలో ఎవరైనా ప్రవక్తలుంటే నేను వాళ్లకు దర్శనాల్లో కనిపిస్తాను. కలల్లో వాళ్లతో మాట్లాడతాను. కాని నా భక్తుడైన మోషేతో మాత్రం నేరుగానే మాట్లాడతాను. అలాంటి వాణ్ణి ఎదిరించడానికి మీకు ఎన్ని గుండెలు?" అని ఉగ్రుడై పోయాడు - సంఖ్యా 12,6-8. ఈ సందర్భాన్ని బట్టి గూడ ప్రభువు దర్శనాల ద్వారా ప్రవక్తలతో మాట్లాడతాడని భావించుకోవాలి.

## 7. నటన చేసి చూపించడం

ప్రవక్తలు కొన్నిసార్లు దైవ సందేశాన్ని నటన చేసి చూపించారు. యిర్మీయా యెద్దుల కాడిని మెడ మీద పెట్టుకొని తిరిగాడు. యిస్రాయేలు రాజ్యం బాబిలోను రాజుల అధికారం లోకి వస్తుందనీ, ఆ రాజులు యూదుల మీద తమ కాడిని మోపుతారనీ దీని భావం - యిర్మీ 21,1-2. మరో మారు ఈ ప్రవక్త తాను తొడుగుకొనే నిక్కరుని నేలలో పాతిపెట్టాడు. అది చివికి చెడిపోయింది. ప్రభువు యిస్రాయేలును కూడ ఈ నిక్కరుని లాగే నాశం చేస్తాడని దీని భావం - 13,1-11. ఇంకోమారు ఇతడు హిన్నోములోయకు వెళ్ళి అక్కడ ఓ మట్టికుండను పగులకొట్టాడు. ఆ కుండ పగిలి పోయినట్లుగనే ప్రభువు యిస్రాయేలును నాశం చేస్తాడని చెప్పాడు - 19,10-11. వేరొకమారు అతడు స్వీయనగరమైన అనతోతులో ఓ పొలాన్ని కొన్నాడు. ఇది యిస్రాయేలీయులు బాబిలోను ప్రవాసం నుండి తిరిగివచ్చి మళ్ళా తాము కోల్పోయిన పొలాలను కొని స్వాధీనం చేసికోవడానికి చిహ్నం - 32, 1-15.

ప్రభువు సొలోమోను మీద ఆగ్రహం చెంది అతని రాజ్యాన్ని రెండు ముక్కలు చేసి ఓ ముక్కను యరోబాముకి ఇచ్చివేయాలి అనుకొన్నాడు. ఈ యరోబాము సొలోమోనుకు వెట్టిచాకిరి చేసేవాళ్లకు నాయకుడు. ఓ మారు యరోబాము యెరూషలేము నుండి వస్తుండగా పొలంలో అహీయా ప్రవక్త అతన్ని కలుసుకొన్నాడు. ఆ ప్రవక్త తాను ధరించివున్న క్రొత్త బట్టలను విప్పి వాటిని పండ్రెండు ముక్కలుగా చించివేసాడు. యరోబాముతో "ప్రభువు వీటిల్లో నీకు పదిముక్కలిస్తున్నాడు తీసికో" అన్నాడు. అనగా సొలోమోను రాజ్యంలో పది వంతులు చీలిపోతుందనీ దానికి యరోబాము రాజౌతాడనీ భావం. సొలోమోను గతించి అతని కుమారుడు రెహబాము రాజు కాగానే పై ప్రవచనం నెరవేరింది - 1రాజు 11,29-31.

హోషేయ తన కుమార్తెకు "లో రూహామా" అని పేరు పెట్టాడు. ప్రభువు యిస్రాయేలు ప్రజల మీద జాలిచూపడని ఈ పేరుకి అర్థం. అలాగే అతడు కుమారునికి "లో అమ్మి" అని పేరు పెట్టాడు. అనగా ప్రభువు యిస్రాయేలును తన ప్రజలుగా అంగీకరింపబడని భావం - హోషే 1,6.9. ఈలా పేర్లు పెట్టడం కూడ ప్రవచనాన్ని నటించి చూపడం క్రిందికే వస్తుంది. యెషయా కూడా ఈలాగే తన కుమారునికి ప్రవచనపూర్వకమైన పేరు పెట్టాడు - యెష 8,1-4.

నూత్నవేదంలో క్రీస్తు ఈ ప్రక్రియననుసరించాడు. అతడు అంజూరాన్ని శపించాడు - మత్త 21,18-20. ఓ చిన్న బిడ్డను శిష్యుల మధ్యలో నిల్పి వాళ్ళు ఆ బిడ్డలా కావాలన్నాడు - 18,1-4. ఇక్కడ ప్రభువు ప్రవక్తల్లాగే నటన చేసి చూపించాడు. అగబు ప్రవక్త పౌలు నడికట్టుతో నటన చేసి చూపించాడని ముందే చెప్పాం - అచ 21,10-11.

ఈ యధ్యాయంలో ప్రవచన రూపాలను ఏడింటిని పేర్కొన్నాం. ఇంకా వేరే రూపాలు కూడ వున్నాయి. ప్రవక్త ఒక్క మాటలతోనే గాదు ఇతర ప్రక్రియద్వారా గూడ దైవసందేశాన్ని విన్పిస్తాడు అనడానికి ఈ ప్రక్రియలన్నీ సాక్ష్యం.

## 4. కపట ప్రవక్తల్గూ, నిజ ప్రవక్తలూ

యిస్రాయేలీయుల్లో ఎప్పుడూ ప్రవక్తలు చాలామంది వుండేవాళ్లు. వాళ్లల్లో నిజమైన ప్రవక్త యెవడో, స్వార్థలాభం కోసం అబద్ధాలు చెప్పే ప్రవక్త యెవడో నిర్ణయించడం కష్టంగా వుండేది. రాజుల గ్రంథం నుండి ఓ వుదంతం పరిశీలిద్దాం. అహాబు అనే రాజు రామోతు గిలాదును ముట్టడింప గోరాడు. తాను పోషించే ప్రవక్తల సమాజాన్ని పిల్పించి యుద్ధంలో తనకు విజయం కలుగుతుందో లేదో చెప్పుమన్నాడు. ఆ సమాజంలో నాల్గువందల మంది ప్రవక్తలున్నారు. వాళ్ల నాయకుడు సిద్కియా. అతడూ ఆ ప్రవక్తలూ అంతా ఏకగ్రీవంగా "నీవు యుద్ధానికివెళ్లు ప్రభువు నీకు విజయం దయచేస్తాడు" అని

రాజుని ఉబ్బించారు. రాజు మన్ననను సంపాదించడమే వాళ్లకు కావలసింది. కాని మికాయా ఈ సమాజానికి చెందని ప్రవక్త, అబద్ధాలు చెప్పనివాడు. అతడు రామోతు మీదికి యుద్ధానికి వెళ్తే రాజు తప్పక ప్రాణాలు కోల్పోతాడని చెప్పాడు. తరువాత మికాయా చెప్పినట్లే అహాబు రామోతు పోరులో చనిపోయాడు - 1రాజు 22. ఈ సంఘటనంలోని సిద్కియా మరియు అతని అనుచరుల్లాగ స్వార్థలాభం కోసం దబ్బర ప్రవచనాలు చెప్పేవాళ్లు ఎప్పుడూ వుండనే వుండేవాళ్లు. ఈలాంటి అబద్ధాల కోరులను గుర్తు పట్టడానికి మంచి ప్రవక్తలు కొన్ని సూత్రాలను సూచించారు. వాటిని పరిశీలించి చూద్దాం.

1. ప్రవక్త రాజుకీ ప్రజలకీ కీడు కలుగుతుందని ప్రవచిస్తే ఆ ప్రవచనాన్ని శంకించనక్కర లేదు. కాని అతడు శత్రువులు ఓడిపోతారనీ యిస్రాయేలు దేశానికి శాంతి చేకూరుతుందనీ ప్రవచిస్తే ఆ వాక్యాలను శంకించాలి. రాజు మెప్పు కోసం అతడు అలా చెప్పి వుండవచ్చు. కనుక ఆ వాక్యాలు యథార్థంగా నెరివేరిందాకా వాటిని నమ్మకూడదు.

ఓమారు బాబిలోనీయులు ఐగుప్తీయులు పోరాడుతూ యిస్రాయేలుని ముట్టడించారు. యిర్మీయా బాబిలోనీయులే గెలుస్తారు కనుక వాళ్లతో ముందుగానే సంధి చేసికొమ్మని రాజుకు సలహా యిచ్చాడు. కాని దొంగ ప్రవక్తయైన హనన్యా రాజు మెప్పు పొందగోరి బాబిలోనీయులు ఓడిపోతారనీ పాలస్తీనా దేశంలో శాంతి నెలకొంటుందనీ ప్రవచించాడు. అప్పుడు యిర్మీయా "ఓయి! మనకు ముందు వచ్చిన ప్రవక్తలంతా ఈ దేశంలో యుద్ధమూ కరువూ అంటువ్యాధులూ నెలకొంటాయని ప్రవచించారు. ఇప్పుడు నీవు మాత్రం ఈ దేశంలో శాంతి నెలకొంటుందని చెప్తున్నావు. అలా శాంతి నెలకొన్న తరువాత గాని నీ వాక్యాల్లోని సత్యం రుజువుకాదు" అన్నాడు. తరువాత యిర్మీయా చెప్పినట్లు గానే బాబిలోనీయులు గెలిచి యిస్రాయేలీయులను బందీలనుగా తీసికొని పోయారు. హనన్యా కూడ గతించాడు - యిర్మీ 28.

2. మంచి ప్రవక్త యెప్పుడు కూడ తన ప్రవచనాన్ని గూర్చి కొన్ని గుర్తులు చెప్తాడు. సమూవేలు ప్రవక్త సౌలును తైలంతో అభిషేకించి ప్రభువు అతన్ని యిస్రాయేలుకు రాజుగా నియమించాడని ప్రవచించాడు. తన ప్రవచనంలోని సత్యాన్ని రుజువు చేసికోవడానికి అతడు కొన్ని గుర్తులు కూడ చెప్పాడు. సేవకులు వచ్చి సౌలు తండ్రి పోగొట్టుకొన్న గాడిదలు దొరికాయని సౌలుతో చెప్తారు. దారిలో తాబోరు సిందూరం వద్ద ఓ బాటసారి రెండు రొట్టెలను సౌలుకు కానుక యిస్తాడు. గిబియా వద్ద సౌలు ప్రవక్తల సమాజంలో చేరిపోయి తాను కూడ ప్రవచనాలు చెప్తాడు. సమూవేలు చెప్పినట్లుగానే తరువాత ఈ గుర్తులన్నీ నెరవేరాయి. కనుక దేవుడు సౌలుని రాజుగా నియమించాడన్నది వాస్తవం - 1సమూ 10,1-8.

3. ఎవడైనా యిస్రాయేలు మతానికి వ్యతిరేకంగా ప్రవచనాలు చెప్పినట్లయితే, అతడు తన మాటలు నిరూపించుకొనడానికై అద్భుతాలు చేసి చూపించినా వాణ్ణి నమ్మకూడదు. ప్రజలను ప్రభువు మార్గం నుండి వైదొలగించి పెడత్రోవ పట్టింప గోరేవాడు కనుక ఆ కపట ప్రవక్తను పట్టి చంపాలి - ద్వితీ 13,1-5.

4. ప్రవక్తను నమ్మాలి అంటే అతని జీవితం విశుద్ధంగా వుండాలి. మంచి జీవితం జీవించే ప్రవక్త ప్రవచనం తప్పకుండా నిజమైయుండనక్కర లేదు. కాని చెడ్డ జీవితం జీవించే ప్రవక్త ప్రవచనం మాత్రం తప్పకుండా తప్పుడిదే ఔతుంది. కనుక తననాటి మోసపు ప్రవక్తలను గూర్చి యిర్మీయా "సమరియా లోని ప్రవక్తలు బాలుదేవత పేర ప్రవచనాలు చెప్పి ప్రజలను అపమార్గం పట్టిస్తున్నారు. కాని యెరూషలేములోని ప్రవక్తలు ఇంకా ఘోరకార్యాలు చేస్తున్నారు. వాళ్ళు వ్యభిచరిస్తున్నారు, అబద్ధాలు చెప్తున్నారు, ప్రజలను పురికొల్పి వాళ్ళచేత దుష్కార్యాలు చేయిస్తున్నారు. సొదొమ గొమర్రా పౌరుల వలె వీళ్ళుకూడ దుష్టులైపోయారు" అన్నాడు - యిర్మీ 23, 13.14. ఈలాంటి దుర్మార్గులు చెప్పిన ప్రవచనం నిజం కానేరదు కదా! నూత్న వేదంలో ప్రభువు కూడ పండ్లను బట్టి చెట్టును నిర్ణయించాలి అన్నాడు - మత్త 7,15-20. మామిడిపండ్లు కాస్తే అది మంచిచెట్టు. ఉమ్మెత్తకాయలు కాస్తే అది వెధవచెట్టు. అలాగే మంచి జీవితం జీవించే ప్రవక్త మంచి ప్రవచనం చెప్పగలడు. చెడ్డ జీవితం జీవించే ప్రవక్త మోసపు ప్రవచనాలు చెప్పగలడు.

5. ప్రజల ఆదరణను సంపాదించి వాళ్ళనుండి ఏదో లాభాన్ని పొందాలి అన్న కక్కుర్తితో వాళ్ల తప్పులను సమర్థిస్తూ మాట్లాడే ప్రవక్తలను నమ్మకూడదు. వాళ్ళు వట్టి స్వార్థపరులు. ప్రభువు బాబిలోనియా రాజుల నుండి యిస్రాయేలుకు ముప్పు వాటిల్లేలా చేయబోతున్నాడు. ఈ సంగతి యిర్మీయా ప్రజలకు తెలియజేసాడు. కాని కొందరు ప్రవక్తలు ప్రజల మెప్పు పొందగోరి వాళ్లకు ఏయపాయం కలగదని పల్కుతున్నారు. ఈలాంటివాళ్ల పల్కులు నమ్మకూడదు - యిర్మీ 23,16-17.

6. పై సూత్రాలన్నీ ఒక యెత్తు, ప్రవక్త తన పిలుపు మీద తనకే నమ్మకం వుందని చెప్పుకోవడం ఒక యెత్తు. మంచి ప్రవక్త యెప్పుడు గూడ భగవంతుడు తన్ను ప్రవచనం చెప్పడానికి పిల్చాడని గాఢంగా విశ్వసిస్తాడు. అందుకే గొప్ప ప్రవక్తలంతా తమ పిలుపుని గూర్చి విపులంగా చెప్పుకొన్నారు. ఈ యంశాన్ని మొదటి అధ్యాయంలో చూచాం. ఆమోసు గొర్రెలు కాచుకొంటూ అంజూరపు నారు పెంచుకొంటూ వుండగా ప్రభువు అతన్ని పిల్చాడు. సింహం గర్జిస్తే ప్రజలు ఏలా తప్పకుండా భయపడతారో అలాగే ప్రభువు పిల్చిన భక్తుడు తప్పకుండా ప్రవచనం చెప్తాడు అన్నాడు ఈ ప్రవక్త. కనుక అతనికి తన ప్రవచనాన్ని గూర్చి ఏమీ అనుమానం లేదు - ఆమో 3,7-8. అలాగే

ప్రభువు యెహెజ్కేలుతో "ఓయి! నేను నిన్ను నా ప్రజకు కావలివానినిగా నియమించాను. నేను నీకు చేసే హెచ్చరికలను నీవు వారికి అందీయాలి" అన్నాడు - యెహె 3,17. ఆ మాటలు విన్నపిదప అతనికి తన ప్రవచనం మీద ప్రగాఢమైన విశ్వాసం కలిగింది. అలాగే యిర్మీయా యెషయా కూడ తమ పిలుపును గూర్చి సవిస్తరంగా చెప్పికొన్నారు. వీళ్ళు ప్రభువు తమ్ము పిల్చి తమచేత ప్రవచనం చెప్పిస్తున్నాడని పూర్ణంగా నమ్మారు. ఈలాంటి అనుభవం వున్నవాళ్ళు తప్పుడు ప్రవచనాలు చెప్పరు. కనుక మనం వాళ్ళను నమ్మవచ్చు.

పై సూత్రాలు ఆనాడు లాగే యీనాడు కూడ మంచి ప్రవక్త యెవడో తప్పుడు ప్రవక్త యెవడో నిర్ణయించడానికి కొంతవరకు ఉపయోగపడతాయి.

# 5. ప్రవక్తల శ్రమలు

ప్రవక్తలు ప్రజాసేవకులు. ప్రజలకు దైవసందేశాన్ని విన్పించిన మహానుభావులు. కాని వాళ్లు తమ సేవలో ఘోర శ్రమలు అనుభవించారు. మరీ కొందరు ప్రవక్తల బాధలు చూస్తూంటే మనకు మనసు కరిగిపోతుంది.

## 1. ప్రవక్తల బాధలు

ఎడారిలో యిస్రాయేలీయులు మోషే మీద తిరగబడ్డారు. ఐగుప్తులో ఐతే మాకు మాంసం మస్తుగా లభించింది. ఇక్కడ ఈ దిక్కుమాలిన మన్నా ఒక్కటి తప్ప మరేమీ దొరకడం లేదని గొణుగుకొన్నారు. అప్పుడు మోషే ప్రభువుతో "నీవు ఈ ప్రజలను పరామర్శించే బాధ్యత నా నెత్తిన ఎందుకు పెట్టావు? నేను వీరిని కన్నానాయేమి? వీళ్ళు మాకు మాంసం ఇప్పించు కడుపార తింటామని నన్ను చంపుకతింటున్నారు. వీళ్ళ బాగోగులను నేనొక్కడినే పరామర్శించలేను. నీవు నా యెడల ఇంత కఠినముగా ప్రవర్తిస్తున్నావెందుకు? అసలు నన్ను చంపివేయి, అప్పుడు నేను వాళ్ళ ఇక్కట్టులను కన్నులార చూడవలసిన అవసరం లేకుండా పోతుంది" అన్నాడు - సంఖ్యా 11,10-15. ఈలాంటి ఆవేదనలు మోషే యెన్నో అనుభవించాడు. యిస్రాయేలీయులు బంగారు దూడను ఆరాధించినప్పుడు గూడ మోషే వాళ్ళ తరపున ప్రభువుని మనవి చేసాడు. ప్రభువు తన మనవిని ఆలింపక పోయినట్లయితే తన పేరును ఆ ప్రభువు గ్రంథంలో నుండి కొట్టివేయవలసినదిగా కూడ విన్నపం చేసాడు - నిర్గ 32,32. ఆ ప్రజల తరపున అతడు అనుభవించిన ఆందోళనం అంత గొప్పది.

యిర్మీయా ఆనాటి ప్రజలకు ప్రభువు శిక్ష ఎరిగించాడు. బాబిలోను రాజులు వచ్చి యూదులను ప్రవాసానికి తీసికొని వెళ్తారని చెప్పాడు. కాని రాజులూ అధికారులూ

అతన్ని ఎదిరించారు. ప్రజలు అతన్ని చూచి నవ్వారు. కపట ప్రవక్తలు అతడు చెప్పిందానికి వ్యతిరేకంగా ప్రవచనం చెప్పారు. అందరూ యిర్మీయాను హేళన చేసారు. ఆ బాధల్లో అతడు ఈలా విలపించాడు :

ప్రభో! నీవు నన్ను వంచించావు
నీవు నాకంటె బలవంతుడివి కనుక
నా మీదబడి నన్ను గెల్చావు
అందరూ నన్ను ఎగతాళి చేసేవాళ్ళే
జనమంతా నన్ను గేలిచేసేవాళ్ళే
నీ సందేశాన్ని విన్పించినందుకు
రోజంతా నేను నవ్వుల పాలౌతున్నాను
నేను ప్రభువు పేరెత్తను
అతని పేరు మీదిగా ఇక బోధ చేయను
అనుకొన్నాను గాని, నీ సందేశం మాత్రం
నా హృదయంలో ఓ మంటలా మండుతూంది
నేను దాన్ని లోలోపల అణచిపెట్టుకోలేక
విసిగి వేసారిపోతున్నాను
ఆ సందేశం నా హృదయాంతరాళంలో నుండి
ఉబికివుబికి వెలుపలికి వస్తూంది. - 20, 7-9.

నేను పుట్టిన రోజు శాపగ్రస్తం కావాలి
మా యమ్మ నన్ను కన్నదినం
అశుభదినంగా పరిగణింపబడాలి
నీకో మగకందు పుట్టాడని
కబురుతెచ్చి నా తండ్రిని సంతోషపెట్టిన
వార్తావహుడు శాపగ్రస్తుడు కావాలి. 20, 14-15

నేను ఈ దేశంలో ప్రతివాడితోను
జగడమాడవలసి వచ్చింది
నేనెంత దౌర్భాగ్యుణ్ణి!
తల్లీ! అసలు నీవు నన్నెందుకు కన్నావమ్మా!
నేనెవరికీ వడ్డీకి అప్పీయలేదు

ఎవరి వద్దనుండి వడ్డీకి సొమ్ము పుచ్చుకోలేదు
ఐనా ప్రతివాడూ నన్ను శపించేవాడే. - 15,10

ప్రభూ! ఆనాడు నీవు నాతో సంభాషించగా
నీ పలుకు నేను ఆతురతతో విన్నాను
నేను నీ దాసుణ్ణి కనుక నీ వాక్కు
నా హృదయానికి అమితానందం కలిగించింది
నేను భోగప్రియులతో కలసి
సంతోషంగా కాలం వెళ్లబుచ్చలేదు
నీయాజ్ఞకు బద్ధుడనై ఒంటరిగా వుండిపోయాను
నీవు నన్ను కోపగ్రస్తుణ్ణి చేసావు
నేనీలా బాధలతో క్రుగ్గిపోతూండవలసిందేనా?
ఈ గాయమిక యెప్పటికి మానదా?
వేసవిలో యెండిపోయే యేటిలాగా
నీవు నన్ను నిరుత్సాహపరచ దలచుకొన్నావా? - 15,16-18.

ఈలాంటి వాక్యాలు పల్కిన ప్రవక్త ఏలాంటి శ్రమలు అనుభవించి వుంటాడో ఊహించుకోండి. అందుకే పూర్వ వ్యాఖ్యాతలు యిర్మీయా బాధల్ని క్రీస్తు శ్రమలతో పోల్చారు.

ప్రవక్తలు చాల చిత్తశుద్ధి కలవాళ్లు. అహాబురాజు గిలాదులోని రామోతు మీదికి యుద్ధానికి వెళ్లగోరి ప్రవక్తలను సంప్రతించాడు. అతని ఉప్పు తిని బ్రతికే నాల్గువందల మంది ప్రవక్తలూ, వారి నాయకుడు సిద్కియా, రాజుకే విజయం కలుగుతుందని ఇచ్చకాలు పలికారు. కాని చిత్తశుద్ధి కల మీకాయా మాత్రం అహాబుకి ఓటమి కలుగుతుందని ప్రవచించాడు. దానితో సిద్కియా రెచ్చిపోయి మీకాయాను నిండు కొలువులో చెంపలు వాయించి "బాబూ! దేవుని ఆత్మ నన్ను వదలిపెట్టి నీ చెంతకు వచ్చి నీతో ప్రవచనం చెప్పించిందా? అదెప్పటినుండి?" అని హేళనం చేసాడు. మీకాయా "నీవు యుద్ధం వచ్చినపుడు పారిపోయి మూలగదిలో దాగుకొంటావు. దేవుని ఆత్మ ఎప్పటినుండి నాతో ప్రవచనం చెప్పిస్తూందో అప్పుడే నీకు తెలుస్తుంది పో" అన్నాడు. రాజుకు మీకాయా అంటే అసలే గిట్టదు. కనుక అతడు ఆ ప్రవక్త మీద మండిపడి అతన్ని చెరలో త్రోయించాడు. నేను యుద్ధం నుండి సురక్షితంగా తిరిగి వచ్చిందాకా ఇతనికి రొట్టె నీళ్లు తప్పితే మరేమీ ఈయవద్దని సేవకులకు కట్టడ చేసాడు. కాని మీకాయా "నీవసలు పోరునుండి తిరిగిరావు. అలా వచ్చావో, ప్రభువు నా ద్వారా ప్రవచనం చెప్పించలేదనుకో" అన్నాడు. మీకాయా చెప్పినట్లే రాజు రామోతు యుద్ధంలో గతించాడు - 1రాజులు 22, 24-28.

ఇక్కడ యీ మీకాయా చిత్తశుద్ధి యెంత గొప్పదో ఆలోచించండి. అతడు తోడి ప్రవక్తలను నాల్గు వందల మందినీ రాజునూ గూడ ఎదిరించి నిలచాడు. బాధలకు గురయ్యాడు. ఐనా ప్రభువు పేరుమీదిగా సత్యం చెప్పడానికి మాత్రం వెనుకాడలేదు.

## 2. ప్రజలు ప్రవక్తల బోధలు వినలేదు

ప్రవక్తలు అనుభవించిన ఓ తీవ్రబాధ, ప్రజలు వాళ్ల బోధలు వినకపోవడం. యెషయా ప్రవచనారంభంలో ప్రభువు ఈలా అన్నాడు :

"భూమ్యాకాశాలూ వినండి!
నేను పెంచిన బిడ్డలే నామీద తిరగబడ్డారు
ఎద్దుకు తన యజమానుడెవరో తెలుసు
గాడిదకు తన యజమానుని దొడ్డి తెలుసు
కాని యిస్రాయేలుకు మాత్రం ఏమీ తెలియదు" - 1,2-3.

ఈలా దేవుణ్ణే లక్ష్యపెట్టని ప్రజలు ప్రవక్తలను లక్ష్యపెడతారా? కనుకనే ప్రభువు యెషయాతో "వాళ్ల చెవులు ప్రవక్తల బోధలు విన్నట్లే వుంటాయి కాని వాళ్లు ఏమీ అర్థం చేసికోరు. వాళ్ల కండ్లు చూచినట్లే వుంటాయి కాని వాళ్లు ఏమీ గ్రహించలేరు. నీవు వాళ్లు ఏమీ అర్థం చేసికోకుండా వుండేలా చేయి. వాళ్ల చెవులు వినకుండ వుండేలా, కండ్లు చూడకుండ వుండేలా చేయి. ఇక వాళ్లు అర్థం చేసికోలేరు, వినలేరు, చూడలేరు. లేకుంటే వాళ్లు నావద్దకు వచ్చి తమ రోగాన్ని నయం జేయించుకొనే వాళ్లేకదా!" అన్నాడు - యెష 6,9-10. ఆ ప్రభువు అన్నంతా జరిగింది. ప్రజలు యెషయా బోధ వినలేదు. అతని మాటలను అర్థం చేసికోలేదు. అది అతనికి యెంతో బాధ కలిగించింది.

ప్రభువు యిర్మీయాతో ఈలా అన్నాడు. "నీవు ఈ సంగతులను ప్రజలతో చెప్తావు గాని వాళ్లు నీమాట వినరు. నీవు వాళ్లను పిలుస్తావు గాని వాళ్ళు నీకు జవాబీయరు" - యిర్మీ 7,27.

యెహెజ్కేలుతో ప్రభువు ఈలా నుడివాడు. "నరపుత్రుడా! నేను నిన్ను యిస్రాయేలు ప్రజ వద్దకు పంపుతున్నాను. వాళ్లూ వాళ్ల పూర్వులూ నామీద తిరగబడ్డారు, ఇంకా తిరగబడుతూనే వున్నారు. వాళ్లు నన్ను గౌరవింపని మొండి మనుష్యులు. కాని ప్రభువునైన నా సందేశం విన్పింపమని నేను నిన్ను వాళ్లచెంతకు పంపుతున్నాను. ఆ తిరుగుబాటుదారులు నీమాటలు ఆలించినా ఆలించకపోయినా కనీసం తమ నడుమ ఓ ప్రవక్త ఉన్నాడనైనా గుర్తిస్తారు" - 2,3-5. "వాళ్లు విన్నా వినకపోయినా నేను చెప్పిన మాటలన్నీ నీవు వాళ్లతో చెప్పు. వాళ్లు వట్టి తిరుగుబాటు మూక" -2.7. "నేను నీతో చెప్పిన సంగతులు నీవు వాళ్లతో చెప్పు. వారిలో కొందరు నీమాటలు ఆలిస్తారు గాని కొందరు ఆలించరు. వాళ్లు వట్టి తిరుగుబాటు మూక" - 3,27.

ఈలా ప్రజలు దేవుని మీద తిరుగుబాటు చేయడమూ, అతడు పంపిన ప్రవక్తలు విన్పించే సందేశాన్ని లక్ష్యం చేయక పోవడమూ పూర్వవేదంలో చాలచోట్ల కన్పిస్తుంది. ప్రవక్త ప్రధానంగా దేవుని సందేశాన్ని విన్పించేవాడని చెప్పాం. మరి ప్రజలు ఆ సందేశాన్ని వినకపోతే అతనికి ఎంత బాధ కలుగుతుందో ఊహించుకోవచ్చు.

### 3. ప్రవక్తల మరణం

ప్రభువు సీనాయికొండ దగ్గర యిస్రాయేలీయులతో చేసికొనిన నిబంధనాన్ని గూర్చి ప్రవక్తలు తేపతేపకు ప్రజలను హెచ్చరిస్తూండేవాళ్లు. మోషే ధర్మశాస్త్రాన్ని పాటించమని జనులను మందలిస్తూండేవాళ్లు. కాని ఈ ధర్మశాస్త్రాన్ని మీరేవాళ్లల్లో మొట్టమొదటి వాళ్లు రాజులూ అధికారులూను. కనుక ప్రవక్తలు ఈ పెద్దమనుషులను చీవాట్లు పెడుతూండేవాళ్ళు. వాళ్ళు అధికార గర్వంతో ప్రవక్తలను హింసించేవాళ్ళు. అహాబురాజు ప్రవక్తలను పట్టి చంపించాడు - 1రాజు 18,4. అలాగే యోయాకిం రాజుకూడ చంపించాడు - యిర్మీ 26,20-23. యిస్రాయేలీయులు ఓ సింహం లాగ ప్రవక్తల మీదబడి వాళ్ళను వధించారు - 2,30. ఈ సందర్భాలను పురస్కరించుకొనే నూత్న వేదంలో క్రీస్తు "యెరూషలేమూ! నీవు ప్రవక్తలను చంపేదానివి" అన్నాడు - మత్త 23,37.

ఈలా ప్రాణాలు కోల్పోయిన ప్రవక్తలందరిలోను బాధామయ సేవకుడు ఘనుడు. ఇతన్ని ఓ గొర్రెపిల్లను లాగ వధ్యస్థానానికి నడిపించుకొనిపోయారు. ఐనా ఆ మహానుభావుడు పల్లెత్తు మాట అనలేదు. మన పాపాల కోసం అతన్ని వధించారు - యెష 53,7-8. ఆ పుణ్య పురుషుడు తన్ను సంహరించే పాపుల కోసం ప్రార్థన చేస్తూ తనువు చాలించాడు. అతని మరణం ద్వారా మనకు రక్షణం చేకూరింది - 53,11. పూర్వవేదంలోని ఈ బాధామయ సేవకుడు నూత్న వేదంలో రాబోయే క్రీస్తుని సూచిస్తాడు.

ప్రభువు సందేశాన్ని విన్పించడంలో ప్రవక్తలు నానా హింసలు అనుభవించారని చెప్పాం ఈ యధ్యాయంలో. నిజమైన వేదబోధకులు ఈ బాధలను నేడూ ఏదోవొకరూపంలో అనుభవిస్తూనే వున్నారు.

## 6. ప్రవచనం - నాడూ నేడూ

### 1. నాడు

పూర్వవేదంలో ప్రవక్తలు దైవ సందేశాన్ని విన్పించి ప్రజలకు చైతన్యం కలిగించారు. రాజులతో పాటు, యాజకులతో పాటు, ప్రవక్తలు కూడ యిస్రాయేలు సమాజానికి ఎనలేని సేవలు చేసారు. మోషే యిస్రాయేలు ప్రజలంతా కూడ ప్రవక్తలై

ప్రభుని స్తుతిస్తే బాగుంటుంది అనుకొన్నాడు - సంఖ్యా 11,29. ప్రభువు అంత్యదినాల్లో ప్రజలందరి మీదా తన ఆత్మను కుమ్మరిస్తాడనీ జనులంతా ప్రవక్తలౌతారనీ యోవేలు ప్రవక్త నుడివాడు - 2,28-29. పరిశుద్ధాత్మ శిష్యుల మీదకి దిగివచ్చిన పిదప ఈ ప్రవచనం నెరవేరిందని పేత్రు యెరూషలేములో తాను చేసిన మొదటి ప్రసంగంలో పేర్కొన్నాడు - అ కా 2,16. ఈ వాక్యాన్ని బట్టి నూత్న వేదంలో ప్రవచనం పూర్వవేదంలో కంటె గూడ అధికంగా వుంటుందని అర్థం చేసికోవచ్చు.

ఐనా పూర్వవేదంలోనే చివరి రోజులు వచ్చేప్పటికల్లా ప్రవచనం మందగించి పోయింది. 538లో యూదులు బాబిలోను ప్రవాసం నుండి తిరిగి వచ్చాక ప్రవచనం క్షీణించి పోయింది. 515 ప్రాంతంలో జకర్యా ప్రవక్తనాడు ప్రవచనానికి అట్టే గౌరవం లేదని తెలుస్తుంది - జక 13,2-6. దీనికి కారణమేమిటో రూఢిగా తెలియదు. బహుశః పూర్వవేదం లిఖితరూపంలో ప్రచారానికి వచ్చాక వాగ్రూపమైన ప్రవక్తల సందేశం మూలబడి వుంటుంది. గ్రంథాన్ని చదివి వ్యాఖ్య చెప్పే ధర్మశాస్త్రవేత్త ప్రవక్త స్థానాన్ని ఆక్రమించుకొని వుంటాడు.

ఐనా ప్రవచనం పూర్తిగా విలువను కోల్పోలేదు. నూత్నవేదం నాటికి గూడ ఆ ప్రక్రియ ప్రచారంలో వుంది. స్నాపక యోహాను మహా ప్రవక్త. క్రీస్తు అందరినీ మించిన ప్రవక్త. తర్వాత పౌలు నెలకొల్పిన క్రైస్తవ సమాజాల్లో చాలమంది ప్రవక్తలు వుండేవాళ్ళు. అతడు ప్రవచనాన్ని అనాదరం చేయవద్దని ప్రత్యేకంగా హెచ్చరించాడు గూడ - 1తెస్స 5,19-20.

పూర్తిగా నశించకపోయినా ప్రవచనం విలువ క్రమేణ తగ్గిపోతూ వచ్చిందని చెప్పాం. నూత్నవేదం వ్రాయడం ముగిసి అపోస్తలులు గతించాక - అనగా మొదటి శతాబ్దం అంతానికి అది యింకా తగ్గిపోయింది. రెండవ శతాబ్దం నుండి శ్రీసభలో అధికార ప్రాబల్యం పెరుగుతూ వచ్చింది. బిషప్పులూ గురువులూ మొదలైన వాళ్ళు అధికారానికి ఎక్కువ ప్రాముఖ్యమిచ్చి అన్నిటినీ కట్టుబాట్లలో పెట్టడం మొదలుపెట్టారు. ఈ యధికార మనస్తత్వం వల్ల మిగిలివున్న ప్రవచనం కాస్త ఉక్కిరిబిక్కిరై నలిగిపోయింది.

ఈలా ప్రవచన ప్రమేయం లేకుండానే మన క్యాతలిక్ సమాజం రెండువేల యేండ్లు జీవితయాత్ర సాగించింది. కాని యిటీవల పెంతెకోస్తు ఉద్యమం ద్వారా ఈ వరం మళ్ళా ఊపిరిపోసికొని ప్రచారం లోకి వచ్చింది. ఇప్పుడు క్రైస్తవ శాఖ లన్నిటిలోను, క్యాతలిక్ శాఖలో గూడ, ఈ వరం మళ్ళా తలెత్తుతూంది. ఇది శుభసూచనమే. ప్రభువు ఆదరంతో దయచేసిన ఈ వరాన్ని మనం అశ్రద్ధ చేయగూడదు గదా!

కాని ఈ ప్రవచన వరం నేడు మనకు ఏమి మేలు చేసి పెడుతుంది? అది పూర్వం యిస్రాయేలు సమాజానికీ, తొలి శతాబ్దం లోని క్రైస్తవ సమాజానికీ ఏమి మేలు చేసిపెట్టిందో నేడు మనకూ అదే మేలు చేసిపెడుతుంది. ఈ సందర్భంలో పౌలు "ప్రవక్త ప్రజలకు అభివృద్ధినీ, ప్రోత్సాహాన్నీ, ఆదరాన్నీ చేకూర్చి పెడతాడు" అన్నాడు - 1కొ 14,3. ప్రవచనం నేడు మనకు విశేషంగా చేసే మేలు, ప్రోత్సాహం. కనుక ఈ యంశాన్ని కొంచెం విపులంగా పరిశీలించి చూద్దాం.

## 2. నేడు

నేడు ప్రపంచంలో ప్రధానమైంది సాంఘిక సమస్య. అనగా ధనవంతులు దరిద్రులను దోచుకోవడం. ప్రపంచంలో ఎక్కడికి వెళ్ళినా రెండువంతులు పేదలూ ఒక వంతు ధనికులూను. కాని ఈ ఒక వంతు సంపన్నులు రెండువంతులు దరిద్రులను పీడించి పిప్పి చేస్తున్నారు. దేవుడే గనుక ఈనాడు పేదవాడికి దర్శనమిస్తే రొట్టెరూపంలో దర్శనమిస్తాడు అన్నాడు గాంధి. కనుక ప్రభువు ఈనాడు పేదవాణ్ణి ప్రోత్సహించడానికి తన ప్రవచన వరాన్ని వాడుకొంటాడని ఊహించుకోవచ్చు. అందుచేత మనం పదిమందిమి ప్రోగైనప్పుడు ఈ వరాన్ని వినియోగించుకొని ఒకరినొకరం ప్రోత్సహించు కొంటూండాలి.

ఓ పెద్ద హైస్కూల్లో అరవైమంది ఉపాధ్యాయినులున్నారు. కాని వాళ్ళ ధనవంతుల పిల్లలను మన్ననతో చూస్తూండేవాళ్ళు. బళ్ళో విద్యార్థులకు లభించే ఉద్యోగాలూ పదవులూ అన్నీ ఈ పిల్లలకే అంటగడుతూండే వాళ్ళు. పేద విద్యార్థులను మాత్రం బొత్తిగా పట్టించుకొనే వాళ్ళుకాదు. ఆ స్కూలుకి ఓ సిస్టరు ప్రధానోపాధ్యాయిని. ఓమారు ఆమె ఉపాధ్యాయినులందరినీ ప్రోగు జేసి "మనం కూడ ధనవంతుల పిల్లలను మాత్రమే పరామర్శిస్తే ఇక పేద పిల్లలను పట్టించుకొనేదెవరు? మీరు విందుచేసికొనేపుడు పేదలనూ కుంటివారినీ గ్రుడ్డివారినీ వికలాంగులనూ పిలవండి. వాళ్ళు మీకు ప్రత్యుపకారం చేయలేరు కనుక మీరు ధన్యులౌతారు - అనే ప్రభువాక్యం వుంది కదా? కనుక మనం ధనికులను వెళ్ళగొట్ట నక్కరలేదు కాని పేదలను మాత్రం ప్రత్యేక శ్రద్ధతో పరామర్శించాలి" అని హెచ్చరించింది. దానితో ఆ స్కూలులోని ఉపాధ్యాయినుల దృక్పథం మారిపోయింది. వాళ్ళు పేదపిల్లలను పట్టించుకోవడం మొదలుపెట్టారు. ఇక్కడ ఈ సిస్టరు చెప్పింది ప్రవచనమే. ఈ ప్రవచనం వలన ఈ స్కూలులో సాంఘిక న్యాయం చేకూరింది.

ఈలాగే మనలో ఎవరైనా ప్రవచనాన్ని వాడుకొని మన చుట్టూరా జరిగే సాంఘిక అన్యాయాలను ఎత్తి చూపించవచ్చు. ఆ యన్యాయాలను సవరించుకొమ్మని అందుకు కారకులైన వ్యక్తులను హెచ్చరించవచ్చు, మందలించవచ్చు. కాని యిక్కడ ఓ అంశం

గుర్తుంచుకోవాలి. ప్రవచనం మనంతట మనం పలికేది కాదు. అది దేవుని ప్రోద్బలం వల్ల పుట్టేది. ఆత్మ పలికించేది. కనుక ప్రభువు మనలను పలానా అన్యాయాన్ని గూర్చి మాట్లాడమంటున్నాడనే భావం కలిగినప్పుడు మాత్రమే మనం ఆ ప్రభువు పేరు మీదిగా ప్రవచనం చెప్పాలి. అలా చెప్పేపుడు ఈ యంశానికి సంబంధించిన బైబులు వాక్యాలు ఒకటి రెండు ఉదహరించడం మంచిది.

పైన చెప్పిన ఉదాహరణం సాంఘిక అన్యాయాన్ని చక్కదిద్దే ప్రవచనం. ఈలాగే తోడిజనులను ప్రోత్సహించే ప్రవచనం కూడ వుంది. ఓ తావులో కొందరు ఉపాధ్యాయులూ ఉపదేశులూ కలసి దీపావళి సెలవల్లో బైబులు సదస్సు జరుపుకొంటున్నారు. ఉపన్యాసకుడు "భక్తులారా! మీరు దీపావళి వేడుకలు కూడ వదలిపెట్టి వచ్చి ఇక్కడ గుమిగూడి ప్రభు వాక్యం వింటున్నారు. మీ భక్తిని చూడగా నా భక్తి కూడ పెరుగుతూంది. నేను మీకు ప్రభువాక్కు విన్పిద్దామనుకొన్నాను గాని మీ మంచి ఆదర్శం ద్వారా మీరే నాకు ఆ వాక్కు విన్పించారు. సరే, మనందరికీ బోధచేసేది ఆ ప్రభువే. భగవంతుడే స్వయంగా ఉపాధ్యాయుడై తన భక్తులకు బోధ చేస్తాడు అనే ప్రభువు వాక్యం ఉంది" అన్నాడు. ఈ పలుకుల వలన అక్కడ సమావేశమైన ఉపాధ్యాయులూ ఉపదేశులూ ప్రోత్సాహం చెంది శ్రద్ధతో సదస్సులో పాల్గొన్నారు. ప్రోత్సాహక ప్రవచనాలు ఈలా వుంటాయి.

ఇతరులను ప్రోత్సాహపరచ దలచుకొన్నపుడు భగవంతుని కరుణనూ ప్రేమనూ పేర్కొనడం కూడ మంచిది. ఓ విద్యార్థి సమావేశంలో ఉపన్యాసకుడు దైవ ప్రేరణలతో "నా ప్రజలారా! మీరు నా ప్రేమను గుర్తిస్తారు. నా రక్షణాన్ని చవిజూస్తారు. తల్లి తన ప్రేవున బుట్టిన బిడ్డను మరచిపోతుందా! ఒకవేళ తల్లి తాను కనిన బిడ్డను మరచిపోతే పోతుందేమో కాని నేను మాత్రం మిమ్ము మరచిపోను" అన్నాడు. ఆ ప్రవచనానికి అక్కడి విద్యార్థులు తన్మయులై పోయారు. ప్రభువు తమ్ము ప్రేమిస్తున్నాడని గాఢంగా నమ్మారు. పెంతెకోస్తు సమావేశాల్లో భక్తులు ఈలాంటి ప్రవచనాలను ఎన్నిటినో విన్పిస్తుంటారు.

కొందరు మేమేమిటి ప్రవచనం చెప్పడమేమిటి అని జంకుతూంటారు. ఈలా భయపడనక్కరలేదు. ప్రభువు మన ద్వారా తోడిజనులకూ, తోడిజనుల ద్వారా మనకూ తన సందేశాన్ని విన్పిస్తూంటాడు. కనుక మన తరపున మనం, ప్రభువు అనుగ్రహం వలన మనం కూడ అతని సందేశాన్ని విన్పింపగలం అని నమ్ముతూండాలి. పైగా మనం ప్రభువు సందేశాన్ని విన్పించడానికి సిద్ధం కావాలి కూడ. ప్రభువు గ్రంథాన్ని భక్తితో చదువుకోవడం, ప్రార్థనం చేసికోవడం, ప్రభువు మన అంతరాత్మలో విన్పించే ప్రబోధాలను ఆలించడం, తోడి ప్రజలయెడల దయా సానుభూతీ అలవర్చుకొని వాళ్ళ గోడు వినడం – మొదలైనవి ఈలా సిద్ధం కావడానికి మార్గాలు.

# ౨. నాల్గు బైబులు భావాలు

బైబులు భాష్యం - 41

విషయ సూచిక



## 1. బాలలు

### 1. పూర్వవేదం

పూర్వవేదం బాలలను బుద్ధిహీనులనుగా భావిస్తుంది. వాళ్ళ క్రమశిక్షణకు లోబడి వుండాలని చెప్తుంది. సామెతల గ్రంథకర్త.

"బాలల హృదయంలో మూర్ఖత్వం
స్వాభావికంగానే వుంటుంది
కాని దండనం ద్వారా దానిని తొలగించవచ్చు"

అంటాడు - 22,15. యూదులు పిల్లలను అంత గౌరవ భావంతో చూడలేదోమో ననిపిస్తుంది. వాళ్ళ సంప్రదాయం ప్రకారం చిన్నపిల్లలూ, స్త్రీలూ, బానిసలూ ఒకే శాఖకు చెందుతారు. ఈ ముగ్గురికీ హక్కులు లేవు, సమాజంలో స్థానం లేదు. కనుక పిల్లలను తల్లిదండ్రులూ, భార్యలను భర్తలూ, బానిసలను యజమానులూ తమ యిష్టం వచ్చినట్లు చేయవచ్చు.

ఐనా యూదులు చిన్న బిడ్డలను ప్రేమించి ఆదరంతో చూడకపోలేదు. తల్లిదండ్రులు బిడ్డలను దేవుని వరంగాను దీవెన గాను భావించారు. కయీను పుట్టినప్పుడు ఏవ "దేవుని తోడ్పాటు వలన నాకో బిడ్డ కలిగాడు" అనుకొంది - ఆది 4,1. అనగా ఆమె ఆ శిశువును దేవుని వరంగా భావించింది. అలాగే కీర్తనకారుడు

"బిడ్డలు దేవుడిచ్చే వరం
వాళ్ళు ప్రభువు దయచేసే బహుమానం

యౌవనప్రాయంలో పుట్టిన పిల్లలు
యోధుని చేతిలోని బాణాల వంటివాళ్ళు
అట్టి బాణాలతో అమ్ములపొది నింపుకొనేవాడు ధన్యుడు"

అంటాడు - 127,3-5. అనగా బిడ్డలు తండ్రికి బాగా ఉపయోగపడతారని భావం. మరో కీర్తనకారుడు గృహస్థుని దీవిస్తూ

"నీ లోగిట నీ భార్య ఫలించిన ద్రాక్షలతలా వుంటుంది
భోజనపు బల్ల చుట్టు నీ పిల్లలు
ఓలివు మొక్కల్లా కన్పిస్తారు"

అన్నాడు - 128,3-4. ఇక్కడ సంతానవతియైన భార్యను గుత్తులు వ్రేలాడే తీగతోను, పిల్లలను ఓలివు మొక్కలతోను పోల్చాడు. ఇది రమ్యమైన ఉపమానం.

బిడ్డలు లేని దంపతులకు తీరని వ్యధి కలిగేది. అబ్రాహాము సంతానం కలగనందున చాల బాధపడ్డాడు. ఓమారు ప్రభువు అతనికేదో బహుమానాన్ని ఇస్తానని చెప్పగా అబ్రాహాము "ప్రభూ! నీవు నాకు ఏమియిస్తే మాత్రం ఏమిలాభం? నేను బిడ్డపాప లేనివాడనై పోయానుగదా!" అని విలపించాడు - ఆది 15,2. అలాగే బిడ్డలు కలుగనందున ఎల్కానా భార్యయు గొడ్రాలునైన అన్నా కుమిలిపోయింది. "ప్రభూ! నాకొక మగకందును ప్రసాదించావంటే ఆ బిడ్డను ఆమరణాంతం నీకే సమర్పించుకొంటాను. మంగలికత్తి వాని తలవెంట్రుకలను తాకదు" అని మ్రొక్కుకొంది -1సమూ 1,11. యాకోబు చిన్న భార్య రాహేలుకు చాలకాలం వరకు సంతానం కలగలేదు. ఆమె "నాకు పిల్లలను పుట్టిస్తావా లేక ఏ నుయ్యో గొయ్యో చూచుకొమ్మంటావా" అని భర్తను పీడించింది - ఆది 30;1. యూదదంపతులు పిల్లలను కోరుకునేతీరు ఈలావుండేది.

పిల్లలు కూడ ఆరాధనలో పాల్గొని దేవుని స్తుతింపగలరు. వాళ్ళ స్తుతి భగవంతునికి ప్రియపడుతుంది. కనుకనే కీర్తనకారుడు

"చిన్నబిడ్డలూ, చంటిబిడ్డలూ నిన్ను స్తుతిస్తారు"

అన్నాడు - 8,2. ఈ భావం క్రీస్తుకి బాగా నచ్చింది. అందుకే అతడు ఈ వాక్యాన్ని తన బోధల్లో ఉదాహరించాడు - మత్త 21,16.

పూర్వవేదంలో ప్రభువు ముగ్గురు బాలురను తన దూతలనుగా ఎన్నుకొన్నాడు. ఈ ముగ్గురు ప్రభువు తరపున ప్రజలకు రక్షకులుగా వ్యవహరించారు. వాళ్లు సమూవేలు, దావీదు, దానియేలూ.

బాలుడైన సమూవేలు షిలో దేవాలయంలో పెరుగుతూ ఏలి అనే పెద్ద గురువుకి పరిచర్యలు చేస్తుండేవాడు. ఓనాటి రాత్రి అతడు దేవళంలో మందసం చెంత పండుకొని

నిద్ర పోతూండగా ప్రభువు అతనికి ప్రత్యక్షమై పేరెత్తి పిల్చాడు. ఈలా మూడుసార్లు జరిగింది. నాల్గవసారి దేవుడు పిలవగా సమూవేలు "ప్రభూ! ఆజ్ఞ యీయి. నీ దాసుడు ఆలిస్తూనే వున్నాడు" అన్నాడు. అప్పుడు ప్రభువు ఆ బాలునికి తన సందేశం విన్పించాడు. ఆనాటి నుండి సమూవేలు ప్రభువు ప్రవక్త అయ్యాడు. యిస్రాయేలీయులకు దైవ సందేశాన్ని విన్పించాడు. వాళ్లకు న్యాయాధిపతిగా నాయకుడుగా వ్యవహరించాడు -1సమూ 3.

ప్రవక్తయైన సమూవేలు యీషాయి కొడుకుల్లో ఒకనిని సౌలు స్థానే రాజుగా అభిషేకించడానికి బేత్లెహిముకు వచ్చాడు. అతడు యీషాయి కొడుకుల్లో మొదటి యేడ్గురునీ త్రోసిపుచ్చి కడగొట్టువాడైన దావీదును పిలిపించాడు. అప్పుడు దావీదు ఇంటివద్ద లేడు, పొలంలో గొర్రెలు మేపుతున్నాడు. తండ్రి అతన్ని రప్పించాడు. ఆ బాలుడు రాగానే ప్రభువు నేను కోరుకున్నవా డితడే, నీవు ఇతన్ని అభిషేకించు అని ప్రవక్తతో చెప్పాడు. ప్రవక్త తైలపుకొమ్ము పుచ్చుకొని అన్నలందరి యెదుట దావీదుకు అభిషేకం చేసాడు. ఆ దినం మొదలుకొని ప్రభువు ఆత్మ దావీదును ఆవేశించి అతనిలో వుండిపోయింది - 1సమూ 16,11-12. ఈ దావీదు యిస్రాయేలు గోత్రాలన్నిటిని ఐక్యపరచాడు. యూద సామ్రాజ్యాన్ని నిర్మించాడు. సమూవేలు ప్రవక్తగా యిస్రాయేలుకు రక్షకుడైతే ఇతడు రాజుగా రక్షకుడయ్యాడు.

యూదులు బాబిలోనులో ప్రవాసులుగా వున్న కాలంలో సూసన్న అనే గృహిణి వుండేది. ఆమె యెవాకీం భార్య, అందగత్తె. ఒకయేడు ఇరువురు వృద్ధులు యూదులకు న్యాయాధిపతులుగా ఎన్నికయ్యారు. వీళ్ళు సూసన్న అందాన్ని చూచి ఆమెను కామించారు. కాని ఆమె వాళ్ళ కోరికను నిరాకరించింది అందువల్ల వాళ్ళు ఆగ్రహం చెంది సూసన్న మరెవరితోనో వ్యభిచరించింది అని నేరం మోపి ఆమెకు మరణశిక్ష విధించారు. అలా ఆ పుణ్యాత్మురాలుని చంపడానికి తీసికొని వెళ్తూండగా ప్రభువు ఆత్మ దానియేలు అనే బాలుణ్ణి ప్రేరేపించింది. అతడు జనాన్నందరినీ మళ్లా న్యాయస్థానానికి మరలించుకొని వచ్చాడు. అక్కడ దానియేలు ఆ వృద్ధ న్యాయాధిపతులిరువురిని వేరువేరుగా పిల్చి సూసన్న ఎక్కడ వ్యభిచరించిందో చెప్పమన్నాడు. వాళ్ళిద్దరూ పరస్పర భిన్నమైన తావులు పేర్కొన్నారు. కనుక వాళ్ళు దొంగ సాక్షులని తేలిపోయింది. కడన వాళ్ళకు మరణశిక్ష ప్రాప్తించింది, సూసన్న బ్రతికి బయటపడింది. ఈలా ఈ బాలుడు ఈ పుణ్యస్త్రీకి రక్షకుడయ్యాడు - దాని 13, 44-50.

పూర్వవేదంలో యెషయా ప్రవక్త మెస్సీయా శిశువు పుట్టువును వర్ణించాడు. "గర్భవతిగా వున్న ఓ యువతి కుమారుని కని ఆ శిశువుకి ఇమ్మానువేలు అని పేరు పెడుతుంది" అని ప్రవచించాడు -7,14. ఇంకా ఈ శిశువును గూర్చిన వివరాలను పేర్కొంటూ

"మనకో శిశువు జన్మించాడు
ఓ కుమారుడు లభించాడు
అతడు మనకు పాలకుడౌతాడు
అతనికి ఆశ్చర్యకరుడైన హితోపదేశకుడు,
మహాదేవుడు, శాశ్వతపిత,
శాంతిదూత అని పేర్లు
అతని రాజ్యాధికారం పెంపుజెందుతుంది
అతని రాజ్యంలో ఎప్పుడూ శాంతి నెలకొంటుంది
దావీదు అనుయాయిగా అతడు కలకాలం రాజ్యం చేస్తాడు"

అని చెప్పాడు - 9,6-7. ఈ రెండు ప్రవచనాలూ రాబోయే క్రీస్తుకి వర్తిస్తాయి.

## 2. నూత్నవేదమూ బాలలూ

ప్రవక్త మెస్సీయా పుట్టువును వర్ణించాడని చెప్పాం గదా! ఆ మెస్సీయా శిశువు మనకోసం బేత్లెహేములో జన్మించనే జన్మించాడు. ఆ బాబుని పొత్తిగుడ్డల్లో చుట్టి పసుల తొట్టిలో పరుండబెట్టింది తల్లి మరియ - లూకా 2,12. శిశువుగా వున్నపుడే ఆతల్లి అతన్ని దేవాలయంలో అర్పించింది - 2,27. బాలుడుగా అతడు తల్లిదండ్రులైన మరియా యోసేపులకు విధేయుడయ్యాడు - 2,51. అతడు పరలోకంలోని తండ్రి కార్యంలో నిమగ్నుడై వుండేవాడు కూడ - 2,49. ఈ రీతిగా యేసు తాను శిశువుగా పుట్టి మన శిశువులందరినీ దీవించాడు. తాను బాలుడుగా పెరిగి మన బాలలందరినీ ఆశీర్వదించాడు.

ఈ యేసు పెరిగి పెద్దవాడైన పిదప బాలలకు అంతకుముందు యూదు సంప్రదాయంలో లేని గౌరవాన్ని చేకూర్చిపెట్టాడు. బాలలను గూడ వ్యక్తులనుగా గుర్తించి గౌరవంతో చూచిన మొదటి రబ్బయి అతడే. ఆ వివరాలను కొన్నిటిని పరిశీలిద్దాం.

### 1. క్రీస్తు చిన్నబిడ్డలను ఆహ్వానించాడు

యూదులు చిన్నబిడ్డలనూ స్త్రీలనూ పెద్దగా గౌరవించలేదని చెప్పాలి. ఐనా క్రీస్తు పసివాళ్ళను గూడ పూర్ణవ్యక్తులనుగా గుర్తించి ఆదరించాడని గూడ నుడివాం. ఓమారు కొందరు తల్లులు చిన్న బిడ్డలనెత్తుకొని ప్రభువు దగ్గరకి వచ్చారు. ఆ పుణ్యపురుషుడు దీవిస్తే తమ బిడ్డలు తప్పకుండా వృద్ధిలోకి వస్తారని వాళ్ళ భావం. కాని శిష్యులు ఆ తల్లులను క్రీస్తు చెంతకు రానీకుండా ఆటంకపరచారు. అప్పుడు ప్రభువు శిష్యులను మందలించి ఆ తల్లులను దగ్గరికి పిల్చాడు. పిల్లల మీద చేతులు చాచి వాళ్ళను దీవించాడు. ఈలా అతడు చిన్నబిడ్డలను ఆహ్వానించి ఆదరించాడు - మార్కు 10, 13-16.

## 2. చిన్నబిడ్డలకు ఉపకారం చేసాడు

ప్రభువు చిన్నబిడ్డలకు ఉపకారం చేసిన సందర్భాలు కూడ కొన్ని వున్నాయి. కననీయ స్త్రీ తన బిడ్డను పట్టి పీడించే దయ్యాన్ని పారద్రోలమని ప్రాధేయపడింది. ప్రభువు పిల్లలు తినవలసిన రొట్టెను కుక్క పిల్లలకు వేయం గదా అన్నాడు. కాని ఆమె పిల్లలు భోజనపు బల్ల మీదనుండి జారవిడిచిన రొట్టె ముక్కలను కుక్కపిల్లలు కూడ తిని బ్రతుకుతాయి కదా అంది. ఆమె విశ్వాసాన్ని మెచ్చుకొని ప్రభువు ఆమె పాపకు పట్టివున్న దయ్యాన్ని వెళ్ళగొట్టాడు - మార్కు 7,24-30. ఇంకా అతడు చనిపోయిన యాయీరు కొమార్తెను జీవంతో లేపాడు. ఆమె పండ్రెండేళ్ళ బాలిక - మార్కు 5,41-42. ఇవి రెండు అతడు చిన్నపిల్లలకు చేసిన ఉపకారాలు.

అసలు పిల్లలంటే ప్రభువుకి యెంతో యిష్టం. కనుకనే అతని బోధల్లో పిల్లలను సమర్థించే వాక్యాలు కూడ వున్నాయి. పెద్దవాళ్ళు పిల్లలను అపమార్గం పట్టించగూడదు. అలాంటి పని చేయడం కంటె మెడలో తిరుగలిరాయి కట్టుకొని సముద్రంలో పడిపోవడం మేలు - మత్త 18,6. ఇంకా, పెద్దవాళ్ళు పిల్లలను చిన్నచూపు చూడకూడదు. అలా చూస్తే ఆ బిడ్డలకు కావలి కాసే దేవదూతలు ఆ యన్యాయాన్ని దేవుని సన్నిధిలో విన్నవిస్తారు - మత్త 18,10. కనుక పెద్దవాళ్ళు పిల్లలకు కీడు చేయకూడదని భావం.

## 3. చిన్నబిడ్డలు శిష్యుల్లాంటి వాళ్ళు

క్రీస్తు మోక్షాన్ని దైవరాజ్యమని పేర్కొంటూండేవాడు. శిష్యులు ఆ రాజ్యం కూడ ఈ భూలోక రాజ్యం లాంటిదే అనుకొన్నారు. ఆ రాజ్యంలో తాము మంత్రులం కావచ్చు అని కూడ భావించారు. కాని యెవరు ప్రధానమంత్రి కావాలి అన్న పేచీ వచ్చింది. కనుక వాళ్ళు క్రీస్తు దగ్గరికి వచ్చి నీవు బోధించే ఆ పరలోక రాజ్యంలో అందరికంటె గొప్పవాడెవడు అని అడిగారు. అనగా నీ రాజ్యంలో ఎవరు ప్రధానమంత్రి ఔతారు అని వాళ్ల ప్రశ్న. క్రీస్తుకి ఈ మనస్తత్వం ఏమీ నచ్చలేదు. అతడు శిష్యులను మందలించి వాళ్ళను చిన్నబిడ్డల్లా తయారుకమ్మన్నాడు. చిన్నబిడ్డల్లా ఐతేనే గాని వాళ్ల పరలోక రాజ్యంలో ప్రవేశించరని నొక్కి చెప్పాడు - మత్త 18,1-5. కాని యిక్కడ శిష్యులు చిన్నబిడ్డల్లా తయారు కావాలంటే భావం ఏమిటి? వాళ్లు ప్రాయంలో చిన్నవాళ్ళు కాలేరు. మరి దేనిలో చిన్నవాళ్ళు కావాలి? చిన్న బిడ్డడు పెద్దవాళ్ళ మీద ఆధారపడి జీవిస్తాడు. అలాగే శిష్యులు కూడా దేవునిమీద ఆధారపడి జీవించడం నేర్చుకోవాలి. నేను అంతటి వాణ్ణి యింతటివాణ్ణి అనే భావం కాని, నాకునేను చాలుదుననే ధీమాగాని వాళ్ళకు పనికిరాదు. వాళ్ళు దేవునిమీద ఆధారపడాలి. ఆ తండ్రిని నమ్మడం నేర్చుకోవాలి. అతనిపట్ల వినయ

విధేయతలు అలవర్చుకోవాలి. శిష్యులు చిన్నబిడ్డల్లా కావాలి అన్నపుడు క్రీస్తు ప్రధానంగా ఉద్దేశించింది ఈ యాధార మనస్తత్వమే. ఈ మనస్తత్వం కలవాడే శిష్యుడు. ఇది చిన్న బిడ్డల్లో బాగా వుంటుంది. కనుక వాళ్ళు ఉత్తమ శిష్యులు.

ఇంకోసారి ప్రభువు, శిష్యులు పసిబిడ్డల్లాగ దైవరాజ్యాన్ని అంగీకరించాలి అని బోధించాడు - మార్కు 10,15. దీని భావం ఏమిటి? పరిసయులు మోషే ధర్మశాస్త్రాన్ని తుచ తప్పకుండా పాటిస్తున్నారు. ఈ యాచరణం ద్వారా వాళ్ళు దైవరాజ్యం మీద హక్కును సంపాదించాము అనుకొన్నారు. అనగా తాము ధర్మశాస్త్రాన్ని పాటించినందువల్ల దేవుడు తమకు మోక్షాన్ని విధిగా ఈయాలి అని వాళ్ళ భావం. ఎందుకంటే తాము నీతిమంతులు కనుక - లూకా 18,9. కాని అసలు వాళ్ళు ధర్మశాస్త్రాన్ని పాటించడానికే భగవంతుని కృప కావాలి కదా? కనుక మోక్షం మీద వాళ్ళకేదో హక్కు వుంది అనుకోవడం పొరపాటు. మోక్షం మీద ఏ నరునికి, ఎంతటి భక్తునికి కూడ, హక్కు లేదు. అది యెవరికి లభించినా కేవలం ప్రభువు కృపవలననే. మరి యిక్కడ క్రీస్తు మనం పసిబిడ్డల్లా దైవరాజ్యాన్ని అంగీకరించాలి అంటే, దాన్ని దేవుడు ఉచితంగా యిచ్చే వరంగా భావించాలని అర్థం. దాని మీద మనకేదో హక్కువుంది అన్నట్లుగా ఎంచగూడదని భావం. కనుక దేవుడు మనకు మోక్షాన్ని విధిగా ఈయాలి అనుకోగూడదు, అతని కృపవలన మనకు మోక్షం ప్రాప్తిస్తుంది అనుకోవాలి.

పిల్లలు మనమేమైనా యిస్తే సంతోషంతో తీసికొంటారు. దాని మీద తమకు హక్కు వుంది అనుకోరు. అలాగే మనం కూడ దేవుని నుండి మోక్షాన్ని స్వీకరించాలి.

తండ్రి దైవరాజ్య రహస్యాలను ఎవరికి తెలియజేస్తాడు? విజ్ఞులకూ వివేకవంతులకూ కాదు. పండితుల మనుకొని విర్రవీగేవాళ్ళకూ కాదు. మరి పసిబిడ్డలకి. ఎందుకు? వాళ్ళు దేవుణ్ణి భక్తితో నమ్ముతారు కనుక - మత్త 11,25. కనుక చిన్నవాళ్ళు దైవరాజ్య రహస్యాలను గ్రహించే శిష్యులు.

పైన మనం పేర్కొన్న ఉదాహరణాలన్నీ చిన్న బిడ్డలను గూర్చి. కాని ఈ యుదాహరణల్లో "చిన్న బిడ్డలు" అనే పదానికి శిష్యులు అని కూడ అర్థం చెప్పవచ్చు. క్రీస్తు స్వయంగా తన శిష్యులను "చిన్న పిల్లలారా!" అని సంబోధించేవాడు. కొన్ని వాక్యాల్లో చిన్నబిడ్డడంటే శిష్యుడు, శిష్యుడంటే చిన్న బిడ్డడు అని అర్థం వస్తుంది. "మరియు నా శిష్యుడని యెంచి ఈ చిన్న వారిలో ఒకనికి గ్రుక్కెడు మంచినీళ్ళ నిచ్చినవాడ ప్రతిఫలమును పొంది తీరుతాడు" - మత్త 10,42. ఈ వాక్యంలో చిన్నవాడు శిష్యుడు, శిష్యుడు చిన్నవాడు.

ఫలితార్థమేమిటంటే చిన్న బిడ్డలు శిష్యులతో సమానం. శిష్యులకు చిన్నబిడ్డల మనస్తత్వం - అనగా ఆధార మనస్తత్వం వుండాలి. ఈలాంటి మనస్తత్వం అలవర్చుకొన్నప్పుడే మనం కూడ శిష్యులమయ్యేది.

## 4. చిన్నబిడ్డల్లా ప్రార్థన చేయాలి

మనం ప్రార్థనం చేసేపుడు చిన్నబిడ్డల్లా మెలగాలి. అనగా దేవుని మీద ఆధారపడి అతన్ని మనవి చేసికోవాలి. క్రీస్తు శిష్యులకు పరలోక జపం నేర్పిస్తూ దేవుణ్ణి "తండ్రీ" అని సంబోధించి జపం చేయమని చెప్పడు - లూకా 11,2. ఇక్కడ మూలభాషయైన అరమాయిక్‌లో తండ్రి అనే పదానికి క్రీస్తువాడిన శబ్దం "అబ్బ". ఇది తెలుగు మాట కాదు, అరమాయిక్ మాట. క్రీస్తు నాడు యూదకుటుంబాల్లోని చిన్నబిడ్డలు వాళ్ళ నాన్నలను "అబ్బ" అని సంబోధించేవాళ్ళట. కనుక ఇది నేడు మన పిల్లలు వాడే "నాన్న" అనే పదం లాంటిది. కాబట్టి క్రీస్తు దేవుణ్ణి "నాన్న" అని సంబోధించమన్నాడు అనుకోవాలి. అనగా ఆ దేవుని పట్ల మనకు అంత చనువూ నమ్మకమూ ఏర్పడాలని భావం. మనం చిన్న బిడ్డల్లాగా దేవునికి ప్రార్థన చేయాలి.

ఇంకా అతడు ఓ వుపమానం చెప్పాడు. భూలోకంలోని తల్లిదండ్రులు వాళ్ళ బిడ్డలు ఆకలై అన్నం పెట్టమంటే ఏంచేస్తారు? ఆ కుమారులు చేపనడిగితే పామునిస్తారా? గ్రుడ్డునడిగితే తేలు నిస్తారా? వాళ్ళకుపయోగపడే గ్రుడ్డు చేపలాంటి మంచి వస్తువుల నిస్తారు గాని హానికరమైన పాము, తేలులాంటి వాటిని ఈయరు కదా? అలాగే మనం కూడ పరలోకంలోని తండ్రిని అడుగుకొంటే అతడు మంచివస్తువులనే ఇస్తాడు గాని హానికరమైన వాటిని ఈయడు కదా - లూకా 11,11-13. అనగా పిల్లలు తల్లిదండ్రులను లాగే మనం కూడ నమ్మకంతో దేవుణ్ణి అడుగుకోవాలని భావం. అంటే మనం ప్రార్థనంలో చిన్న పిల్లలంగా తయారు కావాలని అర్థం.

ఇక్కడ క్రీస్తు బోధల్లో చిన్నబిడ్డలను గూర్చిన అంశాలను నాల్గింటిని పరిశీలించాం. అతని వుపదేశాల్లో ఈలాంటి భావాలు ఇంకా వున్నాయి. ఏమైతేనేమి, ప్రభువు బాలలను ఆదరాభిమానాలతో చూచాడు అనేది ప్రధాన సత్యం. మనం కూడ ఈ క్రీస్తు మనస్తత్వం అలవర్చుకొని బాలలను ప్రేమాభిమానాలతో చూస్తే ఎంత బాగుంటుంది!

## 3. తల్లిదండ్రులూ, పిల్లలూ

ఈ సందర్భంలో తల్లిదండ్రులకూ పిల్లలకూ వుండే సంబంధాన్ని గూర్చి కూడ కొద్దిగా ముచ్చటించాలి. యిస్రాయేలు తల్లిదండ్రులు సంతానాన్ని మక్కువతో వాంఛించారు అని చెప్పాం. సంతానం దేవుని దీవెనకు తార్కాణంగా వుండేదని చెప్పాం. న్యాయాధిపతియైన గిద్యోనుకు డెబ్బదిమంది కుమారులు కలిగారు - న్యాయా 8,30. ఈ సంగతి చెప్పడంలో గ్రంథకర్త ఉద్దేశం, గిద్యోను దేవుని ఆశీర్వాదాన్ని పొందాడని తెల్పడమే. ఇంకా అహష్వేరోషురాజు మంత్రియైన హామాను తనకు పదిమంది

కుమారులున్నారని గొప్పలు చెప్పుకుంటాడు. అనగా తాను దేవుని మన్ననకు పాత్రుడనయ్యానని అతని భావం - ఎస్తే 5,11.

యిస్రాయేలు సమాజంలో స్త్రీకి స్త్రీగా విలువుండేది కాదు. సంతానాన్ని కంటేనే ఆమెకు విలువ. బిడ్డలు లేని ఉవిద లెక్కలోనికి వచ్చేది కాదు. అబ్రాహాము భార్య సార. ఆమె దాసి హాగారు. ప్రభువు హాగారుకి బిడ్డనిచ్చి సారను గొడ్రాలిని చేసాడు. హాగారు తాను గర్భవతి కావడం చూచి యజమానురాలినే చిన్నచూపు చూచింది. ఎందుకంటె సార గొడ్రాలు కనుక - ఆది 16,4. ఇంకా, ఎల్కానాకు అన్నా పెనిన్నా అని యిద్దరు భార్యలు. పెనిన్నాకు బిడ్డలు పుట్టారు గాని అన్నా గొడ్రాలుగా వుండిపోయింది. కనుక పెనిన్నా సవతియైన అన్నాను దెప్పిపొడిచింది - 1సమూ 1,6. ఈలాంటి సందర్భా లన్నిటిలోను సంతానం లేని స్త్రీకి విలువ లేదని అర్థం చేసికోవాలి.

పూర్వకాలంలో తండ్రే పిల్లలకు ఉపాధ్యాయుడుగా వ్యవహరించేవాడు. పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పడం అతని బాధ్యత. ఈ బాధ్యతను బైబులు చాల తావుల్లో గుర్తుకు తెస్తుంది.

"కుమారుని శిక్షింపని తండ్రి వానిని ద్వేషించినట్లే
కుమారుని ప్రేమించే తండ్రి
వానిని శిక్షించి తీరుతాడు - సామె 13, 24

విజ్ఞాన గ్రంథకారులు ఈలాంటి నీతులు చాల చెప్పారు. ఇక, పిల్లల తరపున పిల్లలు కూడ తల్లిదండ్రులకు విధేయులై యుండాలి. పిల్లలు తల్లిదండ్రులను గౌరవించాలి అనేది పదియాజ్ఞల్లో ఓ యాజ్ఞ - నిర్గ 20,12. సామెతల గ్రంథకర్త "కుమారా! నీ తల్లిదండ్రుల ఉపదేశాన్ని ఆదరంతో ఆలించు. సుందరమైన తలపాగాగాని ముత్యాలహారం గాని నీ రూపానికి వన్నె తెచ్చినట్లే తల్లిదండ్రుల ఉపదేశం గూడ నీ శీలానికి మెరుగు తెస్తుంది సుమా!" అని నుడివాడు- 1, 8-9. ఇది చాల చక్కని హితబోధ. తల్లిదండ్రులను కొట్టిన వారికి, వాళ్ళను తిట్టి శపించిన వాళ్ళకీ మరణశిక్ష విధించాలి అంటుంది నిర్గమకాండం - 21,15-17. ఈ సందర్భంలో ఓ సంఘటనం గుర్తుకు వస్తుంది. ఎలీషా ప్రవక్త యెరికో నుండి బేతేలుకు ప్రయాణం చేస్తూండగా త్రోవలో కొంతమంది ఆకుదాయపు పిల్లలు అతన్ని గేలిచేసారు. అతని వెంటబడి "పోపో బట్టతలకాయా!" అని ఎగతాళి చేసారు. ప్రవక్త కోపించి వాళ్ళను శపించాడు. వెంటనే అడవిలో నుండి రెండు ఆడు ఎలుగుబంటులు వెడలి వచ్చి నలువది యిద్దరు పిల్లలను ముక్కముక్కలుగా చీల్చివేసాయి. 2రాజు 2,23-24. పిల్లలు పెద్దలను అవమానించగూడదని ఈ పట్టున గ్రంథకర్త ఉద్దేశం.

## 4. ప్రార్థనా భావాలు

1. చాలమంది మేము అంతటివాళ్ళం ఇంతటివాళ్ళం అనుకొని మిడిసి పడుతూంటారు. చిన్న బిడ్డల్లాగ వినయమూ సరళ స్వభావమూ, దేవుని పట్ల నమ్మకమూ ఆధార మనస్తత్వమూ అలవర్చుకోరు. కాని భక్తుడైన కీర్తనకారుడు తన సంగతిని చెప్పుకోవలసి వచ్చినప్పుడు చిన్నబిడ్డను ఉపమానంగా తీసికొన్నాడు.

"ప్రభో! నా గర్వాన్ని వదులుకొన్నాను
నా మిడిసిపాటును అణచుకొన్నాను
నేను గొప్పగొప్ప సంగతులను గూర్చి గాని
కష్టమైన విషయాలను గూర్చి గాని
ఆలోచించదల్చుకోలేదు
నేను నెమ్మదిగాను ప్రశాంతంగాను ఉండిపోతాను
తల్లి రొమ్ము మీద నిమ్మళంగా
పండుకొనివున్న పసిబిడ్డలాగ
నా హృదయం కూడ ప్రశాంతంగా వుంది"

అని చెప్పుకొన్నాడు - కీర్త 131. ఉత్తమ శిష్యుడంటే ఈ కీర్తనకారుడే. తన్ను తాను హెచ్చించుకొనేవాడు కాదు, తగ్గించుకొనే వాడు శిష్యుడు. నేను గొప్పవాణ్ణి అనుకొనేవాడు కాదు, కొలది పాటివాణ్ణి అనుకొనేవాడు శిష్యుడు. సోక్రటీసులో, గాంధీలో, ఐన్‌స్టయిన్‌లో ఈ చిన్నబిడ్డ మనస్తత్వం వుండేది. భక్తురాలు చిన్న తెరేసలో ఈ మనస్తత్వం వుండేది. ఈలాంటి పుణ్యాత్ములు నడచిన త్రోవలో నడచేవాడే క్రైస్తవ శిష్యుడు.

2. చిన్నపిల్లల పట్ల మనకు ఓ విధమైన ప్రేమా ఆదరాభిమానాలూ వుండాలి. మనం వాళ్ళను చూచి ఆనందించాలి. అసలు వాళ్ళ ఉనికే మనకు ఇష్టం పుట్టించాలి. బాబిలోను రాజులు యెరూషలేము పట్టణాన్ని ముట్టడించి నాశం చేసారు. యూదులను బందీలనుగా కొనిపోయారు. ఇక ఆ నగరంలో ఎవరూ లేరు. అది పాడుపడి బీడై పోయింది. కాని ప్రభువు అనుగ్రహం వల్ల యూదులు ప్రవాసశిక్షను ముగించుకొని మళ్ళా యెరూషలేముకు తిరిగి వస్తారనీ, ఆ నగరంలో మళ్ళా నివాస మేర్పరచుకొంటారకనీ ప్రవక్తలు ప్రవచించారు. ఈ సందర్భంలో జెకర్యా అనే ప్రవక్త చెప్పిన ప్రవచన మిది.

"యెరూషలేము మళ్లా నివాసయెగ్యమౌతుంది
ముసలితాతలూ అవ్వలూ కఱ్ఱమీద నడచి వచ్చి
నగర వీధిలో రచ్చబండ వద్ద కూర్చుంటారు
వీధుల నిండా బాలబాలికలు గుంపులుగుంపులుగా ప్రోగై
ఆటలాడుకొంటారు" - 8,3-5

ఈ ప్రవచనంలో ప్రవక్త ముసలివాళ్ళపట్లా పిల్లలపట్లా కనపరచిన ఆదరాన్ని అర్థం జేసుకోవాలి. మన బళ్ళల్లో గుళ్ళల్లో బోలెడంత మంది పిల్లలు మెదులుతూంటారు. కాని వాళ్ళను మనం ఏపాటి ఆదరంతో చూస్తుంటాం? ఏపాటి ప్రేమతో పరామర్శిస్తుంటాం?

3. ఇటీవలే అంతర్జాతీయ బాలల సంవత్సరం జరిపాం. ఈ సంఘటనం పెద్దవాళ్ళకు మల్లె పిల్లలకు గూడ కొన్ని హక్కులుంటాయని తేటతెల్లం చేసింది. విద్య, వైద్యం, ఆరోగ్యం, ఆహారం, అనురాగం, భద్రత, పేరు, పౌరత్వం మొదలైన వాటిని పొందే హక్కు బాలలందరికీ వుంది. మన తరపున మనం మన అధీనంలో వున్న బాలలు ఈ హక్కులన్నిటినీ పొందేలా చూడాలి. వాళ్ళ అభివృద్ధికి తోడ్పడాలి. అప్పుడు "నా పేరు మీదిగా ఓ చిన్న బిడ్డను స్వీకరించినవాడు నన్ను స్వీకరించి నట్లే" అన్న వాక్యాన్ననుసరించి ప్రభువు దీవెన పొందుతాం - మత్త 18,5.

# 2. దేవుని పోలిక

దేవుడు నరుణ్ణి తనకు పోలికగా చేసాడు - ఆది 9,6. నరుని గొప్పతనమంతా ఈ పోలికలోనే వుంది. కనుక దేవుని పోలివుండడమంటే యేమిటో పరిశీలిద్దాం.

## 1. నరుడు దేవునికి పోలికగా వుంటాడు

పూర్వవేదం విగ్రహాలను చేయవద్దంటుంది. ప్రభువు విగ్రహం కూడ చేయకూడదని శాసిస్తుంది. యావే ప్రభువు నరునికి అందుబాటులో వుండేవాడు కాదు. అతడు మనుష్య లోకానికి దూరంగా వుండేవాడు. అలాంటి దూరవర్తియైన ప్రభువుని మన మధ్యలో వున్నట్లుగా ఓ విగ్రహం ద్వారా, అనగా ఓ ఆకారమూ లేక పోలిక ద్వారా ప్రదర్శించకూడదని చెప్తుంది బైబులు - ద్వితీ 27,15. కాని ఈలా పోలిక ద్వారా ప్రదర్శించడానికి వీలులేని దేవునికి నరుడు పోలికగా వుంటాడు అని చెప్తుంది ఆదికాండం - 1,27. కనుక ఈ నరుళ్ళో అనన్య సామాన్యమైన మాహాత్మ్యం ఏదో వుండివుండాలి. ఆ దేవునికి పోలికగా వుండడమంటే సామాన్యమా మరి?

నరుడు దేవునికి పోలికగా వుంటాడు అంటే అర్థం ఏమిటి? ఈ పోలికలో మూడు ప్రధాన లక్షణాలున్నాయి. మొదటిది, ఆధిపత్యం. ఈ సృష్టికంతటికీ దేవుడు అధిపతి. కాని ఈ నేల మీద మాత్రం దేవునికి బదులుగా, అతని ప్రతినిధిగా, నరుడు అధిపతిగా వుంటాడు. దేవుడే నరుణ్ణి ఈ భూమికంతటికీ అధిపతినిగా నియమించాడు. కనుకనే కీర్తనకారుడు "ప్రభో! నీవు ఎడ్లనూ, గొర్రెలనూ, ఆకాశపక్షులనూ, సముద్ర

మత్స్యాలనూ నరుని పాదాల క్రింద ఉంచావు" అన్నాడు. భూమి మీది ప్రాణికోటికంతటికీ నరుడు అధిపతి అని భావం - 8,8.

రెండవది, నరుడు దేవుని పోలిక కలవాడు అంటే, అతడు దేవుని పోలిన మరో నరుణ్ణి కనగలడని గూఢ భావం. ఆదాము నూటముప్పది యేండ్ల యీడున తనకు పోలిగా వుండే కుమారుణ్ణి కని అతనికి షేతు అని పేరు పెట్టాడట - ఆది 5,3. ఈ వాక్యం ప్రకారం షేతులో అతని తండ్రి ఆదాము పోలిక వుంది. ఈ వాక్యం "దేవుడు తనకు పోలికగా నరుణ్ణి చేసాడు" అనే మీది వ్యాకం లాంటిదే - ఆది 1,27. అనగా దేవుడు తనకు పోలికగా ఆదామును చేసినట్లే ఆదాము కూడ తనకు పోలికగా షేతుని చేసాడు అని భావం. కనుక దేవుని పోలిన నరుడు, దేవుని పోలిన ఇతర నరులను కూడ కనగలడని అర్థం.

మూడవది, నరుడు దేవుని పోలినవాడు అంటే అతడు అమరుడు అని కూడ భావం. అతడు దేవునిపోలిన తోడి మానవులను సృజించుకొంటూ పోయేవాడు. చావులేని వాడు. తొలి మానవునికి జరామరణాలు లేవు. పాప ఫలితంగా అతడు మరణానికి గురయ్యాడు. "దేవుడేమో నరుణ్ణి తనకు పోలికగా చేసాడు. అతన్ని తనలాంటి వాణ్ణిగాను అమరుణ్ణి గాను సృజించాడు. కాని పిశాచం అసూయ వలన మరణం లోకం లోనికి ప్రవేశించింది" అంటుంది సొలోమోను జ్ఞానగ్రంథం - 2,23-24. ఈ వాక్యం ప్రకారం దేవుని పోలికగల తొలినరుడు అమరుడు. పాపం అతన్ని మరణపీడితుణ్ణి చేసింది.

కనుక నరుల్లో దేవుని పోలికవుంది అంటే అతడు భూమికంతటికి అధిపతి అనీ, తోడినరుణ్ణి కలిగించగలవాడు అనీ, అమరుడు అనీ మూడు ప్రధాన భావాలున్నాయి. ఇంకా మనలోని ఆత్మా, బుద్ధిశక్తీ, స్వాతంత్ర్యమూ, మనం దేవుని కుమారులం గావడమూ, పరిశుద్ధులంగా మెలగడమూ మొదలైన లక్షణాలు కూడ ఈ పోలికవల్లనే సిద్ధించాయి. కాబట్టి నరులంగా మనకున్న విలువంతా ఈ పోలికలోనే వుంది అనాలి.

## 2. క్రీస్తు దేవునికి పోలికగా వుంటాడు

నూత్న వేదం చాలతావుల్లో క్రీస్తు దేవునికి పోలికగా వుంటాడని చెప్తుంది. "ఏ నరుడూ ఎప్పుడూ దేవుణ్ణి చూడలేదు. కాని దేవునికి అతి సన్నిహితంగా వుండే కుమారుడు అతన్ని మనకు తెలియజేసాడు" - యోహా 1,18. ఈ వాక్యం భావం ఇది. కుమారుడైన క్రీస్తు తన తండ్రిలాంటివాడు. అతని పోలిక కలవాడు. కనుక అతడు ఆ తండ్రిని గూర్చి మనకు తెలియజేయగలడు.

ఓమారు ఫిలిప్పు క్రీస్తుతో "ప్రభూ! మాకు తండ్రిని చూపించు, అంతేచాలు" అన్నాడు. అందులకు క్రీస్తు తన్ను జూచినవాడు తన తండ్రిని చూచినట్లేనని జవాబిచ్చాడు

- యోహా 14,9. ఈ సందర్భాన్ని బట్టిగూడ క్రీస్తు తండ్రి లాంటివాడనీ, తండ్రిపోలిక కలవాడనీ అర్థం జేసికోవాలి.

పై రెండు యోహాను భావాలు. ఇక పౌలు భావాలు పరిశీలిద్దాం. మనలో తొలి ఆదాము పోలికా వుంది, మలి ఆదాము క్రీస్తు పోలికా వుంది. భువి నుండి పుట్టిన తొలి ఆదామును పోలిన మనం దివినుండి వచ్చిన రెండవ ఆదాము క్రీస్తును గూడ పోలివుండాలి - 1కొ 15,49. ఇక క్రీస్తు దేవునికి ప్రతిరూపం, అతనికి పోలికగా వుండేవాడు - 2కొ 4,4.

కాని ఈ క్రీస్తు దేవునికి ఏలా పోలికగా వుంటాడు? అతడు దేవుని కుమారుడు కనుక ఆ దేవునికి పోలికగా వుంటాడు. కుమారునిలో తండ్రిపోలిక వుంటుంది కదా! - రోమా 8,29. అతడు కంటికి కన్పించని దేవునికి పోలికగా వుండి ఆ దేవుణ్ణి మన కంటికి కన్పించేలా చేస్తాడు - కోలో 1,15. ఫలితాంశమేమిటంటే క్రీస్తు తండ్రిపోలిక కలవాడు, ఆ తండ్రి లాంటివాడు, అతన్ని మనకు ప్రత్యక్షం చేసేవాడు.

## 3. క్రైస్తవుడు క్రీస్తు పోలికను పొందాలి

పూర్వం మోషే సీనాయి కొండ మీదికి వెళ్ళినపుడు ప్రభువు తేజస్సు సోకి అతని ముఖం ప్రకాశించింది - నిర్గ 34, 29-35. ఇక్కడ మోషే యావే తేజస్సును పొందాడు. కాని నూత్నవేదంలో మనం పొందేది యావే ప్రభువు తేజస్సు కాదు, ఉత్థాన క్రీస్తు తేజస్సు. ఉత్థాన క్రీస్తు తాను ఆత్మను పొంది ఆయాత్మ తేజస్సుతో ప్రకాశిస్తుంటాడు. ఆ తేజస్సే మనమీద కూడ సోకి మనం కూడ ఆ క్రీస్తుని పోలివుండేలా చేస్తుంది. అనగా క్రీస్తుని అంగీకరించి విశ్వసించేవాళ్లు అతనిలాంటివాళ్లు ఔతారని భావం. అతని భావాలనూ ప్రవర్తననూ అలవర్చుకొంటారని భావం - 2కొ 3,18. క్రీస్తు పోలిక మనకు ఉత్థానం తర్వాత గాని పూర్తిగా సిద్ధించదు. కాని ఈ జీవితంలోనే మనకు చేతనైనంతవరకు ఆ పోలికను సాధించడానికి కృషి చేయాలి. ఏలా? ఆ ప్రభువు ఆజ్ఞలను పాటిస్తూ అతని అడుగుజాడల్లో నడవడం ద్వారా. ఈ కృషి ఫలితంగా ఆ పోలికను ఇక్కడ పాక్షికంగాను, మరులోకంలో సంపూర్ణంగాను పొందుతాం.

## 4. ప్రార్థనా భావాలు

1. హీబ్రూ ప్రజలకు ఇరుగుపొరుగు జాతులైన కనానీయులు ఫిలిస్తీయులు మొదలైనవాళ్ళంతా ప్రతిమలను పూజించారు. యిస్రాయేలీయులు కూడ చాలసార్లు విగ్రహాలను కొలిచారు. ఈ ప్రజల భావాల ప్రకారం విగ్రహం దేవుని శక్తితోను సామర్థ్యంతోను నిండివుంటుంది. ఇక బైబులు నరుడు దేవునికి పోలికగా వుంటాడు అని

చెప్తుందంటే అతడు దేవునికి ప్రతిమ లాంటివాడని భావం. ప్రతిమలో లాగే అతనిలోగూడ దేవుని శక్తీ సాన్నిధ్యమూ నిండుకొని వుంటాయని తాత్పర్యం. ఈలాగే దేవుని శక్తినీ సాన్నిధ్యాన్నీ తనలో ఇముడ్చుకొని వున్న నరుణ్ణి మనం గౌరవంతో చూడాలి. ఏమతం వాళ్ళల్లోనైనా సరే - కడకు నాస్తికుల్లో కూడ - ఈ లక్షణాలు వుంటాయి. కనుక నరులందరినీ మనం గౌరవంతో చూడవలసిందే. వాళ్ళల్లో వుండే దేవుని పోలిక అంత విలువైంది.

2. నరుడు దేవునికి పోలికగా వుండేవాడు అన్నాం. కనుక ఆ నరుడు కూడ దేవుని లాగ పరిపూర్ణుడుగా వుండాలి - మత్త 5,48. కాని ఈ పరిపూర్ణత్వం దేనిలో? మత్తయి 5,48 కి తుల్యమైన వాక్యం లూకా 6,36లో కన్పిస్తుంది. ఇక్కడ నరులు భగవంతుని లాగే కనికరం కలవాళ్ళై వుండాలి అని చెప్పబడింది. కనుక నరుడు దేవునిలాగ పరిపూర్ణుడయ్యేది విశేషంగా కారుణ్యంలో. తోడినరుల పట్ల దయ, సానుభూతి, కరుణ, ప్రేమ కలవాడు ఉత్తమ నరుడు. ఇవే బైబులు భగవంతుని ప్రధాన లక్షణాలు.

3. తోడి నరుల్లో భగవంతుని పోలికను గుర్తించేవాడు సామాజిక స్పృహను పెంపొందించుకొంటాడు. పేదసాదలను ఆదరంతో చూస్తాడు. అనాథులను కరుణతో ఆదరిస్తాడు. ఎవడైనా సరే దేవుణ్ణి ప్రేమిస్తున్నానని చెప్పుకొంటూ తోడి నరుణ్ణి ద్వేషిస్తే అతడు అసత్యవాది. కంటికి కన్పించే తోడినరుణ్ణి ప్రేమించలేనివాడు, కంటికి కన్పించని దేవుణ్ణి ప్రేమించగలడా? - 1యోహా 4,20-21. ఇంకా మన విశ్వాసమూ సత్కార్యాలూ కలసిపోతూండాలి. కేవలం దేవుణ్ణి పూజిస్తే చాలదు. తోడినరులకు ఉపకారం కూడ చేస్తూండాలి. ఇరుగుపొరుగువాళ్ళు కూడుగుడ్డ కోసం అలమటిస్తుంటే మనకు చేతనైన సాయం చేయాలి. ఎందుకంటె వాళ్ళల్లో దేవుని రూపం వుంది కనుక - యాకో 2,14-17. తోడిమానవుల్లోని దేవుని పోలికను గుర్తించడంలో ఇన్ని బాధ్యతలు వున్నాయి.

4. రెండవ శతాబ్దంలో జీవించిన భక్తుడు ఇరెనేయుస్ ఈ క్రింది భావం చెప్పాడు. అన్ని జంతువులకూ తలలు నేల వైపు చూస్తున్నట్లుగా అమర్చబడ్డాయి. నరుని శిరస్సు మాత్రం పైకి చూస్తున్నట్లుగా అమర్చబడింది. అనగా ప్రాణులన్నిటి లోను నరుడొక్కడు మాత్రం పైకి, దేవుని వైపుకి, చూడగలడు. నరులమైన మనం దేవుని స్మరించుకోగలం, మోక్షాన్ని చేరుకోగలం. మృగాలకు ఈ శక్తి లేదు. పూజలో "మీ మనస్సులను ఉన్నతమునకు మర్చలండి" అని చెప్తాం. ఔను, దేవుని పోలికగల నరుడు తన మనస్సును ఆ వున్నతంలోని దేవునివైపు మరల్చుకో గలిగివుండాలి. అతడు జంతువులా కాదు, దివ్యుడిలా ప్రవర్తిస్తుండాలి.

5. తొలి మానవుడైన ఆదాములో దేవుని పోలిక వుండేది. కాని ఆ యాదాము పాపం వలన ఆ పోలికను పోగొట్టుకొన్నాడు. రెండవ ఆదాము తన సిలువ మరణం

ద్వారా ఈ పోలికను పునరుద్ధరించాడు. ఇప్పుడు మనం జ్ఞానస్నానం పొందేపుడు దేవుని పోలికా, క్రీస్తుపోలికా మన హృదయం మీద ముద్రితమౌతుంది. ఈ పోలికను ఈలా ముద్రించేది పవిత్రాత్మే. ఆ దివ్యాత్ముడు గొప్ప చిత్రకారుడు. అతడు రోజురోజు క్రీస్తు రూపురేఖలను మన హృదయాల్లో చిత్రించుకొంటూ పోతుంటాడు. కనుక మనం క్రీస్తు పోలికను పొందాలి అంటే విశేషంగా ఆ యాత్మణ్ణి మనవి చేసికోవాలి. ఆత్మ అనుగ్రహం లేందే మనకు క్రీస్తుపట్ల భక్తి కుదరదు - 1కొ 12,3.

# 3. హృదయం

బైబుల్లో హృదయమంటే నరుని వ్యక్తిత్వం. విశేషంగా నైతికమైన వ్యక్తిత్వం. హృదయం ద్వారా నరుడు భగవంతునితో సంబంధం పెట్టుకొంటాడు. క్రీస్తు హృదయం మన హృదయం మీద సోకి దానిని పవిత్రం చేస్తుంది. ఈ భావాల్ను సవివరంగా పరిశీలిద్దాం.

## 1. హృదయం లోని దుష్టత్వం

ప్రారంభంలోనే బైబులు, నరులు ఎల్లప్పుడూ చెడ్డ పనులు చేయాలనే కోరుకొంటారు అని చెప్తుంది - ఆది 6,5. నరుని ఆలోచనలు అతని యౌవనం నుండి కూడ దుష్టంగానే వుంటాయి అని వాకొంటుంది - ఆది 8,21. పాపం వలన పతనమైపోయిన నరునికి చెడుతనం సహజంగానే అలవడుతుంది. అందుకే నరుడు సున్నతిసంస్కారం లేని హృదయం కలవాడు అన్నాడు యిర్మీయా ప్రవక్త - 9,26. ఇక్కడ సున్నతిసంస్కారం లేని హృదయమంటే దేవుని ఆజ్ఞలను ధిక్కరించే గుండె, బండబారిన గుండె. హృదయంలోని దుష్టత్వం ప్రధానంగా దేవుని పట్ల మనం చూపే అవిధేయత లోనే వుంది.

## 2. ప్రభువు హృదయాన్ని పరిశీలిస్తాడు

మనం తరచుగా వెలుపలి ఆకారాన్ని చూచి నరుణ్ణి మంచివాడి క్రిందనో చెడ్డవాడి క్రిందనో లెక్కకడతాం. కాని భగవంతుడు ఈలా చేయడు. అతడు నరుల అంతరంగాన్ని చూచి వాళ్ళ మంచి చెడ్డలను గణిస్తాడు. అందుకే సమూవేలు ప్రవక్త "దేవుడు నరుడు చూచే చూపుతో చూడడు. నరుడు వెలుపలి రూపాన్ని మాత్రమే చేస్తాడు. కాని దేవుడు హృదయాన్ని పరిశీలిస్తాడు" అంటాడు - 1సమూ 16,7. నరుని హృదయాన్ని పరిశీలించే శక్తి మనకు లేదు. దేవుని కొక్కడికే వుంది. కావుననే యిర్మీయా ప్రవక్త

"నరుని హృదయాన్ని ఎవడు అర్థం చేసికోగలడు?
హృదయానికున్నంత కపటం దేనికీ లేదు
అది ఘోరవ్యాధితో కుమిలిపోతుంటుంది
దాని రోగాన్ని కుదర్చలేం
ఐనా ప్రభువైన నేను నరుని మనస్సునీ
హృదయాన్నీ పరిశీలించి చూస్తుంటాను
ప్రతి నరుణ్ణీ అతడు జీవించే తీరును బట్టీ,
పనిచేసే రీతిని బట్టీ, సంభవిస్తూంటాను"

అంటాడు- 17,9-10. ఈ వాక్యాల్లో చాల సత్యముంది. ఒకోమారు మన హృదయం మనకే అర్థంకాదు. ఇక వేరేవాళ్ళ హృదయం ఏమి అర్థమౌతుంది? అలాంటప్పుడు అందరి హృదయాలనూ పరిశీలించేవాడూ, అర్థం చేసికొనేవాడు, ఆ ప్రభువొక్కడే.

మనం ఆ ప్రభువుని చిత్తశుద్ధితో ఆరాధిస్తున్నామో లేదో కూడ అతనికి తెలుసు. కనుకనే ప్రభువు యెషయా ప్రవక్త ద్వారా

"ఈ ప్రజలు నన్ను పెదవులతో మాత్రమే గౌరవిస్తున్నారు
వీళ్ల హృదయాలు నాకు చాల దూరంగా వున్నాయి"

అని పల్కాడు - 29,13. ఈ వాక్యాన్ని బట్టి భక్తిమంతులుగా చూపట్టేవాళ్ళల్లో గూడ కొందరు కపట భక్తులేనేమో అని శంకింపవలసి వుంటుంది.

ఇంకా, దేవుని వాక్కు ఓ కత్తిలాగ మన హృదయాన్ని నరుకుకొని లోపలికి పోతుంది. ఆ హృదయంలోని ఆశలనూ ఆలోచనలనూ పరిశీలించి చూస్తుంది - హెబ్రే 4,12. ఇక్కడ దేవుని వాక్కు అంటే దేవుడే. దేవుడు మన హృదయంలోకి ప్రవేశిస్తాడనీ, ఓ న్యాయమూర్తి లాగ దాని మంచిచెడ్డలను పరీక్షించి చూస్తాడనీ ఈ వాక్యం భావం. కనుక మనం నరుల కన్ను గప్పగలం గాని దేవుని కన్ను కప్పలేం. "పాతాళ లోకం గూడ ప్రభువుకి తెలియంది కాదు అంటే, నరుని హృదయం లోని ఆలోచనలు అతనికి తెలియకుండా వుంటాయా" అంటుంది సామెతల గ్రంథం - 15,11. ఈలాంటి వాక్యాలన్నిటిని బట్టి ప్రభువు మన హృదయాలను నిశితంగా పరీక్షిస్తాడని తెలిసికోవాలి. ఆ ప్రభువు ప్రధానంగా హృదయజ్ఞుడు.

## 3. హృదయశుద్ధి అవసరం

యిస్రాయేలీయులు ప్రభువుని పూర్ణ హృదయంతో వెతకాలని అర్థం చేసికొన్నారు - ద్వితీ 4,29. అతన్ని పూర్ణ హృదయంతోను పూర్ణ మనస్సు తోను ప్రేమించాలని

తెలిసికొన్నారు - 6,5. కాని వాళ్ళ హృదయాలు మాత్రం అందుకు సిద్ధంగా లేవు. అవి అవిధేయతతో దేవుని మీద తిరుగుబాటు చేసే హృదయాలు - యిర్మీ 5,23. దుష్ట హృదయాలు కూడ - 7,24. కనుకనే యిస్రాయేలీయుల్లో భక్తులైన మహానుభావులు హృదయశుద్ధి కొరకు ప్రార్థించారు. ఈలా జపించినవాళ్లల్లో 51వ కీర్తన వ్రాసిన భక్తుడు స్ఫటికం లాంటి మనసు కలవాడు. ఇతడు

"దేవా! నాలో నిర్మల హృదయాన్ని సృజించు
ఓ క్రొత్త అంతఃకరణాన్ని నాలో నెలకొల్పు
నీ సన్నిధి నుండి నన్ను గెంటివేయకు
నీ పరిశుద్ధాత్మను నాయొద్ద నుండి తీసివేయకు"

అని మనవి చేసాడు - 51,10-11. ఇది చాల చిత్తశుద్ధి కల ప్రార్థనం. ఇంకా ఈ భక్తుడు

"నేను సమర్పించుకొనేబలి పశ్చాత్తాప హృదయమే
పశ్చాత్తాపంతో సంతాపపడే హృదయాన్ని
ప్రభూ! నీవనాదరం చేయవు"

అని నుడివాడ - 51,17. ఈ వాక్యం ప్రకారం అన్ని బలుల కంటె పశ్చాత్తాప పూరితమైన హృదయమే శ్రేష్ఠమైన బలి. హృదయంలో మాలిన్యం పెట్టుకొని దేవునికి ఏమియిస్తే మాత్రం ఏమి లాభం? పైగా మనకున్న వాటిని భగవంతునికి ఈయడం తేలికే. కాని మన హృదయాన్ని ఈయడం కష్టం.

## 4. నూత్న హృదయం

భక్తుల హృదయ శుద్ధికొరకు మనవి చేసారు అన్నాం. శుద్ధిగల హృదయం నూత్న హృదయం. కనుక బైబులు చాల తావుల్లో నూత్న హృదయాన్ని ప్రస్తావిస్తుంది. ప్రభువు భక్తులకు నూత్న హృదయాన్ని దయచేస్తాడని ప్రవక్తలు వాగ్దానం చేసారు. పూర్వకాలంలోనే మోషే "ప్రభువు మీకూ మీ సంతానానికీ విధేయాత్మకాలైన హృదయాలను దయచేస్తాడు" అని యిస్రాయేలీయులకు మాట యిచ్చాడు - ద్వితీ 30,6. ప్రభువు యిస్రాయేలు ప్రజతో క్రొత్త నిబంధనం చేసికొంటాడనీ, అప్పుడు తన ధర్మవిధులను వాళ్ల హృదయాలమీదనే లిఖిస్తాడనీ, తాను వాళ్లకు దేవుడు కాగా వాళ్ళు అతని ప్రజలౌతారనీ యిర్మీయా వాకొన్నాడు - 31-33. పూర్వ నిబంధనంలో ప్రభువు తన ధర్మశాస్త్రాన్ని రాతిపలకలమీద వ్రాసి యిచ్చాడు. ఈ క్రొత్త నిబంధనంలో తన విధులను నేరుగా నరుల హృదయాల మీదనే వ్రాస్తాడు. ఫలితంగా ప్రజలు ఎక్కువ చిత్తశుద్ధితో జీవిస్తారని

భావం. ఇదే ప్రవక్త ప్రభువు తన ప్రజలకు ఏకైక దృష్టికల హృదయాన్ని అనుగ్రహిస్తాడనీ, దానితో వాళ్ళు ప్రభువుని శాశ్వతంగా పూజించి తామూ తమ తర్వాత వచ్చే భావితరాలవాళ్ళు కూడ బాగుపడి పోతారనీ నుడివాడు - 32,39. ఈలాంటి ఏకైక దృష్టికల హృదయంతో ప్రజలు ప్రభువుని అర్థం చేసికోగల్గుతారని గూడ చెప్పాడు - 24,7. ఇదే హృదయ జ్ఞానం.

క్రొత్త హృదయాన్ని గూర్చి ప్రవచించిన ప్రవక్తలందరిలోను బహుశః యెహెజ్కేలు ముఖ్యుడు. "ఇంతవరకు మీరు చేస్తున్న చెడ్డపనులను విరమించుకోండి. క్రొత్తమనసులనూ క్రొత్త హృదయాలనూ పొందండి" అని యితడు ప్రజలను హెచ్చరించాడు - 18,31. కాని ప్రజలకు ఈ క్రొత్త హృదయాలు ఏలా సిద్ధిస్తాయి? ప్రభువే వాటిని దయచేయాలి. కనుక ప్రవక్త ప్రభువు పేరు మీదిగా "నేను మీకు నూత్న హృదయాన్నీ, నూత్న మనస్సునీ ప్రసాదిస్తాను. మీలోని రాతి గుండెను తొలగించి దాని స్థానే మాంసపు గుండెను నెలకొల్పుతాను. నా యాత్మను మీమీద నిల్పి మీరు నా యాజ్ఞలను పాటించేలా చేస్తాను" అని పల్కాడు - 36,26-27. ఈ వాక్యాలు పూర్వవేదంలోని అనర్ఘరత్నాలకు చెందినవి. ఇక్కడ రాతిగుండ అంటే దేవుని మీద తిరుగుబాటు చేసి అతని ఆజ్ఞలను ధిక్కరించే గుండె. ఫరో ఈలాంటి గుండె కలవాడు. మాంసపు గుండె అంటే మెత్తని గుండె. విధేయతతో దేవుని ఆజ్ఞలకు కట్టుపడి వుండే గుండె. అబ్రాహాము ఈలాంటి గుండె కలవాడు. ప్రభువు నరులను అవిధేయుల నుండి విధేయలనుగా మార్చి వాళ్ళు తన ఆజ్ఞలను పాటించేలా చేస్తాడని ఫలితార్థం. నూత్న హృదయమంటే ప్రధానంగా దేవుని ఆజ్ఞలకు కట్టుబడి వుండడమే.

## 5. హృదయాలను శుద్ధి చేసే ప్రభువు

యెహెజ్కేలు మొదలైన ప్రవక్తలు నూత్న హృదయాన్ని గూర్చి ప్రవచించారని చెప్పాం. ప్రభువు ప్రజలకు క్రొత్త హృదయాన్ని ప్రసాదిస్తాడని వాగ్దానం చేసాడని పల్కాం. ఈ వాగ్దానం క్రీస్తు రాకతో నెరవేరింది. మనందరి హృదయాలను మార్చేది ఆ ప్రభువే. అదేలాగో పరిశీలిద్దాం.

మనం తరచుగా బాహ్యశుద్ధిని కోరతాం. కాని క్రీస్తు అంతశ్శుద్ధిని కోరాడు. చెడ్డ అంతా మన హృదయంలోనే వుంది అని బోధించాడు. "హృదయంలో నుండి దురాలోచనలు పుట్టుక వస్తాయి. వీటివలన నరహత్యలూ, వ్యభిచారాలూ, అశుద్ధకార్యాలూ, దొంగతనాలూ, కూటసాక్ష్యాలూ, దూషణలూ కలుగుతాయి. నరుని మాలిన్య పరచేది యివేకాని చేతులు కడుగుకోకుండా భుజించడం లాంటి బాహ్యశుద్ధి లేని క్రియలు కాదు" - మత్త 15,19. ఈ వాక్యాల ప్రకారం ప్రభువు హృదయ శుద్ధిని ఘనంగా ఎంచాడని అర్థం జేసికోవాలి.

అంతా మన ఆలోచనలను బట్టి వుంటుంది. మన తలపులు పవిత్రంగా వుంటే క్రియలు కూడ పవిత్రంగా వుంటాయి. లేకపోతే లేదు. ఈ తలపులు హృదయం నుండి పుడతాయి. కనుక కీలకమంతా హృదయంలోనే వుంది. హృదయాన్ని బట్టి నరుడు నైతిక మానవుడుగా గాని అనైతిక మానవుడుగా గాని తయారౌతాడు.

ప్రభువు హృదయాన్ని గూర్చి చెప్పిన సంగతులు ఇంకా వున్నాయి. మన హృదయాన్ని బట్టే మన మాటల తీరు కూడ వుంటుంది - మత్త 12,34. కనుక అనిర్మల హృదయుడు నిర్మలంగా మాట్లాడలేడు. ఐతే విశుద్ధ హృదయులకు దేవుడు సాక్షాత్కరిస్తాడు - మత్త 5,8. లోకంలోని జనం తమ శక్తిసామర్థ్యాలను నమ్ముకొంటారు. తామెవరి మీదా ఆధారపడనక్కరలేదు అనుకొంటారు. కనుక వాళ్ళు అహంకారం తోను గర్వంతోను పొంగిపోతారు. కాని క్రీస్తు అలాంటివాడు కాదు. అతడు వినయశీలుడు, వినమ్ర హృదయుడు. నిత్యమూ తన తండ్రిమీద ఆధారపడి జీవించేవాడు. ఆ క్రీస్తు అడుగుజాడల్లో నడిచే భక్తులు కూడ అతనిలాగే వినయాత్ములు కావాలి - మత్త 11,29. ఉత్థానానంతరం ఎమ్మావు గ్రామంలో ప్రభువే స్వయంగా శిష్యుల హృదయాలకు వెలుగును ప్రసాదించాడు. ఆ శిష్యులు "ప్రభువు మనకు లేఖనాలను వివరించి చెప్పినపుడు మన హృదయాలు భక్తిభావంతో ప్రజ్వరిల్లాయి కదా" అనుకొన్నారు - లూకా 24,32. ఈ విధంగా ఆ ప్రభువు మన హృదయాలను జ్ఞానజ్యోతితో నింపుతాడు.

ఈనాడు మనలను రక్షించేది యేమిటి? ఉత్థాన క్రీస్తుని మనం హృదయంలో విశ్వసిస్తే అప్పుడు మనకు రక్షణం కలుగుతుంది - రోమా 10,9. క్రీస్తు మొదట తన ఆత్మను నరుల హృదయంలోకి ప్రవేశపెడతాడు. ఈ యాత్మద్వారా మనం క్రీస్తుని విశ్వసిస్తాం. ఈ యాత్మద్వారానే మనం పరలోకం లోని దేవుణ్ణి తండ్రీ అని పిలుస్తాం. ఆ తండ్రి పంపిన కుమారుడు క్రీస్తుని విశ్వసిస్తాం - గల 4,6. ఇంకా ఈ యాత్మ మన హృదయాన్ని దేవుని ప్రేమశక్తితో నింపుతుంది కూడ. ఈ శక్తితోనే మనం తండ్రినీ అతడు పంపిన కుమారుణ్ణీ, తోడి ప్రజలనీ కూడ ప్రేమించగల్గుతూన్నాం - రోమా 5,5.

సిలువ మీద వ్రేలాడుతున్న క్రీస్తుని ఈటెతో పొడిచి అతని హృదయాన్ని తెరచారు - యోహా 19,34. ఆ విశుద్ధ హృదయం మన హృదయాల మీద సోకి వాటిని పునీతం చేయాలి. కనుక క్రీస్తు హృదయంలో నుండి మన హృదయం లోనికి జీవజలాలు ప్రవహించాలి. ఈ జీవజలాలు ఏమో కాదు, పరిశుద్ధాత్మే. అనగా క్రీస్తు హృదయం నుండి బయలుదేరే ఆత్మ మన హృదయాల్లోకి ప్రవేశించి వాటిని పునీతం చేస్తుంది - యోహా 7,38-39. అంటే ఉత్థాన క్రీస్తు అతని ఆత్మా మన హృదయాలను శుద్ధి చేస్తారని

భావం. ఈ విధంగా ప్రభువు మన హృదయాన్ని పవిత్రం చేయాలని మనం నిత్యమూ ప్రార్థించాలి. ఎందుకంటె మన హృదయం దానంతట అది కపటంతోను మోసంతోను కూడింది. కనుక అది ప్రభువు వలన శుద్ధిని పొంది నూత్న హృదయంగా మారిపోవాలి - యెహెజ్కేలు చెప్పినట్లుగా.

## 6. ప్రార్థనా భావాలు

1. అబ్రాహాము తొంబదితొమ్మిది యేండ్లవాడై యుండగా ప్రభువు అతన్ని పిల్చాడు. నీవు నా సన్నిధిలో నడుస్తూ ఉత్తముడిగా మెలగాలి అని చెప్పాడు. ప్రభువు ఆజ్ఞ ప్రకారం అతడు జన్మదేశాన్ని బంధువులనూ విడనాడి కనాను మండలానికి వచ్చాడు. జీవితాంతమూ ప్రభువు సన్నిధిలోనే నడుస్తూ ఉత్తముడుగా మెలిగాడు - ఆది 17,1. తర్వాత ప్రభువు అబ్రాహాముని పరీక్షించడానికై అతని యేకైక కుమారుణ్ణి తనకు బలియీయమని కోరాడు. ఆ ముసలిప్రాయంలో తాను ఆ బిడ్డణ్ణి కోల్పోతే మరో పుత్రుడు కలగడని అబ్రాహాముకి బాగా తెలుసు. ఐనా అతడు ఈసాకుని బలి యీయడానికి సంసిద్ధుడయ్యాడు - ఆది 22,10-12. ఈ యబ్రాహాము ఎంత చిత్తశుద్ధి గల భక్తుడో! మనకు కూడ అతని లాంటి హృదయం అబ్బితే యెంత బాగుంటుంది!

2. నవోమి అనే యూద గృహిణి కుటుంబ సమేతంగా మోవాబు మండలానికి వలసపోయింది. అక్కడ ఆమె భర్తా ఇద్దరు కొడుకులూ గతించారు. ఇరువురు కోడళ్లు మాత్రం మిగిలిపోయారు. నవోమి మళ్లా బేత్లెహేముకు తిరిగివస్తూ కోడళ్ళను మోవాబు మండలంలోని తమ పుట్టినిండ్లకు వెళ్ళిపొమ్మంది. పెద్దకోడలు అలాగే వెళ్ళిపోయింది. కాని చిన్న కోడలు మాత్రం "నేను గూడ నీ వెంటనే వస్తాను. నీ బంధువులే నాకు బంధువులౌతారు. నీ దేవుడే నాకూ దేవుడౌతాడు. నీవు చనిపోయే కాడే నేనూ చనిపోతాను. నిన్ను పాతిపెట్టేకాడే నన్నూ పాతిపెడతారు. మరణం వరకూ మనమిద్దరమూ విడిపోగూడదు" అంది - రూతు 1,16-17. ఈ రూతు ఎంత చిత్త శుద్ధిగల ఆడపడుచు! మగడు గతించాక గూడ కన్నవారిని సయితము విడనాడి అత్త వెంటబడి వచ్చింది! ఆమె శీలంవంటి శీలం మనకు కూడ అలవడితే యెంతముచ్చటగా వుంటుంది!

3. ఓ మారు ప్రభువు యెరూషలేం దేవళంలో బోధిస్తున్నాడు. అప్పుడు జనం కానుకల పెట్టెలో సొమ్ము వేస్తున్నారు. ఉన్నవాళ్ళు ఉన్నట్లుగా కానుకలు పడవేస్తున్నారు. ఆ సమయంలో ఓ పేదరాలు కూడ వచ్చి రెండు కాసులు మాత్రమే పెట్టెలో వేసింది. ఐనా ప్రభువు ఆమెను మెచ్చుకొన్నాడు. డబ్బు మస్తుగా వున్న ధనవంతులు పెద్ద మొత్తాలే వేసారు. కాని ఈవిడకున్నది రెండు పైసలే. ఐనా ఆ రెండు పైసలను గూడ ఆవిడ దానం

చేసింది. కనుక ఆమె తన జీవితాన్నే త్యాగంచేసింది అన్నాడు ప్రభువు - మార్కు 12,41-43. భగవంతునికి కావలసింది మన హృదయాలు కాని వస్తువులు కాదు. చాలమంది వాళ్ళ వస్తువులను దేవుడికిస్తారు గాని హృదయాలను ఈయరు. వాళ్ళు నిజమైన భక్తులు కాదు. కొందరు మాత్రం తమ హృదయాన్ని కూడ దేవునికి అర్పించుకొంటారు. వీళ్ళు చిత్తశుద్ధికల భక్తులు.

4. వేమన గొప్ప కవి, సంఘ సంస్కర్త, భక్తుడు. అతడు.

"ఆత్మశుద్ధిలేని యాచార మదియేల
భాండశుద్ధి లేని పాకమేల
చిత్తశుద్ధి లేని శివపూజ లేలయా"

అన్నాడు. మురికి కుండలో పరమాన్నం వండినా అది రుచించదు గదా! అలాగే అనిర్మల హృదయంతో భగవంతుణ్ణి ఆరాధిస్తే ఆయారాధనం దేవునికి ప్రియపడదు. చిత్తశుద్ధి లేకుండా ఏవేవో మతాచారాలు పాటిస్తూ కర్మకాండలు చేసికొంటూ పోతే మాత్రం ఏమిలాభం? కనుక హృదయశుద్ధి అన్నిటికంటె ముఖ్యమని వేమన భావం. మన క్రైస్తవుల్లో చిత్తశుద్ధి కల భక్తులు అరుదు. వినడానికి కటువుగా వున్నా ఈ వాక్యం చెప్పక తప్పదు. కనుక చిత్తశుద్ధి కోసం మనం ఆ ప్రభువునే మనవి చేసికోవాలి.

# 4. భగవంతుని మీద కోర్కె

## 1. భగవంతుని కొరకు దప్పిక గొనాలి

అందరు నరులూ భగవంతుణ్ణి మక్కువతో వాంఛించరు. కొందరు అతన్ని పట్టించుకొనే పట్టించుకోరు. మరికొందరు కష్టాలు వచ్చినపుడు మాత్రం అతన్ని స్మరించుకొంటారు. భగవంతుణ్ణి వాంఛించడమనేది ఓ భాగ్యం, ఓ గొప్పవరం. ప్రభువే ఆ వరాన్ని తన భక్తులకు ప్రసాదిస్తుంటాడు.

ప్రభువు దప్పిక కల్గినవాడు నావద్దకు వచ్చి దప్పిక తీర్చుకోవచ్చు. నన్ను విశ్వసించే వాని అంతరంగంలో నుండి జీవజల ప్రవాహాలు పొంగిపారతాయి" అన్నాడు. ఈ జీవజల ప్రవాహం పరిశుద్ధాత్మే - యోహా 7,37-39. కొందరికి ఆ భగవంతుని మీద కోరిక పుడుతుంది. అతనిమీద దప్పిక కలుగుతుంది. ఈ దప్పికను మనంతట మనం తీర్చుకోలేం. కనుక ప్రభువు తనలోని జీవజలాలను మనలోనికి పొంగిపారేలా చేస్తాడు. ఈ జీవజలం పరిశుద్ధాత్మే. అనగా ఆత్మ క్రీస్తు హృదయంలో నుండి మన హృదయం లోనికి ప్రవేశిస్తుంది. అలా ప్రవేశించి మన హృదయంలో ఆ ప్రభువు మీద కోర్కెను పెంచుతుంది. ఇక, ఆ

కోర్కెను తీర్చేది కూడ ఆత్మే. ఆ యాత్మ మనం క్రీస్తుని అనుభవానికి తెచ్చుకొనేలా చేస్తుంది. అతని మూర్తిని మన హృదయ ఫలకం మీద చిత్రిస్తుంది. మనం అతని ఆశయాల ప్రకారం జీవించేలా చేస్తుంది, అతన్ని ఇతరులకు ఎరుక పరిచేలా చేస్తుంది.

ఈలాంటి వాక్యమే ప్రకటన గ్రంథంలో కూడ కన్పిస్తుంది. "నేను దాహం గొన్నవాణ్ణి జీవజలపు చెలమనుండి స్వేచ్ఛగా నీళ్లు త్రాగనిస్తాను" - 21,6. ఇక్కడ జీవజలపు చెలమ పరిశుద్ధాత్మే. భగవంతుని మీద కోర్కె పుట్టినవాడు పరిశుద్ధాత్మను పొంది ఆ కోర్కెను తీర్చుకొంటాడు. ఎప్పుడు కూడ క్రీస్తు మీద మనకు ఆశ పుట్టించేదీ, ఆ క్రీస్తుని మనం అనుభవానికి తెచ్చుకొనేలా చేసేదీ పరిశుద్ధాత్మే.

ఎలిసబేతు ఇంట మరియు విన్పించిన మంగళగీతంలో "ప్రభువు ఆకలిగొన్నవాళ్ళను సంతృప్తిపరచి ధనవంతులను వట్టి చేతులతో పంపివేసాడు" అనే వాక్యం వుంది - లూకా 1,53. ప్రభువు ఆకలి గొన్నవాళ్ళను అన్నంతో సంతృప్తి పరుస్తాడు. ఆయన్నం ఏమో కాదు, తానే, తన దీవెనలే. అతడు తన్ను కోరుకొన్నవాళ్ళకు దర్శనమిస్తాడు. తన్ను తాను ప్రత్యక్షం చేసికొని వాళ్ళ హృదయాల్లోని కోరికలను తీరుస్తాడు. వాళ్ళకు తన వరాలిస్తాడు, వాళ్ళను దీవిస్తాడు.

"దప్పిక గొనినవాళ్ళకు స్వచ్ఛమైన నీళ్ళు ఆనందాన్నిస్తాయి. అలాగే ప్రభు రక్షణాన్ని పొందినవాళ్ళకు ప్రమోదం కలుగుతుంది" అంటాడు యెషయా - 12,3. మంచి నీళ్ళు దప్పికను తీర్చినట్లే ప్రభు రక్షణ భాగ్యం మన హృదయాల్లోని కోర్కెలను తీరుస్తుందని ఈ వాక్యం భావం.

చాలమంది ప్రభువుని కోరుకొనే కోరుకోరని చెప్పాం. కనుక మనం మొదట ఆ ప్రభువుని ఆశించే భాగ్యం కొరకు మనవి చేసికోవాలి. అటుపిమ్మట ఆ కోరికకు ఫలసిద్ధి నీయమని గూడ ప్రభువునే అడుగుకోవాలి. అనగా మన హృదయంలోని కోరికల ప్రకారం ప్రభువు మనకు అనుభవానికి రావాలని ప్రార్థించాలి.

## 2. కోరికను పుట్టించమని మనవి చేయాలి

ప్రజలకు చాలమందికి భగవంతుని మీద కోర్కె పుట్టదు గనుక, మన తరపున మనం ఆ ప్రభువుని కోరుకొనే భాగ్యం కొరకు అడుగుకోవాలని చెప్పాం. ప్రభువు సమరయ స్త్రీతో "నీవు దేవుని వరాన్ని గుర్తించి వున్నట్లయితే, నిన్ను నీళ్ళు అడుగుతుంది ఎవరో నీవు తెలిసికొని వున్నట్లయితే, నీవే అతన్ని నీళ్ళు అడిగేదానివి. అప్పుడు అతడు నీకు జీవజలం ఇచ్చి వుండేవాడు" అన్నాడు - యోహా 4,10. కనుక మన హృదయాల్లో ఆ ప్రభువు మీద కోర్కె పుట్టాలని అతన్ని అడుగుకోవాలి. అప్పుడు ప్రభువు మనకు జీవజలాన్ని,

అనగా ఆత్మను ప్రసాదిస్తాడు. ఆ యాత్ముడు మనకు క్రీస్తు అనుభవం కలిగిస్తాడు. క్రీస్తు ఇచ్చిన నీటిని త్రాగేవాడికి దప్పికలన్నీ తీరతాయి. ప్రభువు ఇచ్చే నీరు భక్తుని హృదయంలో ఓ నీటి బుగ్గగా పెంపుజెంది అతనికి నిత్యజీవాన్ని సంపాదించి పెడుతుంది - 4,14.

భూలోకంలోని పిల్లలు ఆకలైనపుడు తల్లిదండ్రులను అడుగుతారు. అమ్మానాన్నలు వాళ్ళకు చేప గ్రుడ్డు మొదలైన భోజన పదార్థాలు అందిస్తారు. అలాగే మనం కూడ పరలోకంలోని దేవుణ్ణి తన మీద మనకు కోర్కె పుట్టించమని అడుగుకోవాలి. ఆ తండ్రి తన్నడిగిన వాళ్ళందరికీ ఆత్మను సమృద్ధిగా ప్రసాదిస్తాడు - లూకా 11,9-13, ఈ యాత్మే మనకు భగవంతుని మీద తృష్ణను పెంచేది.

ప్రభువు మీద మనకు కోర్కె పుట్టాలని వ్యక్తిగతంగా అడుగుకోవచ్చు. కాని వ్యక్తిగతమైన ప్రార్థనం కంటె బృంద ప్రార్థనం బలమైంది. వడకాలు సెమినార్లు మొదలైన వాటికి సమావేశమైన భక్తులు అంతా కలసి ఈ కోర్కె కోసం ప్రార్థనలు చేయాలి. ఇద్దరు ముగ్గురు ఏకమనస్కులై ప్రార్థిస్తే పరలోకం లోని తండ్రి ఆ మనవిని వింటాడు. ఇద్దరు ముగ్గురు ప్రభువు పేరిట సమావేశమైతే వాళ్ళ మధ్యలో అతడూ నెలకొని వుంటాడు - మత్త 18,19-20.

## 3. కీర్తనకారుల అనుభవం

పూర్వవేదపు కీర్తనకారులు మహాభక్తులు. ఆ విశుద్ధ హృదయులు నూత్న వేదపు పునీతులకు ఏ మాత్రమూ తీసిపోరు. వాళ్ళు ప్రభువుని గాఢంగా వాంఛించారు. అతని దర్శనభాగ్యం పొందారు కూడ. వాళ్ళ అనుభవాలను స్మరించుకొంటే ఈనాడు మనకు కూడ ఆ భగవంతుని మీద కోర్కె పుడుతుంది.

"ప్రభుని ఒక్కవరం కోరుకొన్నాను
నాకు కావలసింది ఇదొక్కటే -
నా జీవిత కాలమంతా ప్రభు మందిరంలో వసించాలనీ,
ఆయనను ప్రసన్నుణ్ణి చేసికోవాలనీ
దేవాయలంలో ఆయనను సంప్రతించి చూడాలనీ
నా కోరిక" - 27,4.

"ప్రభూ! దప్పిగొనిన దుప్పి
సెలయేటి నీళ్ళకు మల్లె
నా హృదయమూ నీకోసం తహతహ లాడుతూంది
సజీవుడైన దేవుని కోసం నా హృదయం తపించిపోతూంది

నేనెప్పుడెప్పుడు ప్రభువు ముఖారవిందాన్ని
దర్శిస్తానా అని ఉవ్విళ్ళూరిపోతున్నాను" - 42,1-2.

"ప్రభో! వనాలు కురవనందున
ఎండి బీటలువారిన నేలలాగా
నా హృదయం నీ కొరకు దప్పిక గొంటూంది
నిన్ను చూడాలని నేనెంతో వేగిరపడుతున్నాను" - 63,1.

"మోక్షంలో మాత్రం నీవు దప్ప ఇంకెవరున్నారు
ఈ లోకంలో నీవు దప్ప మరొకటి నాకు రుచించదు" - 73,25.

ఈ ప్రార్థనలు హృదయము నుండి వెలువడినవి, చిత్తశుద్ధి కలవి. సాధకులు ప్రారంభంలో ఈలాంటి భక్తిమంతమైన ప్రార్థనలను వాడుకొని ప్రభు దర్శనం కొరకు మనవి చేసికోవాలి. అటుపిమ్మట సొంత ప్రార్థనలతో ప్రభు సాక్షాత్కారం కొరకు మనవి చేసుకోవచ్చు.

## 4. హృదయంలో దైవప్రవేశం

ప్రభువు మొదట మనకు తమ మీద కోర్కె పుట్టిస్తాడు. అటుపిమ్మట ఆ కోర్కెను తీర్చడానికి స్వయంగా మన హృదయాల్లోకి ప్రవేశిస్తాడు. ఈ సత్యాన్ని విశదం చేసే బైబులు సందర్భాలు కొన్ని వున్నాయి.

ప్రభువు ఈలా సెలవిచ్చాడు. "నేను ద్వారం దగ్గరికి వచ్చి తలుపు తడతాను. ఎవరైనా నా స్వరం విని తలుపు తెరిస్తే నేను లోనికి వస్తాను. ఆ తెరచిన యతనితో భుజిస్తాను. అతడూ నాతో భుజిస్తాడు" - దర్శ 3,20. ప్రభువు మన హృదయ ద్వారం చెంతకు వచ్చి మెల్లగా తడతాడు. అనగా మనకు ప్రబోధం కలిగిస్తాడు. అతడు మన స్వాతంత్ర్యాన్ని మన్నించేవాడు. కనుక మనలను నిర్బంధపెట్టడు. మన అనుమతి లేందే, మనం బుద్ధిపూర్వకంగా ఆహ్వానించందే, మన హృదయంలోని ప్రవేశింపడు. ఆ ప్రభువు స్వరం విని అతన్ని లోనికి ఆహ్వానించేవాళ్ళ హృదయాల్లోకి అతడు అడుగిడతాడు. వాళ్ళతో తానూ, తనతో వాళ్ళూ భోజనం చేస్తారు. ఇక్కడ భోజనం చేయడమంటే యేమిటి? మిత్రులైన వాళ్ళు ఒకరి సరసన ఒకరు కూర్చుండి ఆప్యాయంగా కబుర్లు చెప్పుకొంటూ భుజిస్తారు. శత్రువులైన వాళ్ళు అలా ఒకరి సరసన ఒకరు కూర్చోరు. కనుక ప్రభువు మనతో భోజనం చేస్తాడంటే అతడు మనకు మిత్రుడై యుంటాడని భావం. ఎవరు ఆ ప్రభువు ప్రబోధానికి లొంగి అతన్ని హృదయంలోనికి ఆహ్వానిస్తారో వాళ్ళకు అతడు

మిత్రుడై యుంటాడని ఫలితార్థం. కనుక మనం అతన్ని ఆదరంతో ఆహ్వానించాలి. మన హృదయంలో వసించమని కోరుకోవాలి. మనకు తన మీద గాఢమైన తృష్ణను కలిగించమని అడుగుకోవాలి.

ఇంకా ప్రభువు ఈలా నుడివాడు. "నన్ను ప్రేమించే వాడు నామాట పాటిస్తాడు. అప్పుడు నా తండ్రి కూడ అతన్ని ప్రేమిస్తాడు. మేమిద్దరమూ వాని వద్దకు వచ్చి వానితో వసిస్తాం" - యో 14,23. నాల్గవ సువార్తలో మాట పాటించడం లేక ఆజ్ఞ పాటించడం అంటే సోదర ప్రేమను పాటించడమని భావం. సోదర ప్రేమతో జీవించే భక్తుడు పితకు ఇష్టుడౌతాడు. అలాంటి భక్తుని హృదయంలోకి క్రీస్తూ అతని తండ్రీ ప్రవేశిస్తారు. వాళ్ళ అతని హృదయంలో నివాసమేర్పరచుకొంటారు. భక్తుడు సోదర ప్రేమతో జీవిస్తూ భగవంతుణ్ణి హృదయంలో నిల్పుకొంటాడని పైవాక్యం భావం. ఈలా మన హృదయంలో వసించే ప్రభువు పట్ల మనకు గాఢమైన వాంఛా అనుభవమూ కలగాలని మనవి చేసికోవాలి.

## 5. ఆత్మ అనుగ్రహం

ఆత్మను గూర్చి ఈ వ్యాసారంభం లోనే చెప్పాం. యథార్థంగా మనకు భగవంతుని మీద కోర్కెను పుట్టించేది ఆ యాత్మే. మనం తండ్రిని గాని కుమారుని గాని కోరుకొనేలా చేసేది ఆత్మే. "నన్ను పంపిన తండ్రి ఆకర్షిస్తేనే తప్ప ఎవడూ నావద్దకు రాలేడు" అన్నాడు క్రీస్తు - యోహా 6,44. ఈ యాకర్షణే ప్రేమ. ఈ ప్రేమే పరిశుద్ధాత్మ. అనగా తండ్రి పరిశుద్ధాత్మ ద్వారా భక్తుని క్రీస్తు చెంతకు రాబడతాడని భావం. కనుక మనలను క్రీస్తు చెంతకు చేర్చేదీ ఆత్మే. ఆ యాత్మ క్రీస్తుని గూర్చి మనకు బోధ చేస్తుంది. విశేషంగా మనం అతని మరణోత్థానాలను అర్థం చేసికొనేలా చేస్తుంది. సంపూర్ణ సత్యమైన ఆ ప్రభువుని మనం ఆకళింపుకు తెచ్చుకొనేలా చేస్తుంది - యోహా 16,13-14. ప్రాచీన క్రైస్తవులు ఈ యాత్మణ్ణి ఓ చిత్రకారునితో పోల్చారు. అతడు క్రీస్తు రూపాన్ని మన హృదయాల్లో చిత్రిస్తాడని చెప్పారు. మరి మనకు క్రీస్తు మీద కోర్కె పుట్టాలి అంటే ఈ యాత్ముడు కాక ఇంకెవరు తోడ్పడతారు?

భగవంతుణ్ణి కోరుకోవడానికి ఒక్కటి ఆటంకంగా వుంటుంది - సృష్టి వస్తు వ్యామోహం. సుఖభోగాలు, ధనము, పదవులు, పేరుప్రతిష్ఠలు మొదలైన వ్యామోహాల్లో చిక్కుకొన్నవాళ్ళకు దేవుడు దర్శనమీయడు. రాత్రిలో మేఘం చంద్రబింబాన్ని కప్పివేసి అది వెలుగును ప్రసరింపకుండా వుండేలా చేస్తుంది. అలాగే ఈ వస్తువ్యామోహం కూడా మన హృదయాన్ని కప్పివేస్తుంది, ఆ ప్రభువుని మన దృష్టి నుండి మరుగు పరుస్తుంది. ఎవరూ ఇద్దరు యజమానులను సేవింపలేరని ప్రభువే నుడివాడు. ఐహిక వస్తువులను సేవించేవాళ్ళు భగవంతుణ్ణి సేవించలేరు - మత్త 6,24.

అవివేకియైన ధనికునికి ఏమి జరిగింది? పంటలు పండించడం, ధాన్యం గిడ్డంగుల్లో భద్రపరచడం, తిని త్రాగి సుఖాలనుభవించడం - ఇదే అతని దృష్టి. భగవంతుడూ తోడినరులూ అతనికి గుర్తుకు రాలేదు. అలాంటి పరిస్థితుల్లో ప్రభువు అతని ప్రాణాలు తీసికొనిపోయాడు. అతని సిరిసంపదలన్నీ అన్యుల పాలయ్యాయి - లూకా 12,16-21. ఐహికవస్తు వ్యామోహం తెచ్చిపెట్టే అపాయం ఇదే. కనుక భగవద్భక్తుడు ఈ యపాయాన్నుండి జాగ్రత్తగా తప్పుకోవాలి. నిండు హృదయంతో ఆ ప్రభువుని ఆశించడం అలవాటు చేసికోవాలి. అన్నిటికంటె అధికంగా అతన్ని ప్రేమించడం నేర్చుకోవాలి. ఇంతకంటె దొడ్డ భాగ్యం మరొకటి లేదు.

## 6. ప్రార్థనా భావాలు

1. అగస్టీను భక్తుడు "ప్రభో! మా హృదయాన్ని నీ కొరకే సృజించావు. నీయందు విశ్రమించినదాకా దానికి విశ్రాంతి అంటూ లేదు" అని నుడివాడు. ఇది చాల లోతైన భావం. మన హృదయం సృష్టి వస్తువుల కొరకు గాదు, సృష్టికర్త కొరకే చేయబడింది. కనుక సుఖభోగాలూ ధనమూ మొదలైన సృష్టివస్తువులేవీ దానికి పూర్ణ తృప్తినీయలేవు. కొయ్యల వల్ల అగ్ని తృప్తి చెందలేదు. మరి గుండెకు తృప్తినిచ్చే దేమిటి? భగవంతుడొక్కడే. కనుక జ్ఞాని అన్ని వస్తువుల కంటె అదనంగా ఆ ప్రభువుని కోరుకొంటాడు. అన్ని వస్తువులను త్యజించియైనా ఆ ప్రభువుని సంపాదించడానికి పూనుకొంటాడు. మరి సృష్టి వస్తువులను మాత్రమే సంపాదించుకొని హృదయాధినాథుడైన ఆ ప్రభువుని కోల్పోయేవాళ్ళు వట్టి మూర్ఖులు.

2. తోమాసు అక్వైనాసు పదమూడవ శతాబ్దంలో వర్ధిల్లిన భక్తుడు, గొప్ప వేదాంతి. ఇతడు "సుమ్మ తియొలోజిక" అనే సుప్రసిద్ధ వేదాంత గ్రంథాన్ని రచించాడు. ఓ మారు ప్రభువు ఇతనికి ప్రత్యక్షమై "తోమాసూ! నన్ను గూర్చి నీవు చక్కగా వ్రాసావు. భావితరాల వాళ్ళు నీ గ్రంథం చదివి నన్ను గూర్చి నేర్చుకొంటారు. నేను నీకేదైనా బహుమాన మీయాలని వచ్చాను. ఏమి వరం గావాలో అడుగు" అన్నాట్ట. తోమాసు చేతులు జోడించి "ప్రభూ! నేను నిన్ను గూర్చి చక్కగా వ్రాసానని నీవే చెప్తున్నావు. నేను నిన్ను చక్కగా అర్థం జేసికొన్నట్లయితే ఏమి వరం అడగగలను? నీకు మించిన వరం ఏముంది కనుక? నీవు నాకు ప్రత్యక్షమయ్యావు, అంతేచాలు. నీవు దప్ప నాకు ఏవరమూ అక్కర్లేదు" అన్నాట్ట. భగవంతుణ్ణి అర్థం చేసికొన్న భక్తుని తీరు ఈలా వుంటుంది. మనం తరచుగా భగవంతుని వరాలను కోరతాం. ఇది భక్తి కాదు, స్వార్థం. స్వార్థం లేని భక్తుడు ఆ ప్రభువు వరాలను కాదు, అతన్నే ఆశిస్తాడు. మనం కూడ అన్నిటికంటె అదనంగా, అన్ని వస్తువుల కంటె పైగా, ఆ ప్రభువునే కోరుకోవాలి.

# 3. సంపదలు



## విషయసూచిక



## 1. పూర్వవేద బోధలు

పూర్వవేదం సంపదలను చిన్నచూపు చూడదుగదా, మెచ్చుకొంటుంది. సిరిసంపదలు దేవుని అనుగ్రహానికి చిహ్నమని కూడ చెప్తుంది. కాని అన్యాయార్జితమైన విత్తాన్ని మాత్రం గర్హిస్తుంది. ఈ భావాలను క్రమంగా పరిశీలిద్దాం.

### 1. సంపదలు మంచివే

సంపదలు కూడబెట్టుకోవడం మంచిదేననే భావం పూర్వవేదంలో చాలచోట్ల కన్పిస్తుంది. యోబు కష్టాలూ పరీక్షలూ ముగిసాక ప్రభువు అతనికి మళ్లా సిరిసంపదలు కొల్లలుగా దయచేసాడు - యోబు 42, 10. దావీదు, యోషఫాత్తు, హిస్కియా మొదలైన రాజులు దైవానుగ్రహానికి విశేషంగా నోచుకొన్నవాళ్ళు. వీళ్ళంతా మహా ధనవంతులు - 2 దిన 32, 27. దేవుడు తాను అంగీకరించినవాళ్ళకు ఐశ్వర్యాలు ప్రసాదిస్తాడు. అతడు అబ్రాహామును పశుసంపదతో, వెండి బంగారాలతో తులతూగేలా చేసాడు - ఆది 13,2. ఈసాకు వెదపెట్టగా దేవుని దీవెనవలన నూరురెట్లు పంట చేతికి వచ్చింది - 26,12. యాకోబు మహా సంపన్నుడై దాసదాసీజనాన్నీ మందలనూ సేకరించుకొన్నాడు - 30, 43. దేవుడు తన ప్రజలకు ధారాదత్తంచేసే వాగ్దత్తభూమి నిస్సారమైంది కాదు, పాలు తేనెలు ప్రవహించేది - నిర్గ 3, 8.

సిరిసంపదలు అన్ని విధాలా మంచివే. అవి కలవాడు అడుక్కొని తిననక్కరలేదు - సామె 18,23. ధనవంతుడు తనవద్ద బాకీ పుచ్చుకొన్నవాళ్ళను దర్జాగా బానిసలనుగా ఏలవచ్చు - 22,7. అతనికి చాలమంది మిత్రులుకూడ ప్రోగౌతారు - సీరా 13,21. మామూలుగా ధనార్జన చేసినవాడు తెలివైనవాడు అనిపించుకొంటాడు - 24,4. లోకం

దరిద్రులను సోమరిపోతులనుగా గణించినట్లే ధనవంతులను క్రియాపరులనుగా లెక్కకడుతుంది - 10,4. ఈ భావాలన్నిటినిబట్టి పూర్వవేదం సంపదలు మంచివే అనీ, ధనాన్ని కూడబెట్టినవాళ్ళు యోగ్యులే అనీ భావించినట్లుగా అర్థంచేసికోవాలి.

## 2. సంపదలు దేవుని వరం

పూర్వవేదం సంపదలను దేవుని వరంగాగూడ ఎంచుతుంది. దేవుడు తన భక్తులను పూర్ణాయుష్కులను చేస్తాడు. అతడనుగ్రహించే ఈ నిండు జీవితంలో చాల అంశాలున్నాయి. చాల యేండ్లు జీవించడం, మంచి ఆరోగ్యాన్ని అనుభవించడం, ప్రజల మన్నన పొందడం, సిరిసంపదలు ప్రోగుజేసికోవడం మొదలైనవన్నీ పూర్ణాయుస్సులో భాగాలే. ప్రభువు చేపట్టినవాడికి ఇక యే కొరతా వుండదు - కీర్త 23, 1. ఎడారికాలంలో ప్రభువు తన ప్రజలకు మన్నానూ మాంసాహారాన్నీ సమృద్ధిగా దయచేసాడు. తర్వాత వాగ్దత్త భూమికి చేరాక గూడ వాళ్లు సుష్ఠుగా భుజించి చీకుచింత లేకుండ జీవిస్తారు. - లేవీ 26,5. ప్రజలు దేవళంలో తమ దేవుణ్ణి సేవించుకోవడానికి వచ్చినపుడు తనివిదీర విందు ఆరగిస్తారు. ప్రభువే గృహస్థుఐ తన భక్తులచేత విందు కుడిపిస్తాడు - కీర్త 23,5. ప్రభువు తన ప్రజల కృషినీ పంటనూ దీవిస్తాడు - ద్వితీ 16,15. కనుక సంపదలను దేవుడిచ్చే దీవెనలనుగా ఎంచాలి. అసలు అతడు తన భక్తులకు వాగ్దత్తభూమినే కానుకగా యిచ్చాడు. ఆ పెద్ద కానుకతోపాటు చిన్న కానుకలైన సిరిసంపదలనుగూడ దయచేస్తాడు. ఇక, యావే తన ప్రజలను తనవాళ్ళనుగా ఎంచి వాళ్ళకు దానాలు దయచేసేవాడు. ఆలాగే ప్రజలుకూడ అనాథులను తమ బిడ్డలనుగా గణించి వాళ్ళకు సహాయం చేస్తూండాలి - సీరా 4,10.

## 3. సంపద ప్రధానమైన భాగ్యం మాత్రం కాదు

సంపద వాంఛింపదగినదేఐనా ముఖ్యమైనది మాత్రం కాదు. దానికంటె ఉత్తమమైన భాగ్యాలు చాలా వున్నాయి. ధనంకంటె హృదయశాంతి మెరుగైంది - సామె 15,16. డబ్బుకంటె మంచిపేరు ముఖ్యమైంది - 22,1. ఆరోగ్యం కూడ డబ్బుకంటె దొడ్డభాగ్యమే - సీరా 30, 14. సిరిసంపదలు మనలను చావునుండి తప్పించలేవు - కీర్త 49,7. ఒకోమారు మనం కూడబెట్టుకొన్న సొమ్ముకు అన్యులు వారసులౌతారు - ఉపదే 6,2. కనుక డబ్బుకంటె వివేకం మెరుగైంది. కావుననే దేవుడు నీకేమి వరం కావాలో కోరుకొమ్మనగా సొలోమోనురాజు వివేకాన్ని కోరుకొన్నాడు - 1రాజు 3,9. అసలు వివేకాన్ని మించిన వరం లేదు: సిరిసంపదలేవీ ఆ భాగ్యంతో సరితూగలేవు - సామె 8,11.

## 4. అన్యాయార్జితమైన విత్తం కీడు తెచ్చిపెడుతుంది

పూర్వాంశంలో సొత్తు అతి శ్రేష్ఠమైన భాగ్యం కాదనీ, వివేకం హృదయశాంతి మొదలైనవి దానికంటె గొప్ప వరాలు అనీ చెప్పాం. ఐనా డబ్బుకుండే విలువ వుండనే వుంది. దేవుడేమో తన భక్తులకు సిరిసంపదలు ఇస్తూనే వుంటాడు. కాని సిరిసంపదలు కలవాళ్ళంతా దైవభక్తులై వుండనక్కరలేదు. చాలమంది అక్రమ మార్గంలో సొత్తు ప్రోగుజేసికొంటారు. ఈలా అన్యాయంగా ఆర్జించిన విత్తం విలువ యేమిటి? దేవుడిచ్చింది కాదు కనుక అది మేలుకి మారుగా కీడు కలిగిస్తుంది.

అబద్ధాలు చెప్పి ప్రోగుజేసికొన్న సొమ్ము చావును తెచ్చిపెడుతుంది - సామె 21,6. డబ్బుచేసికొనేవాడు సాంఘిక న్యాయాన్ని మరచిపోకూడదు. పొలమూపుట్రా అన్నీ మనమే ఆక్రమించుకొని ఇరుగుపొరుగువాళ్ళు గాలికి పొయ్యేలా చేయగూడదు. కనుకనే యెషయా "ఇంటికి యిల్లూ చేనికి చేనూ కలుపుకొని క్రమేణ చుట్టుపట్ల వున్న స్థలాన్నంతటినీ ఆక్రమించుకొనేవాళ్ళు శాపగ్రస్తులౌతారు" అన్నాడు - 5,8. యిర్మీయాకూడ "ధనవంతుల యిండ్లు దోపిడి సొమ్ముతో నిండిపోయాయి. కనుకనే వాళ్ళు గొప్ప వాళ్ళయ్యారు, బలిసిపోయారు" అని నిందించాడు - 5,27. ధనవంతులు దౌర్జన్యపరులై పేదలను పీడించారు అని వాపోయాడు మీకాయా - 6,12.

సంపన్నులు దేవునిమీదకంటెగూడ అదనంగా డబ్బు మీద హృదయం నిల్పుకొని చెడిపోతారు. నరుడు తలదాచుకొనే కోట దేవుడై యుండాలి - కీర్త 18,2. కాని ధనవంతుడు తలదాచుకొనే కోట అతని డబ్బే ఔతుంది - సామె 10,15. ఇది విడ్డూరంగదా! ఇంకా, వెండిబంగారాలతోను గుర్రాలు రథాలతోను నిండిపోయే దేశం క్రమేణ విగ్రహాలతో గూడ నిండిపోతుంది - యెష 2,7-8. ధనంమీద నిల్చేవాడు తప్పకుండా పడిపోతాడు - సామె 11,28. విత్తవంతులు మోషే నిబంధనను పాటించరు. మీరుతారు. ఎడారిలో ప్రజలు మస్తుగా భుజించి మదమెక్కి దేవుణ్ణి మరచిపోలేదా? - హోషేయ 13,6. ధనవంతులు దేవుని ఆజ్ఞలను పాటించలేరు, వాళ్ళ కళ్ళకు పొరలు కమ్ముతాయి - ద్వితీ 31,20. ఈ సందర్భంలో జ్ఞానియైన ఆగూరు ధనాన్ని మనసులో పెట్టుకొని చేసిన ప్రార్థనం స్మరింపదగ్గది :

"ప్రభూ! నన్ను ధనికుణ్ణీ చేయకు, దరిద్రుణ్ణీ చేయకు
నాకు తిండికిమాత్రం లోటులేకుండా చేయి
నేను ధనవంతుణ్ణయితే పొగరెక్కి

నీతో నాకేమి యవసరం అనేకాడికి రావచ్చు
దరిద్రుణ్ణయితే దొంగతనానికి పాల్పడి
నీకే అపఖ్యాతి తేవచ్చు" - సామె 30, 8-9.

ఇవి సంగ్రహంగా ధనాన్ని గూర్చిన పూర్వవేద భావాలు. ఈ భావాలు యిస్రాయేలు ప్రజలు వ్యవసాయ పరమైన జీవితం గడిపినప్పుడు వెలిబుచ్చినవి. డబ్బువల్ల కలిగే శోధనలు అప్పటికి వాళ్ళకింకా అనుభావానికి రాలేదు. ధనం తెచ్చిపెట్టే ప్రలోభాలను అర్థంచేసికోవాలంటే నూత్న వేదంలో క్రీస్తు బోధలను తిలకించాలి.

## 2. క్రీస్తు బోధలు

పూర్వవేదం డబ్బుకి ఒకపాటి విలువ నిచ్చింది. దాన్ని దేవుని వరంగా గూడ ఎంచింది. క్రీస్తుకి ఈ పూర్వవేదభావాలు తెలుసు. ఐనా అతడు సొత్తుకి పూర్వవేద మిచ్చిన విలువ నీయలేదు. ప్రభువు దృష్టిలో ధనం నరుణ్ణి దేవునినుండీ తోడి నరులనుండీగూడ వైదొలగించేది. కనుక శిష్యుడు ధనాన్ని అతిజాగ్రత్తగా వినియోగించుకోవాలి. క్రీస్తుకి ప్రధానమైంది దైవరాజ్యం. అది అమ్యూలమైన నిధి. నరుడు తతిమ్మా సంపదలన్నిటినీ వదలుకొని అమూల్యమైన ఈ ఏకైక నిధిని సంపాదించుకోవాలి - మత్త 13,44.

ఇక, సంపదలను గూర్చిన క్రీస్తు భావాలను క్రమంగా పరిశీలిద్దాం.

### 1. ధనికులు దేవుణ్ణి విస్మరిస్తారు

నరులు ఈ ప్రపంచ వస్తువులతోనే సతమతమైపోవడాన్ని క్రీస్తు తీవ్రంగా నిరసించాడు. ఓమారు ఓ కుటుంబంలోని సోదరులిద్దరు పోట్లాడుకొన్నారు. వారిలో ఒకడు క్రీస్తుని మధ్యవర్తిగా వుండి తమ ఆస్తిని పంపిణీ చేయమని కోరాడు. కాని క్రీస్తు వాళ్లకు తీర్పరిగా వుండడానికి నిరాకరించాడు. అత్యాసతో సిరిసంపదలను కూడబెట్టుకోవడాన్ని గూడ ప్రభువు ఖండించాడు - లూకా 12, 13-15.

ఈ సందర్భంలోనే క్రీస్తు అవివేకియైన ధనికుని సామెత కూడ చెప్పాడు - 12, 16-21. ఓ ధనవంతుడు బాగా పంటలు పండించుకొని ధాన్యం నిల్వజేసికొన్నాడు. చాల యేండ్ల దాకా తిని త్రాగి సుఖిస్తాననుకొన్నాడు. దేవుణ్ణి పూర్తిగా మర్చిపోయాడు. కాని దేవుడు ఆరాత్రే ఆ యవివేకి ప్రాణాలు కొనిపోయాడు. అతని యాస్తిపాస్తులు అన్యులపాలయ్యాయి. సిరిసంపదలను ప్రోగుజేసికోవడమే జీవిత ధ్యేయం కాదని ఈ సామెత భావం. ఈ లోక వస్తువులు అసలు వద్దని కాదు. కాని వాటి ఆర్జనే పరమావధి కాదు. అన్నిటికంటె విలువైనవాడు దేవుడు వున్నాడు. నరుడు ఆ భగవంతుణ్ణి సేవించి

అతని రాజ్యాన్ని సంపాదించుకోవాలి. అతన్ని పొందకపోతే ఎన్ని యిహలోక వస్తువులు సంపాదించుకొన్నా లాభం లేదు. సిరిసంపదలు మనం దేవుణ్ణి విస్మరించేలా చేస్తాయి. వాటిల్లోని ప్రలోభం ప్రధానంగా యిదే.

ఈ సామెతలోని ధనవంతుణ్ణి బైబులు "అవివేకి" అని పిలుస్తుంది. దేవుడు లేడని చెప్పకపోయినా, నిత్యజీవితంలో ఏవేవో లోకవస్తువులతో సతమతమైపోతూ దేవుణ్ణి పట్టించుకోకుండా జీవించేవాణ్ణి బైబులు "అవివేకి" అని పేర్కొంటుంది. అవివేకియైనవాడు దేవుడు లేడులే అనుకొంటాడు అని చెప్తుంది - కీర్తన 14,1. అనగా అవివేకియైనవాడు దేవుని వునికిని నిరాకరించకపోయినా, అతన్ని పట్టించుకోవడం మాత్రం మానివేస్తాడు అని భావం. పై సామెతలోని ధనికుడుకూడ ఈలాంటివాడే. ఈ మనస్తత్వం నేటి మన లోకంలో అరుదేమీ కాదు. మనమందరమూ ఈ లోకవస్తువులను విరివిగా వినియోగించుకోవాలి అనే కోరిక కలవాళ్లమే. వస్తువ్యామోహంలోబడి దేవుణ్ణి విస్మరించేవాళ్ళమే. కనుక ఈ సామెత నేడు మన జీవితానికీ అక్షరాల అన్వయిస్తుంది.

## 2. సంపదలు దైవరాజ్యాన్ని పొందనీయవు

క్రీస్తు విత్తేవాని సామెత చెప్పాడు - లూకా 8,14. ఓ రైతు విత్తనాలు వెదజల్లుతూంటే కొన్ని ముండ్లపొదల్లో పడ్డాయి. అవి మొల్చి మొక్కలయ్యాయి గాని ముండ్లమధ్యలో వున్నందున అవిసిపోయాయి. దీని భావం ఏమిటి? ఈ విత్తనాలను పోలిన నరులు కొందరుంటారు. వీళ్ళు ప్రభువు వాక్యాన్ని ఆలిస్తారు, అంగీకరిస్తారు. కాని ప్రాపంచిక చింతలూ ధనవ్యామోహమూ వాళ్ళను అణచివేస్తాయి. కనుక వాళ్ళు దైవరాజ్యాన్ని పొందలేరు.

ఇంకా క్రీస్తు విందుసామెతనుగూడ చెప్పాడు - లూకా 14,15-24. ఈ విందు దైవరాజ్యానికి పోలికగా వుంటుంది. ఈ కథలో విందుకు ఆహ్వానింపబడినవాళ్లు ప్రపంచ వ్యాపారాల్లో నిమగ్నులై వున్నారు. కనుక వాళ్ళు విందుకు పోనేలేదు. అనగా సంపదలూ వస్తువ్యామోహమూ నరులను దైవరాజ్యాన్ని చేరనీయకుండా అడ్డుపడతాయని భావం.

ఇంకా ప్రభువు ఈలా చెప్పాడు. "ఎవడూ ఇద్దరు యజమానులకు సేవ చేయలేడు. ఆ ఇద్దరిలో ఒకరిని ప్రేమించి మరొకరిని అనాదరం చేస్తాడు. అలాగే మీరూ దైవాన్నీ డబ్బునీ సేవించలేరు" - మత్త 6,24. ఈ సూత్రాన్ననుసరించి లోకంలోని నరులంతా దేవుణ్ణో లోకవస్తువులనో ఎన్నుకొంటారు. అతన్ని పట్టించుకొనేవాళ్లు వీటిని పట్టించుకోరు. వీటిని పట్టించుకొనేవాళ్ళు అతన్ని పట్టించుకోరు. అనగా ధనం నరుని హృదయాన్ని భగవంతునినుండి వైదొలగిస్తుందని భావం. ధనాన్ని సేవించేవాడు దేవుణ్ణి సేవించలేడని గూడ భావం.

పై వాక్యంలో "డబ్బునీ దైవాన్ని రెండింటినీ సేవించలేరు" అన్నపుడు క్రీస్తు రెండు భావాలను ఉద్దేశించాడు. మొదటిది, దాస్యం అనే భావం. డబ్బును కూడబెట్టేవాడు దానికి దాసుడైపోతాడు. దానికి ఊడిగంచేస్తాడు. ఇక దేవునికి ఊడిగంచేయడానికి అతనికి వ్యవధి వుండదు. అసలు డబ్బే అతనికి దైవం ఔతుంది. అతడు సిరినే దేవుణ్ణి కొల్చినట్లుగా కొలుస్తాడు.

అసలు మన హృదయాన్ని వశంచేసికొనే విచిత్రమైన శక్తి యేదో డబ్బులో వుంది. అది మనలను అవలీలగా బానిసలను చేసి ఏలుకొంటుంది. ధనలోభంవల్లనే పూర్వం యూదులు దేవాలయాన్ని వ్యాపారస్థలంగా మార్చారు - యోహా 2,16. డబ్బుకి దాసులయ్యే అననీయా సఫీరా పేత్రు యెదుట బొంకి శాపం పాలయ్యారు - అకా 5,1-10. మాంత్రికుడైన సీమోను డబ్బుపెట్టి దేవుని వరాలనుకొని వాటినిమళ్ళా ఎక్కువ డబ్బుకు అమ్ముకోవాలని చూచాడు. కాని అతడు కూడ పేత్రు శాపానికి గురయ్యాడు- అచ 8, 18-24. కైసరయా రాష్ట్రాధిపతియైన ఫీలిక్సు పౌలు బోధలను వింటూన్నట్లే నటించి అతని వద్దనుండి డబ్బు గుంజుకోవాలని చూచాడు. ఇతడుకూడ ధనవాంఛకు లొంగినవాడే. కాని ధనానికి దాసులైన వాళ్ళందరిలోను యూదా అగ్రగణ్యుడు. అతడు ప్రధానాచార్యులనుండి డబ్బుతీసికొని క్రీస్తుని పట్టిఈయడానికి సంసిద్ధుడయ్యాడు - మార్కు 14-11. యోహా 12,6. కావలిసైనికులుకూడ యూదుల నుండి సొమ్ము తీసికొని క్రీస్తు ఉత్థానం కాలేదని కూట సాక్ష్యం పల్కారు - మత్త 28, 11-15. ఈ యుదాహరణలను బట్టి నరుడు ఎంత తేలికగా ధనానికి దాసుడైపోతాడో అర్థమౌతుందికదా! ఔను, ధనంలో మహా దుష్టశక్తి యేదో వుంది. అది విషప్రాయమైంది. కనుక వివేచన లేకుండా ధనాన్ని ప్రోగుజేసికొనేవాడు దాని విషం సోకి నాశమైపోతాడు.

ఇక రెండవది, అన్యాయం అనే భావం. నరుడు తరచుగా అన్యాయంగా సొమ్ముకూడ బెడతాడు - లూకా 16,9. మామూలుగా ఏవో కొన్ని అన్యాయాలు చేయందే డబ్బు ప్రోగుజేయలేం. కనుక దాని ఆర్జనలోనే నరుడు పాపం గట్టుకొని దేవునికి దూరమైపోతాడు. ఫలితంగా ధనవంతుడు దేవుణ్ణి సేవించలేడు.

ఇక, ద్రవ్యాన్ని కాక దేవుణ్ణి మాత్రమే సేవించే భక్తుడు ఈ సృష్టివస్తువులనుకాక ఆ భగవంతుణ్ణి నమ్ముతాడు. అతన్ని తండ్రినిగా భావిస్తాడు. ఏ యాందోళనలకూ గురికాక అతని మీద భారంవేసి జీవిస్తాడు. ఆలాంటివాడు ఏమితిందామా, ఏమిత్రాగుదామా, ఏమికట్టుకొందామా అని కలత జెందడు. దీర్ఘాయువా అల్పాయువా అని వెత జెందడు - మత్త 6, 23-34. లూకా 12, 25. అన్నిటికీ ఆ ప్రభువే వున్నాడని నమ్మి నిమ్మళంగా జీవిస్తాడు. డబ్బు కూడబెట్టేవాడికి ఈ బుద్ధి వుండదు. అతడు దేవుణ్ణి నమ్మడు. దైవబలంమీదకాక ధనబలంమీద ఆధారపడి జీవిస్తాడు.

## 3. ధనాపేక్షను పరిత్యజించందే దైవరాజ్యం లేదు

ఓ మారు ఓ ధనికయువకుడు క్రీస్తు చెంతకువచ్చి నిత్య జీవం పొందడానికి ఏమి చేయాలో చెప్పమని అడిగాడు. ప్రభువు దైవాజ్ఞలను పాటించమని చెప్పగా అతడు నేను చిన్న నాటినుండి ఆజ్ఞలను పాటిస్తూనే వున్నాని జవాబిచ్చాడు. క్రీస్తు అతనితో "అలాగయితే నీయాస్తిపాస్తులను అమ్మి పేదలకు దానంజేయి. నీవు వచ్చి నన్ను వెంబడించు" అని చెప్పాడు. కాని అతడు చాల ధనవంతుడు. తన సంపదలను వదలుకోవడానికి అతనికి మనసురాలేదు. కనుక అతడు క్రీస్తు పలుకులకు బాధపడి వెళ్ళిపోయాడు - మార్కు 10, 17-22. ఈ యువకుడు ధనాపేక్షను వదలుకోలేక పోయాడు. కనుక క్రీస్తు శిష్యుడై దైవరాజ్యాన్ని సంపాదించుకోలేకపోయాడు.

అతడు వెళ్ళిపోయాక ప్రభువు ధనవంతుడు దైవరాజ్యంలో ప్రవేశించడం ఎంతో కష్టమని శిష్యులకు బోధించాడు. పూర్వవేదం సంపదను దేవుని వరంగా ఎంచుతుందని చెప్పాం గదా! యూదుల రబ్బయిలుకూడ అలాగే బోధించారు. ఇప్పుడు క్రీస్తు సంపదలను తక్కువ చేయడంజూచి శిష్యులు విస్తుపోయారు. ప్రభువు తన భావాలను ఇంకా వివరించి చెప్పగోరి "ధనవంతుడు దైవరాజ్యంలో ప్రవేశించడం కంటె ఒంటె సూది బెజ్జంలో దూరడం సులభం" అని పల్కాడు - 17,25. ఇది చాల కటువైన వాక్యం. కనుకనే పూర్వం నుండి వ్యాఖ్యాతలు ఈ వాక్యంలోని కటుత్వాన్ని కొంతవరకైనా తగ్గించాలని ప్రయత్నం చేసారు. ఇక్కడ "సూదిబెజ్జం" అనేది ఆ రోజుల్లో యెరూషలేము ప్రాకారంలోవుండే ఓ ద్వారానికి పేరని కొందరు అర్థం చెప్పారు. ఒంటెలు ఆ ద్వారం గుండా కొంచెం కష్టంగా దూరిపోయేవి. అలాగే ధనవంతుడు కూడ కొంచెం కష్టంగా దైవరాజ్యం చేరుకొంటాడని అర్థం చెప్పారు. కాని ఈలాంటివన్నీ వట్టి అపవ్యాఖ్యలు. క్రీస్తు ఇక్కడ బుద్ధిపూర్వకంగానే ఈ యతిశయోక్తిని వాడాడు. ఒంటె అంత పెద్ద జంతువు సూది బెజ్జమంత చిన్నరంధ్రంలో దూరడం కంటెగూడ ధనవంతుడు మోక్షానికి వెళ్ళడం ఎక్కువ కష్టం అని చెప్తే శిష్యులు నిర్ఘాంతపోయి వింటారు. వాళ్ళాలా విని ఆశ్చర్యపోవాలనే, సంపదలు దైవరాజ్యానికి ఎంతగా ఆటంకం కలిగిస్తాయో అర్థం చేసికోవాలనే క్రీస్తు ఉద్దేశం.

సరే, శిష్యులు క్రీస్తు వాక్యం విని సంపదలు నరులను అంతగా ఆటంకపరచేవైతే ఇక రక్షణం పొందగలిగేదెవరని నివ్వెరపోయారు. ఆ ప్రభువ "మానవులకిది అసాధ్యం. కాని దేవునికి సర్వమూ సాధ్యమే" అని బదులు చెప్పాడు - మార్కు 10, 23-27. ఇక్కడ "దేవునికి సర్వమూ సాధ్యమే" అంటే దేవుడు ఏదో అద్భుతంచేసి ధనవంతులకు, వాళ్ళడబ్బు వాళ్ళకుండగానే, మోక్షం దయచేస్తాడని భావంకాదు. దేవునికి సాధ్యమయ్యేదేమిటి?

ధనవంతుణ్ణి ధనవంతుణ్ణిగానే మోక్షం చేర్చడం గాదు. అతనికి తన సొత్తుపట్ల పరిత్యాగ బుద్ధిని పుట్టించడం. అతడు ధనంకంటె గూడ దేవుడే గొప్ప విలువ అని అర్థం చేసికొనేలా చేయడం. ఆలా అర్థం చేసికొని డబ్బుమీద మమకారం వదలుకొని దైవరాజ్యాన్ని పొందేలా చేయడం. ఈ వరాన్ని మాత్రం పై సంఘటనంలోని ధనికయువకుడు పొందలేక పోయాడు.

శిష్యుడు పూర్తిగా భగవంతునిమీదనే ఆధారపడి జీవించాలి. ఇక, ధనవంతులు కూడ తమ సొమ్ముమీద కాక దేవుని మీద ఆధారపడి జీవించడం అసంభవం కాదు. క్రీస్తు తన శిష్యులను ప్రతివాళ్ళనూ సొంత ఆస్తులను పరిత్యజించమని అడగలేదు. అరిమత్తయియ యోసేపు సంపన్నుడు. ఐనా క్రీస్తు శిష్యుడు - మత్త 27, 57-60. కాని ఈలాంటి వాళ్ళు చాల అరుదు. వస్తుతః ధనవంతులు చాలమంది దేవునిమీద ఆధారపడరు. చిక్కు యిక్కడే వుంది. కనుక క్రీస్తుశిష్యుడు కాగోరేవాడు ప్రపంచవస్తువులకు వేటికీ అంటిపెట్టుకోగూడదు. పౌలు చెప్పినట్లుగా, ఆ ప్రభువుతో పోల్చుకొంటే ఈ లోకంలోని వస్తువులన్నీ పెంటప్రోవుతో సమానం అని తలంచగలిగి వుండాలి - ఫిలి 3,8.

లూకా సువిశేషంలో ప్రభువు సంపన్నులను ఉద్దేశించి "ధనికులారా! మీరు శాపగ్రస్తులు. మీరు మీ సుఖాన్ని అనుభవించనే అనుభవించారు" అంటాడు. దానికి భిన్నంగా ప్రభువు పేదలను ధన్యులనుగా చిత్రించాడు. వాళ్ళకు దైవరాజ్యం దక్కుతుందని చెప్పాడు. ఎందుకంటే వాళ్ళు దేవుని మీద ఆధారపడి జీవిస్తారు కనుక -6, 20.24. మోషే ద్వితీయోపదేశ గ్రంథంలో దేవుని ఆజ్ఞలను పాటించేవాళ్ళకి దీవెనలూ, పాటించని వాళ్ళకు శాపమూ కలుగుతుందని చెప్పాడు - 28, 2.15. ఆలాగే ఈ ధన్యవచనాల్లోకూడ పేదలు ప్రభువు ఆజ్ఞలను పాటించి దీవెనలు పొందేవాళ్ళనీ, ధనవంతులు ప్రభువు ఆజ్ఞను మీరి శాపం తెచ్చుకొనేవాళ్ళనీ అర్థం చేసికోవాలి.

ఇంకో తావులో ప్రభువు "అన్నిటినీ పరిత్యజిస్తేనే తప్ప ఎవడూ నా శిష్యుడు కాలేడు" అని నుడివాడు... లూకా 14, 33. ఈ బోధకు అనుగుణంగా ప్రభువే అన్నిటినీ విడనాడాడు. నక్కలకు బొరియలున్నాయి. ఆకాశ పక్షులకు గూళ్ళున్నాయి. కాని మనుష్యకుమారునికి తలదాచుకొనే తావైనా లేదు. అతడు సర్వసంగ పరిత్యాగి - 9, 58. ఈ సందర్భాలన్నిటిని బట్టి అర్థమయ్యేదేమిటంటే, మోక్షరాజ్యాన్ని పొందగోరే నరుడు ధనాపేక్షను పరిత్యజించి తీరాలి.

## 4. సంపదలు తోడినరుణ్ణి పట్టించుకోనీయవు

పూర్వాంశంలో సంపదలు దేవుణ్ణీ దైవరాజ్యాన్నీ చేరనీయకుండా అడ్డుపడతాయని చెప్పాం. వాటిల్లో ఇంకో దుర్గుణం కూడ వుంది. సంపన్నుడు తోడినరుణ్ణి పట్టించుకోడు.

కలవాడు పేదవాణ్ణిచూచి మొగం ప్రక్కకు తిప్పుకొంటాడు. ధనవంతుడు లాజరు కథే ఇందుకు తార్కాణం -లూకా 16, 19-31. పట్టుబట్టలు తాల్చి విందులూ వినోదాలతో కాలంగడిపే ధనవంతుడు ఒకడున్నాడు. లాజరు అనే బిచ్చగాడు అతని వాకిట పడివుండేవాడు. అతని వళ్ళంతా పుండ్లే. కుక్కలు అతని శరీరాన్ని నాకేవి. లాజరు ధనవంతుని బల్లమీదినుండి జారిపడే యెంగిలి మెతుకుల కొరకు కాచుకొని వుండేవాడు. కాని అతనికి అవికూడా దొరకలేదు. ధనవంతుడు అతన్ని యే మాత్రము పట్టించుకోలేదు. తర్వాత ఆ యిద్దరూ చనిపోగా ధనవంతుడు నరకానికీ, లాజరు మోక్షానికీ వెళ్ళారు.

ఈ సామెతలోని ధనవంతునికి శిక్షపడింది ప్రధానంగా అతడు దేవుణ్ణి విస్మరించి ధనాన్ని నమ్ముకొన్నందుకు. కాని పేదవాడైన తోడినరుణ్ణి పట్టించుకోకపోవడంగూడ అతని నేరమే. దానికి గూడ అతడు శిక్షననుభవించాడు.

పేదలకొరకు కృషిచేసిన హెల్డర్ కామెరా అనే బ్రెజీలియన్ బిషప్పుగారు ఈలా వ్రాసారు. "నేను చిన్నవాణ్ణిగా వున్నపుడు క్రీస్తు ధనంవల్ల అనర్థాలు కలుగుతాయని చెప్పిన మాటలు అతిశయోక్తులేమో అనుకొన్నాను. కాని యిప్పుడు నా కర్థమయింది. ధనవంతుడికి తోడిజనంపట్ల దయ లేశమైనా వుండదు. డబ్బు మన నోటిమాటలూ, కడకు హృదయంకూడ మూగవోయేలా చేస్తుంది. డబ్బుకీ దయాదాక్షిణ్యాలకీ ఆమడ దూరం."

కనుక కలిమిగలవాళ్ళు జాగ్రత్తగా మెలగాలి. మన కలిమివల్ల సోదరప్రేమను పోగొట్టుకొనే ప్రమాదం కలిగితే ఆ కలిమిని విడనాడి సోదరప్రేమను పెంపొందించుకోవడం మేలు.

## 5. ఉన్నవాళ్ళు తమ సొమ్ముతో పేదసాదలను ఆదుకోవాలి

పైసామెతలోని ధనవంతునిలా కాకుండ, తోడినరుణ్ణి పట్టించుకోవాలి అనడానికి క్రీస్తు చెప్పిన పెద్ద సామెతలు రెండున్నాయి. అవి మంచి సమరయుని కథా, కడతీర్పు కథాను. తోడినరుల కొరకు మన ధనాన్ని వ్యయంచేస్తే దేవుని అనుగ్రహాన్ని సంపాదించుకొంటామని ఈ రెండు కథలూ సూచిస్తాయి.

మంచి సమరయుడు గాయాలతో త్రోవప్రక్కన పడివున్నవాణ్ణి జూచి జాలిపడ్డాడు. అతని గాయాలకు కట్టుకట్టి అతన్ని తనవాహనం మీద ఎక్కించుకొని సత్రానికి తీసికొని వెళ్ళాడు. యజమానునికి రెండు దీనారాలిచ్చి అతన్ని పరామర్శించమని చెప్పాడు. ఎక్కువ ఖర్చయితే తాను మళ్ళా తిరిగివచ్చేపుడు చెల్లిస్తానని చెప్పాడు - లూకా 10, 34-335. ఈ మంచి సమరయుడే మనకు ఆదర్శమని బోధించాడు క్రీస్తు. అనగా అతనిలాగే మనంకూడ అక్కరలోవున్న వాళ్ళకొరకు మన సొమ్మును వ్యయం చేయాలి.

ఈలాంటిదే కడతీర్పు కథ కూడాను. ఆ కథలో గొర్రెల్లాంటి వాళ్ళయిన సాధుపురుషులు పేదజనానికి అన్నంపెట్టారు. దాహం తీర్చారు. బట్టలిచ్చారు. ఇంకా నానా ఉపచారాలు చేసారు - మత్త 25, 35-40. ఈ కార్యాలన్నిటికీ వాళ్ళ సొమ్ము ఖర్చయింది. మనకున్నదానిలో కొంత తోడిజనం కొరకు ఖర్చు పెట్టందే సోదరప్రేమలేదు. పేదసాదల ఆకలినీ, అనారోగ్యాన్నీ, ఇక్కట్టులనూ తొలగించాలంటే మన డబ్బు కొంత సెలవు కావాలి. కాని డబ్బున్నవాళ్ళు తమ సొమ్మును సద్వినియోగం జేసికొనే మార్గం యిది.

విశేషంగా లూకా సువిశేషం మనం దానధర్మాలకు ఎక్కువ విలువనీయాలని చెప్తుంది. యుక్తిగల గృహనిర్వాహకుడు ఒకడున్నాడు. అతన్ని యజమానుడు లెక్కలు చెల్లించమని కోరాడు. అతనికి తన ఉద్యోగం ఊడుతుందని అర్థమయింది. కనుక అతడు వెంటనే తన యజమానునికి బాకీపడివున్న వారినందరినీ పిలిపించి తమ బాకీలను తగ్గించి వ్రాసికొమ్మన్నాడు. దానితో వాళ్లు అతనికి స్నేహితులైపోయారు. ఉద్యోగాన్ని పోగొట్టుకొన్నాక వాళ్లు అతన్ని ఆదరించారు - లూకా 16, 1-8. అన్యాయంగా సొమ్ము గణించిన ధనవంతులు ఆ పాపపు సొమ్మును దానధర్మాలకు సెలవు చేస్తే దేవదూతలు వాళ్ళకుగూడ స్నేహితులౌతారు. వాళ్ళను నిత్యనివాసమైన మోక్షానికి చేరుస్తారు - లూకా 16,9. డబ్బును కూడబెట్టుకోవడంలో తరచుగా అన్యాయాలు చేస్తూంటాం గనుక ఆ యన్యాయాలను తొలగించుకోవడానికి దానధర్మాలు చేయాలి అనే భావాన్ని ముందే చూచాం.

లూకా సువిశేషం దానధర్మాలు చేసినవాళ్ళ ఉదంతాలు చాల పేర్కొంటుంది. రోమను సైన్యాధిపతి యూదులమీద ఆదరం జూపి తన సొంత సొమ్ముతోనే వాళ్ళకు ప్రార్థనా మందిరం కట్టిపెట్టాడు - 7,5. జక్కయ తన ఆస్తిలో సగం పేదలకు పంచియిచ్చాడు - 19, 8. పేత్రు జీవంతో లేపిన తబితా చాల సత్క్రియలూ దానధర్మాలూ చేసింది - అచ 9, 36. రోమను సైన్యాధిపతియైన కొర్నేలి దానధర్మాలు చేసి దేవుని మన్నన పొందినవాడు - 10, 1-2. ఈ సందర్భాలన్నిటిని బట్టి లూకా హృదయాన్ని అర్థంచేసికోవచ్చు. ధనవంతులు తమ సొమ్మును పేదల కొరకు వినియోగించినపుడు దానిని సద్వినియోగం చేసినట్లవుతుంది.

ఇక్కడ ఇంకో సంగతికూడ అర్థంచేసికోవాలి. పూర్వవేదంకాని, క్రీస్తుగాని డబ్బు దానియంతటట అది చెడ్డదని ఎక్కడా చెప్పలేదు. అన్ని వస్తువుల్లాగే అదికూడ ఓ వస్తువు. అన్నిటిని లాగే దాన్నికూడ దేవుడే చేసాడు. అది మంచిదే ఐయుండాలి. కాని వచ్చిన చిక్కేమిటంటే దానిలో అమోఘమైన శక్తివుంది. నరులు దాని శక్తిని దుర్వినియోగం చేస్తారు.

ధనాన్ని కూడబెట్టుకొని దానిశక్తితో అహాన్ని పెంచుకొంటారు. తోడినరులను పీడిస్తారు. దేవుణ్ణి చులకన చేస్తారు. క్రీస్తు ఖండించింది ధనశక్తిని ఈలా దుర్వినియోగం చేయడాన్ని గాని, అసలు డబ్బునేకాదు.

ధనశక్తిని సద్వినియోగం జేసికొని ఆదర్శప్రాయులుగా జీవించినవాళ్ళనుగూడ బైబులు పేర్కొంటుంది. యెరూషలేములోని పేదరాలు తనకున్న రెండుకాసులను దేవునికే అర్పించి మాన్యురాలయింది - మార్కు 12, 41-44. తొలినాటి యెరూషలేము సమాజంలోని ధనవంతులు తమసొత్తును పేదలతో పంచుకొని ఆ పేదల యిక్కట్టులను తొలగించారు - అచ 2, 45. 4, 32. డబ్బు అనేది నరుల అక్కరలను తీర్చడంకోసం ఉద్దేశింపబడింది. వస్తువులు వాడుకోవడం కోసమే వున్నాయి. కనుక ఈ యెరూషలేము సమాజంలోని ధనవంతులు తమకు అధికంగా ఉన్నవాటిని లేనివాళ్ళ వినియోగంకొరకు ఇచ్చివేసారు. తమ వస్తువులను ఇతరులతో పంచుకొని సోదరప్రేమను నిరూపించుకొన్నారు. అలాగే తొలిరోజుల్లో కరువువచ్చినపుడు గ్రీకుక్రైస్తవులు సొమ్ము ప్రోగుజేసి యూద క్రైస్తవులకు పంపారు. 2 కొ 8, 14. మామూలుగా ధనవంతుడు తన ధనశక్తితో ఇతరులను పీడిస్తాడు. ఇక్కడ ఈ గ్రీకుక్రైస్తవులు తమ సొత్తుతో తోడినరులను పీడించలేదుగదా, వాళ్ళకి సాయంచేసారు. ఈ వుదాహరణాలన్నిటిల్లోను నరులు ధన శక్తిని సద్వినియోగం జేసికొన్నారు కాని దుర్వినియోగం చేసికోలేదు. కనుక డబ్బు దానంతట అది చెడ్డది కాదు, మంచిదే. దాన్ని మంచికి వాడామా లేక చెడ్డకు వాడామా అన్నదాన్ని బట్టి దాని మంచి చెబ్బరలను నిర్ణయించాలి.

## 6. విజ్ఞాన బోధ

మనం ఈ లోకంలోగాక పరలోకంలో సంపదలుకూడ బెట్టుకోవాలని బోధించాడు క్రీస్తు. ఈ బోధ విజ్ఞానగ్రంథాల బోధల ధోరణిలో వుంటుంది. "ఈ లోకంలో సంపదలను కూడబెట్టుకొంటే వాటిని చిమ్మట పురుగులూ త్రుప్పూ తినివేస్తాయి. దొంగలు దోచుకొంటారు గూడ. భూలోక సంపదలు క్షణికమైనవి. కనుక మనం పరలోక సంపదలను కూడబెట్టు కోవాలి. అక్కడ అవి అక్షయంగా వుండిపోతాయి. మన సంపదలున్న కాడనే మన హృదయం కూడ వుంటుంది. అనగా మనకు ఈ లోక సంపదలమీద కోరికలుంటే మన హృదయం ఈలోక వస్తువుల మీదనే లగ్నమౌతుంది. అలా కాకుండా పరలోక సంపదలమీద కోరికలు పెట్టుకొంటే మన హృదయం కూడ దేవునిమీదా, మోక్షంమీదా లగ్నమౌతుంది - మత్త 6, 19-25. శిష్యుడు మొదట దైవరాజ్యాన్ని వెదకాలి. అప్పుడు ఈ లోకవస్తువులన్నీ వాటంతట అవే సిద్ధిస్తాయి - 6, 33.

ఈ బోధలద్వారా ప్రభువు సంపదల్లోవుండే ప్రలోభ గుణాన్ని చక్కగా వివరించి చూపాడు. అతని బోధలు పూర్వవేదంకంటె భిన్నమైనవని వేరుగా చెప్పనక్కరలేదు.

# 3. తొలినాటి శిష్యుల బోధలు

పేత్రు, పౌలు, యోహాను యాకోబు మొదలుగాగల తొలినాటి శిష్యులుకూడ సంపదలనుగూర్చి బోధించారు. వీళ్ళు చాలవరకు క్రీస్తుభావాలనే విప్పిచెప్పారు. ప్రస్తుతం వీళ్ళ భావాలను క్రమంగా పరిశీలిద్దాం.

## 1. ఉన్నవాళ్ళు లేనివాళ్ళతో పంచుకోవాలి

తొలినాటి క్రైస్తవులంతా యెరూషలేములో ఓ సమాజంగా జీవించడం మొదలెట్టారు. వీళ్ళకు పేత్రు పెద్ద. వీళ్ళు పవిత్రాత్మ ప్రేరణంతోనే ఈ వుమ్మడి జీవితం జీవించారు. ఈ సమాజంలో ధనికులూ దరిద్రులూ కూడ వున్నారు. కాని క్రీస్తు నేర్పిన ప్రేమసూత్రాన్ని అర్థంచేసికొన్నవాళ్ళు కనుక ఈ బృందంలోని ధనికులు తమ సిరిసంపదలను పేదలతో వంచుకొన్నారు - అచ 4, 32-35. బహుశః ఈ కార్యానికి మొదటపూనుకొన్నవాడు బర్నబా 4, 36-37. ఈ వుమ్మడి జీవితం, ఈయాస్తిపాస్తుల పంపకం తొలినాటి క్రైస్తవుల సోదరప్రేమకు చక్కని తార్కాణం. వాళ్ళు ధనానికి గాక ధనమే వాళ్ళకు దాస్యం చేసింది అనడానికి ఇది మంచి నిదర్శనం.

పౌలు క్రైస్తవుల్లో కొందరు యూదులు, కొందరు గ్రీకులు. ఒకసారి పాలస్తీనా దేశంలో పెద్ద కరవు వచ్చింది. కనుక పౌలు గ్రీకుక్రైస్తవులచేత విరాళాలు సేకరింపజేసి ఆ సొమ్మును క్షామపీడితులైన యూదక్రైస్తవులకు పంపాడు. ఈ సందర్భంలో అతడు సమృద్ధిగా వున్నవాళ్ళు అక్కరలో వున్నవాళ్ళను ఆదుకోవాలనీ, ఈలా చేస్తే సొమ్మును సద్వినియోగం చేసినట్లవుతుందనీ బోధించాడు - 2 కొ 8, 13-15. ఇంకా క్రీస్తునికూడ మనకు ఆదర్శంగా యెత్తి చూపించాడు. క్రీస్తు స్వయంగా భాగ్యవంతుడు. కాని అతడు బుద్ధిపూర్వకంగా నిరుపేదయై తన సొత్తుని మనతో పంచుకొన్నాడు. దానితో పేదలమైన మనం భాగ్యవంతులమయ్యాం. ఈ క్రీస్తు ఆదర్శాన్నే మనంకూడ ఈలోకంలో పాటించాలి - 2 కొ 8,19.

క్రీస్తు వాక్యాలు కొన్ని సువిశేషాల్లోకి ఎక్కలేదు. పౌలు అలాంటి వాక్యాన్నొకదాన్ని గుర్తుంచుకొని ఉదాహరించాడు. "తీసికోవడంకంటె ఈయడం ధన్యమైంది" - అచ 20, 35. పౌలు ఒకరిసొమ్ముకు ఆశపడలేదు. అతడు కష్టపడి పనిచేసి పొట్టకూడు సంపాదించుకొన్నాడు. ఇతరుల నుండి తానేమీ తీసికోకపోయినా ఇతరులకు తాను చాలా యిచ్చాడు. తన శిష్యులుకూడ అలాగే చేయాలని హెచ్చరించాడు - 20, 33-35.

తోడిజనం కూడూగుడ్డా కొరకు అలమటిస్తుంటే ఉన్నవాళ్లు తప్పకుండా సహాయం చేయాలనీ, మన విశ్వాసాన్ని క్రియాపూర్వకంగా నిరూపించుకోవాలనీ చెప్తుంది యాకోబు జాబు - 2, 14-17. ఈలాగే యోహాను మొదటి జాబుకూడ ధనికుడు పేదలకు సహాయం చేయాలని చెప్తుంది. పేదల అవసరాలను జూచి ధనవంతులు తమ హృదయ ద్వారం మూసివేసికోగూడదు. సోదరప్రేమను తీయటిమాటల్లోగాక చేతల్లో చూపించాలి - 1 యోహా 3, 17-18.

అసలు మనం తోడిజనానికి ధనంతోకంటె విశ్వాసంతోనే ఎక్కువ సహాయం చేయవచ్చు. కనుకనే ప్రభువు శిష్యులను వేదప్రచారానికి పంపినపుడు డబ్బుతీసికొని వెళ్ళవద్దన్నాడు - మార్కు 6, 7-8. పేత్రు యెరూషలేము దేవళంవద్ద కుంటివాణ్ణి నడిపించినపుడు "నావద్ద వెండీ బంగారాలేమీ లేవు. ఐనా నాకున్నది నీకిస్తాను. క్రీస్తు పేరుమీదిగా నీవులేచి నడువు" అన్నాడు - అచ 3,6. ఈ సందర్భాలనుబట్టి డబ్బు అతి ప్రధానమైనది కాదని అర్థంచేసికోవాలి. ఐనా దానికుండే విలువ దానికుంది. మనంమాత్రం ఆ విలువను సద్వినియోగం జేసికోవాలి. అనగా విలువగల మన సొమ్మును అక్కరలో వున్నవాళ్ళని ఆదుకోవడానికి వినియోగించాలి.

## 2. తారతమ్యాలను పాటించగూడదు

లోకంలో డబ్బుకి బోలెడంత విలువ వుంటుంది. ధనవంతుడు అందరి మన్ననలు పొందుతాడు. డబ్బులేనివాడు దుబ్బుకి కొరగాడు. మామూలుగా మనం ధనవంతులను గౌరవించి పేదలను చిన్నచూపు చూస్తాం. ఈ పొరపాటునే చేయవద్దంటుంది యాకోబు జాబు 2, 1-7. మంచి దుస్తులతో వచ్చిన ధనవంతుణ్ణి గౌరవించి చింపిరి దుస్తులతో వచ్చిన పేదవాణ్ణి పట్టించుకోకపోవడం తప్పు. ఈలా తారతమ్యాలను పాటించడంవల్ల సమాజంలో ధనికులు దరిద్రులు అనే వర్గాలను సృష్టించినవాళ్ళ మౌతాం. అసలు దేవుడు పేదలనే ఎన్నుకొంటాడు. వాళ్ళనే దైవరాజ్యానికి వారసులను చేస్తాడు. అలాంటివాళ్ళను మనం చిన్నచూపు చూడ్డం అవివేకం గదా! తొలినాటి క్రైస్తవసమాజంలో ధనికులు దరిద్రులు అనేవాళ్ళవల్ల వచ్చిన సమస్యలను ఈ వాక్యాలు స్పష్టంగా తెలియజేస్తాయి.

ఇంకా యీ జాబు ధనవంతులను హెచ్చరిస్తుంది. భాగ్యవంతులు అన్యాయమైన పద్ధతిలో సొమ్ము కూడబెట్టారు. ఇప్పుడు సుఖభోగాలు అనుభవిస్తున్నారు. కాని దేవుడు వాళ్ళకు తీర్పు తీర్చడానికి సిద్ధంగా వున్నాడు. కనుక వాళ్ళు పశ్చాత్తాపపడి కన్నీళ్ళు కార్చాలి. లేకపోతే నాశమైపోతారు-5, 1-6.

## 3. డబ్బు అనర్థాలన్నిటికీ మూలం

పౌలు డబ్బును గూర్చి నిశితమైన హెచ్చరికలు చేసాడు. ధనాపేక్ష సర్వ అనర్థాలకూ మూలం అన్నాడు - 1తిమొ 6,10. ఈ వాక్యం ప్రభావాన్ని నేటి మన క్రైస్తవ సమాజాల్లో కన్నులార చూస్తూనే వున్నాం. డబ్బు మీద కోరికలు పెట్టుకొన్నవాడు దేవుణ్ణీ తోడి ప్రజలనూ లెక్కచేయడు. చేయరాని పనులు చేసి చెడిపోతాడు. మనకు మామూలు కూడూ గుడ్డా చాలు. వాటితో తృప్తి చెందక డబ్బుమీద విపరీతమైన కోరిక పెట్టుకొంటే చివరకు ఆ కోరికే మనకు మృత్యుపాశమై కూర్చుంటుంది - 1తిమొ 6, 8-9. కనుక ధనవంతులు చంచలములైన సంపదలపై మనసు నిల్పుకోగూడదు. అహంకారంతో విఱ్ఱవీగకూడదు. మరి దేవునిపై ఆధారపడి జీవించాలి. ఉదారబుద్ధితో తమకున్నదానిని ఇతరులతో పంచుకోవాలి - 1తిమొ 6, 17-18.

ఇంకా, ఈలోక వస్తువులతో మెలిగేవాళ్లు వాటితో తమకు సంబంధంలేనట్లే వ్యవహరించాలి. అనగా ఈ ప్రపంచ వస్తువులమీద మనసు పెట్టుకోగూడదు. వాటికి దాసులు కాగూడదు. అసలు ఈ ప్రపంచమే అనతి కాలంలో నశిస్తుంది. కనుక శిష్యుడు వస్తుదాస్యాన్నీ వస్తుమమకారాన్నీ అరికట్టాలి - 1కొరి 7, 30-31.

పూర్వవేదం సంపదను దేవుని వరంగా భావించిందని చెప్పాం. కాని నూత్నవేదం దాన్ని అలా గణించదు. పైగా ధనాన్ని ప్రలోభ కారణంగా ఎంచుతుంది. డబ్బు నరుణ్ణి శోధించి పాపమార్గాన్ని పట్టించేది. కనుక నరుడు దాన్ని అతిజాగ్రత్తగా వాడుకోవాలని హెచ్చరిస్తుంది. ధనాన్ని సోదరప్రజలు అవసరాలను తీర్చడానికి వినియోగించడం ఉత్తమమైన మార్గం అనికూడ చెప్తుంది.

# 4. నేటి క్రైస్తవ సమాజమూ సంపదలూ

ధనాన్ని గూర్చిన బైబులు బోధలను పరిశీలించి చూచాం. సంపదలను గూర్చిన క్రీస్తు భావాలను అర్థం చేసికొన్నాం. కాని ఈ బోధలను ఈనాటి మన క్రైస్తవ సమాజానికీ, మన వ్యక్తిగత జీవితానికీ అన్వయించుకోవడం ఏలా?

## 1. సంస్థగా శ్రీసభ

భారతదేశ క్రైస్తవులు చాలమంది పేదవాళ్ళు. తక్కువ కులాలకు చెందినవాళ్ళుకూడ. అందుచేత సిరిసంపదలు తెచ్చిపెట్టే సమస్యలు మన క్రైస్తవ సమాజాలను అంతగా బాధించవు. కాని మన క్రైస్తవులు పేదవాళ్ళయినా ఇండియాలో శ్రీసభ మాత్రం పేదది ఎంతమాత్రమూ కాదు. సంస్థగా మన శ్రీసభ సుసంపన్నమైనదని అందరికీ తెలుసు.

ఎన్నో కోట్ల రూపాయల విలువచేసే బ్రహ్మాండమైన భవనాలూ, భూములూ వాహనాలూ ఈ దేశంలో శ్రీసభ అధీనంలో వున్నాయి. మనకు విద్యాసంస్థలూ ఆస్పత్రులూ సేవా సదనాలూ చాలా వున్నాయి. ఈ సంస్థలన్నిటినీ పోషించడానికి ఏటేట కోట్లకొలది విదేశ నిధులు - ప్రతియేడు కనీసం వేయికోట్లయినా - ఇండియాకు చేరుతున్నాయి. అలాంటప్పుడు మన శ్రీసభ పేదది ఏలా ఔతుంది?

ఇక ఈ శ్రీసభ అధికారులకున్న పలుకుబడి తక్కువదేమీ కాదు. మన విద్యాసంస్థలూ ఆస్పత్రులూ పెద్దపెద్ద నగరాల్లో వున్నాయి. ఈ దేశంలోని ధనవంతులూ బలవంతులూ ప్రభుత్వోద్యోగులూ మేధావులూ చాలమంది మన విద్యాసంస్థల్లో చదువుకొన్నారు, మన ఆస్పత్రుల్లో చికిత్స పొందారు. కనుక మన పెద్దలు చిన్నదానికీ పెద్దదానికీగూడ వీళ్ళ పలుకుబడిని వినియోగించుకొని నానాసదుపాయాలు పొందుతూంటారు. ఇంకా ఈ పెద్దల్లో అల్పబుద్ధులైనవాళ్లు ఒకోమారు ఈ పలుకుబడిని దుర్వినియోగం చేయడం గూడ కద్దు.

ఇక్కడే వచ్చింది చిక్కు. ఈ దేశంలోని విద్యావంతుల దృష్టిలోను బలవద్వర్గం దృష్టిలోను క్రైస్తవ శ్రీసభ పేదదికాదు, ధనవంతమైంది. విద్యా వైద్యాది నానారంగాల్లో సమర్థవంతంగా పనిచేసేది. కాని ఈ దేశీయులు మనలను సమర్థవంతంగా పనిజేసే ఓ సంస్థగా గుర్తిస్తారేగాని క్రీస్తు శిష్యులనుగా గుర్తించరు. అంటే మన సంస్థలతో, మన నిధులతో, మన శక్తిసామర్థ్యాలతో మనం క్రీస్తుకి సాక్ష్యం పల్కలేకపోతున్నాం. అతన్ని గూర్చి బోధించలేకపోతున్నాం. అనగా ఈ దేశంలో శ్రీసభ ధనవంతమైపోయినందున ప్రజలకు క్రీస్తుని చూపించలేకపోతూంది. స్వీయవైభవాన్నే ప్రపంచానికి చాటుకొంటూంది. ఇది మహా దౌర్భాగ్యం.

సంపదలు శోధనకు కారణమౌతాయన్నాడు క్రీస్తు. భారతదేశంలోని శ్రీసభ నేడు అచ్చంగా ఈ ప్రమాదానికే గురైంది. కనుక మన శ్రీసభ అనే సంస్థా దాని అధికారులూ పేదజీవితం గడపడం మొదలెట్టాలి. వైభవోపేతమైన భవనాలనూ ఆడంబరప్రియమైన వాహనాలనూ సుఖజీవనాన్నీ త్యజించాలి. మన పెద్దలు గౌరవప్రతిష్ఠలకు అర్రులు చాచడం మానుకోవాలి. సంస్థలమూలంగా గణించిన పలుకుబడిని స్వార్థానికి వినియోగించుకోకుండా వుండాలి. అప్పుడే శ్రీసభ ఈ దేశంలో క్రీస్తుని బోధించగలిగేదీ, క్రీస్తుకి సాక్ష్యం పల్కగలిగేదీనీ. దీనికిగాను మన శ్రీసభకు కొన్ని హింసలూ కష్టాలూ గూడ రావాలి. కష్టాలపాలైనవాళ్ళు కళ్ళు తెరుస్తారు. ఆ కష్టాలు ఇప్పుడు ఎంతో దూరంలో లేవు.

## 2. ధనికులైన క్రైస్తవులు

మనదేశ క్రైస్తవుల్లో అగ్రశ్రేణి ధనికులు అరుదు. కాని ఒకపాటి ధనికులు లేకపోలేదు. పేదప్రజల నడుమ ఎవరైనా కొద్దిపాటి సొత్తుగలవాళ్ళుంటే వాళ్ల ధనికులుగానే గణింపబడతారు. ఈ దృష్టితో చూస్తే మన క్రైస్తవ సమాజాల్లో చిన్న స్థాయి ధనికులు చాలామంది తగులుతారు. ఈలాంటివాళ్లు డబ్బు విషయంలో ఏలా ప్రవర్తించాలి?

అల్పమానవులకు డబ్బువలన సులభంగా పొగరెక్కుతుంది. డబ్బులో పరపీడనశక్తి వుందని చెప్పాం. ధనవంతుడు తన ధనశక్తితో పేదవాణ్ణి బాధించడం మొదలిడతాడు. వాడికి ముట్టవలసింది తాను కొట్టేస్తాడు. వాణ్ణి బానిసను చేయబోతాడు. కనుక ధనశక్తితో తనకంటె క్రిందిస్థాయిలో వున్నవాళ్ళను పీడించడమనే దుష్కార్యాన్నుండి క్రైస్తవ ధనికుడు జాగ్రత్తగా తప్పుకోవాలి.

భక్తుడు ఇగ్నేష్యస్ లొయోలాగారు తాను వ్రాసిన తపోభ్యాసాలు అనే గ్రంథంలో పిశాచం నరులను శోధించే తీరును చక్కగా వివరించాడు. దయ్యం నరులకు మొదట డబ్బుమీద ప్రీతిని పుట్టిస్తుంది. ఆ డబ్బును గడించినవాళ్ళకు ఈ లోకపు పదవులమీదా గౌరవప్రతిష్ఠలమీదా కాంక్ష పుట్టిస్తుంది. ఆ పదవులనుగూడ పొందినవాళ్ళకు విపరీతమైన గర్వం పుట్టిస్తుంది. కనుక పిశాచం నరుణ్ణి సంపదలకూ, సంపదలనుండి పదవులకూ, పదవులనుండి గర్వానికీ నడిపిస్తుంది. కడన గర్వంద్వారా అతన్ని కూలద్రోస్తుంది. ఇగ్నేష్యస్ పేర్కొన్న ఈ శోధనలకు క్రైస్తవ ధనికులు ఎందరు గురికావడంలేదు?

సంపన్న క్రైస్తవులు అవివేకియైన ధనికుని సామెతను గూడ జాగ్రత్తగా గుర్తుంచుకోవాలి - లూకా 12, 16-21. ఏ ధనవంతుడూ తనకున్న సొమ్ముతో సంతృప్తి చెందడు. ఇంకా యెక్కువ డబ్బును కూడబెట్టుకోవాలని తాపత్రయ పడతాడు. ఈ తాపత్రయం అతనికి ఓ వ్యసనంగా పరిణమిస్తుంది. దానితో అతడు దేవుణ్ణి విస్మరిస్తాడు. భగవంతుణ్ణికాక తన సొత్తునే నమ్ముకొని దానిమీదనే ఆధారపడి జీవిస్తాడు. దీనితో అతని పతనం ప్రారంభమైనట్లే. ఈలా ధనవంతుడు పిచ్చెక్కినవాడి లాగ సొత్తు కూడబెట్టుకొంటూనే ఎప్పుడో, ఎక్కడో, తలవని తలంపుగా కన్నుమూస్తాడు. దేవుణ్ణి మాత్రం పోగొట్టుకొంటాడు. సంపన్నులు చాలమంది ఈలాగే నాశమయ్యారు, ఔతున్నారుకూడ. ఓ విధంగా జెప్పాలంటే ధనవంతులైన వాళ్ళకి వచ్చే శోధనలన్నిటిలోను ఇది పెద్దది. ఇక, క్రీస్తు బోధలను జీర్ణం చేసికొని ధనలోభాన్ని అర్థం చేసికొన్న క్రైస్తవుడు మాత్రం ఈ యనర్థానికి గురికాకూడదు.

తోడి నరుణ్ణి బానిసనుచేసి వాణ్ణి మన స్వార్థానికి వాడుకొనేలా చేసే దుష్టశక్తి సంపదలో వుంది. ధనికులైన క్రైస్తవులు ఈ దుష్టశక్తి నుండి జాగ్రత్తగా తప్పుకోవాలి.

ఈలా తప్పుకోవాలంటే వాళ్ళు తోడి పేదలకు అపకారం చేయకుండా వుంటేనే చాలదు. దరిద్రులకు బుద్ధిపూర్వకంగా ఉపకారం చేయాలి కూడ. అనగా తమ సిరిసంపదలను లేనివాళ్ళతో కొలదిగానైనా పంచుకోవాలి. దీనికి తొలినాటి యెరూషలేము సమాజం చక్కని ఆదర్శం - లూకా 4, 35. పూర్వగురువుల సహాయంతో నేడు క్రైస్తవుల్లో పేదవర్గాలవాళ్ళు చాలమంది విద్య గడించి చిన్నవో పెద్దవో ఉద్యోగాలు చేపట్టారు. కనుక వీళ్ళ ఆర్థికస్థాయి పెరిగింది. ఈలాంటివాళ్ళు తమ వర్గాల్లో ఇంకా అట్టడుగుననే వున్న పేదవాళ్ళకు చేయూత నివ్వాలి. ఉన్నవాడు ఒక్కొక్కడు కనీసం ఒక్క పేదకుటుంబాన్నయినా ఆదుకోవాలి. పాలల్లోకి పంచదారలేక ఒకమ్మ ఏడుస్తూంటే నీళ్ళల్లోకి ఉప్పుగల్లు లేక మరొకమ్మ ఏడుస్తూందని తెలుగు సామెత. పాలల్లోకి పంచదారను సంపాదించుకొన్నవాళ్ళు నీళ్ళల్లోకి ఉప్పుగల్లు సంపాదించుకోలేనివాళ్ళకు తప్పకుండా సహాయం చేయాలి. ధనం తెచ్చిపెట్టే శోధనలకు గురికాకుండా వుండడానికీ, దాన్ని సద్వినియోగం జేసికోవడానికీ ఇంతకంటె ఉత్తమ మార్గం లేదు. ఆసబోతుతనంతో డబ్బుని కూడబెట్టుకొంటే దాని దుష్టశక్తి హెచ్చుతుంది. ఆ డబ్బునే పేదసాదలకొరకు వినియోగిస్తే దాని దుష్టశక్తి సచ్ఛక్తిగా మారుతుంది. కనుకనే లూకా సువిశేషం డబ్బుని దానానికి వినియోగించమని మాటిమాటికి హెచ్చరిస్తుంది - 12, 23.

కడన, ధనికులు మాకు సిరి అబ్బిందిలే అని మిడిసిపడకూడదు. "ప్రభువు అధిపతులను ఆసనాలనుండి పడద్రోసి దీనులను లేవనెత్తాడు. ఆకలిగొన్నవారిని సంతృప్తిపరచి ధనవంతులను వట్టిచేతులతో పంపివేసాడు" అని చెప్తుంది మరియ నుడివిన మహిమగీతం - లూకా 1, 52-53. కనుక కలిమి గలవాళ్ళకు వినయం తగుతుంది.

# 4. పేదల పాట్లు

బైబులు భాష్యం - 20

## 1. నీవలె నీ పొరుగువారిని ప్రేమించాలి - మార్కు 12,31

ఓమారు ఓ ధర్మశాస్త్ర బోధకుడు ఆజ్ఞలన్నిటిల్లోను ప్రధానమైన ఆజ్ఞయేమిటని క్రీస్తుని ప్రశ్నించాడు. ప్రభువు "దేవుణ్ణి నిండు హృదయంతో ప్రేమించాలి, నీవలె నీ పొరుగువారినీ ప్రేమించాలి" అని జవాబిచ్చాడు. ప్రస్తుతానికి దేవుణ్ణిగాదు, పొరుగువారిని ప్రేమించడాన్ని గూర్చి విచారిద్దాం. మన తోడి ప్రజల్లో అధిక సంఖ్యాకులు పేదవాళ్ళు. కనుక పొరుగువారిని ప్రేమించడమంటే పేదసాదలైన తోడి ప్రజలను ఆదరించడమూ, కనికరముతో చూడ్డమూను. ఈ దేశములో పేదసాదలు అనుభవించే కడగండ్లు అన్నీయిన్నీ కావు. ఈ పొత్తంలో పేదల పాట్లను కొన్నిటిని పరిశీలిద్దాం.

## 2. పీడితులకు విమోచనాన్ని ప్రకటించడానికి - లూకా 4,18

నజరేతు సమాజమందిరంలో ప్రభువు బహిరంగబోధను ప్రారంభించాడు. పేదలకు సువార్తా, చెరలో నున్నవారికి విడుదలా, గ్రుడ్డివారికి చూపూ, పీడితులకు విమోచనమూ లభించేలా చేయడమే తన ధ్యేయంగా పెట్టుకొన్నాడు ప్రభువు. అంతకు ఎన్మిది వందల యేండ్లకు పూర్వమే యెషయా ప్రవక్త బాబిలోనులో బందీలై దేవురించే యూదులకు ఈ భాగ్యాలన్నీ లభిస్తాయని ప్రవచనం చెప్పాడు. తన నాటి పీడితప్రజకు క్రీస్తుకూడ ఇవే భాగ్యాలు లభింపజేయాలని కోరుకొన్నాడు. కనుక యిక్కడ క్రీస్తు యెషయా ప్రవచనాన్ని యథాతథంగా ఉదాహరించాడు.

ఇక, నేడు మన దేశప్రజల స్థితిగతులు కూడ ఈలాగే ఉన్నాయి. ఇండియాలో ప్రస్తుతం 100 కోట్లమంది జనం ఉన్నారు. అనగా ప్రపంచ జనాభాలో ఏడవవంతు. మనదేశంలో ధ్రాదాపు ఐదులక్షల గ్రామాలున్నాయి. మన జనాంగంలో 80 శాతం అనగా 80 కోట్లమంది ఈ గ్రామాల్లోనే వసిస్తున్నారు. గ్రామాల్లో జీవిత సదుపాయాలు అట్టే వుండవు. కనుక ఈదేశ దౌర్భాగ్యమైనా, సౌభాగ్యమైనా గ్రామ జీవితంమీదనే ఆధారపడి వుంటుంది.

## 3. నాకు ఈ ప్రజల మీద జాలి కల్గుతూంది - మార్కు 8,2

ఆనాటి యూదప్రజలు ప్రభువు బోధలు ఆలించి ఉత్సాహంతో అతని వెంట వెళ్ళారు. క్రీస్తు పలుకులు వింటూ మూడు రోజుల పాటు అతనితోనే వుండిపోయారు. కాని తినడానికి తిండి లేనందున ఆకలితో అలమటించిపోయారు. వాళ్ళను చూడగా క్రీస్తుకు జాలి కలిగింది. అతడు వాళ్ళకు అద్భుతంగా ఆహారం సంపాదించి పెట్టాడు. పేదసాదలనూ దిక్కుమొక్కు లేనివాళ్ళనూ చూచి జాలిచెందడమనేది సాంఘిక సేవకు మొదటి మెట్టు. కరుణాహృదయుడు కానివాడు తోడి ప్రజలకు సేవ చేయలేడు.

మనదేశ జనాభా ప్రస్తుతం 100 కోట్లు అన్నాం. అనగా చదరపు మైలుకి 800 మంది ఔతారు. ప్రపంచం మొత్తాన్ని చదరపు మైళ్ళుగా విభజించి ప్రపంచ జనాభాన్ని విభజించినట్లయితే ఒక్కో చదరపు మైలుకి 67 మంది మాత్రమే ఔతారు. అనగా మన దేశంలోని జనాభా సాంద్రత ప్రపంచజనాభా సాంద్రతకంటే 12 రెట్లు ఎక్కువ. ఈ జనాభా గూడ ఈమాత్రంగానే వుండిపోదు. ఏటేటికీ రెండున్నర శాతం పెరుగుతూంటుంది. ఇంత మంది జనంలో ధనికులెంతమంది, పేదలెంతమంది? ఉన్నవాళ్ళెంతమంది, లేనివాళ్ళెంతమంది? ఈ జనంపట్ల మనకు జాలి కలుగవద్దా?

## 4. సోదరసోదరీ జనం కూడూగుడ్డా లేక అలమటిస్తూంటే - యాకో 2,15

మన విశ్వాసమూ సత్క్రియలూ కలిసిపోవాలిగాని, విశ్వాసమొక్కటే చాలదని చెప్తుంది యాకోబు జాబు. ఉదాహరణకు మన యిరుగుపొరుగు సోదరసోదరీ జనం కూడూగుడ్డా లేక అలమటించి పోతున్నారనుకొందాం. మనం వాళ్ళ జీవితావసరాలను తీర్చే ప్రయత్నం చేయాలి. అనగా సత్క్రియలు చేయాలి. అంతేగాని "దేవుడు మిమ్ము దీవిస్తాళ్లే ! మీరు వెచ్చగా బట్టలు కప్పుకోండి. హాయిగా భుజించండి" అని ఉపచార వాక్యాలు పలికితే ఏమి లాభం? కనుక తోడి ప్రజలను ప్రేమించడమంటే అక్కరలో నున్నవారిని మనకు చేతనైనంతగా ఆదుకోవడం.

కాని మనదేశ ప్రజలు అక్కరలో ఉన్నారా? ఉన్నారని మెల్లగా చెప్తే చాలదు. ఇండియాలో 20 శాతం ప్రజలకు, అనగా 20 కోట్ల మందికి, సగటు రోజువారి ఆదాయం 100 పైసలు మాత్రమే. వీళ్లంతా పేదలు మాత్రమే కాదు, పేదలకంటె క్రింది తరగతిలో నికృష్టజీవితం జీవించేవాళ్లు. నానా వెతలూ, అగచాట్లూ పడుతూ బడుగు బ్రతుకులు బ్రతికేవాళ్లు. వీళ్ల నుద్దేశించి మనకు చేతనైన సత్క్రియలకు పూనుకోవాలి. క్రైస్తవుడికి విశ్వాసమూ ఆచరణమూ రెండూ వుండాలి.

## 5. ప్రేమను మాటల్లోకాదు చేతల్లో చూపించాలి - 1 యోహా 3,18

యోహాను తన మొదటి జాబులో మరోసంగతి చెప్పాడు. ఉన్నవాడు అవసరంలోవున్న పేదవాళ్ళను జూచి గూడ నిర్దయతో వుండిపోయినట్లయితే, అతని హృదయంలో దైవప్రేమ వుంది అని చెప్పగలమా? కనుక ప్రేమ అంటే మాటలు చెప్పడంగాదు, చేతలు చూపించడం. మన దేశంలో చాలమందిలో ఈ చేతలనేవి లేవు. కనుకనే రోజురోజుకి పేద ప్రజల ఘోష మిన్ను ముట్టుతూంది.

## 6. నక్కలకు బొరియలూ పక్షులకు గూళ్లూ వున్నాయిగాని - లూకా 9,58

పూర్వవేద కాలంనుండీ యిస్రాయేలు ప్రజల్లో ఓ వర్గంవాళ్లు "యావేకు చెందిన పేదప్రజలు" అనే పేరుతో పిలువబడేవాళ్లు. వీళ్లు ప్రస్తుతః పేదవాళ్లు కావచ్చు. కాకపోవచ్చుగూడ. కాని వీళ్ల హృదయం మాత్రం ఐహిక వస్తువులకూ సిరిసంపదలకూగాక, దేవునికే అంటి పెట్టుకొనివుండేది. కష్టసుఖాల్లోను వీళ్లు దేవుని మీదనే ఆధారపడి జీవించేవాళ్లు. వీళ్లను హీబ్రూ భాషలో "హనవిమ్" అనిపిలిచేవాళ్లు. ఈలాంటి పేదవాళ్ల కోవకు చెందినవాడు క్రీస్తు. అతని హృదయం ఐహిక వస్తువులకు వేటికీ అంటిపెట్టుకోలేదు. పక్షులకూ, మృగాలకూ నివాస స్థలాలైనా వున్నాయిగాని మనుష్య కుమారునికి తలదాచుకొనే తావైనా లేకపోయింది. ఈలాంటి పేదజీవితం జీవించిన క్రీస్తు పేదలను ఆదరంతో జూచాడు అంటే, పేదల కోపు తీసికొన్నాడు అంటే ఆశ్చర్యమేముంది?

నరునికి కూడూ, గుడ్డా, యిల్లూ కనీసావసరాలు. కాని మనదేశంలో పేదప్రజలకు కనీసావసరాలు కూడ తీరడంలేదు. చాలమందికి ఉండడానికి ఇండ్లుకూడ లేవు. ఒక అంచనా ప్రకారం భారతదేశంలో ఇండ్లు లేనివాళ్లు పల్లె ప్రాంతాలలోనే ఎనిమిది కోట్లదాకా వున్నారు. పెద్దపెద్ద పట్టణాల్లో వసించే వాళ్లలో సగంమంది మురికి వాడల్లోను పాడు గుడిసెల్లోను తల దాచుకొంటున్నారు. ఆరోగ్యకరమైన ఇండ్లు లేనివాళ్లు అనతికాలంలోనే రోగాలగొట్టులై పోతుంటారు.

## 7. పేదలైన మీరు ధన్యులు, దైవరాజ్యం మీది - లూకా 6,20

క్రీస్తు పేదప్రజల కోవకు చెందినవాడు అన్నాం. అతడు పేదజీవితం జీవించాడు అన్నాం. అతని సానుభూతి అంతా పేదప్రజలకే. కనుక అతడు పల్కిన ధన్యవచనాల్లో ఓ వచనం పేదప్రజల నుద్దేశించింది. పేదలు ధన్యులు అంటాడు ప్రభువు. ఎందుకంటే వాళ్లకు దైవరాజ్యం లభిస్తుంది. దేవునికి వాళ్లు ఇష్టులౌతారు. కాని ఈ పేదరికం అనేది

కేవలం వస్తువులు లేకపోవడంలోనే కాదు. హృదయంలో వుండాలి. అనగా మన హృదయం సృష్టివస్తువులకు కాకుండ దేవునికి అంటి పెట్టుకొని వుండాలి.

మనదేశంలోని నేల పంపిణీని చూస్తుంటే ఆశ్చర్యం కలుగుతుంది. ఈ దేశంలోని 70శాతం వ్యవసాయదారులకు ఒక్కొక్కరికి ఐదెకరాల లోపు భూమి మాత్రమే వుంది. కాని 10శాతం ఘరానా భూస్వాములు మాత్రం దేశంలోని మొత్తం సాగు నేలలో 56 శాతం నేలను స్వాధీనం చేసికొన్నారు. కనుక దేశంలోని సాగునేల కొద్దిమంది చేతుల్లోనికి వచ్చేసింది. పనిచేసికొనే రైతుకి నేల లేదు. కొంతమంది అగాయిత్యంతో దౌర్జన్యంతో నేలను స్వాధీనం చేసేసుకొన్నారు. కాకపోతే యింతమంది కూలీలు రెక్కలు విరుగగొట్టుకొంటూ రోజురోజూ వేరేవాళ్ల పొలాల్లోనే పని చేయడమెందుకు? పనిచేసి కొనేవాడికి ఎవడిపొలం వాడికి ఎందుకుండ కూడదు? దేవుడు భూమిని నరులందరి కొరకూ సృజింపలేదా?

## 8. ఓరీ బుద్ధిహీనుడా! ఈ రాత్రే నీవు చనిపోతావు - లూకా 12,20

క్రీస్తు ఓమారు ఓ సామెత చెప్పాడు. ఓ ధనవంతునికి సమృద్ధిగా పంటలు పండాయి. అతడు ధాన్యాన్ని భద్రపరచడం కోసం క్రొత్త కొట్లు కట్టిస్తా ననుకొన్నాడు. నేను అదృష్టవంతుణ్ణి. నాకు ఎంతకాలానికైనా సరిపోయ్యేంతగా సిరిసంపదలు అబ్బాయిగదా అనుకొన్నాడు. హాయిగా తింటూ త్రాగుతూ ఆనందిస్తాననుకొన్నాడు. కాని దేవుడు ఓరీ బుద్ధిహీనుడా! ఈ రాత్రే నేను నీ ప్రాణాలు తీసుకవెళ్తాను. ఇక నీ సిరిసంపదలన్నీ ఏమౌతాయో చూద్దాం అన్నాడు. బైబుల్లో "బుద్ధిహీనుడు" అంటే దేవుణ్ణి లెక్కపెట్టనివాడు. దేవుడు ఉన్నాడని నమ్మినా తన నిత్యవ్యవహారంలో మాత్రం దేవుడు లేడో అన్నట్లు జీవించేవాడు. ధనికులు అందరూ కాకపోయినా చాలమంది ఈ వర్గానికి చెందినవాళ్లు.

దేవుడు నేలను నరులందరి కొరకూ కలిగించాడు అన్నాం. నరులందరూ ఆనేలమీద కష్టంచేసి పొట్టపోసికోవాలనే దేవుని కోరిక. కాని కొందరు మాత్రం అన్యాయంగా ఆ నేలను తమ స్వాధీనం చేసికొన్నారు. దాన్ని వేరేవాళ్లకు దక్కకుండా చేసారు. ఇది పెద్ద అన్యాయం. దీన్ని చూచే మన ప్రభుత్వాలు నేలపంపిణీలు ప్రారంభించాయి. కాని ఎన్ని భూసంస్కరణలు జరిగినా పేదవాళ్ల చేతుల్లోకి మాత్రం అరెకరం నేలైనా రావడం లేదు. ఎక్కడి కక్కడే మోసాలు చేసి, దొంగలెక్కలు తయారుచేసి ఆ వచ్చే నేలను కాస్త మధ్యలో ధనికులే కొట్టేస్తున్నారు. పేదవాడి నోటిలో మాత్రం దుమ్ము కొడుతున్నారు.

## 9. ఒంటె సూది బెజ్జంలో దూరడం - మార్కు 10,25

క్రీస్తు ధనవంతులను గూర్చి చెప్పిన వాక్యాలు కొన్ని వున్నాయి. ధనాన్ని కూడబెట్టడంలో తప్పేమిలేదు. కాని తరచుగా ధనవంతుల హృదయం ఆ ధనంమీదికే పోతుంది గాని దేవుని మీదికి పోదు. అందుకే ధనవంతులు రోజురోజుకీ దైవరాజ్యానికి దూరమై పోతూంటారు. కనుక ఒంటె సూది బెజ్జంగుండా దూరడం ఎంత కష్టమో ధనికుడు మోక్షాన్ని చేరుకోవడం అంతకష్టం అన్నాడు ప్రభువు. మరోతావులో క్రీస్తు ఈలోకంలో సంపదలు చేకూర్చి పెట్టవద్దన్నాడు. ఈలోకంలో కూడబెట్టే డబ్బును త్రుప్పు చిమ్మటలు దొంగలు కాజేస్తారు. కనుక పరలోకంలో మన సొమ్ము దాచుకోవాలి - మత్త 6,19.

మనదేశపు రైతుల్లో 15 శాతం ధనవంతులు, తతిమ్మా వాళ్ళంతా పేద రైతులు. ఈ ధనవంతులైన రైతులకు మూలధనముంటుంది కనుక పెట్టుబడి పెట్టగలరు. మంచి విత్తనాలు, ఎరువులు కొనగలరు. సకాలంలో పని చేయించగలరు. కనుక వీళ్ళు రోజు రోజుకీ వృద్ధిలోకి వస్తుంటారు. ఇక పేద రైతులు పెట్టుబడి పెట్టలేరు. కనుక వాళ్ళు ఏటేటికి అణగారి పోతుంటారు. ఈ రీతిగా రైతాంగంలో కొద్దిమంది బలిసిపోతూంటారు. అధిక సంఖ్యాకులు మాత్రం బడుగులై పోతూంటారు.

## 10. ఎవడూ ఇద్దరు యజమానులను సేవించలేడు - మత్త 6,24

ఒకవైపు ధనమూ మరోవైపు దైవమూ అని యిద్దరు యజమానులున్నారు. మనం ఈ యిద్దరినీ సేవించలేం. దేవుణ్ణి సేవిస్తే ధనాన్ని వదలుకోవాలి. ధనాన్ని సేవిస్తే దేవుణ్ణి వదలుకోవాలి. అందుకే ప్రభువు ఇంకో తావులో ధనికులు ఇక్కడ సుఖాలనుభవిస్తారుగాని తర్వాత వాళ్ళకు దౌర్భాగ్యపు గతి పడుతుంది అన్నాడు - లూకా 6,24.

మనదేశంలో చాలమంది బడుగు రైతులు ఉన్నారని చెప్పాం. వీళ్ళు పెట్టుబడికి డబ్బు లేక బాకీ దారులను ఆశ్రయిస్తారు. ఈ వడ్డీ వ్యాపారులు 120 శాతం వరకు వడ్డీ తీసుకొంటారు. అనగా నూరు రూపాయలు అప్పు తీసికొంటే సంవత్సరాంతంలో మొత్తం 220 రూపాయలు చెల్లించాలి. దీనివలన పేదరైతులు గుల్లైపోతారు. వాళ్ళ పొలంలో పండిన కొద్దిపాటి పంట బాకీలు తీర్చడానికే చాలదు. ఈవిధంగా పేదలు ఏటేటికీ క్రుంగిపోతూంటారు.

## 11. ధనవంతుడూ, లాజరూ - లూకా 16,19-26

ఓ ధనవంతుడూ లాజరు అనే ఓ పేదవాడూ ఉండేవాళ్లు. ధనవంతుడు పట్టువస్త్రాలతో, విందులూ వినోదాలతో కాలక్షేపం చేస్తుండేవాడు. లాజరు తన పుండ్లు కుక్కలు నాకుతూండగా ఆ ధనవంతుని యింటిముందు పడిఉండేవాడు. ధనవంతుని బల్ల మీదినుండి జారిపడిన యెంగిలి మెతుకులు తిని రోజులు గడుపుతూండేవాడు. తర్వాత వాళ్లిద్దరూ చనిపోయారు. లాజరు అబ్రాహాము ఒడిలోనికీ ధనవంతుడు పాతాళానికీ చేరుకొన్నారు. ఈలా ఈ జీవితంలో సుఖించిన ధనవంతుడు మరు జీవితంలో కష్టాలకు గురయ్యాడు. ఇక్కడ కష్టాలనుభవించిన లాజరు మరుజీవితంలో సుఖాన్ని పొందాడు. ఈలా క్రీస్తు పేదలను పొగడుతూ ధనవంతులను తెగడుతూ చాలా బోధలు చేసాడు. ఆ ప్రభుబోధలు నేడూ మన సమాజానికి అక్షరాల వర్తిస్తాయి.

మన ఆసియా ఖండంలో, విశేషంగా యిండియాలో, ఉన్నంత సాంఘిక వ్యత్యాసం మరేఖండంలోను కన్పించదు. మన దేశంలో ఈ ప్రక్కన ఆకాశాలంటే ధనికుల మేడలు. వాటికెదురుగానే ఆ ప్రక్కన పేదజనుల పూరిపాకలు. ఈ మేడల్లో విందులూ, పరమాన్నభోజనాలు, త్రాగుళ్లు. ఆ పూరి పాకల్లో పస్తులూ, ఒంటిపూట కూళ్లూనూ. ఈ మేడల్లో వసించే స్త్రీ పురుషులు పట్టుబట్టలతో, టెర్లిను నైలెను దుస్తులతో విలాసంగా తిరుగుతూంటారు. ఈలాగే మన సమాజంలో పేదలకూ ధనవంతులకూ మధ్య బోలెడన్ని వ్యత్యాసాలు కనిపిస్తాయి.

## 12. ఏమి తిందామా ఏమి కట్టుకొందామా అనే ఆందోళనం - మత్త 6,26-33

నరులు చాలమంది తాము బ్రతికే బ్రతుకుకొరకూ, తినే తిండికొరకూ కట్టే బట్టకొరకూ ఆందోళన పడుతూంటారు. కాని ఈలాంటి ఆందోళనం అనవసరం అన్నాడు ప్రభువు. ఎంత ఆందోళన పడినా మన ఆయువును కొన్ని క్షణాలకాలమైనా పెంపొందించుకోలేం గదా! ఆకాశపు పక్షులను పోషించే ప్రభువు నరులకు కూడు దొరికేలా చేయడా? గడ్డి మొక్కలను పూలతో అలంకరించే దేవుడు నరులకు బట్టలు లభించే మార్గం చూపించడా? కనుక నరుడు దేవుని మీద భారం వేసి జీవిస్తూండాలి. పురుషకారమూ దైవమూ ఈ రెండింటిలో దేనికీ భంగం కలుగకుండా తన ప్రయత్నం తాను చేస్తూండాలి.

కూడూ గుడ్డా యిల్లూ బ్రతుకూ వీటిని గూర్చి ఆందోళన పడగూడదన్న క్రీస్తు బోధ ధనికవర్గాలకూ పేదవర్గాలకూ గూడ వర్తిస్తుంది. ఎందుకంటే ఈ యాందోళన

మనేది ధనవంతుల్లోను ఉండవచ్చు పేదల్లోను ఉండవచ్చు. విపరీతంగా ఆందోళన పడ్డం దేవుని మీద నమ్మిక లేకపోవడమే ఔతుంది.

## 13. నన్ను వెంబడింప గోరేవాడు తన్నుతాను నిరాకరించుకోవాలి - మత్త 16,24

నరునిలో ఓపెద్ద లోపం వుంది. అదే అతని స్వార్థం. ఈ స్వార్థం కొద్దీ అతడు తన సుఖాలను తాను వెదుకుకొంటాడు. ఇతరులమీద దౌర్జన్యంచేసి వాళ్లకు రావలసిందికూడ తాను కొట్టేస్తూంటాడు. ఈ స్వార్థాన్ని అణచుకొన్నవాడుగాని దివ్య మానవుడూ క్రీస్తుశిష్యుడూ కాలేడు. అందుకే ప్రభువు తన్ను వెంబడింప గోరేవాడు తన్ను తాను నిరాకరించుకోవాలనీ తన సిలువను తాను మోసికొని రావాలనీ బోధించాడు. ఈలా నరుడు తన్ను తాను నిరాకరించుకోవడమూ క్రీస్తు సిలువను మోయడమూ నేర్చుకొన్నదాకా అతనిలోని స్వార్థం చావదు. ఈస్వార్థం చావకపోవడం వల్లనే అతడు సాంఘిక అన్యాయానికీ దౌర్జన్యానికీ తలపడుతూన్నాడు.

మన దేశంలోని పేదప్రజలు విశేషంగా పల్లెల్లో జీవిస్తున్నారు. ఈ పల్లెల్లో వుండే మీది రెండుశాతం పల్లీయులకు పల్లెలకు లభించే మొత్తం ఆదాయంలో 25 శాతం లభిస్తూంది. క్రింది 20 శాతం పల్లీయులకు ఈ యాదాయంలో 1 శాతం మాత్రమే లభిస్తుంది. అనగా పల్లీయుల్లో కొద్దిమందికి మాత్రమే ఆదాయం పుష్కలంగా లభిస్తుంది. అధిక సంఖ్యాకులు నిరుపేదల్లా జీవిస్తున్నారు.

## 14. లోకాన్నంతటినీ జయించినా తన్నుతాను కోల్పోతే - మార్కు 8,36

నరుడు లోకాన్నంతటినీ జయించినా తన్నుతాను కోల్పోతే ఏమిలాభం అన్నాడు క్రీస్తు. ఇక్కడ తన్ను తాను కోల్పోవడమంటే యేమిటి? నరుడు తనకు తానూ దక్కడు. దేవునికీ దక్కడు. తోడి మానవునికీ దక్కడు. స్వార్థపరుడైన మానవుడు ఈలా తయారౌతాడు. అతడు అన్నీ తన కొరకే కూడబెట్టుకోబోతాడు. కాని అలా కూడబెట్టుకునే ప్రయత్నంలో దేవునికీ తోడి ప్రజలకూ దూరమైపోతాడు, నాశమైపోతాడు. ఈలా స్వార్థ మానవుడు ప్రపంచాన్ని వశం జేసికోబోతూంటాడు, ఆ పోకడలో తానే నాశమై పోతూంటాడు. ఈ స్వార్థాన్ని జయించిననాడే గాని సాంఘిక న్యాయాన్ని పాటించలేడు.

పల్లెల్లోని ప్రజలు చాలామంది పేదవాళ్ళున్నాం. వీళ్ళల్లో కొంతమంది జీవనోపాధి లభిస్తుందేమోనని ఆశతో పట్టణాలకు వచ్చి చేరుతూంటారు. కాని అక్కడ వాళ్ళకు పనులు దొరకవు. పల్లెలనుండి తెచ్చుకొన్నది కాస్త ఐపోతుంది. ఏమైనా మిగిలితే బాకీదారులకు కుదువ బెడతారు. ఈ రీతిగా ఉన్నది కాస్త ఊడిపోతుంది. ఇక చేసేదిలేక ఏ మురికివాడల్లోనో పడి అఘోరిస్తూంటారు. ఈ రీతిగా పల్లీయులు చాలమంది పట్టణాలకు వచ్చి మోసపోతూంటారు.

## 15. హృదయ పరివర్తనం చెందాలి - మార్కు 1,15

దైవరాజ్యం సమీపించింది గనుక హృదయ పరివర్తనం చెందమని బోధించాడు ప్రభువు. ఇక్కడ దైవరాజ్యమంటే క్రీస్తే. హృదయ పరివర్తనమంటే మన విలువలూ, తలపులూ చేతలూ మార్చుకోవాలి. క్రీస్తు విజయంచేస్తాడు గనుక ప్రజలు అతన్ని వెంబడించడానికి సంసిద్ధం కావాలి. కాని అతడు తన అనుచరుల నుండి కోరేది విశుద్ధవర్తనం. కనుక నరులు తమ పాపజీవితాన్ని మార్చుకోవాలి. మన పాపజీవితం రకరకాల రూపాల్లో వుండవచ్చు. మనంచేసే సాంఘిక అన్యాయం గూడ ఓరకం పాపజీవితమై వుండవచ్చు. ఈ యన్యాయాన్ని సవరించుకొంటేనే గాని మనం దైవరాజ్యంలో ప్రవేశించలేం.

నిరుద్యోగంవల్ల బాధపడ్డమనేది మనదేశంలో ఓపెద్ద సమస్య. ఒక అంచనా ప్రకారం పల్లెల్లో కూలిపని చేసికొని బ్రతికే పామర జనంలో 12 కోట్లమందికి పనీ పాటలు దొరకడం లేదు. పల్లెల్లో నైతేనేమి పట్టణాల్లో నైతేనేమి విద్యావంతులకు ఇరవైకోట్ల మందికి ఉద్యోగాలు దొరకడంలేదు. ఈలా ఉద్యోగాలూ పనిపాటలూ ధొరకని జనమంతా ఏలా బ్రతుకుతున్నారో దేవుడికే యెరుక.

## 16. ఓదేవా ఈ పాపిని కరుణించు - లూకా 18,13

ప్రార్థనం చేసికోవడానికి ఇద్దరు దేవాలయానికి వెళ్లారు. వాళ్లల్లో ఒకడు పరిసయుడు. మరొకడు సుంకరి. పరిసయుడు "దేవా! నేను నీతిమంతుణ్ణని నీకు తెలుసుగదా!" అని దేవుని ముందు తన్ను తాను మెచ్చుకొన్నాడు. కాని సుంకరి "ప్రభో! నేను పాపిని, నన్ను కరుణించు" అని ప్రార్థించాడు. మనందరం సాంఘిక అన్యాయంలో పాల్గొంటూనే వుంటాం. అవకాశం లభించినపుడెల్ల మనకంటె క్రిందివాళ్ల నోళ్లు కొడుతూనేవుంటాం. ఈ సంగతిని గుర్తించి మనం చిత్తశుద్ధితో పశ్చాత్తాపపడాలి. ఆ సుంకరిలాగే మనంగూడ పాపులమని ఒప్పుకోవాలి. అప్పుడు దేవుడు మనలను క్షమిస్తాడు. అంతేగాని ఆ పరిసయుడులాగ మనలను మనం నీతిమంతులనుగా ఎంచుకొని ఆత్మస్తుతి చేసికొంటూ కూర్చోగూడదు.

మనదేశంలో విద్యావంతులు 60 శాతం, అవిద్యావంతులు 40 శాతం. అనగా మన దేశీయులు 40 కోట్లమందికి అక్షరజ్ఞానం లేదు. చదువు సంధ్యల్లేక అజ్ఞానులై యున్న ప్రజలను వంచించడం సులభం. మనదేశంలో కొంతమంది మరికొంతమందిని నిత్యం వంచిస్తూంటారు. కాని ఈలా వంచితులయ్యే వాళ్లల్లో అధిక సంఖ్యాకులు పేదసాదలే. వీళ్లు వంచితులై గూడ న్యాయంకోసం పోరాడలేరు.

## 17. మనుష్యకుమారుడు సేవలు చేయడానికి వచ్చాడు - మార్కు 10,45

క్రీస్తు నేను సేవలు చేయించు కోవడానికికాదు, సేవలు చేయడానికి వచ్చానన్నాడు. స్వార్థపరుడైన నాయకునికీ స్వార్థం లేని నాయకునికీ ప్రధాన భేదం ఇక్కడే వుంది. స్వార్థపరుడైన నాయకుడు ఇతరులచేత సేవలు చేయించుకొంటాడు. స్వార్థంలేని నాయకుడు తాను ఇతరులకు సేవలు చేస్తాడు. క్రీస్తు అలా యితరులకు సేవలు చేసాడు. తన ప్రాణాన్నే యితరుల కొరకు సమర్పించాడు. ఈలాగే మనంకూడ నేటి పీడిత ప్రజానీకానికి సేవలు చేయాలి. ఆ సేవలుకూడ నిస్వార్థబుద్ధితో చేయాలి.

మనదేశంలో వెట్టిచాకిరి అనే దురాచారం ఒకటుంది. పేదలు ధనవంతుల దగ్గర బాకీ తెచ్చుకొంటారు. ఆ బాకీ తీరిందాకా ఆ పేదవాళ్ల కుటుంబం తరతరాలూ ఆ ధనికుల కుటుంబానికి ఉచితంగా చాకిరి చేయాలి. ఈలా ధనవంతుల పొలాల్లో చాకిరి చేసేవాళ్లను పాలేరు అంటారు. ఈ యాచారం మన రాష్ట్రంలో కొన్ని ప్రాంతాల్లో వాడుకలో వుంది. ఇటీవలే మన ప్రభుత్వం ఈ వెట్టిచాకిరిని రద్దుచేస్తూ ఓ శాసనం చేసింది. ఈ వెట్టిచాకిరి విధానం ప్రకారం నరులు తోడి నరుణ్ణి బానిసగా వాడుకొంటారు. ఇది చాల పెద్ద అన్యాయం అనాలి.

## 18. బోధకుడను ప్రభువునైన నేనే మీకాళ్లుకడిగితే - యోహా 13,14

క్రీస్తు తాను సేవకుణ్ణని వెల్లడించుకోవడం మాత్రమే గాదు. అచ్చంగా సేవకుళ్లాగే ప్రవర్తించాడు. అతడు శిష్యుల పాదాలు కడిగాడు. ఆరోజుల్లో బానిసలూ సేవకులూ యజమానుల పాదాలు కడిగేవాళ్లు. కనుక శిష్యుల పాదాలు కడగడం ద్వారా క్రీస్తు తన వినయాన్నీ సేవాభావాన్నీ ప్రదర్శించాడు. తోడి ప్రజలకు చిత్తశుద్ధితో సేవలు చేయడమంటే ఈలాగుండాలి. ప్రభువు శిష్యుల పాదాలు కడిగినంక మీ "గురువును ప్రభువునైన నేను మీ పాదాలు కడిగాను. నన్ను ఆదర్శంగా పెట్టుకొని మీరూ ఒకరి పాదాలొకరు కడుగుతూండండి" అన్నాడు. కాని నేడు ఈ యాదర్శాన్ని పాటించే క్రైస్తవు లెంతమంది?

మనదేశాన్ని పట్టిపీడించే మహారోగాల్లో అస్పృశ్యతా రోగమొకటి. మనవాళ్ళు నరుల్లో కొంతమందిని ముట్టుకోరాదన్నారు. వీళ్ళే దళితులు లేక పంచములు. తరతరాలుగా ధనికవర్గాలవాళ్ళు పేదవర్గాలను అణగద్రొక్కుతూ వచ్చారు. వాళ్ళను బానిసలుగా వాడుకొంటూ వచ్చారు. కడన వాళ్ళను ముట్టుకొంటేనే మైలపడిపోతాం అనే కాడికి వచ్చారు. ఈ యస్పృశ్యతా పిశాచం నేటికీ పల్లెప్రాంతాల్లో వికటాట్టహాసం చేస్తూనేవుంది. పెద్ద కులాలవాళ్లు దళితుల వాడలమీద దౌర్జన్యం చేసారనీ, దళితులను నిలువున

కాల్చివేసారనీ నేడూ పత్రికల్లో చదువుతుంటాం. నరుణ్ణి నరుడు పసరంగా జాడడమంటే యిదేగదా!

## 19. మీలో గొప్పవాడు కాదలచుకొన్నవాడు మీకు పరిచారకుడై యుండాలి - మార్కు 10,43

పాలకులు పాలితులనూ పైయధికారంలో వున్నవాళ్లు క్రింది వారినీ నిరంకుశంగా పరిపాలిస్తూంటారు. వాళ్ల మీద పెత్తనమూ అధికారమూ చెలాయిస్తూంటారు. కాని తన శిష్యులు ఈలా ప్రవర్తించకూడదన్నాడు క్రీస్తు. తన శిష్యులు అధికారంలో వున్నపుడు క్రింది వాళ్లమీద పెత్తనం జేయడంగాదు, వాళ్లకు పరిచర్యలు చేయాలన్నాడు. స్వార్థంలేని నాయకుడూ అధికారీ క్రిందివాళ్లకు మేలు చేస్తాడన్నాం. ఆ మేలే అతడు చేసే పరిచర్య. కనుక మనం యథార్థంగా క్రీస్తు శిష్యులమైతే పేద ప్రజలకు మేలూ పరిచర్యా చేయడం నేర్చుకోవాలి.

మొదటి అంశంలో అస్పృశ్యతను పేర్కొన్నాం. ఇంత ఘోరమైంది కాకపోయిన ఈలాంటిదే కులవ్యవస్థకూడ. కులం భగవంతుడు కలిగించిందికాదు, నరుడు అన్యాయంగా తెచ్చిపెట్టింది. ప్రపంచంలోకెల్లా మనదేశంలో మాత్రమే కులాలంటూ వున్నాయి. కులంపేరు మీదుగా నరులు కొన్ని వర్గాలుగా చీలిపోయి, ఒకవర్గంవాళ్లని మరోవర్గంవాళ్లు అనాదరం చేస్తూంటారు. మనదేశంలో కొన్ని పెద్దకులాలూ కొన్ని చిన్న కులాలూను. పెద్దకులాలకున్న వసతులూ సదుపాయాలూ చిన్న కులాలకు లేవు. అందుచేత రోజురోజుకీ పెద్దకులాలవాళ్లు వృద్ధిలోనికి వస్తూంటారు, చిన్నకులాలవాళ్లు అణగారి పోతూంటారు.

## 20. తన్ను తాను హెచ్చించుకోవడం - లూకా 18,14

కలవాళ్లూ ధనవంతులూ కన్నూమిన్నూ కానకుండా తిరుగుతూంటారు. వాళ్లకు పేదల కష్టాలు తెలిసిరావు. వీళ్లు మాకేమి కొదవ అన్నట్లు మిడిసిపడుతూంటారు, విర్రవీగుతూంటారు. కాని ఈలాంటి వాళ్లను గూర్చి ప్రభువు తన్నుతాను హెచ్చించు కొనేవాడు తగ్గింపబడతాడు అని మందలించాడు. కాని తన్నుతాను తగ్గించుకొనేవాడు ఆ ప్రభువు చేతనే హెచ్చింపబడతాడు. కనుక మనం భూలోక సంపదలు అమరాయిగదా అని తలబిరుసుతనంతో తిరుగగూడదు. పేదలను చిన్నచూపు చూడనూగూడదు.

మనదేశంలో ఉద్యోగులకు లభించే వేతనాలుగూడ చాల తక్కువ. ముగ్గురు సభ్యులుగల విద్యావంతుల కుటుంబానికి నెలకు కనీసం 1000 రూపాయలు అవసరమని

అంచనావేసారు ఆర్థికవేత్తలు. కాని ఎన్ని కుటుంబాలకు 1000 రూపాయల జీతం లభిస్తుంది? పైగా ఎన్ని కుటుంబాల్లో ముగ్గురు సభ్యులు మాత్రమే వుంటున్నారు? అందుచేత చాల కుటుంబాలు జీతాలు చాలక బాధపడి పోతూంటాయి. ఇక, జీతాలలోని వ్యత్యాసాలుకూడ మహాదారుణంగా వుంటాయి. ఒక ఆఫీసులో అందరికంటె పైయుద్యోగికి ఇచ్చే జీతం అదే ఆఫీసులో అందరికంటె క్రింది వుద్యోగికి ఇచ్చే జీతం కంటె 10 రెట్లు ఎక్కువ. ఇంత వ్యత్యాసం ఎందుకు? ఆపై యుద్యోగి అంతగా పొడిచేసిందేమిటి?

## 21. స్నేహితులకొరకు ప్రాణాన్ని ధారపోయటం - యోహా 15,13

తోడిప్రజలకు యథార్థంగా సేవచేయడమంటే కొన్ని మంచిమాటలు చెప్పడం మాత్రమేగాదు. కొన్ని పరిచర్యలు చేయడం మాత్రమేగాదు. ప్రాణాలు సమర్పించడంగూడ. కనుకనే క్రీస్తు స్నేహితులకొరకు ప్రాణాలు ధారవోయడమే ఉత్తమమైన ప్రేమ అన్నాడు. స్వార్థమానవునికీ పరార్థమానవునికీ ఎంత వ్యత్యాసం! స్వార్థపరుడు తోడి నరులనుండి ఏదో పొందగోరుతూంటాడు. వాళ్ల కష్టాలనుజూచి సానుభూతి చెందదు. అసలు వాళ్లగోడు విన్పించుకోడు. కాని పరార్థమానవుడు తోడినరులకు తానేదో ఈయగోరుతూంటాడు. కడకు వాళ్లకొరకు తన ప్రాణాన్నే సమర్పించుకొంటాడు.

మనది పారిశ్రామిక దేశం కాదు. మనదేశ ఆదాయం విశేషంగా వ్యవసాయంమీద ఆధారపడి వుంటుంది. మన ఆదాయంలో 46 శాతం వ్యవసాయం వల్లనే లభిస్తుంది. కాని ఈ వ్యవసాయరంగంలో దేశంలోని పనివాళ్లల్లో 70 శాతం వినియోగింపబడుతూన్నారు. ఇంతమంది ఈరంగంలో పనిచేయడంవల్ల వ్యవసాయ కూలీల వేతనాలు తగ్గిపోయాయి. వాళ్లు పనిచేయదగ్గ రంగమా మరొకటిలేదు. కనుక ఈ కష్టజీవులు కూలి చాలడం లేదని నెత్తీనోరూ బాదుకొంటూంటారు. ఐనా వీళ్ల గోడు వినేదెవడు? పైగా చాలమంది కూలీలకు కూలి సంఘాలంటూ లేవు. కూలీలకు అన్యాయం జరిగినప్పుడు వాళ్ల కొరకు పోరాడి వాళ్ల హక్కులను నిలబెట్టేవాళ్లు తక్కువ. కనుక ఈ వర్గం ప్రజలు ఎన్నో కడగండ్లకు లోనౌతుంటారు.

## 22. గొర్రెల కొరకు నా ప్రాణాన్నే సమర్పిస్తాను - యోహా 10,15

క్రీస్తు తన ప్రజల కొరకు ప్రాణాన్ని సమర్పిస్తానని చాలసార్లు చెప్పాడు. అతడు మంచి కాపరి, తన మందల కొరకు ప్రాణాలను బలి యిచ్చేవాడు. అతడు మంచి విత్తనం లాంటివాడు. ఆ విత్తనం భూమిలోపడి చివికిపోతేనేగాని మొలకెత్తి నూరంతలుగా ఫలించదు - యోహా 12,24. ఆ క్రీస్తులాగే మనంకూడ ప్రాణాలను సమర్పించేంతగా తోడి ప్రజలను ప్రేమించాలి.

మనదేశంలో ధనికులవద్ద బోలెడంత నల్లడబ్బు వుంది. ప్రభుత్వం లెక్కలోని కెక్కకుండా, పన్ను చెల్లించకుండా వుండే డబ్బును నల్లడబ్బు అంటారు. ఈలాంటి నల్లడబ్బు దేశంలో యాభైవేల కోట్లదాకావుంది. ఇది ధనవంతులు అక్రమంగా కూడబెట్టుకొన్నసొమ్ము. పేదలు డబ్బులేక బాధపడుతూంటే, ధనవంతులవద్ద ఈ నల్లడబ్బు నిష్ఫలంగా వుండిపోతుంటుంది.

## 23. మనంకూడ సోదరుల కొరకు ప్రాణాలర్పించాలి - 1యోహా 3,16

క్రీస్తు మనకొరకు ప్రాణాలర్పించాడు. ఆ ప్రభువు మనపట్ల చూపిన ప్రేమ అలాంటిది. క్రీస్తు ప్రేమను ఆదర్శంగా పెట్టుకొని మనంకూడ తోడిప్రజలను ప్రేమించాలి. క్రీస్తులాగే మనంకూడ తోడి ప్రజలకొరకు ప్రాణాలు అర్పించాలి. ఇది యోహాను ఇచ్చిన సందేశం. తోడి ప్రజలకొరకు మనం ప్రాణాలను సమర్పించాలని దివ్యగ్రంథం చెప్తూంటే, దౌర్జన్యంతో ఇతరులకు ముట్టవలసింది కూడ మన కొట్టేస్తూండడం ఎంతటిపాతకం!

ఈ దేశంలో వ్యాపారస్థులూ వర్తకులూ తూచే దొంగ కొలతలకూ కొలిచే దొంగ మానాలకూ అంతూపంతూ లేదు. వ్యాపారస్థులు వస్తువులను కొనుక్కొనే వాళ్లనుండి ఏటేట పదివేల కోట్ల రూపాయలు మోసంతో కొట్టేస్తూన్నారు. అందరూ పేదవాడి నోరుగొట్టి వృద్ధిలోనికి రావాలనుకొనేవాళ్లే. పెద్దచేప చిన్నచేపను మ్రింగివేసి తానింకా పెద్దదౌతూంటుంది. అలాగే ధనవంతులు పేదవాళ్ల కడుపుగొట్టి తామింకా ధనవంతులౌతూంటారు. ఇది తోడి ప్రజలకొరకు ప్రాణాలు సమర్పించడం గాదు, తోడిప్రజల ప్రాణాలు తీయడం. క్రీస్తుబోధకూ నరుల ప్రవర్తనకూ ఎంత వ్యత్యాసం!

## 24. నేను మీకు క్రొత్త ఆజ్ఞను ఇస్తూన్నాను - యోహా 13,34

ప్రభువు సోదరప్రేమను క్రొత్తఆజ్ఞ అని పేర్కొన్నాడు. పూర్వవేదం కూడ సోదరప్రేమను బోధిస్తుంది. కాని అక్కడ సోదరప్రేమను ఎందుకు పాటించాలో కారణం చెప్పలేదు. క్రీస్తు కారణం చెప్పాడు. ఏమిటి ఆకారణం? అతడు మనలను ప్రేమించినట్లే మనమూ ఒకరినొకరం ప్రేమించాలి. మన సోదరప్రేమకు కారణం ఆ క్రీస్తే. అతని ప్రేమే. అతని కొరకు మనం తోడి ప్రజలను ప్రేమించాలి. క్రీస్తు ఇచ్చిన ప్రేమాజ్ఞలోని నూతనత్వం ఇదే. ఇక, మనం ఎవరిని ప్రేమించాలి? అక్కరలో నున్న తోడి జనాన్ని ఆదుకోవాలి. విశేషంగా కూడూ గుడ్డా యిల్లూ లేని పేద ప్రజలను ఆదుకోవడం సోదరప్రేమ ఔతుంది. ఇది మన అందరి కర్తవ్యం కూడా.

మన దేశంలోని పిల్లలకు చాలినంత పోషకాహారం లభించడం లేదు. ఇండియాలోని మొత్తం ప్రజల్లో 15 ఏండ్ల లోపులో వున్న పసివాళ్లు 42 శాతం. అనగా

23 కోట్లమంది. పోషకాహారం లభించక పోవడంవల్ల ఈ పిల్లల్లో రెండున్నర కోట్లమంది గ్రుడ్డివాళ్ళయిపోతూంటారు. ఐదుకోట్లమంది మరణిస్తూంటారు. మిగిలిన పిల్లలు వ్యాధి బాధలకు లోనై చావకుండా బ్రతకకుండా జీవిస్తూంటారు. ఈనాటి బాలసంపదే రేపటి పౌరసంపద. బాల్యప్రాయంలో పోషకాహారం లభించని పిల్లలు ఇక జీవితమంతా అవిటి రకాలుగానే తయారౌతూంటారు. మరి ఈ పిల్లలందరినీ, విశేషంగా పేదసాదల బిడ్డలను పోషించేదెవరు?

## 25. మీరు ఒకరినొకరు ప్రేమిస్తే అప్పుడు నా శిష్యులుగా గణింపబడతారు - యోహా 13,35

క్రీస్తు శిష్యులకు గుర్తేమిటి? ఉపన్యాసాలు ఈయడంగాదు. గ్రంథాలు వ్రాయడం గాదు. అద్భుతాలు చేయడంగాదు. అన్నదానాలూ, గృహదానాలూ, భూదానాలూ చేయడంగాదు. విద్యాసేవ వైద్యసేవ చేయడమూకాదు. ఇవన్నీ మంచివే కాని వీటినన్నిటిని స్వార్థబుద్ధితోగూడ చేయవచ్చు. అందుకే క్రీస్తు వీటిని వేటినీ తన శిష్యుల లక్షణాలుగా పేర్కొలేదు. అతడు పేర్కొన్న లక్షణం ఒక్కటే. ఒకరినొకరు ప్రేమించడం. నేను తోడి మానవుణ్ణి - విశేషంగా పేదవాణ్ణి - అంగీకరించి ఆదరించి ప్రేమిస్తే అప్పుడు మాత్రమే క్రీస్తు శిష్యుణ్ణిగా గణింపబడతాను.

మన దేశంలోని పేదప్రజలు చాలమంది కర్మను సాకుగా జెప్తూంటారు. మాకర్మ వలన పేదవాళ్లంగా జీవిస్తున్నాం అంటూంటారు. ఇది పెద్ద పొరపాటు. నరుడు చేయవలసిన ప్రయత్నం చేయకుండా కర్మ సిద్ధాంతాన్ని నమ్ముకొని కూర్చోవడం వట్టి మౌఢ్యం. నరుడు వృద్ధిలోకి రావాలంటే పురుషకారమూ వుండాలి, దైవబలమూ వుండాలి. పురుషకారంలేందే దైవం తోడ్పడదు. అనగా స్వయంకృషి లేని నరుడు వృద్ధిలోకి రాడు. కనుక మన పేదప్రజలు కర్మ సిద్ధాంతాన్ని విడనాడి కార్యసాధనకు పూనుకోవాలి. పూర్వజన్మనుండి వచ్చే కర్మఫలం అనేది ఒకటి లేనేలేదు. కష్టపడి పనిజేసికొనేవాడు ఈనాడు గాకపోతే రేపైనా రాణించి తీరతాడు.

## 26. ఈ యత్యల్పుల్లో ఒకనికి తోడ్పడినప్పుడు నాకూ తోడ్పడినట్లే - మత్త 25,45

లోకాంతంలో ప్రభువు మంచివాళ్లకూ చెడ్డవాళ్లకూ న్యాయనిర్ణయం చేస్తాడు. ఇతరులకు కూడూ గుడ్డా యిల్లూ వాకిలీ మందూ మాకూ యిచ్చి తోడ్పడిన వారిని

ప్రభువు దీవిస్తాడు. కాని అలా తోడ్పడనివాళ్లను శపిస్తాడు. మీరు నాకే తోడ్పడలేదని వాళ్లను నిందిస్తాడు. అప్పుడు వాళ్లు "ప్రభూ నీవు మాయొద్దకు ఎప్పుడువచ్చావు, నిన్ను మేమెప్పుడు ఆదరించలేదు" అని అడుగుతారు. ప్రభువు వాళ్లతో "నా శిష్యుల్లో అత్యల్పులు మీయొద్దకు వచ్చారు. మీరు వాళ్లను ఆదరించలేదు. వాళ్లను ఆదరించనపుడు నన్ను ఆదరించనట్లే" అంటాడు. ఇక్కడ క్రీస్తు శిష్యులంటే క్రైస్తవులు మాత్రమేగాదు, నరమాత్రులంతాను. మనం పేదసాదలను ఆదరించాలి అనడానికి ఇంతకన్న ప్రబలతార్కాణం ఏమి కావాలి?

మన దేశంలోని మీది పదిశాతం ప్రజలు మహాధనవంతులు. వీళ్లకు ఉద్యోగాలూ, విద్యా, ధనమూ అన్నీ వున్నాయి. సాగునేలలో 56 శాతం వీళ్ల అధీనంలో వుంది. మనదేశపు జాతీయ ఆదాయంలో 3వ వంతు వీళ్లకే చెందుతుంది. ఇంజనియ్యరింగు వైద్యము మొదలైన వృత్తి కళాశాలల్లో చదివేవాళ్ళల్లో అధికభాగం వీళ్లపిల్లలే. ఐ సి యఫ్, ఐ ఎస్ ఎస్, ఐ పి యస్ ఉద్యోగుల్లో 80 శాతం వీళ్లే. కాని క్రింది 50 శాతం ప్రజలకు మాత్రం ఏ సదుపాయాలూ లేవు. కనుక వీళ్లు నిరుపేదల్లా జీవిస్తున్నారు. ఈ విధంగా దేశంలోని సదుపాయాలన్నీ మీది పదిశాతం ప్రజలు అనుభవించడమూ, క్రింది సగంశాతం ప్రజలు ఏ సదుపాయాలూ లేక మలమల మాడిపోవడమూ ఎంత దారుణం!

## 27. ఈ నా సోదరులలో అత్యల్పుడైన వానికి ఒకనికి తోడ్పడినప్పుడు నాకే తోడ్పడినట్లు - మత్త 25,40

మీదటి తుదితీర్పు సామెతనే ఇంకా పరిశీలిద్దాం. కొందరు ప్రభువు శిష్యులను ఆదరింపగా ప్రభువు వాళ్లు తన్నే ఆదరించినట్లుగా భావించాడు. వాళ్లను సంభావించి మోక్షాన్ని బహూకరించాడు. ఈ సామెత బోధించే భావాన్ని మనం చక్కగా గుర్తించాలి. బైబులు భగవంతుడు ఎక్కడో ఆకాశంలో వుండేవాడుకాదు. అతడు తన ప్రజలతో ఐక్యమై యుంటాడు. విశేషంగా పేదసాదల్లో జీవిస్తుంటాడు. కనుక మనం తోడి ప్రజలను ఆదరిస్తే ఆ భగవంతుణ్ణే ఆదరించినట్లు. తోడి ప్రజలను అనాదరం చేస్తే ఆ ప్రజల్లో నెలకొనివున్న భగవంతుణ్ణే అనాదరం చేసినట్లు. ఎప్పుడూ భగవంతుడూ ప్రజ కలిసి వుంటారు. ప్రజను ఏచూపున చూస్తామో భగవంతుణ్ణికూడ అదే చూపున చూచినవాళ్లమౌతాం. కనుక ప్రజలకు అన్యాయంచేసి దేవుణ్ణి పూజిస్తే లాభంలేదు.

నేటి పేదల పాట్లను తెలిసి కోవాలంటే రూపాయి కొనుగోలు విలువనుకూడ గమనించాలి. 1954లో మన రూపాయి కొనుగోలు విలువ 99 పైసలు. 1956లో 95 పైసలు. అప్పటి నుండి రూపాయి విలువ ఏటేటా దిగజారిపోతూ వచ్చింది. 1975లో

రూపాయి కొనుగోలు విలువ 26 పైసలు మాత్రమే. ఇప్పుడు 15 పైసలు. పేదవాడు రూపాయి తీసుకొని అంగడికి వెళ్తే వాడికి ఇప్పుడు 15పైసలు విలువగల వస్తువులు మాత్రమే లభిస్తాయి. వాడి జేబులో ఎన్ని రూపాయలుంటాయి? వాని చేతిలోనికి ఎన్ని వస్తువులు వస్తాయి? వాడి యింటిలో జనమెంతమంది? వాడి కుటుంబం బ్రతికేదెలా? పేదవాడి బాధలు ధనవంతులకేలా అర్థమౌతాయి?

## 28. భగవంతుడు ప్రేమమయుడు - 1యో 4,8.

భగవంతుని గుణాలన్నిటిలోను ముఖ్యమైంది ప్రేమ. అతడు ప్రప్రధానంగా ప్రేమమయుడు. ఇక, ఈ భగవంతుడు నరుణ్ణి తనకు పోలికగా కలిగించాడు. కనుక భగవంతుని గుణాలే నరునిలోను వుండాలి. అనగా నరుడుకూడ ఆ భగవంతునిలాగే ప్రేమమయుడై యుండాలి. అందుకే భగవంతుడు పరిశుద్ధాత్మ ద్వారా తన ప్రేమను మన హృదయాల్లో కుమ్మరిస్తుంటాడు - రోమా 5,5. ఈ దివ్యాత్మ ద్వారా భగవంతునిలో వుండే ప్రేమే ఘనలోనూ వేరు పాతుకొంటుంది. ఆ ప్రభువులాగే మనమూ ప్రేమ జీవితం జీవిస్తాం. ఆ భగవంతునిలాగే మనమూ ప్రప్రధానంగా ప్రేమ మూర్తుల మౌతాం. కాని స్వార్థం వల్ల నరుడు తనలోని యీ ప్రేమశక్తిని చంపివేస్తుంటాడు. తోడి మానవులను ప్రేమించడానికి మారుగా వాళ్లను ద్వేషిస్తుంటాడు.

మీదటి అంశాల్లో మనదేశంలో కన్పించే సాంఘిక అన్యాయాలను పరిశీలించాం. ప్రపంచంలోని వివిధ జాతుల్లోగూడ చాల అన్యాయం వుంది. జాతీయరంగంలో కంటే అంతర్జాతీయ రంగంలో సాంఘిక అన్యాయం ఎక్కువ. ప్రపంచ జనాభా వేయి కోట్లు. ఈ జనాభాలో ధనిక జాతులు నాల్గవ వంతు మాత్రమే. పేదజాతులు మూడు పాళ్లు. కాని 25 శాతం మాత్రమే ఐన ధనిక జాతులు ప్రపంచ సంపదలో 85 శాతం అనుభవిస్తున్నారు. 75 శాతమైన పేదజాతులు ప్రపంచ సంపదలో 15 శాతంమాత్రమే అనుభవిస్తున్నారు. అదేమంటే ధనిక జాతులు పేదజాతులను సంతాన నిరోధాన్ని పాటించమని సలహాయిస్తున్నారు. కాని పేదజాతులు సంతాన నిరోధాన్ని పాటించడంకాదు పరిష్కార మార్గం. మరి ధనిక జాతులు అక్రమంగా స్వాధీనం చేసికొన్న ప్రపంచ సంపదను పేద జాతులకు పంచియీయడం.

## 29. ప్రేమలేనివాడనైతే అంతా వ్యర్థమే - 1కొ 13,2

పౌలు కొరింతీయులకు వ్రాస్తు మనుష్యుల భాషలోను దేవదూతల భాషలోను మాటలాడే వక్తృత్వశక్తి కన్న, ప్రవచనము జ్ఞానము విశ్వాసము మొదలైన దివ్యశక్తులకన్నా, ఆస్తిపాస్తులను పేదసాదలకు పంచియీయడమనే దానశక్తికన్న సోదరప్రేమ గొప్పశక్తి అన్నాడు. ఆ శక్తులన్నీ వున్నా ప్రేమశక్తి లేకపోవచ్చు. ప్రేమశక్తి ఒక్కటుండి ఆ శక్తులన్నీ

లేకపోవచ్చుగూడ. కనుక మనలను రక్షించేదీ, మనలను భగవంతునిలాంటి వాళ్లను చేసేదీ ప్రేమ ఒక్కటే. అనగా తోడిమానవుణ్ణి ఆదరించేవాడే నరుడు. వాడే భగవంతుణ్ణి పొందేవాడు. తోడిమానవుణ్ణి ఆదరించనివాడు రాక్షసుడు. వాడు పిశాచాన్ని పొందుతాడు.

ప్రపంచ జనాభాలో నాల్గవవంతు మాత్రమే ఐన ధనికజాతులు ప్రపంచంలో ఉత్పత్తి అయ్యే సంపదలో 87 శాతం కొట్టేస్తున్నారు. ప్రపంచ జనాభాలో మూడువంతులు ఐన పేద జాతులు మిగతా 13 శాతం మాత్రమే పొందగల్గుతున్నారు. ధనిక జాతుల వాళ్లు ప్రపంచంలోని గొప్ప శాస్త్రపరిశోధనా కేంద్రాల్లో 98శాతం నడిపిస్తున్నారు. పేదజాతులవాళ్లు మిగతా 2శాతం కేంద్రాలను మాత్రమే నడిపిస్తున్నారు. ఈ పరిశోధనా కేంద్రాలు కనుగొనే నూత్న సూత్రాలవల్ల ధనికజాతులే లాభం పొందుతున్నారు. ప్రపంచ వ్యాపారంలోను పెట్టుబడిలోను 80శాతం ధనికజాతుల అధీనంలో వున్నాయి. 20 శాతం పేదజాతుల అధీనంలో ఉన్నాయి. ధనికజాతులు వాళ్లరాజ్యాంగ సూత్రాలనూ వాళ్ల భావాలనూ పేదజాతుల మీద రుద్దుతుంటారు. పేదజాతులు విద్యావిధానమూ రాజకీయ విధానమూ ధనికజాతులను అనుకరిస్తుంటాయి. ఈ విధంగా ప్రపంచంలోని ధనికజాతులు పేదజాతులను బానిసలుగా జేసికొని ఏలుతుంటారు.

## 30. సోదరప్రేమ జీవమూ, సోదర ద్వేషం మరణమూ - 1యోహా 3,14

సోదరప్రజను ప్రేమించేవాడు జీవాన్ని, అలా ప్రేమించనివాడు మృత్యువునీ పొందుతాడు. సోదరప్రేమ వెలుగు, అది లేకపోవడం చీకటి. సోదరప్రేమగల మానవులు దేవుని బిడ్డలు, అదిలేనివాళ్లు పిశాచం బిడ్డలు. సోదరప్రేమను పాటించడమనగా సత్యాన్ని పల్కడం. దాన్ని పాటించక పోవడమనగా అబద్ధమాడడం. సోదరప్రేమను పాటించడమనగా దేవుణ్ణి తెలిసికోవడం, దాన్ని పాటించక పోవడమనగా దేవుణ్ణి తెలిసికోలేకపోవడం. ఇవన్నీ యోహాను తొలిజాబులోని భావాలు. ఈ భావాలను బట్టి సోదరప్రేమ ఎంత విలువైందో విశదమౌతూంది గదా!

ప్రపంచంలో నాల్గవ వంతు ధనిక జాతులూ, మూడువంతులు పేదజాతులూ అన్నాం. అంతర్జాతీయ సూత్రాలను అమలుపరచేవాళ్ళు ధనిక జతులే. పేదజాతులు ధనిక జాతులు విధించే రాజ్యాంగ సూత్రాలకు కట్టుపడి వుండాలి. అంతర్జాతీయ సంస్థలన్నీ ధనిక జాతుల చేతుల్లోనే వున్నాయి. ఈ సంస్థల్లో పేద జాతులకు అట్టే ప్రాబల్యం లేదు. అంతర్జాతీయ న్యాయస్థానాలుకూడ ధనిక జాతుల అధీనంలో వున్నాయి. కనుక పేద జాతులకు అట్టే న్యాయం జరగడం లేదు. అంతర్జాతీయ ఆర్థిక వ్యవహారాలూ వర్తకమూ ధనిక జాతుల వశంలో వున్నాయి. పేదజాతులు తమలో తాము పోట్లాడుకొంటూ వుంటారు, అంతే. ఈ విధంగా ఒక్క మనదేశంలోనేకాదు, ప్రపంచంలోకూడ ధనవంతుడు పేదవాణ్ణి ఏలుతున్నాడు. ఉన్నవాడు లేనివాని రొమ్ము మీద కాలు మోపి వాణ్ణి లేవనీకుండా

అణగద్రొక్కేస్తున్నాడు. ఇంకో విషయం. పై ధనిక జాతుల వాళ్లంతా క్రైస్తవులే. ఒకవైపు క్రైస్తవమతాన్ని పాటిస్తూనే మరోవైపు వీళ్లు ఇన్ని అత్యాచారాలు చేస్తున్నారు. క్రీస్తు తోడి ప్రజలను ప్రేమించమన్నాడా, పీడించమన్నాడా? మరి వీళ్ళు క్రీస్తు బోధలను ఏయేటిలో గలిపినట్లు?

## 31. ప్రజలు మీ సత్కార్యాలను చూచి పరలోకం లోని మీ తండ్రిని సన్నుతించాలి - మత్త 5,16

సాంఘిక న్యాయం అనేది వట్టి మాటలవల్ల అయ్యేదికాదు. కేవలం సానుభూతి వల్లా అయ్యేదికాదు. మరి సత్కార్యాలవల్ల అయ్యేది. అనగా ఉన్నవాడు లేనివాణ్ణి హృదయపూర్వకంగా ఆదుకోవాలి. తనకున్నదాన్ని లేనివాడికి కొలదిగానైనా పంచి ఈయాలి. ఈలా వున్నవాళ్ళు సత్కార్యాలు చేస్తుంటే చూచి ప్రజలంతా పరలోకంలోని తండ్రిని సన్నుతిస్తారు.

మీదటి అంశాల్లో ఇండియాలో నైతేనేమి ప్రపంచంలో నైతేనేమి కన్పించే సాంఘిక అన్యాయాన్ని వివరించాం. ప్రపంచం మొత్తంలో ఇంచుమించు 10శాతం ధనికులు. 90శాతం పేదవాళ్లు. కాని ఈ ధనికులు 10శాతం ప్రపంచ సంపదలో 80 శాతం అనుభవిస్తున్నారు. ఇక పేదవాళ్లయిన 90 శాతానికీ మిగిలంది 20 శాతం సంపదలు మాత్రమే. ఇది సాంఘిక అన్యాయం. ఇంతమంది పేదవాళ్లు ఈలా ఎందుకు బాధపడవలసి వచ్చింది? ప్రపంచం పేదది కావడంవల్ల కాదు. పాడిపంటలూ ఖనిజసంపదలూ లోపించడం వల్ల కాదు. ప్రజలు కష్టపడి పనిచేయకపోవడంవల్లా కాదు. మరి దేనివలన? మోసంవల్ల నైతేనేమి, దౌర్జన్యం వల్ల నైతేనేమి, ప్రపంచంలో ఉత్పత్తి అయ్యే సంపదలను కొంతమంది మాత్రమే కొట్టేస్తున్నారు. వాటిని మిగతావాళ్లకు దక్కనీకుండా చేస్తున్నారు.

కనుక ప్రధానమైన సమస్య దేశం దరిద్రమై పోవడంగాదు. ఈ దేశంలో ఉత్పన్నయ్యే సంపదను ప్రజలు ఏలా పంచుకొంటున్నారు అన్నది నిజమైన సమస్య. దేశంలో ఉత్పన్నమయ్యే సంపదను అందరూ కలిసిపంచుకొంటే ఇక ధనిక వర్గాలు పేదవర్గాలు అనే వ్యత్యాసాలు ఉండవు. కాని ఆ శుభదినం ఎప్పుడువస్తుందో! అసలు వస్తుందా?

ఇక, ఇతరులను సంస్కరించడానికి పూనుకోకముందు మనలను మనం సంస్కరించుకోవాలి. సాంఘిక న్యాయాన్ని గూర్చి మాటలాడేపుడు ఈ సూత్రాన్ని మరచిపోగూడదు. కొలదిగానో గొప్పగానో మనం కూడా సాంఘిక అన్యాయంలో పాల్గొంటూనే వుంటాం. పెద్దగానో కొద్దిగానో మనంకూడ ఇతరులను పీడిస్తూనే వుంటాం. కనుక ఈ విషయాన్ని గూర్చి చిత్తశుద్ధితో మనకుమనమే ఆత్మవిచారం చేసికొందాం.

# 5. దైవప్రజలు

బైబులు భాష్యం - 61

## విషయ సూచిక



**మనవిమాట**

వాటికన్ మహాసభ గృహస్థుల నాయకత్వాన్ని ప్రోత్సహించింది. కనుక తిరుసభలో గృహస్థుల స్థానమూ, ఆ సభకు వాళ్ళు చేయవలసిన సేవలూ మొదలైన సమస్యలను గూర్చిన దైవశాస్త్రాంశాలు మన విశ్వాసులకూ గురువులకూ గూడ క్షుణ్ణంగా తెలిసి వుండాలి. గృహస్థులకు నాయకత్వపు తర్ఫీదునిచ్చేపుడు ఈ యంశాలు అవసరమౌతాయి. ఈ రంగంలో తెలుగులో మన కుపయోగపడే పుస్తకాలు ఏమీ లేవు. అందుకే ఈ చిన్ని పొత్తాన్ని తయారు చేసాం.

# 1. బైబులు బోధలు

ఈ మొదటి అధ్యాయంలో దైవప్రజను గూర్చి బైబులు బోధించే అంశాలను పరిశీలిద్దాం. మొదట పూర్వ వేదాంశాలనూ తరువాత నూత్నవేదాంశాలనూ విలోకిద్దాం.

## 1. పూర్వవేద ప్రజలు

### 1. ఎన్నికా నిబంధనలద్వారా

ఎన్నికా నిబంధనలద్వారా యూదులు దైవ ప్రజలయ్యారు. ఈ విషయాన్ని గూర్చి ద్వితీయోపదేశకాండ ఈలా చెప్తుంది. "మీరు ప్రభువుకి పవిత్ర ప్రజలు. అతడు ఈ భూమిమీది జనులందరిలోను మిమ్మే తన సొంత ప్రజలనుగా యెన్నుకొన్నాడు. మీరు ఇతరజాతులకంటె అధిక సంఖ్యాకులన్న తలంపుతో అతడు మిమ్ము ఎన్నుకోలేదు. మీరు జాతులన్నిటిలోను స్వల్పసంఖ్యాకులు. మరి యతడు స్వయంగా మిమ్ము ప్రేమించాడు కనుక, మీ పితరులతో తాను చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకో గోరాడు కనుక, మిమ్మే

యెన్నుకొన్నాడు" 7, 6-9. ప్రభువుప్రజలు కావడానికి యూదులకు ప్రత్యేకార్హత యేమీలేదు. ఇతర జాతులకంటె వాళ్ళు యోగ్యులేమీ కాదు. ఐనా అతడు స్వయంగా ఆ ప్రజను ప్రేమించాడు. కనుక వాళ్ళను ఎన్నుకొని తన సొంత ప్రజను చేసికొన్నాడు.

అలా యెన్నుకొనిన ప్రజను ప్రభువు ఐగుప్తు దాస్యం నుండి విడిపించాడు. సీనాయి కొండదగ్గర వాళ్ళతో నిబంధనం చేసికొన్నాడు. ఈ నిబంధనాన్ని గూర్చి నిర్గమకాండం ఈలా చెప్తుంది. "నేను ఐగుప్తు ప్రజలకు ఏమిచేసానో మీరు కన్నులార చూచారు. గరుడపక్షి తన పిల్లలను రెక్కలమీద మోసికొని పోయినట్లే నేనూ మిమ్ము మోసికొనివచ్చి నా చెంతకు చేర్చుకొన్నాను. దీనిని బట్టి మీరు ఓ సంగతి గమనించండి. మీరు నా మాట విని నా నిబంధనను శ్రద్ధగా పాటిస్తే సకల జాతులలోను మీరే నావారూ, నా సొంత ప్రజలూ ఔతారు. ఈ భూమండలమంతా నాదేకదా! మీరే నాకు యాజకరూపరాజ్యం. మీరే నా పవిత్ర ప్రజ" - 19, 4-6. అనాడు భూమిమీద నానాజాతులుండగా ప్రభువు యిస్రాయేలీయులనే తన సొంత ప్రజగా ఎన్నుకొని వారితో నిబంధనం చేసికొన్నాడు. దాని ఫలితంగా వాళ్ళు ప్రభువుని కొల్చే ప్రజలయ్యారు. అతనికి యాజకులయ్యారు. పూర్వం వాళ్ళు ఫరోని సేవించే బానిసలు. కాని యిప్పుడు యావేను సేవించి అతన్ని అర్చిస్తారు. అందువల్ల వాళ్ళు పవిత్రులౌతారు. యావే వాళ్ళకు దేవుడౌతాడు. తాము అతని ప్రజలౌతారు.

ఈ రీతిగా యూదులు ఎన్నికా నిబంధనలద్వారా దైవప్రజలయ్యారు.

## 2. పూర్వవేద ప్రజల బిరుదాలు

యూదులు దైవప్రజలైనందున వాళ్ళకు అనేక బిరుదాలు లభించాయి. ప్రస్తుతం వాటిల్లో కొన్నిటిని పరిశీలిద్దాం.

1. పవిత్రప్రజ - ద్వితీ 7, 6. యూదులు కొలిచే దేవుడు పవిత్రుడు. కనుక అతనిలాగే అతని భక్తులుకూడ పవిత్రులై యుండాలి - లేవీ 19,2.
2. దేవుని సొంతప్రజలు - నిర్గ 19,5. ఆ రోజుల్లో ఓ ఆచారముండేది. దేశమంతా రాజుదే. ఐనా ఆ దేశంలో కొంతభూమిని రాజుకి ప్రత్యేకంగా కేటాయించే వాళ్ళు. ఆ భూమినుండి వచ్చే ఆదాయాన్ని రాజు స్వయంగా అనుభవించేవాడు. అది అతని ప్రత్యేకభూమి. అలాగే ఈ భూమండలమంతా యావేదే. ఈ లోకంలోని జాతులన్నీ అతనివే. ఐనా అతడు ఆ జాతుల్లో ఒక దాన్ని తన ప్రత్యేక ప్రజనుగా ఎన్నుకొన్నాడు. వాళ్ళే యూదులు. ఆజాతి అతనికి సొంతప్రజలై అతని ఆదరాభిమానాలను చూరగొంటారు.

3. వారసంగా లభించిన ప్రజలు - నిర్గ 34,9. కుమారునికి తండ్రినుండి ఆస్తిపాస్తులు వారసంగా లభిస్తాయి. ఆ వారసాన్ని అతడు అమూల్యంగా యెంచుతాడు. ప్రీతితో జూచుకొంటాడు. ప్రభువు యిస్రాయేలీయులను ఫరో దాస్యంనుండి విడిపించడం ద్వారా వాళ్ళు అతనికి వారసపు ఆస్తి అయ్యారు. అనగా ఆ ప్రభువుకి వాళ్లు విలువకలవాళ్లు, ప్రీతిపాత్రులు ఔతారని భావం.

4. ప్రభువు మేపే మంద - కీర్త 95,7. కాపరి తన మందను శ్రద్ధతో మేపుతాడు. అలాగే ప్రభువుకూడ తన మందయైన యిస్రాయేలీయులను ఆదరంతో కాచి కాపాడతాడు.

5. ప్రభువు పెంచే ద్రాక్షతోట - యెష 5,1. కాపు తన పొలాన్ని సాగుచేసి దానిలో ద్రాక్షలు పెంచుతాడు. ప్రభువుకూడ తన ప్రజను సొంత తోటనులాగ పరామర్శిస్తాడు అని భావం.

6. ప్రభువుకి పుత్రుడు - నిర్గ 4,22. ఎన్నికద్వారా యిస్రాయేలు ప్రభువుకి పుత్రుడయ్యాడు. అతడు ఫరో పుత్రుణ్ణి వధించి తన పుత్రుడైన యిస్రాయేలుని కాపాడాడు. ఆ ప్రజలు అతనికి ప్రీతిపాత్రులయ్యారని భావం.

7. ప్రభువు వధువు - యిర్మీ 2,2. వరుడు తన వధువుని అనురాగంతో జూచుకొంటాడు. అలాగే ప్రభువు యిస్రాయేలుని ప్రేమతో ఆదరిస్తాడు.

8. యాజకరూపరాజ్యం - నిర్గ 19,6. యిస్రాయేలీయులు ఫరోను కొల్వడం మాని యావేను కొలుస్తారు. అతనికి అర్చకులౌతారు. అతని పావిత్ర్యంలో తామూ పాలుపొందుతారు. అన్యజాతుల్లా కాకుండ తాము పవిత్ర ప్రజగా రూపొందుతారు.

9. ప్రభువుకి సాక్షులు - యెష 44,8. యిస్రాయేలీయులు ప్రభువు ఆజ్ఞలు పాటిస్తూ అతని మార్గాల్లో నడుస్తారు. ఇతరజాతులకు ఆ ప్రభువుని చాటిచెప్తారు. అన్యులను ఆ ప్రభువు దగ్గరికి ఆకర్షిస్తారు. ఈరీతిగ అతనికి సాక్షులౌతారు.

పైన పేర్కొన్న యిస్రాయేలీయుల బిరుదులన్నీ నూత్న వేదంలో క్రైస్తవప్రజకు కూడ వర్తిస్తాయి.

## 3. పూర్వవేద ప్రజల లక్షణాలు

పూర్వవేద ప్రజలకు కొన్ని లక్షణాలు చెల్లుతాయి. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

1. జాతి నియమం. యిస్రాయేలీయులు యూదజాతికి చెందినవాళ్లు. పితరులైన అబ్రాహాము, ఈసాకు, యాకోబు ఈ జాతికి మూలపురుషులు. - యెష 63, 16. కాలక్రమంలో అన్యజాతులవాళ్ళుకూడ వచ్చి యిస్రాయేలీయులలో

కలసిపోయారు - నిర్గ 12,38. కాని యెవరైనాసరే యూదజాతిలో చేరిపోతేనేగాని దైవప్రజలయ్యేవాళ్లు కాదు. పూర్వవేదానికి ఈ జాతి నియమం ముఖ్యం. నూత్న వేదప్రజకు జాతినియమం లేదు.

2. వివిధ నియమాలు. యిస్రాయేలీయులకు సున్నతి ఆచారముండేది. ఇదిలేందే ఎవడుకూడ దైవప్రజల్లో చేరలేడు. యిస్రాయేలీయుణ్ణి ఎవరైనా చంపితే హతుని దగ్గరిబంధువు హంతకుణ్ణి చంపివేయాలి - సంఖ్యా 35,19. ఎవడైనా సంతానంలేకుండా చనిపోతే అతని భార్య తన పెనిమిటి సోదరుని కూడి బిడ్డను కనవచ్చు. ఆబిడ్డ చనిపోయిన పురుషుని బిడ్డగా పరిగణింపబడతాడు. ఇదే దేవరన్యాయం - ద్వితీ 25, 5-6. అన్యజాతులను జూచి యిస్రాయేలీయులుకూడ రాచరికాన్ని ఏర్పాటు చేసికొన్నారు - 2సమూ 2,4. ఇంకా యూదులకు ధర్మశాస్త్రముండేది. ఇది వాళ్ళను క్రీస్తురాకడకు సిద్ధంచేసింది - గల 3,24. ఈలాంటి వివిధ నియమాలతో జీవించినవాళ్ళు యూదులు.

3. దేవుడు నడిపించాడు. యిస్రాయేలు పితరులు చాల తావులు తిరిగారు. ఆ ప్రజలు ఐగుప్తులో బందీలయ్యారు. ఆ దాస్యాన్నుండి తప్పించుకొని రాజులను చాలమందిని జయించి వాగ్దత్తభూమిని వశంచేసికొన్నారు. అక్కడినుండి మళ్లా బాబిలోనుకు బందీలుగా వెళ్లారు. మళ్లా తిరిగివచ్చి యెరూషలేముని పునర్నిర్మించుకొన్నారు. ఈ సుదీర్ఘచరిత్రలో ప్రభువే ఆ ప్రజలను నడిపిస్తూవచ్చాడు. అతని హస్తం ఆదుకోకపోయినట్లయితే వాళ్లు ఏనాడో, ఏ గండంలోనో చిక్కి అణగారి పోయివుండేవాళ్లు - యెష 68, 8-14.

4. వాగ్దత్త భూమి. ప్రభువు కనాను మండలాన్ని యూదులకు వారసంగా యిచ్చాడు. ఆభూమిని వాళ్లు పరమానందంతో భుక్తంచేసికొన్నారు. దేశ రాజధానియైన యెరూషలేములో వాళ్ళ దేవళముండేది. పండ్రెండు తెగలవాళ్ళు ఉత్సాహంతో ఆ దేవళానికి యాత్రలు చేసేవాళ్లు. అక్కడ దేవుణ్ణి కొల్చుకొనే వాళ్ళు - కీర్త 122, 1-4. వాగ్దత్తభూమి పేరుమీదిగా యెరూషలేము నగరం పేరుమీదుగా, దేవాలయం పేరు మీదిగా యూదులంతా ఐక్యమయ్యేవాళ్ళు.

5. హీబ్రూభాష. యూదులకొక ప్రత్యేకమైన భాషవుంది. ప్రభువు తన పలుకులను ఈ భాషలోనే విన్పించాడు. ఆ పలుకులన్నిటినీ వాళ్ళు గ్రంథస్థం చేసికొన్నారు. హీబ్రూభాషా, ఆ భాషలో వెలసిన బైబులు గ్రంథమూ ఆ ప్రజలకు ఐక్యతను చేకూర్చిపెట్టాయి.

6. ఆరాధన సమాజం. యూదులు సమాజంగా గూడి దేవుణ్ణి పూజించేవాళ్లు. ఆ యారాధనంగూడ వాళ్ళను ఐక్యపరచింది. ఆ యారాధన సమాజాన్నే పూర్వవేదం "దైవసమాజం" అని పిల్చేది. తర్వాత ఇదే నూత్న వేదంలో శ్రీసభ ఐంది.

## 4. నూత్న ప్రజను గూర్చిన ప్రవచనాలు

పాతప్రజలైన యిస్రాయేలీయులు దేవుని ఆజ్ఞలుమీరి పాపం కట్టుకొన్నారు. వాళ్ళు ప్రభువు ఆశించినట్లుగా పవిత్రజీవనం గడపలేదు. కనుక ప్రభువు వాళ్లను పరిత్యజించాడు. మరోప్రజను ఎన్నుకోవాలని నిర్ణయించుకొన్నాడు. వారితో తాను నూత్నంగా నిబంధనం చేసికోగోరాడు. పూర్వవేద ప్రవక్తలు ఈ నూత్న ప్రజనూ, నూత్న నిబంధననూ గూర్చి చాల ప్రవచనాలు చెప్పారు. వాటిల్లో మూడింటిని పేర్కొందాం.

ప్రభువు తన ఆత్మద్వారా ప్రజల హృదయాలు మారుస్తాడు. వాళ్లల్లోని రాతి గుండెలను తొలగించి వాటిస్థానే మాంసపు గుండెను నెలకొల్పుతాడు. ఫలితంగా ప్రజలు దేవునికి విధేయులై దైవాజ్ఞలను పాటిస్తారు - యెహెజ్కేలు 36, 26-27. ప్రభువు ప్రజల్లోనుండి పవిత్రులైన వారిని వేరుపరుస్తాడు. వారిని శేషజనంగా తయారు చేస్తాడు. తరువాత మెస్సియా ఉద్భవించేది ఈ వర్గం వాళ్ళనుండే - యెష 10, 20-22. ప్రభువు ఈ వర్గంవాళ్ళతో నూత్న నిబంధనం చేసికొంటాడు. ఈమారు అతని ధర్మవిధులు రాతిపలక మీదకాక ప్రజల హృదయాలమీదనే లిఖింపబడతాయి. కనుక పూర్వ ప్రజలవలెకాక ఈ నూత్న ప్రజలు దేవుని ఆజ్ఞలను శ్రద్ధతో పాటిస్తారు - యిర్మీ 31-31-34. పూర్వ ప్రజలకంటె విధేయులూ ఆజ్ఞాబద్ధులూ పవిత్రులూ ఐన నూత్న ప్రజలు ఉద్భవిస్తారని ఈ ప్రవచనాల భావం.

పూర్వవేద ప్రజలు యూదజాతికి మాత్రమే చెందినవాళ్ళని చెప్పాం. నూత్న ప్రజలమీద ఈలాంటి ఆంక్షయేమీ లేదు. అన్ని జాతులవాళ్ళూ యిస్రాయేలీయుల్లో చేరవచ్చు. "ఆరోజుల్లో చాలా జాతులవాళ్ళు వచ్చి మనం ప్రభువు పర్వతానికి ఎక్కిపోదాం. అతడు తన ఆజ్ఞలను మనకు బోధిస్తాడు. మనం అతని మార్గాల్లో నడుద్దాం అని చెప్పుకొంటారు" అన్నాడు యెషయా -2, 2-3. అనగా అన్నిజాతులవాళ్ళూ ఈ నూత్న జనంలో చేరిపోతారని భావం. ఈ జాతులవాళ్ళందరూ అబ్రాహాము పొందిన దీవెనల్లో తామూ పాలుపొందుతారు. ఇంకా ఓ గొప్ప సేవకుడుకూడ బయలుదేరి వస్తాడు. అతని మధ్యవర్తిత్వం ద్వారానే నూత్న నిబంధనం ఏర్పడుతుంది. అతడు అన్యజాతులకు జ్యోతిగా వుంటాడు - యెష 42,6.

ఈలాంటి ప్రవచనాల ద్వారా నూత్న వేదప్రజకు రంగంసిద్ధమయింది. ఇక మెస్సీయా మరణోత్థానాల ద్వారా ఈ ప్రజ ఉద్భవిస్తుంది.

# 2. నూత్నవేద ప్రజలు

## 1. క్రైస్తవ ప్రజల యెన్నిక

మానవజాతిని రక్షించడానికి తండ్రి తన కుమారుడైన క్రీస్తుని పంపాడు. ఆ క్రీస్తు తన మరణోత్థానాలద్వారా నరజాతి పాపం తొలిగించి వారిని రక్షించాడు. ఆ ప్రభువు మన పాపాలకు మరణానికి గురయ్యాడు. మనలను పాపరహితులనుగా చేయడానికి ఉత్థానుడయ్యాడు - రోమా 4,25. ప్రభువు తన సిలువ మరణంద్వారా నూత్ననిబంధనను ఏర్పరచాడు. కనుకనే అతడు "ఇది అనేకుల పాపపరిహారం కొరకు చిందబడనున్న నూతన నిబంధనం యొక్క నా రక్తం" అని పల్కాడు - మత్త 26,28. పైన యిర్మీయా ప్రవక్త పేర్కొన్న నూతన నిబంధనం ఇదే - 31,31.

మనం క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందడంద్వారా అతని ప్రజలమౌతాం. పూర్వవేదప్రజలు ఎన్నికా నిబంధనలద్వారా యావే ప్రజలయ్యారని చెప్పాం. నూత్నవేదంలో జ్ఞానస్నానం ఆ యెన్నికా నిబంధనలకు సమానం. ఈ జ్ఞానస్నానంద్వారా, పూర్వవేదంలో యిస్రాయేలీయులకు సంక్రమించిన బిరుదులన్నీ నూత్న వేదంలో మనకూ సంక్రమిస్తాయి. వాళ్ళలాగే మనంకూడ ఎన్నుకోబడిన జాతి, రాచరికపు గురుకులం, పవిత్రజనం, దేవుని సొంతప్రజ ఔతాం - 1 పేత్రు 2,9.

యూదులకు జాతి ముఖ్యమని చెప్పాం. నూత్న వేదప్రజలమైన మనకు జాతి ముఖ్యం కాదు. కేవలం క్రీస్తుని విశ్వసించడం ద్వారా మాత్రమే మనం నూత్నవేదప్రజలమౌతాం. కనుకనే తొలినాటి క్రైస్తవ సమాజంలో యూదులూ అన్యజాతివాళ్ళూ కూడ చేరారు. పౌలు "క్రీస్తుని విశ్వసించడం వలన మీరందరూ దేవుని పుత్రులయ్యారు. క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందిన మీరంతా అతన్ని ధరించారు. కావున మీలో యూదుడు అన్యుడు, బానిస స్వతంత్రుడు, పురుషుడు స్త్రీ అనే విభేదం లేదు. క్రీస్తులో మీరందరూ సరిసమానమే" అని వ్రాసాడు - గల 3, 26-28.

తండ్రి పూర్వవేద ప్రజలను తిరస్కరించి నూత్నవేద ప్రజలను ఎన్నుకొన్నాడని చెప్పాం. ఆ ప్రజల బిరుదాలన్నీ మనకుగూడ సంక్రమిస్తాయని చెప్పాం. కనుకనే మనం దేవుని యిస్రాయేలీయులం - గల 6,16. అబ్రాహాము సంతానానిమి - గల 3, 29. నిజమైన సున్నతిని పొందిన వాళ్ళం - ఫిలి 3,3. నూత్న దేవాలయానిమి - 1కొ 3, 16.

గొర్రెపిల్ల వధువుమి - ప్రక 19,7. ఈ బిరుదాలన్నీ మొదట యిస్రాయేలీయులకు చెందినవి. తర్వాత క్రైస్తవులకు చెందుతాయి.

## 2. నూత్నవేద ప్రజల యాజకత్వం

క్రీస్తు యాజకుడు, రాజు, ప్రవక్త. అతనిలోనికి జ్ఞానస్నానం పొందినపుడే మనకుగూడ ఈ మూడు లక్షణాలు సంక్రమిస్తాయి. అతనిద్వారా మనంకూడ యాజకులమూ, రాజులమూ, ప్రవక్తలమూ ఔతాం. వాటిలో యాజకత్వం చాల ముఖ్యమైంది. కనుక మొదట ఈ లక్షణాన్ని గూర్చి విచారిద్దాం.

పూర్వవేద ప్రజలు ఎన్నికద్వారా దేవుణ్ణి కొల్చేయాజకరూపమైన రాజ్యం అయ్యారని చెప్పాం - నిర్గ 19,6. నూత్నవేద ప్రజలమైన మనంకూడ జ్ఞానస్నానం ద్వారా రాచరికపు గురుకులాని మౌతాం -1 పేత్రు 2,9. అనగా ఆ యూదప్రజలాగే మనంకూడ దేవుణ్ణి పూజించేవాళ్ళమౌతాం. దేవునికి అర్చకులమౌతాం. అతన్ని అర్చించడం ద్వారా పవిత్రులమౌతాం. మన అర్చనం ప్రధానంగా బలిని సమర్పించడంలో వుంది. పూర్వవేదప్రజలు తమ అర్చనంలో జంతుబలిని సమర్పించేవాళ్ళు. అది భౌతికమైన బలి. కాని మన బలి ఆధ్యాత్మికమైంది. అనగా మనం క్రీస్తునే బలిగా అర్పిస్తాం. మనం యేసుక్రీస్తుద్వారా తండ్రికి ప్రీతికరమైన ఆధ్యాత్మిక బలులను అర్పించే యాజకులం - 1పేత్రు 2,5.

మనం కొలిచే క్రీస్తు యాజకుడు. దేవునికీ నరునికీ మధ్య ఏకైక మధ్యవర్తి - 1తిమొ 2,5. మనం క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినపుడు అతని లక్షణాలు మనకుగూడ సంక్రమిస్తాయి. కనుక అతని యాజకత్వం మనకు కూడ లభిస్తుంది. యాజకుడైన క్రీస్తునందు మనమందరమూ యాజకులమౌతాం. క్రైస్తవసమాజమంతా కలసే ఈ యాజకత్వాన్ని నిర్వహిస్తుంది. ఈ నిర్వహణం మూడురూపాల్లో వుంటుంది.

1. క్రీస్తుద్వారా తండ్రికి స్తోత్రబలులు అర్పిస్తాం - హెబ్రే 13,15. అనగా మనం క్రీస్తుతో ఏకమై తండ్రికి పూజబలి నర్పిస్తాం. ఈ బలిద్వారా తండ్రిని స్తుతించి కీర్తిస్తాం. ఎందుకంటే అతడు క్రీస్తుద్వారా మనలను రక్షించినవాడు.

2. పవిత్రమూ, దేవునికి ప్రీతిపాత్రమూ ఐన సజీవయాగంగా మనలను మనం దేవునికి అర్పించుకొంటాం. ఇది యుక్తమైన బలి - రోమా 12,1. పూర్వవేదంలో ప్రజలు జంతుబలుల నర్పిస్తే నూత్నవేదంలో మనలను మనమే బలిగా అర్పించుకొంటాం. పూర్వవేదంలోని యాగాలు మృతపశువులతో కూడి వుండేవి. మనం సజీవులంగానే దేవునికి అర్పించుకొంటాం. ఇక్కడ "సజీవయాగం" అంటే భావం యిది. మనం వట్టి

పూజబలినర్పిస్తేనే చాలదు. మన జీవితమంతా కూడ బలిగా మారిపోవాలి. మనం బ్రతికివున్న బలిగా తయారుకావాలి. నరులమైన మనకు యుక్తమైన బలి యిదే. ఈ జీవితబలి పవిత్రమైందీ, దేవునికి ప్రీతిపాత్రమైందీని. ఫలితార్థమేమిటంటే క్రైస్తవుడు పవిత్ర జీవితం జీవిస్తూ ఆ జీవితాన్నే బలిగా దేవునికి అర్పిస్తాడు. సిలువబలితో కలసి ఈ జీవితబలి దేవునికి ప్రియపడుతుంది.

3. దేవుని అద్భుతకార్యాలను లోకానికి ప్రకటిస్తాం - 1 పేత్రు 2,9. దేవుడు యూదులను ఐగుప్తు బానిసంనుండి విడిపించడం అద్భుతకార్యం. అంతకంటె అద్భుతకార్యం, అతడు క్రీస్తు మరణోత్థానాలద్వారా మనలను పాపంనుండి విడిపించడం. క్రీస్తుద్వారా లభించిన యీ రక్షణాన్ని మనం లోకానికి యెరుకపరచాలి. మన బోధలద్వారా, మన ఆదర్శప్రాయమైన జీవితంద్వారా గూడ మనం క్రీస్తుని లోకానికి ప్రకటిస్తాం. మనం క్రీస్తునందు ప్రవక్తలమౌతాం అంటే భావం ఇదే.

కనుక పూజబలి నర్పించడం ద్వారా, పవిత్రమైన జీవితాన్ని గడపడం ద్వారా, వేదబోధకులంగా మెలగడం ద్వారా మనం నూత్నవేదంలో యాజకులంగా వ్యవహరిస్తాం.

ఈ యాజక జీవితమే మనలను పవిత్రులను చేస్తుంది. బైబులు భగవంతుడు మహా పవిత్రుడు. అతడు "నేను పవిత్రుణ్ణయిన దేవుణ్ణి. నన్ను కొలిచే ప్రజలైన మీరుకూడ పవిత్రులుగా మెలగండి" అని మాటిమాటికి హెచ్చరిస్తుంటాడు- లేవీ 19,2. కనుక పూర్వవేద ప్రజలుకాని నూత్నవేద ప్రజలుకాని ప్రధానంగా పవిత్రులైన ప్రజలు. మనం- పవిత్రంగా వుండాలనే దేవుడు కోరుకొనేది - 1తెస్స 4,3. మనలను పవిత్రపరచడానికి ఆత్మకూడ మనకు తన ఫలాలను దయచేస్తుంది - గల 5.22.

ఇంకో సంగతికూడ. మనకు రెండు యాజకత్వాలున్నాయి. మొదటిది జ్ఞానస్నానంద్వారా సిద్ధించేది. ఈ యాజకత్వం పురుషులు స్త్రీలు పిల్లలు మొదలైన వాళ్ళందరికీ సిద్ధిస్తుంది. దీన్ని జ్ఞానస్నాన యాజకత్వం అందాం. పైన మనం పేర్కొన్న యాజకత్వం ఇదే.

ఇదికాక రెండవ యాజకత్వంకూడ వుంది. ఇది అభిషేకంపొందిన గురువులకు మాత్రమే సిద్ధిస్తుంది. ఈ యాజకత్వంతో గురువులు క్రైస్తవ సమాజానికి పరిచర్యలు చేస్తారు. వాక్యబోధ, సంస్కారాలు జరిపించడం మొదలైనవి ఈ పరిచర్యలు. కనుక ఈ రెండవ యాజకత్వాన్ని పరిచారక యాజకత్వం అందాం. ఇది గృహస్థులకుకాదు, గురువులకు మాత్రమే సిద్ధిస్తుంది. ఇక క్రైస్తవ ప్రజలు పవిత్రులు కావలసింది ప్రధానంగా జ్ఞానస్నాన యాజకత్వం ద్వారానే.

## 3. క్రైస్తవ ప్రజల సేవావరాలు

ఆత్మ క్రైస్తవ ప్రజలకు ఎన్నో వరాలిస్తుంది. వ్యాధులు నయంచేయడం, ప్రవచనం చెప్పడం, బోధచేయడం, దేవుణ్ణి స్తుతించడం మొదలైనవి ఈ వరాలు - 1కొ 12, 8-10. ఈ వరాలన్నిటికీ ఆధారం ఆత్మే. ఆ యాత్ముడు తన యిష్టప్రకారం ఒక్కొక్కనికి ఒక్కొక్కవరం ఇస్తుంటాడు - 12,11. ఈ వరాలు మన వ్యక్తిగత లాభానికి గాదు, తోడి ప్రజలకు సేవలు చేయడానికి. అందరికి మేలుచేయడానికి ఒక్కొక్కనికి ఆత్మవరాలు లభిస్తాయి. -12,7. ఈ వరాలతో క్రైస్తవ ప్రజలు క్రీస్తు శరీరమనే సంఘాన్ని అభివృద్ధిలోకి తేవాలి -ఎఫే 4,12. ప్రతివాడు దేవుని నుండి తాను పొందిన సేవావరాలను ఇతరుల మేలుకై వినియోగించాలి - 1 పేత్రు 4,10.

ఇతరులకు మనకంటె భిన్నమైన వరాలుండవచ్చు. ఐనా వాళ్ళతో మనం పోటీపడకూడదు. వాళ్ళతో సహకరించి పనిచేయాలి. దేహంలో ఒక అవయవం మరొక అవయవంతో సహకరిస్తుంది. అలాగే క్రైస్తవులు కూడ కార్యరంగంలో ఒకరితో ఒకరు సహకరించాలి - 1కొ 12,12. ఇతరుల వరాలనూ శక్తిసామర్థ్యాలనూ జూచి మనమేనాడు అసూయపడకూడదు. అలాగే మన వరాలను జూచి ఇతరులూ అసూయపడకూడదు. అందరమూ కలసి క్రైస్తవ సమాజాన్ని వృద్ధిలోకి తీసికొని వస్తున్నామా అన్నదే ముఖ్య ప్రశ్న. దేవుడు మనకీయని వరాలను ఇతరులకిచ్చి ఇతరులకీయనివి మనకిస్తున్నాడు అంటే, వీటిద్వారా క్రైస్తవులు ఒకరినొకరు పరిపూర్ణులను చేసికోవాలని భావం.

ఈ వరాలతో మనం తోడివారికి సేవలు చేయాలి. అందుచేత ఎవరు కూడ దేవుడు తమకిచ్చిన వరాలను అణచివేసికోగూడదు. ప్రభువు ఇతరులకు దయచేసిన వరాలను అసలే అణచివేయకూడదు. ఒక్కోసారి అజ్ఞానం వల్ల పై స్థానంలో వున్న వాళ్ళు క్రిందిస్థానంలో వున్నవాళ్ళ వరాలను అణగద్రొక్కుతుంటారు. గురువులు గృహస్థుల వరాలను అణచివేయడం, వాటిని వినియోగించుకోకుండా వుండడం అరుదేమీ కాదు. ఇది వట్టి యవివేకం. దీన్నే పౌలు అంతరంగంలోని దీపాన్ని ఆర్పివేయడంగా పేర్కొన్నాడు - 1తెస్స 5,19. అనగా పవిత్రాత్మనే అణచి వేయడమన్నమాట. గురువులూ మఠకన్యలూ అన్ని సేవాకార్యాలూ తామే చేయలేరు. అందుచేత సామర్థ్యం గల గృహస్థులను ప్రోత్సహించి వాళ్ళచేత ఆయా సేవలు చేయించుకోవాలి. గృహస్థుల సామర్థ్యాలను ఆత్మ వాళ్ళకు దయచేసిన వరాలుగా భావించాలి.

ఇక అందరి మేలు కొరకై ఆత్మ ఒక్కొక్కరికి తన వరాలను అనుగ్రహిస్తుందని చెప్పాం. కనుక ప్రతి క్రైస్తవుడు తన వరాలేమిటివో, అనగా తన ప్రత్యేక శక్తి

సామర్థ్యాలేమిటివో గుర్తించాలి. ఆ సామర్థ్యాలతోనే క్రైస్తవ సమాజానికి సేవలు చేయడానికి ముందుకి రావాలి. మన క్యాథలిక్ సమాజంలో గృహస్థులు సేవా కార్యక్రమాలన్నిటినీ గురువుల మీదా మఠకన్యల మీదా నెట్టివేసి తాము జాగ్రత్తగా ప్రక్కకు తప్పుకొంటుంటారు. ఏ పనికీ ముందుకి రారు. మాది స్వాములవారి మతం, అన్నీ మా స్వాములవారే చూచుకొంటారులే అని చెప్తారు. ఇది చాల చెడ్డ పద్ధతి. క్రైస్తవ సమాజానికి గురువు చేసే సేవలు అతడు చేస్తాడు. గృహస్థులు చేయవలసిన సేవలు వాళ్ళు చేయాలి. మన తరపున మనం పేదవాళ్ళమే కావచ్చు. కనుక తిరుసభ నుండి కొంత సహాయాన్ని ఆశించవచ్చు. కాని క్రైస్తవ మతం కేవలం మనల్ను అభివృద్ధిలోకి తీసికొని రావడానికి మాత్రమే వుంది అనుకోగూడదు. మన తరపున మనం కూడ మనకంటె హీనులూ దీనులూ ఐన తోడి ప్రజలకు సేవలు చేసి వాళ్ళను అభివృద్ధిలోకి తీసికొని రావడానికి గూడ ఈ మతం వుందని భావించాలి.

## 4. క్రైస్తవ ప్రజలు పేదవర్గాలకు సాయం చేయాలి

"అనాథులను విధవలను కష్టాలలో ఆదుకోవడం, ఇహలోక మాలిన్యం సోకకుండ తన్ను తాను కాపాడుకోవడం అనే వాటినే పితయైన దేవుడు స్వచ్ఛము నిర్మలమూ ఐన ఆరాధనంగా భావిస్తాడు" అని చెప్తుంది యాకోబుజాబు 1,27. అనాథులు, విధవలు, పరదేశులు అనే మూడు తెగలవాళ్ళు పూర్వవేదంలో బలహీనవర్గాలుగా భావించబడేవాళ్ళు – ద్వితీ 10,18. కనుకనే ప్రభువు పూర్వవేదంలో ఈ వర్గంవాళ్ళ కోపు తీసికొన్నాడు. అతడు దయతో పేదల మొర ఆలిస్తాడు - కీర్త 22,24. పేదవాణ్ణి దుమ్ములో నుండి పైకి లేవనెత్తుతాడు - 113,7. ఈలాంటి దీనులకే మనం సాయం చేయవలసింది.

ఇక నూత్న వేదంలో క్రీస్తు కూడ పేదలకోపు తీసికొన్నాడు. అతడు బోధించే సువార్త ప్రధానంగా పేదల కొరకు - మత్త 11,5. ధనవంతుని యింటి వాకిట పడివున్న లాజరు కథ చెప్పిన ప్రభువుకి పేదలంటే ప్రీతి - లూకా 16,19-21. అతడు ఆనాటి సమాజంలోని అట్టడుగు వర్గమైన సుంకరులతో కలసిపోయాడు. వారితో భోజనం చేసాడు. తాను పాపుల కొరకే గాని పుణ్యపురుషుల కొరకు రాలేదని చెప్పుకొన్నాడు - లూకా 5,29-32. అతడు ధనవంతుల కానుకలను విస్మరించి పేదరాలి రెండు కాసుల కానుకను మెచ్చుకొన్నాడు - మార్కు 12,41-44. ఈలాంటి వుదాహరణలను బట్టి ప్రభువుకి పేదలంటే యెంతో ప్రీతి అని అర్థం చేసికోవాలి. ఈ పేదలను ఆదుకోవడమే దైవరాధనమని పై యాకోబు జాబు చెప్తుంది. క్రైస్తవ ప్రజలు దేవునికి బలి అర్పించేవాళ్లు. అతన్ని ఆరాధించే యాజకులు. కాని మన ఆరాధనమనేది పేదలను ఆదుకోవడంలో వ్యక్తం కావాలి. సాంఘిక

న్యాయాన్ని పాటించడంలో విదితం కావాలి. వట్టినే గుళ్లోకి వెళ్ళి జపతపాలను అర్పించడంలో గొప్పయేమీ లేదు. అనాథులు విధవలు మొదలైన బలహీనవర్గాల వాళ్ళను పరామర్శిస్తే అది నిర్మలమైన ఆరాధనమౌతుంది.

## 5. గృహస్థులు ప్రాపంచిక విషయాల్లో నిమగ్నులు కావాలి

గృహస్థులను గూర్చిన వాటికన్ చట్టం సంసారికులు భౌతిక ప్రపంచాన్ని నూత్నీకరించాలని బోధించింది. ఇక్కడ భౌతిక ప్రపంచమంటే ఆస్తిపాస్తులు, ఆర్థిక విధానాలు, కళాసంస్కృతులు, విద్యావిశేషాలు, కుటుంబ జీవితం, వివిధ వృత్తులు, వ్యాపారాలు, సమాచార సాధనాలు, రాజకీయాలు అంతర్జాతీయ వ్యవహారాలు మొదలైనవన్నీని. భగవంతుడే వీటినన్నిటిని కలిగించాడు. కనుక ఇవన్నీ మంచివే – ఆది 1,31. ఇవన్నీ నరుని ఉపయోగం కొరకే సృజింపబడ్డాయి. నరుడు క్రీస్తునందు వీటినన్నిటినీ నూత్నపరుస్తుండాలి.

తొలి పాప ఫలితంగా నరులు భౌతిక ప్రపంచాన్ని దుర్వినియోగం జేస్తూవచ్చారు. నీతినియమాలు మీరారు. కనుక నరుడు స్థాపించిన సంస్థలే నరుని వ్యక్తిత్వాన్ని నాశం చేసాయి. శాస్త్రజ్ఞులు శాస్త్రరహస్యాలకు ముగ్ధులైపోయి ప్రకృతి శక్తులను అదుపులోకి తెచ్చుకోవడానికి మారుగా తామే వాటికి దాసులైపోయారు. ఈలాంటి పరిస్థితుల్లో విశ్వాసులు భౌతిక ప్రపంచ పునర్నిర్మాణానికీ దాని సద్వినియోగానికీ పూనుకోవాలి. ఈలా పునర్నిర్మాణం గావించిన ప్రపంచాన్ని తండ్రి ద్వారా క్రీస్తుకు అర్పించాలి – 1కొ 15,24.

క్రీస్తు రాజు లేక నాయకుడు. అతని లోనికి జ్ఞానస్నానం పొందినప్పుడే అతని నాయకత్వం మనకు గూడ సంక్రమిస్తుంది. కాని ఈ నాయకత్వం గృహస్థు లొకరీతిగాను గురువులింకొక రీతిగాను పొందుతారు. గురువులు ఆధ్యాత్మికరంగంలో నాయకులుగా వ్యవహరించాలి. గృహస్థులు భౌతికరంగంలో నాయకులుగా వ్యవహరించాలి.

కనుక గురువులు మఠకన్యలు ప్రధానంగా పారమార్థిక విషయాల్లో నిమగ్నులు కావాలి. గృహస్థులు ప్రధానంగా లౌకిక కార్యాల్లో నిమగ్నులు కావాలి. సువార్తాసూత్రాలకూ శ్రీసభ బోధలకూ బద్ధులవుతూ వీళ్ళు భౌతికరంగంలో కృషి చేయాలి.

ఈ దేశంలో క్రైస్తవులమైన మనం అల్ప సంఖ్యాకులం. మన శాతం కేవలం 2.5. ఈలా స్వల్ప సంఖ్యాకులమైన మనం మన హక్కులను నిలబెట్టుకోవాలంటే విద్యను అలవర్చుకోవాలి. ప్రజాజీవనంలో కలసిపోవాలి. వివిధ వృత్తులు రాజకీయాలు మొదలైన వాటిల్లోకి ప్రవేశించాలి. వివిధ భౌతికరంగాల్లో ఉన్నత ప్రమాణాలతో కృషి చేయడం నేర్చుకోవాలి. ఐనా దురదృష్టవశాత్తు మన ప్రజలు లౌకిక కార్యకలాపాల్లో అంతగా చాకచక్యం చూపించడం లేదు. ఈ విషయంలో మనం ఇంకా యెక్కువ కృషి చేయాలి.

# 2. దైవశాస్త్ర రీత్యా గృహస్థుల స్థానం

1. భగవంతుడు నూత్న మానవజాతిని సృజించాలని సంకల్పించుకొన్నాడు. ప్రేమ, న్యాయం, సహజీవనం మొదలైనవి ఈ నూత్నప్రజకు ముఖ్యలక్షణాలు. ఈ నూత్న ప్రజే దైవరాజ్యం. క్రీస్తు వచ్చింది కూడ ఈ దైవరాజ్యాన్ని నెలకొల్పడానికే. లోకంలో ఆయా మతాలకూ సంస్థలకూ చెందిన సజ్జనులు కూడ పరోక్షంగా గాని ప్రత్యక్షంగా గాని ఈ దైవరాజ్య వ్యాప్తికి కృషి చేస్తూనే వుంటారు. కాని వాళ్ళు ఆ రాజ్యాన్ని మరోపేరుతో పిలుస్తారు. ప్రేమ, సమాధానం, స్వేచ్ఛ, న్యాయం, సహజీవనం, నిర్మలత్వం, ఆనందం మొదలైన సద్గుణాలు ఉన్న కాడల్లా దైవరాజ్యం నెలకొనివుందనే చెప్పాలి. కాని ఈ రాజ్యం లోకాంతంలో గాని పూర్తిగా సిద్ధించదు. ప్రస్తుతం ఈ లోకంలో ఇది పాక్షికంగా మాత్రమే సిద్ధిస్తుంది.

2. తండ్రి క్రీస్తు ద్వారా, ఆత్మశక్తితో, శ్రీసభను నెలకొల్పాడు. దైవరాజ్యాన్ని గూర్చిన సువార్తను ప్రకటించి ఆ రాజ్యాన్ని వ్యాప్తి చేయడం ఈ తిరుసభ బాధ్యత. పరోక్షంగా గాని ప్రత్యక్షంగా గాని ఈ రాజ్యవ్యాప్తికి తోడ్పడే ఇతర వర్గాల వాళ్ళతో గూడ ఈ తిరుసభ సహకరిస్తుంది.

3. శ్రీసభ అంటే యేమోకాదు, దైవప్రజలే. జ్ఞానస్నానం భద్రమైన అభ్యంగం అనే సంస్కారాలను పొంది క్రీస్తు యాజకత్వంలోను, ప్రవక్తృత్వంలోను, రాజత్వంలోను పాలుపంచుకొనిన క్రైస్తవులందరూ ఈ శ్రీసభ సభ్యులే. ఈ సభ్యులందరి బాధ్యతా ఒక్కటే, దైవరాజ్యాన్ని వ్యాప్తి చేయడం. ఈ బాధ్యతను అందరూ సమంగానే వహిస్తారు. ఐనా ఈ బాధ్యతను నెరవేర్చడానికి ఆత్మ ఒక్కొక్కరికి ఒక్కో ప్రత్యేక వరం దయచేస్తుంది. ఒక్కొక్కరిని ఒక్కో రకమైన పరిచర్యకు పురికొల్పుతుంది. కనుక ఒక్కో వర్గంవాళ్లు ఒక్కోరకమైన పనికి పూనుకొంటారు. తిరుసభలో భిన్నవర్గాలవాళ్ళూ భిన్నసేవలూ వున్నాయి. పదిమంది కలసి జీవించే కాడ ఈ వైవిధ్యం అవసరం. దేహంలో ఒక్కో అవయవం ఒక్కోరకమైన పని చేస్తుంది కదా! శ్రీసభ సభ్యులందరూ రాజ్యవ్యాప్తి అనే ఏక బాధ్యతను సరిసమానంగా స్వీకరించినా, వాళ్లు కూడ ఓ మానుష సమాజంగా ఏర్పడినవాళ్ళే కనుక, వాళ్లల్లో కూడ నాయకులు అధికారులు మొదలైన వాళ్ళుంటారు. ఐనా ఈ పదవులు పెత్తనం చెలాయించడానికి కాదు, సేవలు చేయడానికి.

పూర్వం తిరుసభలో పాపుగారు, కార్డినల్సు, బిషప్పులు, గురువులు, గృహస్థులు అనే శ్రేణులుండేవి. ఈ శ్రేణిలో పై వర్గం వాళ్ళకి విలువ యెక్కువ, క్రింది వర్గం వాళ్ళకి విలువ తక్కువ. తిరుసభ అనే మేడ అంతా పాపుగారు అనే ఏకస్తంభం మీద ఆధారపడి

నిలుస్తుందని భావించేవాళ్ళు. కాని రెండవ వాటికన్‌సభ తర్వాత ఈ యభిప్రాయం పూర్తిగా మారిపోయింది. తిరుసభలోని సభ్యులంతా దైవప్రజలే. అందరూ దైవరాజ్య వ్యాప్తికి తోడ్పడేవాళ్ళే. వాళ్ళల్లో ఒకరు ఎక్కువా లేదు ఒకరు తక్కువా లేదు. అందరికీ ఒకే విలువ. కాని తాము చేసే పనులను బట్టి తిరుసభ సభ్యులు భిన్నశాఖల వాళ్ళవుతారు. బిషప్పుల పని వేరు, గురువుల పని వేరు, గృహస్థుల పని వేరు. ఈ విధంగా ఈ సభ్యుల పనుల్లో వ్యత్యాసాలున్నా వీళ్ళ విలువలో మాత్రం ఏ వ్యత్యాసమూ లేదు.

4. శ్రీసభలో గృహస్థులు గురువులు అనే శాఖలు పెద్దవి, ముఖ్యమైనవి. ఈ రెండు వర్గాలవాళ్ళు పరస్పర విరోధులు కారు. ఏవర్గం చేసే పని ఆ వర్గమే చేస్తుంది. ఇవి రెండు స్వయం ప్రతిపత్తి కల భిన్నవర్గాలు. ఐనా ఈ వుభయ వర్గాలవాళ్ళుకూడ, తమ ప్రత్యేక పద్ధతిలో, శ్రీసభ వ్యాప్తికే కృషిచేస్తారు. కనుక ఈ రెండు వర్గాలవాళ్ళు ఒకరి అంతస్తుని ఒకరు అర్థం చేసుకోవాలి, అంగీకరించాలి. గృహస్థులు దైవరాజ్య వ్యాప్తికిగాను ప్రేషిత సేవ చేయడమనేది గురువుల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి వుండదు. జ్ఞానస్నానం ద్వారానే వాళ్లకు ఆ సేవ చేయడానికి హక్కు లభిస్తుంది. క్రీస్తు తండ్రి పంపగా వచ్చిన ప్రేషితుడు. అతనిలోనికి జ్ఞానస్నానం పొందేవాళ్ళంతా అతనిలాగే ప్రేషితులౌతారు.

5. తిరుసభలో ఆధ్యాత్మిక రంగమూ వుంది, భౌతిక రంగమూ వుంది. ఆధ్యాత్మికరంగంలో బిషప్పులూ గురువులూ మొదలైనవాళ్ళు నాయకత్వమూ అధికారమూ వహిస్తారు. ప్రత్యేక సంస్కారాల ద్వారా వీళ్ళకు ఈ హక్కు సిద్ధిస్తుంది. కాని ఈ నాయకత్వమూ అధికారమూ పెత్తనము చేయడానికి గాదు, క్రైస్తవ సమాజానికి పరిచర్యలు చేయడానికి. ఈ యధికారులు క్రైస్తవ సమాజం పేరు మీదిగా పనిచేస్తారు. ఆధ్యాత్మిక రంగంలో గురువుల నాయకత్వం మతపరమైన విశ్వాస విషయాలకూ నైతిక విషయాలకూ మాత్రమే వర్తిస్తుంది.

ఈ యాధ్యాత్మిక రంగంలో గృహస్థులు గురువులతో సహకరించి కృషిచేస్తారు. కనుక ఈ రంగంలో వీళ్ళు తోడి పనివాళ్ళు ఔతారు. కాని ఈలా తోడిపనివాళ్ళుగా వ్యవహరించడానికి గృహస్థులకు స్వయం ప్రతిపత్తి వుంది. ఈ హక్కు వాళ్ళకు జ్ఞానస్నానం ద్వారానే లభిస్తుంది. కనుక ఈ హక్కుని గురువులు భంగపరచకూడదు. తోడిపనివాళ్ళుగా గృహస్థులు ఆరాధనలో పాల్గొంటారు. వేదబోధ చేస్తారు. వివిధ సేవాకార్యక్రమాల్లో సహాయులుగా పనిచేస్తారు.

6. భౌతిక రంగంలో గృహస్థులు నాయకత్వం వహించాలి. వివిధ అభివృద్ధి కార్యక్రమాలు, విద్య, వైద్యం మొదలైన తిరుసభ సేవా కార్యక్రమాల్లో గృహస్థులే నాయకత్వం వహించడం సబబు. క్రీస్తు ద్వారా ఈ భౌతిక ప్రపంచాన్ని నూత్నపరచడమనేది గృహస్థుల

ప్రత్యేక బాధ్యత. కనుక ఈ రంగంలో వీళ్ల నాయకత్వం చెల్లుతుంది. ఇందుకు ఆత్మ వీళ్లకు ప్రత్యేక వరాలు కూడ ఇస్తుంది. కాని ఈ దేశంలో, భౌతిక రంగంలో నాయకత్వం వహించే సామర్థ్యం మన గృహస్థులకు ఇంకా తగినంతగా అలవడలేదు. కనుక వీళ్లను తర్ఫీదు ద్వారా ఈ నాయకత్వానికి సిద్ధం చేయాలి. భౌతిక రంగంలో నాయకత్వం వహించడమంటే రాజకీయాల్లో లాగ స్వార్థలాభాన్ని చూచుకోవడం కాదు. మరి క్రైస్తవ సమాజాన్ని వృద్ధిలోకి తీసికొనిరావడం. ఈ శక్తి ప్రస్తుతం మన గృహస్థుల్లో ఎందరికుంది? కనుకనే వీళ్లకు తర్ఫీదు అవసరమని చెప్పాం. గృహస్థులకు తర్ఫీదు నిప్పించవలసింది మన గురువులూ బిషప్పులూ. తర్ఫీదు ద్వారా ప్రజల బుద్ధులు మార్చడం చాలా కష్టమైన కార్యం. కనుక ఈ కార్యక్రమాన్ని మనం వెంటనే ప్రారంభించాలి.

భౌతిక రంగంలో గృహస్థులు నాయకత్వం వహించాలని చెప్పాం. ఈ రంగంలో గురువులు గృహస్థులకు తోడి పనివాళ్లవుతారు. వాళ్లు నాయకులు కారు. తోడిపని వాళ్లుగానే గురువులు కూడ విద్య, సాంఘిక సేవ మొదలైన సేవా రంగాల్లో పనిచేయవచ్చు.

7. మఠ సభలకు చెందిన గురువుల, సహోదరులు, కన్యలు కూడ వున్నారు. ఆత్మ మఠసభ స్థాపకులకు ప్రత్యేక సేవావరాలనిస్తుంది. ఈ వరాల ప్రకారం ఈ సభల సభ్యులు క్రైస్తవ సమాజాలకు విద్యావైద్య సాంఘిక సేవాది ప్రత్యేక పరిచర్యలు చేస్తుంటారు. ఈ ప్రత్యేక పరిచర్యలకు అనుగుణంగానే వీళ్లు తిరుసభలో ప్రత్యేక నాయకత్వం గూడ వహిస్తారు. ఈ నాయకత్వం వీళ్ల సేవలను బట్టి, వీళ్ల ప్రత్యేక వరాలను బట్టి వస్తుంది.

8. ఈ దేశంలో మనం అధిక సంఖ్యాకులైన హిందువుల మధ్య జీవిస్తుంటాం. మన విద్యాసంస్థలు, ఆస్పత్రులు, సాంఘిక సేవా సంస్థలు మొదలైనవాటిల్లో అన్యమతస్థులు కూడ మనతో కలసి పనిచేస్తుంటారు. ఈలా పని చేసేప్పుడు మనతోపాటు వీళ్లుకూడ దైవరాజ్య వ్యాప్తికి తోడ్పడుతున్నారని చెప్పాలి. కనుక వీళ్లు మనకు తోడిపనివాళ్లు. అందుచేత మనం వీళ్లను కేవలం జీతం తీసికొని పనిచేసిపెట్టేవాళ్ళనుగా మాత్రమే భావించకూడదు. వీళ్ళనూ వీళ్ళపనినీ విలువలతో చూడాలి.

9. గృహస్థులు - క్రైస్తవులైన క్రైస్తవేతరులైనా - గురువులతోనో లేక మఠకన్యలతోనో కలసి ఏదో విద్యారంగంలో పనిచేస్తున్నారనుకొందాం. అప్పుడు వాళ్లు గృహస్థులుగా మాత్రమే పనిచేస్తారు. అనగా గురువులకూ మఠకన్యలకూ వుండే వరాలూ లక్ష్యాలూ గృహస్థులకు వుండవు. గృహస్థులు భిన్నమైన ఉద్దేశాలతోను లక్ష్యాలతోను సంస్థల్లో పనిచేస్తారు. ఎందుకంటే వీళ్లు భౌతికరంగంలో పనిచేస్తూ సంసారజీవితం జీవించేవాళ్ళు కనుక.

ఐనా ఒక సంస్థలో పనిచేసే గురువులు లేక మఠకన్యలూ, గృహస్థులూ ఆ సంస్థ శ్రేయస్సు దృష్ట్యా ఉన్నత ప్రమాణాలతో కూడిన లక్ష్యాలను రూపొందించుకోవచ్చు. ఆ లక్ష్యాలను సాధించడానికి అందరూ సమష్టిగా కృషి చేయవచ్చు. ఎవరి వ్యక్తిగతమైన ఉద్దేశాలు వాళ్ళకేవున్నా అందరూ సంస్థ పురోభివృద్ధికి సమష్టిగా పని చేయవచ్చు.

# 3. చారిత్రకంగా గృహస్థుల స్థానం

చారిత్రకంగా పరిశీలించి చూస్తే శతాబ్దాల పొడుగునా గృహస్థుల స్థానంలో హెచ్చుతగ్గులు కనిపిస్తాయి. తిరుసభలో గృహస్థుల చరిత్రను స్థూలంగా నాల్గుదశలుగా విభజించవచ్చు.

## 1. తొలి శతాబ్దాల్లో గురువులూ గృహస్థులూ సరిసమానం

పూర్వవేద ప్రజల్లో యాజకులకూ గృహస్థులకూ మధ్య పెద్ద తేడాయేమి వుండేది కాదు. ఆ వుభయవర్గాల వాళ్ళకు సమానమైన హోదా వుండేది. అలాగే నూత్న వేదారంభంలో కూడ యాజకులకూ సంసారికులకూ పెద్ద వ్యత్యాసమేమీ కన్పించేది కాదు. క్రీస్తు బోధనా పర్యటనల్లో కొందరు పుణ్యస్త్రీలు కూడ అతని వెంట వెళ్లేవాళ్లు. వాళ్ళు క్రీస్తుకీ అతని శిష్యులకీ అవసరమైన అన్న పానీయాలు చేకూర్చి పెట్టేవాళ్లు - లూకా 8,2-3. తర్వాత ఈ సంప్రదాయాన్ని పౌలు పేత్రు మొదలైన శిష్యులు కూడ పాటించినట్లు తెలుస్తుంది. 1కొ 9,5.

ఆ తొలిరోజుల్లో ప్రిస్కిల్లా అక్విలా అనే పుణ్యదంపతులు వేదప్రచారంలో ఎంతో తోడ్పడ్డారు. అచ -18,26. స్తెఫను మరణానంతరం చాలామంది గృహస్థులు వేదబోధకులుగా వ్యవహరించారు. అచ 11,19-21. పౌలు తనతో గూడి వేదబోధ చేసిన యువొదియా, సుంటకె, క్లెమెంటు అనే గృహస్థులను ఆదర పూర్వకంగా పేర్కొన్నాడు. ఫిలి - 4,2-3. ఇంచుమించు ఐదవ శతాబ్దం దాకా ఈ సమానత్వం ఈలాగే కొనసాగుతూ వచ్చింది.

తొలి శతాబ్దాల్లో వేదబోధ చేసి తిరుసభను వ్యాప్తి చేసిన వాళ్ళల్లో గృహస్థులు కూడ వున్నారు. ప్రారంభంలో క్రైస్తవ విశ్వాసం విశేషంగా వ్యాపార మార్గాల వెంట పెరుగుతూ వచ్చింది. క్రైస్తవ వ్యాపారులే ఈ రోజుల్లో క్రీస్తుని బోధిస్తూ వచ్చారు. రెండవ శతాబ్దంలో గొప్ప వేదబోధకుడుగా కీర్తి గడించిన జస్టిన్ కుటుంబీకుడు. అలాగే రెండవ శతాబ్దంలో అలెగ్జాండ్రియా పట్టణంలో క్రైస్తవ వేదాంతాన్ని బోధించిన ఓరిజిన్ పండితుడు కూడా చాలా యేండ్ల దాక గృహస్థుడు గానే జీవించాడు. జీవితాంతంలో అతడు గురుపట్టాన్ని

స్వీకరించాడు. సిప్రియన్, అగస్టిన్, జెరోము మొదలైన పితృపాదులంతా మొదట గృహస్థులు గానే దైవ శాస్త్రాన్ని బోధిస్తూ వచ్చారు. అటుపిమ్మట బిషప్పులుగా అభిషిక్తులయ్యారు. త్రెంటు మహా సభదాకా గూడ ఆయా మహాసభల్లో గృహస్థులు కూడ పాల్గొన్నారు. తొలిరోజుల్లోని వేదసాక్షుల్లో చాలమంది సంసారికులే. ఆనాటి కుటుంబీకులు క్రైస్తవ మతాన్ని తమదాన్నిగా భావించేవాళ్ళు. ఆ మతాన్ని అనుసరించడమూ వ్యాప్తిచేయడమూ కూడ తమ బాధ్యత అని యెంచారు. ఈనాడు క్రైస్తవ మతం కొరకు ప్రాణాలర్పించే గృహస్థులు ఎంతమంది వున్నారు? ఆ రోజుల్లో గురువులకీ విశ్వాసులకీ మధ్య ఏలాంటి విభేదాలు వుండేవి కావు. ఆ రెండు తెగలవాళ్ళూ కలసి ఏకవర్గంగా జీవించేవాళ్ళు. ఏ విభేదాలు వున్నా క్రైస్తవులకి రోమను మతస్థులకీ మధ్య మాత్రమే వుండేవి.

## 2. గృహస్థుల ప్రాబల్యం పెరగడం

6–7 శతాబ్దాల్లో రాజకీయాలు శ్రీసభలోకి ప్రవేశించాయి. ఈలా ప్రవేశపెట్టింది గ్రిగోరీ పాపుగారు. ఆయన రోమను సామ్రాజ్యాన్ని బలపర్చడానికి రాజకీయాలను ఆశ్రయించాడు. రాజులు రాణులు జమిందారులు మొదలైనవాళ్ల సహాయంతో రోమను సామ్రాజ్యాన్ని క్రైస్తవ మతాన్ని కూడ పటిష్ఠం చేసి వ్యాప్తి చేయించాడు. కాని ఈ కాలం నుండి రాజకీయ సంస్కృతి అనేది తిరుసభలో భాగమై పోయింది.

ఈ రాజకీయాల ప్రాబల్యం వల్లనే పదవ శతాబ్దానికల్లా తిరుసభలో గృహస్థుల ప్రాముఖ్యం బాగా పెరిగిపోయింది. రాజులూ రాణులూ జమీందారులూ తిరుసభలో పెత్తనం చెలాయించారు. షార్లమేన్ అనే గొప్పరాజు ఆనాటి పాపుగారయిన మూడవ లియో గారి మీదనే అధికారం నెరపినట్లుగా తెలుస్తూంది. "నా సైన్యాలతో తిరుసభనూ రక్షించడమూ వ్యాప్తిచేయడమూ కూడ నా బాధ్యత. మోషేలాగ చేతులెత్తి ప్రార్థన చేసి నా సైన్యాలను గెలిపించడం నీ బాధ్యత" అని యితడు నాటి పాపుగారికి జాబు వ్రాసాడు. ఆనాటి రాజులే బిషప్పులనూ మఠశ్రేష్ఠులనూ నియమించేవాళ్ళు. పాపుగారి ఎన్నికలో గూడ రాజుల ప్రమేయం ఎంతో ఉండేది. తిరుసభ సొత్తుకి ఆశపడి ప్రముఖులైన గృహస్థులు దాని పరిపాలనా వ్యవహారాల్లో జోక్యం కలిగించుకొనేవాళ్ళు. ఈలా గృహస్థుల ప్రాముఖ్యమనేది 7 నుండి 10వ శతాబ్దం దాకా కొనసాగుతూ వచ్చింది.

## 3. గృహస్థుల ప్రాబల్యం అంతరించడం

11వ శతాబ్దంలో పదవ గ్రిగోరీ పాపుగారు తిరుసభను సంస్కరించారు. రాజులూ రాణులూ జమీందారులూ తిరుసభ పాలనలో జోక్యం కలిగించుకోవడాన్ని నిషేధించారు.

పాపుగారిని కార్డినల్సూ, బిషప్పులని గురువులూ ఎన్నుకోవాలని శాసనం చేసారు. ఇప్పటినుండి క్రైస్తవ సమాజంలో పాపుగారు, చక్రవర్తి అనే యిద్దరు నాయకులు ప్రముఖులుగా తయారయ్యారు. గురువులూ, తిరుసభా, ప్రపంచమూ, ఆధ్యాత్మికరంగమూ భౌతికరంగమూ అనే విభేదాలు కూడ తలయెత్తాయి.

గ్రెగోరీ పాపుగారు రూపొందించిన సంస్కరణల వల్ల తిరుసభలో గృహస్థుల ప్రాముఖ్యం తగ్గింది. గురువులు బిషప్పుల ప్రాముఖ్యం హెచ్చింది. కాని ఈ గురువులూ బిషప్పులూ పవిత్ర జీవితం గడపకుండా ధనమూ పదవులూ సుఖభోగాలు మొదలైన లోక వ్యామోహాల్లో పడిపోయారు. క్రమేణ గురువులకూ గృహస్థులకూ మధ్య వైరమూ ద్వేషమూ పెరిగిపోయాయి.

16వ శతాబ్దంలో లూతరు మొదలైన ప్రోటస్టెంటు నాయకులు క్రైస్తవులకు జ్ఞానస్నాన యాజకత్వమే గాని పరిచారక యాజకత్వం లేదు అని బోధించారు. ఈ ప్రోటస్టెంటు ప్రవాహానికి అడ్డుకట్ట వేయడానికి 16వ శతాబ్దంలో ట్రెంటు మహాసభ సమావేశమైంది. ఈ సభ అనాటి విషమ పరిస్థితుల్లో గురువుల స్థానాన్ని నిలబెట్టడానికి గృహస్థుల స్థానాన్ని చాలవరకు తగ్గించింది. గృహస్థుల యాజకత్వం అంత ముఖ్యమైంది కాదు అన్నట్లుగా బోధించింది. అప్పటినుండి తిరుసభలో గృహస్థుల స్థానం పూర్తిగా అంతరించింది. క్రైస్తవ సమాజంలో గురువులూ మఠసభలకు చెందినవాళ్ళు మాత్రమే ముఖ్యం, గృహస్థులను అట్టే లెక్కలోనికి తీసికొనక్కరలేదు అనే భావాలు బలపడిపోయాయి. ఈలాంటి వాతావరణంలోనే 10వ భక్తినాథ పాపుగారు "తిరుసభ అనే సమాజంలో రెండు భిన్నవర్గాలు వున్నాయి. కాపరులు ఒక వర్గం, మంద మరొక వర్గం. ఈ రెండూ పూర్తి విభేదం కల భిన్నవర్గాలు. మందను గమ్యానికి చేర్చే అధికారమూ హక్కూ కాపరులకు మాత్రమే వుంది. మంద బాధ్యత ఏమిటంటే, వినయ విధేయతలతో కాపరుల చేత పరిపాలించబడ్డమూ, గమ్యానికి నడిపించబడ్డమూను" అని వ్రాసారు. ఈలాంటి భావాలను నేడెవరూ అంగీకరించరు.

ట్రెంటు మహాసభ గృహస్థుల స్థానాన్ని తగ్గించి గురువుల స్థానాన్ని హెచ్చించిందని చెప్పాం. ఈసభ అనాటి గురువుల పాప జీవితాన్ని సంస్కరించడానికి గూడ బ్రహ్మాండమైన కృషి చేసింది. ఐనా అప్పటి నుండి గురువులకీ గృహస్థులకీ మధ్య విభేదాలు పెరుగుతూనే వచ్చాయి. యూరపు దేశాల్లో గురువుల అధికారాన్ని ధిక్కరించేవాళ్ళూ, అసలు మతాధికారాన్నే నిరాకరించేవాళ్ళూ పెరిగిపోయారు. వీళ్ళు తిరుసభ నుండి వైదొలగి నాస్తిక సంఘాలుగానో లేక లౌకిక సంఘాలు గానో ఏర్పడిపోయారు. గృహస్థులు చాలమంది అపమార్గాలు పట్టారు. ఇటీవల రెండవ వాటికన్ మహాసభ జరిగిందాకా తిరుసభలో

గురువులకీ గృహస్థులకీ మధ్య విభేదాలు వైషమ్యాలు ఏమాత్రం తగ్గలేదు. కాని వాటికన్ సభ ఈ సమస్యను చాల ఉదాత్తంగా పరిష్కరించింది.

## 4. గృహస్థులకు మళ్ళా సరిసమానమైన హోదా లభించడం

రెండవ వాటికన్ మహాసభ బోధల ప్రకారం, దైవరాజ్య వ్యాప్తిలో గురువులతో పాటు గృహస్థులు కూడ చురుకుగా పాల్గొనాలి. ఏ దేశంలో చూచినా దైవప్రజల్లో నూటికి తొంభై తొమ్మిదిపాళ్ళు గృహస్థులు. ఒక్కపాలు మాత్రం గురువులు. తొంభై తొమ్మిది శాతమైన గృహస్థులు కృషిచేయందే తిరుసభ ఏలా పెరుగుతుంది? కనుక గురువులతో కలసి గృహస్థులు కూడ దైవరాజ్య వ్యాప్తికి కృషి చేయనికాడ తిరుసభ అసంపూర్ణంగాను జీవచ్ఛవంగాను వుండిపోతుంది.

మనలను దైవప్రజలను చేసేది జ్ఞానస్నానం. ఈ జ్ఞానస్నానం ద్వారా మన మందరమూ సరిసమానంగానే తిరుసభ సభ్యులమౌతాం. కనుక మన పిలుపును బట్టి మనకు హెచ్చుతగ్గులు లేవు. కాని ఆత్మ మనలో ఒక్కొక్కరికిచ్చే సేవావరాలను బట్టి మనలో తేడాలుంటాయి. కాని యీ తేడాలవల్ల మన విలువ ఏమీ మారదు.

నేటి తిరుసభలో మళ్ళా తొలి శతాబ్దాల పద్ధతి రావాలి. దైవప్రజ లందరిమధ్య సమానత్వం ఏర్పడాలి. గురువులకీ గృహస్థులకీ మధ్య విరోధం పోవాలి. తొలిరోజుల్లో క్రైస్తవ సమాజానికీ రోమను సమాజానికీ మధ్య మాత్రమే వైరుధ్యం వుండేది. అలాగే నేడు కూడ తిరుసభకీ పాపపు ప్రపంచానికీ మధ్య మాత్రమే వైరుధ్యం ఉండాలి.

నేటి తిరుసభకు కావలసిన ప్రధాన గుణం సేవ. క్రీస్తు ప్రధానంగా సేవకుడు. ఆ సేవకుని అడుగుజాడల్లో నడచే తిరుసభ కూడ సేవాసభ కావాలి. కనుక గురువులూ గృహస్థులూ అందరూ ఏకమై ఎవరి శక్తికొలది వాళ్ళు దీనజనోద్ధరణకు పూనుకోవాలి. ఇవి సంగ్రహంగా గృహస్థులను గూర్చిన వాటికన్ సభ భావాలు. ఈ భావాలను పాటిస్తే గురువులకీ గృహస్థులకీ మధ్య సులువుగా పొత్తు కుదురుతుంది.

# 4. మన దేశ పరిస్థితి

1. క్రైస్తవ సమాజంలో గృహస్థులను లెక్కలోకి తీసికోక పోవడం, వేదబోధ పరిపాలనం మొదలైన వ్యవహారాలన్నీ గురువులూ బిషప్పులూ మొదలైన అధికార వర్గాలవాళ్ళు మాత్రమే నిర్వహించడం ప్రాత పద్ధతులని చెప్పాం. జ్ఞానస్నానం పొందినవాళ్ళందరూ దైవప్రజలే కనుక తిరుసభ సభ్యులందరూ సరిసమానమేననే భావమూ, అందరూ దైవరాజ్య వ్యాప్తికి కృషి చేయాలనే భావమూ తొలిరోజుల్లో ప్రచారంలో

వుండేవని నుడివాం. రెండవ వాటికన్ మహాసభ ఈ భావాలను మళ్ళా ప్రచారంలోకి తెచ్చిందని వాకొన్నాం. దైవప్రజలంతా సరిసమానమే, అందరూ తిరుసభ వ్యాప్తికి కృషి చేయాలి అనేవి క్రొత్త పద్ధతులు.

ఐనా మనదేశంలో ఇటీవలి వరకు ప్రాత పద్ధతులే అమలులో వున్నాయి. విచారణల్లో గురువులు గృహస్థులకు అట్టే ప్రాముఖ్య మీయరు. అలాగే విద్యాలయాలు, ఆస్పత్రులు, సాంఘికసేవా నిలయాలు మొదలైన సేవా సంస్థల్లో పనిచేసే గృహస్థులకు కూడ అట్టే ప్రాముఖ్యముండదు. మన క్యాతలిక్ సమాజంలో పరిపాలనా వ్యవహారాలన్నీ గురువులూ బిషప్పులూ నిర్వహిస్తుంటారు. ఇంకా వేదబోధ మొదలైన పనులు కూడ గురువులే చూచుకొంటూంటారు. గృహస్థులు ఈ రంగంలో అట్టే వుత్సాహం చూపించరు. కాని పరిపాలనా వ్యవహారాల్లో గాని, సంస్థలను నడిపించడంలో గాని, అభివృద్ధి కార్యక్రమాలను నిర్వహించడంలోగాని, వేదబోధ చేయడంలో గాని గురువులూ గృహస్థులూ అందరూ కలసి పనిచేయడం అవసరం. ఈ కార్యం సిద్ధించనంత వరకూ మన దేశంలో యథార్థమైన తిరుసభ నెలకొనలేదనే చెప్పాలి.

2. కాని యిప్పుడిప్పుడు భారతదేశ తిరుసభలో కూడ నూత్నాలోచనలు కన్పిస్తున్నాయి. ప్రాత పద్ధతులు పోయి క్రొత్త పద్ధతులు అమలులోకి వస్తున్నాయి. తిరుసభలో గృహస్థులకు కూడ ఉచిత స్థానమీయాలి అనే భావాలు ప్రచారం లోకి వస్తున్నాయి. ఈ వినూత్న భావాలకు కారణాలు చాలా వున్నాయి. ఈ దేశంలో మనం స్వాతంత్ర్యాన్ని సంపాదించి ప్రజాస్వామ్యం ఏర్పరచుకొన్నాం. కనుక తిరుసభలో కూడ ప్రజాస్వామ్యం వుండాలి అనే భావం సహజంగానే తలయెత్తుతుంది. నేడు అందరూ బైబులు జ్ఞానం అలవర్చుకొంటున్నారు. బైబులు దైవప్రజలందరికీ విలువ వుందని చెప్తుంది. ఇంకా నేడు ప్రజలకు జ్ఞానస్నానాన్ని గూర్చిన దైవశాస్త్రాంశాలూ ఆ సంస్కారం ద్వారా గృహస్థులకు లభించే నాయకత్వమూ కొంతవరకు తెలుసు. గృహస్థులు చాలమంది కతోలిక సేవ మొదలైన ఉద్యమాల్లో పాల్గొని పనిచేస్తుంటారు. ఈ కృషి ద్వారా వాళ్ళకి తిరుసభలో మనస్థాన మేమిటా అనే ఆలోచన పుట్టి తీరుతుంది. ఇన్ని కారణాల వల్ల తిరుసభలో గృహస్థులకు కూడ ప్రాముఖ్యముందనే అంశం నేడు చాలమందికి విదితమైంది.

3. తిరుసభలో గృహస్థులకు ఉచిత స్థానం వుండాలి, వాళ్ళు కూడ నాయకత్వంలో పాలుపొందాలి అని చెప్పాం. కాని ఈ నాయకత్వం పెద్ద బాధ్యతతో కూడింది. స్వార్థాన్ని చూచుకోక ఇతరులకు సేవ చేయగలిగి వుండాలి అనేది ఈ బాధ్యత. ఈలాంటి బాధ్యతను నిర్వహించడానికి మన గృహస్థులు సిద్ధంగా వుండరు. కనుక వాళ్ళను ముందుగా ఈ

బాధ్యతా నిర్వహణకు సిద్ధం చేయాలి. వాళ్ళకు నాయకత్వపు తర్ఫీదు నిప్పించాలి. ఈ పనిని మన బిషప్పులూ గురువులూ చేయాలి. చక్కని నాయక లక్షణాలను అలవర్చుకోకపోతే గృహస్థులు క్రైస్తవ సమాజాలకు మేలుకి మారుగా కీడు చేస్తారు. ఇందుకు ఓ వుదాహరణాన్ని చూపించవచ్చు. మన దేశంలో ప్రోటస్టెంటు సమాజాలు వాళ్ళ గృహస్థులకు పూర్తి స్వేచ్ఛనిచ్చాయి. కాని ఈ గృహస్థులు సేవాపరులైన నాయకులుగా గాక స్వార్థపరులైన నాయకులుగా తయారయ్యారు. ఎవరికి దొరికింది వాళ్లు కొట్టేసి క్రైస్తవ సమాజాలను నాశం చేసారు. అంతఃకలహాలు తెచ్చిపెట్టి క్రైస్తవులను విభజించారు. నేడు ప్రోటస్టెంటు సమాజాలు పెరగడం లేదు గదా, ఉన్నవి కూడా నిలువకుండ పోతున్నాయి. క్యాతలిక్ సమాజంలో మనం ఈలాంటి పొరపాటుని చేయకూడదు. మన గృహస్థులు బాధ్యతాయుతంగా ప్రవర్తించడం నేర్చుకొన్న పిదపనే గాని వాళ్ళకి నాయకత్వంలో పాలుపంచి పెట్టకూడదు.

మామూలుగా మన గృహస్థుల్లో కన్పించే అవలక్షణాలు ఇవి. క్రియాసామర్థ్యం వుండదు. దీక్షతో పని చేయరు. కార్యాన్ని సంతృప్తికరంగా ముగించరు. నిజాయితీ, నమ్మదగినతనమూ వుండవు. స్వార్థబుద్ధిని ప్రదర్శిస్తారు. మోసానికి పాల్పడి డబ్బు కొట్టేస్తారు. పదవులకూ పేరు ప్రతిష్ఠలకూ ప్రాకులాడతారు. అంతఃకలహాలు తెచ్చిపెడతారు. బడుగు వర్గాలవాళ్ళను అన్యాయంగా అణగద్రొక్కుతారు. ఐనా మంచి తర్ఫీదుద్వారా ఈ యవలక్షణాలను కొంతవరకు సవరించవచ్చు. గృహస్థుల తర్ఫీదునకు నాందిగా "ప్యారిష్ కౌన్సిల్స్" ను ఏర్పాటు చేయాలి.

4. మన గురువులూ బిషప్పులూ గృహస్థులకు తర్ఫీదు నిప్పించి వాళ్ళను మంచి నాయకులుగా తయారు చేయాలని చెప్పాం. వాళ్ళకు కూడ నాయకత్వములోను కార్యభారంలోను పాలు ఈయడానికి మన అధికారులు సిద్ధం కావాలని చెప్పాం. గృహస్థులు స్వార్థబుద్ధితో గాక బాధ్యతాయుతంగా నాయకత్వాన్ని నిర్వహించాలని చెప్పాం. ఈ పట్టున గృహస్థులు అధికారాన్ని ఏలాగైనా చేజిక్కించుకోవాలని కోరుకొనేవాళ్ళలాగ ప్రవర్తించ కూడదు. గురువులు దయాదాక్షిణ్యాల కొద్దీ అధికారాన్ని పంచిపెట్టేవాళ్ళలాగ ప్రవర్తించకూడదు. గృహస్థులను సేవాబాధ్యతలో పాలుపంచుకోవడానికి అహ్వానిస్తున్నాము అన్నట్లుగా గురువులు తలంచాలి. సేవాబాధ్యతను స్వీకరిస్తున్నాము అన్నట్లుగా గృహస్థులు తలంచాలి.

5. ఒక్క ఉదాహరణ తీసికొందాం. గురువులు కాని కన్యలు కాని నిర్వహించే విద్యాసంస్థలో గృహస్థులు కూడ ఉపాధ్యాయులుగా పనిచేస్తున్నారను కొందాం. అప్పుడు గురువులూ కన్యలూ ఈ గృహస్థ ఉపాధ్యాయులతో ఏలా ప్రవర్తించాలి?

యాజమాన్యం ఇది మా సంస్థ, ఇక్కడ మేము యజమానులం మీరు పనివాళ్ళు, కనుక మీ జీతం మీరు తీసికొని మేము చెప్పిన పనిచేసి వెళ్ళిపొండి అన్నట్లుగా ప్రవర్తించకూడదు. అందరూ కలసి ఒక బృందంగా పనిచేయాలి. విద్యాసంస్థ మనందరిది అన్నట్లుగా తలంచాలి. ఆ సంస్థను గూర్చి ఏవైన నిర్ణయాలు చేసేప్పుడు యాజమాన్యం గృహస్థ ఉపాధ్యాయుల ప్రతినిధులను కూడ పిల్వాలి. గృహస్థుల సర్వీస్ కండిషన్లు ఖచ్చితంగా నిర్ణయించాలి. వాళ్ల జీతాలు సరిగా చెల్లించాలి. వాళ్ల ఫిర్యాదులను ఓపికతో విని న్యాయదృష్టితో పరిష్కరించాలి. ఉపాధ్యాయులు తమ వృత్తి నైపుణ్యాలను పెంపొందించుకోవడానికి సదస్సులు మొదలైనవి ఏర్పాటుచేయాలి.

గృహస్థ ఉపాధ్యాయులు కూడ విద్యాసంస్థ తమదే అనుకొని ఉత్సాహంతో కృషిచేయాలి. వాళ్ళు ఆ విద్యాసంస్థ నెలకొల్పిన ఉన్నత ప్రమాణాలను ఇంకా పెంచాలే గాని వాటిని దిగజార్చగూడదు. ఆ సంస్థ మంచి పేరును నిలబెట్టాలేగాని చెడగొట్టకూడదు. ఆ సంస్థ ఉన్నతాశయాలనూ లక్ష్యాలనూ అర్థం చేసికొని వాటిని సాధించడానికి కృషి చేయాలనేగాని సోమరితనంతో కాలం వెళ్ళబుచ్చ కూడదు. గృహస్థులకు కూడ బాధ్యత ఒప్పజెప్తే తమ పలుకుబడి తగ్గిపోతుందేమోనని యాజమాన్యం తలంచగూడదు. ఓమారు అధికారాన్ని చేజిక్కించుకొంటే సేవ చేయకుండానే లాభం పొందవచ్చునని గృహస్థులు తలంచగూడదు.

ఈ వుదాహరణంలో చెప్పిన సూత్రాలనే కొద్ది మార్పులతో ఇతర కార్యరంగాలకు గూడ వర్తింపజేయవచ్చు.

# 6. ఎడారి మునుల సూక్తులు

- బైబులు భాష్యం - 92

## మనవి మాట

క్రీ॥శ॥ 3 నుండి 5వ శతాబ్దం వరకు క్రైస్తవ భక్తులు చాలమంది ఈజిప్టు, సిరియా, పాలస్తీనా దేశాల పరిసరాల్లోని ఎడారుల్లోకి వెళ్లి అక్కడ ఏకాంతంగాను సామూహికంగాను గూడ సన్యాస జీవితం గడిపారు. వీరికే "ఎడారి మునులు" అని పేరు. శ్రీసభలోని నేటి మఠ జీవితానికీ, ఆశ్రమ జీవితానికీ మార్గదర్శకులు వీళ్లే.

ఈ మునులు కఠోరమైన నియమాలతో ఆధ్యాత్మిక జీవితం కొనసాగించారు. వీళ్ళ జీవితంలో భక్తుల స్వయంకృషీ, భగవంతుణ్ణి పొందడానికి వాళ్ళనుభవించిన శ్రమలూ కొట్టవచ్చినట్లు కన్పిస్తాయి. వినయం, విధేయత, నిరాడంబరత, మౌనం, ఏకాంతం, దైవవాక్య ధ్యానం, ఉపవాసం - మొదలైనవి వీరిలో కన్పించే కొన్ని సుగుణాలు. వీళ్ళు లోక వ్యామోహాలను విడనాడి సువిశేష బోధల ప్రకారం నిష్ఠతోను భక్తి శ్రద్ధలతోను జీవించారు. వీళ్ళల్లో చాలమంది అర్చ్యశిష్టులు.

ఈ మునుల ఆదర్శాలు, ఉపదేశాలు, సూక్తులు ప్రాచీన క్రైస్తవులను బాగా ప్రభావితం చేసాయి. ప్రాచీన కాలంలోనే క్రైస్తవ రచయితలు ఎడారి మునుల సూక్తుల సంకలనాలను తయారుచేసారు. ఈ చిన్ని పొత్తంలో ఆ సూక్తులను కొన్నిటిని అనువదించి ముద్రించాం. నేడు మనం ఆ యెడారి మునులంత నిష్ఠతో క్రైస్తవ జీవితం గడప లేకపోయినా, వారి సూక్తులూ ఆదర్శాలూ మనకు తప్పక ప్రేరణం కలిగిస్తాయి.

1. అంతోనిముని పొయెమన్ మునికి ఈలా చెప్పాడు. "నరుడు నిరంతరం తన పాపాలకు తానే బాధ్యుడనని ఒప్పు కొంటూండాలి. జీవితంలో చివరి గడియ దాకా శోధనలు వస్తూనే వుంటాయని గుర్తించాలి. ఈలా చేసేవాడు ఉత్తముడు."

2. పాంబోముని అంతోని మునిని అయ్యా! నేనేమి మంచికార్యాలు చేయాలో చెప్పమని అడగ్గా అతడీలా పలికాడు. "నీ పుణ్యం మీదనే నీవు ఆధారపడవద్దు. జరిగిపోయినదాన్ని గూర్చి చింతించవద్దు. నీ నాలుకనూ కడుపునూ గూడ అదుపులో పెట్టుకొంటూండు".

3. ఓ వేటగాడు ఎడారిలో అంతోనిముని ఇతర మునులతో గలసి ఆనందంగా కాలం గడుపుతూండడం జూచి విస్తుపోయాడు. మునులు ఈలా సుఖాలు అనుభవించవచ్చా

అని విశ్రాంతి జెందాడు. అంతోనిముని వేటగానికి గుణపాఠం నేర్పాలనుకొన్నాడు. అతనితో నీ విల్లు బాగా వంచి బాణం వేయి అన్నాడు. వేటగాడు అలాగే వేసాడు. ముని అతన్ని రెండవసారి గూడ అలాగే ఆదేశించాడు, వేటగాడు అలాగే చేసాడు. ముని మూడవసారి గూడ అలాగే ఆజ్ఞాపించాడు. కాని వేటగాడు అయ్యా! ఇంతకాలం వంచి వుంచితే నా విల్లు చెడిపోతుంది అన్నాడు. అప్పుడు ముని "నాయనా! భగవత్సేవ కూడ యింతే. నిరంతరం గాఢభక్తితో జీవిస్తే నరులు జబ్బుపడిపోతారు. జీవితంలో కొంత సుఖమూ ఉల్లాసమూ కూడ వుండాలి" అని చెప్పాడు. ఆ మాటలకు వేటగాడు చాల సంతోషించాడు.

4. అర్సేనియస్ ముని ఈలా వచించాడు. "మనం భగవంతుణ్ణి వెదకితే అతడు మనకు దర్శనం ఇచ్చితీరతాడు. అతన్ని మనచెంత వుంచుకోగోరితే ఎల్లవేళలా మన దాపులోనే వుండిపోతాడు."

5. ఓ సన్యాసి అర్సేనియస్ మునిని అయ్యా! నీవు మాతో కలియవెందుకు అని అడిగాడు. అతడు ఈలా చెప్పాడు. "నాయనా! మీరంటే నాకిష్టమే. కాని నేను దేవునితోను నరులోను కలసి జీవించలేను. దేవదూతలకు ఒకే చిత్తం వుంటుంది. కాని నరులకు చాల చిత్తాలుంటాయి. కనుక నేను నరునితో కలసివుంటూ దేవుణ్ణి వదలుకోలేను".

6. అర్సేనియస్ ముని కానోపస్ అనే యెడారి ప్రాంతంలో జీవిస్తుండగా రోమునుండి ఓ భక్తురాలు అయన్ని దర్శించడానికి వచ్చింది. ఆమె ఉన్నతురాలైన మహిళ. రోము శాసనసభలో సభ్యురాలు కూడ. ఆమె వచ్చేటప్పటికి ముని ఆశ్రమం వెలుపలే వున్నాడు. ఆమె అతని పాదాల మీద వాలి అయ్యా! నన్ను సదా జ్ఞాపక ముంచుకోండి అని మనవి చేసింది. అతడు ఆమెను వదలించుకొంటూ "అమ్మా! నీ స్మృతిని నా హృదయం నుండి పూర్తిగా తొలగించమని దేవుణ్ణి వేడుకొంటాను" అన్నాడు.

7. దినం ఓ న్యాయాధిపతి ఓ వీలునామాను తీసికొని అర్సేనియస్ ముని దగ్గరికి వచ్చాడు. అర్సేనియస్ బంధువూ రోము శాసనసభ సభ్యుడూ ఐన ఓ ధనికుడు తన ఆస్తినంతటినీ అర్సేనియస్ పరం జేస్తూ ఆ వీలునామా వ్రాసాడు. ముని ఆ వీలునామాను తీసికొని దాన్ని చింపివేయబోయాడు. కాని న్యాయాధిపతి అయ్యా! మీరు దాన్ని చింపివేయవద్దు. అలా చేసారంటే నా తల తెగుతుంది అని మనవి చేసాడు. అందుకు ఆ ముని "ఈ ధనవంతుడు ఇప్పుడు చనిపోయాడు. కాని నేను ఇతని కంటె చాల యేండ్లకు ముందే చనిపోయాను" అని పలికాడు.

8. ఓ దినం ఓ సన్యాసి అర్సేనియస్‌ను చూడ్డానికి వచ్చి తలుపు తట్టాడు. ముని తలుపు తెరచిచూచి మరో సన్యాసి తన్ను దర్శించడానికి వచ్చినట్లు గుర్తించాడు. వెంటనే అతడు ఆ సన్యాసి ముందు నేలపై బోరగిలపడ్డాడు. సన్యాసి అయ్యా! తమరు

లేవండి. నేను మీతో కొన్ని విషయాలు మాట్లాడదామని వచ్చాను అన్నాడు. కాని అర్సేనియస్ నీవిక్కడినుండి వెళ్ళిపోయిందాకా నేను పైకి లేవను అన్నాడు. ఎంత బతిమాలినా అతడు పైకి లేవకపోవడం చూచి సన్యాసి వెళ్లిపోయాడు.

9. అర్సేనియస్ చనిపోతూండగా శిష్యులు అయ్యా! మీరు కన్నుమూసాక మీ దేహాన్ని ఏమి చేయమంటారని అడిగారు. ముని నా కాళ్ళకు త్రాడుగట్టి నా శవాన్ని కొండ మీదికి లాక్కొని వెళ్ళి అక్కడ వదలివేయండి అని చెప్పాడు. అతడు పలుసార్లు తన్ను తాను ఈలా హెచ్చరించుకొనేవాడు. "అర్సేనియస్! నీవు లోకాన్ని వీడి ఈ యెడారికి ఎందుకొచ్చావు?" "నేను మాట్లాడినందుకు చింతించాను గాని మౌనంగా వున్నందుకు ఏనాడూ చింతించలేదు". అతడు మరణిస్తూండడం చూచి శిష్యులు దుఃఖిస్తూ అయ్యా! నీకు మరణభయం లేదా అని అడిగారు. అతడు "ఇప్పుడే కాదు, నేను సన్యాసి నైనప్పటి నుండి మృత్యుభీతితోనే జీవిస్తూ వచ్చాను" అని పలికాడు. ఈ మాటలు పలికి చనిపోయాడు.

10. ఓ దినం అగతోన్ ముని ఆశ్రమంలో చేరడానికి ఓ ఆగంతకుడు వచ్చాడు. అతడు బాబూ! మీ ఆశ్రమంలోని సాధువులతో ఏలా మెలగాలో తెలియజేయండి అని అడిగాడు. అగతోన్ నీవు తొలిరోజు ఇక్కడ పరాయివాడిలాగ గడుపుతావు కదా! నీ జీవిత కాలమంతా నేను పరాయి వాణ్ణనే భావంతోనే ఇక్కడ జీవించు. ఇక్కడ ఎవరితోను చనువులకు దిగవద్దు అని చెప్పాడు. మకేరియస్ అనే మరోముని ఈ మాటలు విని, ఇతరులతో చనువుగా వుంటే ఏమి నష్టం అని అడిగాడు. అగతోన్ చనువు గాలి దుమారం లాంటిది. అది చెట్టుమీదికి వీచి దాని కాయల నన్నిటినీ రాలగొడుతుంది అని నుడివాడు. మకేరియస్ ఇతరులతో చనువుగా మాట్లాడితే అంత ప్రమాదం కలుగుతుందా అని విస్తుపోయాడు. అగతోన్ ముని "నాయనా! విచ్చలవిడిగా వాగే నాలుకంత ఘోరమైంది మరొకటి లేదు. అది చిన్న పాపాలకు మూలం. కనుక ఏకాంతంగా వసించే సాధువుకి గూడ నోటికి వచ్చినట్లుగా వాగడం తగదు" అని చెప్పాడు.

11. ఇంకా అగతోన్ ముని యీలా వాకొన్నాడు. "నాకు తెలిసినంతవరకు నేనెవరి మీద కోపతాపాలు పెట్టుకొని రేయి నిద్రకు ఉపక్రమించలేదు. నామీద కోపతాపాలతో ఎవరినీ నిద్దుర పోనీయలేదు".

12. ఓ సాధువు అగతోన్ ఆశ్రమంలో జీవించడానికి వచ్చాడు. అతడు వస్తూ వస్తూ దారిలో పెట్లుప్పుముక్క కన్పింపగా దాన్ని ఏరుకొని వచ్చాడు. అగతోన్ ఆ ముక్క యెక్కడిదని అడగ్గా సాధువు అది దారిలో దొరికిందని చెప్పాడు. అగతోన్ "నాయనా! నీవు స్వయంగా దారిలో పెట్టని ముక్కను ఏలా తీసికొనివచ్చావు? పోయి దాని స్థానంలో దాన్ని వుంచిరా" అని ఆజ్ఞాపించాడు.

13. అగతోన్ ముని తనకు ఎవరిని గూర్చయినా, ఏ వస్తువును గూర్చయినా, విమర్శించాలనే కోరిక పుట్టినపుడు తనతోతాను ఈలా చెప్పుకొనేవాడు. "అగతోన్! పరవిమర్శ దేవుని పని కాని నీ పనికాదు." ఈలా అనుకొని అతడు తన ప్రార్థనలో తాను నిమగ్నుడయ్యేవాడు.

14. ఇంకా అగతోన్ ముని ఇలా నుడివేవాడు. "కోపి మృతులను బ్రతికించగలిగేంతటి వాడయినాసరే, దేవునికి అంగీకార యోగ్యుడు కాలేడు".

15. ఇంకా అతడు ఈలా చెప్పేవాడు. "నా కెవరైనా కుష్ఠరోగి ఎదురువస్తే నా దేహాన్ని అతనికిచ్చి అతని దేహాన్ని నేను తీసుకోవాలనిపిస్తుంది. ఇది ఉదాత్తమైన ప్రేమ".

16. ఓ రోజు అగతోన్ ముని ఏవో చిన్న వస్తువులను అమ్ముకోడానికి నగరానికి వెళ్తూండగా దారిలో కాళ్లులేని అవిటివాడు కన్పించాడు. అతడు తన్ను గూడ నగరానికి మోసికొని వెళ్ళమనగా అగతోన్ అలాగే చేసాడు. అగతోన్ పట్టణంలో ఓ వస్తువును అమ్మగానే అవిటివాడు నీకెంత సొమ్ము ముట్టిందని అడిగేవాడు. అగతోన్ ఇంత అని చెప్పేవాడు. అవిటివాడు ఆ సొమ్ముతో తనకేదో వస్తువు కొనితెమ్మని అడిగేవాడు. ముని అలాగే చేసేవాడు. ఆవిధంగా తన వస్తువుల మీద వచ్చిన సొమ్మంతా అవిటివాని మీద ఖర్చుపెట్టాడు. అతడు తిరిగి ఆశ్రమానికి రాబోతుండగా అవిటివాడు తన్ను మళ్లా మోసికొనిపోయి తన పూర్వ స్థానంలో వదలివేయమని అడిగాడు. ముని అలాగే చేసాడు. అవిటివాడు అతన్ని నాయనా! నీకు భూమిమీదా స్వర్గంలోను దేవుని దీవెనలు లభిస్తాయి అని దీవించాడు. అగతోన్ కండ్లు విప్పి చూడగా అతనికి అవిటివాడు కన్పించలేదు. అతడు ఆ మునిని పరీక్షించడానికి వచ్చిన దేవదూత!

17. ఒక వృద్ధసాధువు 50 ఏండ్లదాకా రొట్టెను తినలేదు, ద్రాక్షరసం ముట్టలేదు. అతడు నేను కామాన్నీ, దురాశనీ, ఆత్మాభిమానాన్నీ పూర్తిగా జయించానని గొప్పలు చెప్పుకొనేవాడు. అప్పుడు అబ్రాహామనే ముని అతని దగ్గరికి వచ్చి నాయనా! నీవు నీ గదిలోనికి పోయినపుడు నీ చాపపై ఓ స్త్రీ పరుండి వుండడం చూస్తే నీకు ఆమెపై కోరిక పుట్టదా అని అడిగాడు. సాధువు, పుడుతుంది. కాని నేను నా కామ వికారాన్ని అణచుకొని ఆమెను ముట్టను అన్నాడు. అబ్రాహాము మళ్ళా నీవు దారివెంట బోయేపుడు రాళ్ళతో పాటు బంగారు ముక్క కూడ కన్పిస్తే నీకు దానిమీద కోరిక పుట్టదా అని అడిగాడు సాధువు, పుడుతుంది. కాని నేను నా దురాశను అణచుకొని దాన్ని ముట్టుకోను అన్నాడు. అబ్రాహాము ఇచ్చట ఇద్దరు సన్యాసులు వున్నారనుకో. వారిలో ఒకనికి నీవంటే యిష్టం, రెండవవానికి అనిష్టం. ఈ రెండవవాడు నిన్ను గూర్చి పరుషోక్తులు కూడ పలికాడు. వాళ్ళిద్దరూ నీ దగ్గరికి వచ్చారనుకో. నీవు వాళ్ళిద్దరిని సమానంగా ఆదరిస్తావా అని

అడిగాడు. సాధువు, ఆదరింపను. కాని నాలోని ఆత్మాభిమానాన్ని అణచుకొని నేనంటే యిష్టం లేని సన్యాసిని గూడ ఆదరంతో చూస్తాను అన్నాడు. అపుడు అబ్రాహాము "నీ జవాబులను బట్టి నీవు నీ దుర్గుణాలను ఎంతమాత్రం జయించలేదనీ వాటిని కేవలం అదుపులో పెట్టుకోగలిగావనీ మాత్రమే రుజువౌతుంది" అని చెప్పాడు.

18. బెస్సారియోన్ అనే ముని యిలా చెప్పాడు. "నేను పద్నాలుగేండ్ల నుండీ నేలపై పండుకొని యెరుగను. ఎప్పుడూ కూర్చుండో, నిల్చుండో మాత్రమే నిద్రపోతూ వచ్చాను".

19. బెంజమిన్ అనే ముని యీలా వాకొన్నాడు. "ఓసారి మేము షేటిస్ అనే యెడారి ప్రాంతంలో తపస్సు చేసికొనే ఓ వృద్ధుని చూడబోయాం. అతని కొరకు కొంచెం నూనె కూడ తీసుకొని వెళ్ళాం. కాని ఆ ముదుసలి అయ్యలార! మీరు మూడేండ్ల క్రితం తెచ్చియిచ్చిన నూనె సీసాను చూడండి. దానిలోని తైలం ఇంకా అలాగే వుంది అని చెప్పాడు. అప్పుడు మేము అతడు ఎంత పుణ్యాత్ముడో అని విస్తుపోయాం".

20. జలేష్యస్ అనే మునికి చర్మంతో తయారుచేసిన బైబులు ప్రతి వుండేది. అది 18 వెండినాణాల ఖరీదు చేస్తుంది. అతడు ఇతర సన్యాసులు కూడ చదువుకొంటారనే భావంతో దాన్ని దేవాలయంలోనే వుంచేవాడు. ఓ దినం ఓ క్రొత్త సన్యాసి జలేష్యస్‌ను చూడ్డానికి వచ్చి ఆ బైబులును ఏలాగైనా తస్కరించాలనుకొన్నాడు. తాను వెళ్ళేపుడు దాన్ని చంకన బెట్టుకొని పోయాడు. జలేష్యస్ ఆ సంగతి గమనించి కూడ సన్యాసి వెంటబడలేదు. సన్యాసి దాన్ని పట్టణంలోని ఓ అంగడిలో 13 వెండినాణాలకు అమ్మజూచాడు. కాని అంగడివాడు అయ్యా! మొదట నన్ను దీన్ని పరిశీలించనీయి. తరువాత నీకు ఉచితమైన వెలనిస్తాను అని చెప్పాడు. కనుక సన్యాసి ఆ ప్రతిని అతని దగ్గరనే వదలిపెట్టి పోయాడు. మరుసటి రోజు అంగడివాడు ఆ బైబులును జలేష్యస్ వద్దకు కొనిపోయి బాబూ! ఎవరో ఈ పుస్తకాన్ని నా దగ్గరికి తెచ్చి దీనికి 13 నాణాలు చెల్లించమని కోరారు. ఇది అంత వెల చేస్తుందా అని అడిగాడు. జలేష్యస్, ఇది మంచి పుస్తకం. అంత ఖరీదు ఇచ్చి కొనవచ్చు అన్నాడు. కాని అంగడివాడు తిరిగిపోయి సన్యాసితో అయ్యా! నేనీ గ్రంథాన్ని జలేష్యస్ మునికి చూపించాను. అతడు ఇది మంచి పుస్తకమే గాని, 13 నాణాల వెల చేయదని చెప్పాడు అని బొంకాడు. సన్యాసి ఆతురతతో ఇంతేనా లేక జలేష్యస్ ఇంకేమైనా అన్నాడా అని అడిగాడు. అంగడివాడు అతడు ఇంకేమి అనలేదని పల్కాడు. సన్యాసి ఐతే నేను ఈ పుస్తకాన్ని నీకు అమ్మను అని చెప్పాడు. అతడు వెంటనే జలేష్యస్ దగ్గరికి వెళ్ళి పశ్చాత్తాపంతో కన్నీళ్లు కారుస్తూ మీ పుస్తకాన్ని మీరు తీసికోండి అన్నాడు. కాని ముని దాన్ని తిగిరి తీసికోడానికి ఇష్టపడలేదు. సన్యాసి మీ పుస్తకాన్ని మీరు తీసుకోకపోతే

నాకు మనశ్శాంతి కలుగదని వాపోయాడు. ఆ మాటలు విని జలేష్యస్ దాన్ని తీసికొన్నాడు. సన్యాసి ఆ మునికి శిష్యుడై జీవితాంతం అతని వద్దనే వుండిపోయాడు.

21. దానియేలు అనే ముని ఈ సంఘటనం చెప్పాడు. బాబిలోనియాలో భక్తిమంతుడైన ఓ ధనవంతుని కొమార్తెకు దయ్యం పట్టింది. అతనికి తెలిసిన సన్యాసి వొకడు నీ కూతురుకి సోకిన దయ్యాన్ని వెళ్ళగొట్టగల తాపసులు ఓ ఆశ్రమంలో వున్నారు. కాని వాళ్లు చాల వినయవంతులు. కనుక నీవడిగితే వాళ్ళు పిశాచాన్ని వెళ్ళగొట్టక పోవచ్చు. వాళ్ళు తమ వస్తువులను అమ్ముకోడానికి పట్టణానికి వస్తుంటారు. నీవు వాళ్ళ వస్తువులు కొన్ని కొను. వాళ్ళకు డబ్బు చెల్లించేపుడు నీ కొమార్తె ఆరోగ్యం కొరకు ప్రార్థన చేయమందాం, ఆ జపం వల్ల పిశాచం పారిపోతుంది అని చెప్పాడు. అలాగే చేద్దామని నిర్ణయించుకొని వాళ్లు సంతకు వెళ్ళిచూడగా పై తాపసుల శిష్యుడొకడు అక్కడ తామల్లిన బుట్టలను అమ్ముకొంటున్నాడు. ధనవంతుడు ఈ బుట్టలు నేను తీసికొని నీకు డబ్బులిస్తాను రమ్మని అతన్ని తన యింటికి తీసికొని వెళ్ళాడు. కాని ఆ బాలసన్యాసిని చూడగానే దయ్యం పట్టిన యువతి ఆగ్రహం చెంది అతని చెంప వాయించింది. ఆ బాల సన్యాసి క్రీస్తు ఆదేశించినట్లే రెండవ చెంపను గూడ ఆ యువతికి చూపించాడు. వెంటనే పిశాచం క్రీస్తు ఆజ్ఞ నన్నిక్కడి నుండి తరిమి వేస్తూంది. అని అరుస్తూ ఆ యువతిని వీడి వెళ్ళిపోయింది. క్రీస్తు ఆజ్ఞలోని వినయం ఈ పిశాచం గర్వాన్ని అణచివేసింది గదా అని అనుకొని అక్కడివాళ్ళంతా దేవుణ్ణి స్తుతించారు.

22. ఎపిఫేనియస్ ఈలా నుడివాడు. "కననీయ స్త్రీ బతిమాలగా ప్రభువు ఆమె వేడికోలు విన్నాడు. రక్తస్రావంచే బాధపడే స్త్రీ మౌనంగావున్నా ప్రభువు ఆమె వ్యాధిని కుదిర్చాడు. పరిసయుడు అధికంగా మాటలాడినా ప్రభువు అతన్ని మన్నించలేదు. సుంకరి నోరు మెదపకపోయినా దేవుడు అతన్ని మన్నించాడు."

23. ఏఫ్రేము ముని పసివాడుగా వున్నపుడే కలలో ఓ దర్శనం చూచాడు. అతని నాలుకపై ఓ ద్రాక్షలత పుట్టింది. అది యెదిగి ఆకాశాన్నంతటినీ ఆవరించింది. గుత్తులు గుత్తులుగా పండ్లు కాచింది. ఎన్నో పక్షులు వచ్చి ఆ ఫలాలను ఆరగించాయి. ఐనా పక్షులు తినే కొద్దీ దాని ఫలాలు తరగలేదు కదా, ఇంకా పెరిగాయి. ఈ దర్శనం ఏఫ్రేము ముని పెద్దవాడయ్యాక వ్రాయబోయే భక్తి గీతాలను సూచిస్తుంది.

24. యెషయా అనే ముని గోదుమ ధాన్యాన్ని రాలగొట్టే బద్దను తీసికొని ఓ రైతు కళ్ళానికి వెళ్ళి తనకు రాలగొట్టని గోదుమ గడ్డిని కొంత ఈయమని అడిగాడు. రైతు అయ్యా! నీవా గోదుమ పైరును వెదబెట్టావా అని అడగ్గా, ముని లేదన్నాడు. కాపు నీవు వెదబెట్టని గోదుమ గడ్డిని నేను నీకేలా యిచ్చేది అని ప్రశ్నించాడు. ఐతే పనిచేయని

వాడికి జీతం లేదా అని ముని అడగ్గా రైతు లేదని జవాబు చెప్పాడు. అంతట యెషయా అక్కడినుండి వెళ్ళిపోయాడు. అతని చర్యనంతటినీ గమనిస్తూన్న శిష్యులు అయ్యా! నీవీలా ప్రవర్తించడంలో భావమేమిటి అని అడిగారు. యెషయా నేను మీకు ఓ ఆదర్శం చూపించడానికే యీలా చేసాను. శ్రమ చేయనివాడికి దేవుని నుండి బహుమతి లభించదు అని చెప్పాడు.

25. ఏలీయా ముని ఈ వుదంతం తెలియజేసాడు. ఓ వృద్ధ సన్యాసి ఓ పాడుపడిన దేవళంలో వసస్తుండేవాడు. ఓ దినం పిశాచాలు అతని దగ్గరికి వచ్చి ఇది మా యిల్లు. నీవు ఈ తావుని వదలి వెళ్ళిపో అని దబాయించాయి. అతడు మీ కసలు ఏతావూ లేదు పొండన్నాడు. అవి రెచ్చిపోయి అతని తాటాకుల గ్రంథంలోని ఆకులను ఊడబెరికి చిందర వందరగా వెదజల్లాయి. సన్యాసి ఓపికతో ఆయాకులన్నిటిని ఏరుకొన్నాడు. అటుపిమ్మట ఓ పిశాచం అతన్ని చేయిపట్టుకొని దేవళం వెలుపలికి లాగబోయింది. కాని సన్యాసి ఓ చేతితో దేవాలయ ద్వారబంధాన్ని గట్టిగా పట్టుకొని "యేసు ప్రభూ! నన్ను కాపాడు" అని మనవి చేసాడు. ఆ ప్రార్థనకు దయ్యాలు పారిపోయాయి. సన్యాసి పిశాచాలు నా కింత పని చేసాయి కదా అనుకొని దుఃఖంతో ఏడ్వడం మొదలెట్టాడు. అప్పుడు ప్రభువు ఓయి! నీవు అశ్రద్ధ చేసావు. నీవు నాకు మొరపెట్టగానే నేను నిన్ను కాపాడాను గదా? మొదటనే నీవు నన్నెందుకు ఆశ్రయించలేదు. నేను సిలువపై బాధలనుభవించింది నరుల బాధలు తొలగించడానికి కాదా? నా సహాయాన్ని అడిగేవాణ్ణి నేను వెంటనే ఆదుకోనా? అన్నాడు.

26. తియొడోరా అనే సన్యాసిని ఈలా చెప్పింది. తపస్సు, జాగరణం, కష్టాలు అనుభవించడం మొదలైన పుణ్యకార్యాల ద్వారా గాక వినయం వల్లనే మనకు రక్షణం కలుగుతుంది. వినండి. ఓ సన్యాసి వుండేవాడు. అతడు భూతాలను పారద్రోలగలడు. ఓ దినం అతడు పిశాచాన్ని చూచి నీవు నరులు ఉపవాసం చేస్తే పారిపోతావా అని అడిగాడు. పిశాచం మేము భోజనం ముట్టుకోము అంది. అతడు మీరు నరులు జాగరణంచేస్తే పారిపోతారా అని అడిగాడు. దయ్యం మేము నిద్రపోమంది. అతడు మేము ఈ ప్రపంచాన్ని పరిత్యజిస్తే మీరు పారిపోతారా అని ప్రశ్నించాడు. అది మేము లోకంలో గాక ఎడారుల్లో వసిస్తాము అంది. సన్యాసి ఐతే మీరు ఏ శక్తికి లొంగి పారిపోతారో చెప్పు అన్నాడు. పిశాచం మేము వినయానికి దప్ప మరిదేనికీ లొంగం అంది. చూచారా! దయ్యాన్ని జయించాలంటే వినయానికి మించిన సాధనం లేదు.

27. ఒక భక్తుడు తియోడోరాను అమ్మా! లోకాంతంలో మన శరీరాలు ఉత్థానమౌతాయనడానికి నమ్మక మేమిటి అని అడిగాడు. ఆమె మన క్రీస్తు చనిపోయి ఉత్థానమయ్యాడు కదా! ఆ ప్రభువు వుత్థానం మన వుత్థానానికి సూచకం గాను, ఆదర్శంగాను, విశ్వాస కారణంగాను వుంటుంది అని చెప్పింది.

28. పొట్టి జాన్ అనే ముని ఈలా వాకొన్నాడు. "ఓ రాజు శత్రురాజు పట్టణాన్ని వశం చేసికోవాలంటే దానిలోని ప్రజలకు ఆహారమూ నీళ్ళూ అందకుండా వుండేలా చేస్తాడు కదా! ఆకలి దప్పులకు తట్టుకోలేక విరోధులు అతనికి లొంగిపోతారు. అలాగే సాధకుడు ఉపవాసాలు చేస్తూ ఆకలిదప్పులు అనుభవిస్తూంటే అతని ఆత్మశత్రువులైన పిశాచాలు కూడ లొంగిపోతాయి".

29. ఈ మునే మరోసారి ఈలా వచించాడు. "మనం ఆత్మవిమర్శ అనే తేలిక బరువును మన నెత్తిమీది నుండి దించివేసాం. ఆత్మస్తుతి అనే పెద్ద బరువును మన నెత్తికి ఎత్తుకొన్నాం."

30. ఇతడే ఇంకోసారి యిలా చెప్పాడు. "పునీతులు తోటలోని రకరకాల పండ్ల చెట్ల లాంటివాళ్ళు. అవి వేరు వేరు రుచులు గల ఫలాలు కాస్తాయి. ఐనా వాటి కన్నిటికీ ఒకే నూతి నుండి నీరు పెడతారు. ఒక అర్చ్యశిష్టుని పుణ్యాభ్యాసం ఒక తీరుగా వుంటుంది. మరో అతని పుణ్యాభ్యాసం మరో తీరుగా వుంటుంది. కాని వారి నందరినీ పునీతం చేసేది మాత్రం ఒక్క పవిత్రాత్మే."

31. ఈ ముని ఆశ్రమంలో తర్ఫీదు పొందిన తీరు ఇది. అతడు సేవించిన ముని ఓ యెండిపోయిన కర్రను నేలలో పాతి రోజూ దానికి నీరు పోయమని జాన్‌ని ఆజ్ఞాపించాడు. ఆ చుట్టుపట్ల నీరు దొరకదు. చాల దూరం వెళ్ళి తెచ్చుకోవాలి. ఐనా జాన్‌ముని ఓపికతో రోజూ నీళ్ళు తెచ్చి దానికి పోసేవాడు. అలా మూడేండ్లు పోయగా అది కడన చిగిర్చి పూలు పూచింది. శిష్యుని విధేయతకు తగిన ఫలం లభించింది.

32. ఓ దినం ఈసిడోర్ ముని అలెగ్జాండ్రియా పట్టణానికి అగ్రపీఠాధిపతియైన తెయోఫీలస్‌ని సందర్శించడానికి వెళ్ళాడు. అతడు తిరిగి రాగానే ఆశ్రమంలోని సన్యాసులు అయ్యా ఆ పట్టణంలోని వింతలేమిటి అని అడిగారు. ముని నేనా నగరంలో అగ్రపీఠాధిపతిని తప్ప మరెవ్వరిని చూడలేదని చెప్పాడు. ఆ మాటలకు సన్యాసులు విస్తుపోయి అయ్యా! ఆ నగరం ఏదైనా ప్రమాదం వల్ల తగలబడి పోయిందా యేమిటి అని అడిగారు. ముని ఆ పట్టణం బాగానే వుంది. నాకు తియోఫీలస్‌ను దప్పితే మరెవ్వరినీ చూడబుద్ధి పుట్టలేదు. కనుక తలవంచుకొని వెళ్ళి తలవంచుకొని తిరిగివచ్చాను అన్నాడు. ఆ మాటలకు సన్యాసులు భక్తి తెచ్చుకొని తమ కండ్లను ఇంకా అదుపులో పెట్టుకొన్నారు.

33. సెలూషియా ఈసిడోర్ అనే యతి ఈలా పలికాడు. భక్తితో జీవించకుండా మాట్లాడేవాడికంటె మాట్లాడకుండా భక్తితో జీవించేవాడు మెరుగు. మొదటివాడు మాటలాడినా ప్రయోజనం లేదు. రెండవవాడు మాటలు కట్టిపెట్టి మౌనంగా వున్నా మంచి పనులు చేస్తాడు. మన మాటలకు చేతలకూ పొందిక కుదిరితే పరమార్థా న్నంతటినీ సాధించినట్లే.

34. యాకోబు యతి ఈలా వాకొన్నాడు. "దీపం చీకటి గదిని కాంతిమంతం చేస్తుంది. అలాగే దైవభీతి నరుని హృదయంలోనికి ప్రవేశించి దాన్ని తేజోవంతం చేస్తుంది. అది నరునికి సకల పుణ్యాలూ దైవాజ్ఞలూ బోధిస్తుంది.

35. ఈ మునే యిలా చెప్పాడు. "మనకు కావలసింది చేతలు కాని మాటలు కాదు. నేటి ప్రపంచంలో చేతల కంటె మాటలు ఎక్కువ అయ్యాయి. కాని వట్టి మాటల వల్ల ప్రయోజనం లేదు".

36. ఒక దయ్యం పట్టిన పిల్లవాణ్ణి స్వస్థత చేకూర్చడానికి ఆశ్రమానికి తీసుకవచ్చారు. అంతలోనే ఈజిప్టు నుండి కొందరు సన్యాసులు రాగా పర్శ్యన్ జాన్ అనే ఆశ్రమంలోని వృద్ధముని వారికి స్వాగతం చెప్పడానికి వెలుపలికి వస్తున్నాడు. అలా వస్తూ అతడు ఆశ్రమంలోని ఓ సన్యాసి ఆ బాలునితో పాపం చేస్తూండడం చూచాడు. ఐనా ముని ఆ సన్యాసిని ఏమీ అనలేదు. అతడు అన్నీ గమనించే దేవుడు ఆ సన్యాసి తప్పు చూచికూడ అతన్ని భస్మం చేయునపుడు నేను మాత్రం అతన్నెందుకు నిందించాలి అనుకొన్నాడు.

37. ఈ పర్శ్యన్ జాన్ అనే ముని ఈజిప్టులో వసించేవాడు. అతడు సోదర ప్రేమకు పెట్టింది పేరు. ఓ దినం అతడు తనతో పాటు వసిస్తూన్న ఓ సన్యాసి నుండి డబ్బు బాకీ తీసికొని బట్ట నేసికోవడానికి నూలు కొనుక్కొని వచ్చాడు. అతడు వస్త్రం నేసికోబోతూండగా ఇంకో ముని వచ్చి తనకు కొంచెం నూలీయమని అడిగాడు. జాన్‌ముని అలాగే యిచ్చాడు. అలాగే ఇతర యతులు కూడ వచ్చి అతని నూలంతా అడిగి తీసికొనిపోయారు. ఇంతలో అతనికి సొమ్మిచ్చిన సన్యాసి వచ్చి నా బాకీ తీర్చమని అడిగాడు. అతడు అరువు తెచ్చి బాకీ తీర్చడానికి గాను ఆ ప్రక్కనే వసిస్తూన్న యాకోబు అనే మరో తాపసి నివాసానికి బయలు దేరాడు. దారిలో అతనికి ఓ బంగారు నాణెం కన్పించింది. ఐనా జాన్ దాన్ని ముట్టలేదు. దాని మీద ప్రార్థనం చేసి తన నివాసానికి తిరిగివచ్చాడు. బాకీ యిచ్చిన సన్యాసి మళ్ళా వచ్చి తన సొమ్ము తిరిగి యిచ్చివేయమని పీడించాడు. జాన్ ముని తిరిగి యాకోబనే తాపసి దగ్గరికి ప్రయాణం కట్టాడు. దారిలో మళ్ళా బంగారు నాణెం కన్పించింది. అతడు దాన్ని ముట్టకుండా దానిపై ఓ ప్రార్థన చెప్పి తిరిగి వచ్చాడు. ఈలా మూడుసార్లు జరిగింది. నాల్గవ సారి అతడు యాకోబు తాపసి దగ్గరికి వెళ్తూండగా ఆ నాణెం తిరిగి కన్పించింది. జాన్ ముని దానిపై ప్రార్థన చేసి దాన్ని తీసికొనిపోయి యాకోబుకిచ్చి, ఇది నాకు దారిలో దొరికింది. ఎవరైనా దీన్ని పోగొట్టుకొన్నారేమో ఈ ప్రాంతంలో ప్రకటన వేయించు అని చెప్పాడు. కాని మూడు రోజులు ప్రకటనం వేయించినా ఎవరూ దానికోసం రాలేదు. అప్పుడు జాన్ ముని అయ్యా! నేను నీ దగ్గరికి వచ్చి డబ్బు

అరువు తీసికొని ఓ తాపసి బాకీ తీరుద్దామనుకొన్నాను. ఇంతలో దారిలో ఇది కన్పించింది. ఇది నాదని అడిగినవాళ్ళెవరూ లేరు కనుక నేను దీన్ని ఆ తాపసికిచ్చి అప్పు తీర్చుకొంటాను అన్నాడు. బాకీ వుండికూడ అతడు దారిలో కన్పించిన బంగారు నాణాన్ని ముట్టుకోనందుకు యాకోబు తాపసి చాల విస్తుపోయాడు.

38. ఓసారి ఈసాకు అనే ముని ఓ ఆశ్రమానికి వెళ్లాడు. అక్కడ ఓ తాపసి తప్పు చేస్తూండగా చూచి అతన్ని ఖండించాడు. అతడు తన నివాసానికి తిరిగి వచ్చాక ఓ దేవదూత తలుపుకి అడ్డంగా నిల్చుండి నేను నిన్ను లోనికి పోనీయను అన్నాడు. ఎందుకని అడగ్గా "నీవు ఖండించి వచ్చిన ఆ సన్యాసిని ఎక్కడ త్రోద్దామనుకొన్నావు అని దేవుడు నిన్ను ప్రశ్నిస్తున్నాడు" అని చెప్పాడు. ఈసాకు తన తప్పును గుర్తు తెచ్చుకొని పశ్చాత్తాపపడ్డాడు. దేవదూత "దేవుడు ఇప్పటికి నీ దోషాన్ని మన్నించాడు. ఇకమీద దేవుడు తీర్పు విధించకపూర్వమే నీవెవరికీ తీర్పు తీర్చవద్దు" అని చెప్పాడు.

39. కాష్యన్ అనే ముని ఈ వుదంతం తెలియజేసాడు. ఓ వృద్ధ సన్యాసి వుండేవాడు. ఒక పవిత్రురాలైన కన్య అతనికి పరిచర్య చేస్తూండేది. ఇరుగుపొరుగు వారు స్త్రీతో సేవలు చేయించుకొనేవాడు పవిత్రుడేనా అని శంకించి అతన్ని గూర్చి పరిపరి విధాల మాట్లాడ్డం మొదలెట్టారు. అంతట ఆ వృద్ధ సన్యాసి చనిపోతూ నా కర్రను నా సమాధిపై పాతి వుంచండి అని చెప్పాడు. అలాగే పాతివుంచగా అది మూడవనాడు చిగిర్చి పూలు పూచి కాయలు కాచింది. అప్పుడు ఇరుగుపొరుగు సన్యాసులు అతడు నిజంగా దైవభక్తుడేనని నమ్మారు.

40. ఒక మహిళ క్యాన్సర్‌తో బాధపడుతూ స్వస్థత చేకూర్చే వరం గల లొంజీనస్ అనే మునిని చూడగోరింది. అతడు అలెగ్జాండ్రియా పట్టణానికి తొమ్మిదిమైళ్ళ దూరంలో ఎడారిలో వసించేవాడు. ఆ భక్తురాలు లొంజీనస్ కోసం వెదుకుతూండగా అతడు పుల్ల లేరుకొంటూ సముద్రపు టొడ్డున కన్పించాడు. కాని అతడు లొంజీనస్ అని ఆమెకు తెలియదు. కనుక ఆమె అయ్యా! దైవభక్తుడైన లొంజీనస్ నివాసమెక్కడో నీకు తెలుసా అని అడిగింది. అతడు నీవు ఆ మోసగాని కొరకు ఎందుకు వెతుకుతున్నావు? అతడు వట్టి మాయావి. అసలు నీ బాధయేమిటో చెప్పు" అన్నాడు. ఆమె తన రొమ్ము మీది గాయాన్ని చూపించగా అతడు దానిమీద సిలువ గుర్తువేసి "తల్లీ! ఇక వెళ్ళు. దేవుడు నీకు ఆరోగ్యం దయచేస్తాడు. ఎవరో లొంజీనస్ అంటున్నావే, అతడు నీకేలాంటి సాయమూ చేయలేడు సుమా" అని చెప్పాడు. ఆ మహిళ అతని మాటలు నమ్మి తిరుగు ముఖం పట్టగా దారిలోనే క్యాన్సరు వ్యాధి నయమైంది. తర్వాత, ఆమె ఆ వుదంతాన్ని తోడివారికి తెలియజేసి తన రోగాన్ని నయంజేసిన నరుని రూపురేఖలను వివరించి చెప్పింది. జనులు అతడే లొంజీనస్ భక్తుడు అని చెప్పగా ఆమె నివ్వెరపోయింది.

41. ఓసారి ఓ యతి ఈజిప్టు మకేరియస్ దగ్గరికి వచ్చి అయ్యా! నాకేదైన ఉపదేశం చేయండని అడిగాడు. మకేరియస్ అతన్ని సమాధుల దొడ్డికి వెళ్లి అక్కడి మృతులను దూషించి రమ్మని చెప్పాడు. అలాగే ఆ యతి సమాధుల దొడ్డికెళ్ళి అక్కడ పాతిపెట్టబడిన వాళ్ళను దూషించాడు. వారిపై రాళ్లు విసరాడు. అతడు తిరిగివచ్చి మకేరియస్‌ను కలసికొని నీవు చెప్పినట్లే చేసివచ్చాను అన్నాడు. ముని ఆ మృతులు నిన్నేమీ అనలేదా అని అడగ్గా యతి ఏమీ అనలేదని చెప్పాడు. మకేరియస్ ఐతే రేపు వెళ్ళి వాళ్ళను స్తుతించిరా అని చెప్పాడు. ఆలాగే యతి వెళ్లి వాళ్లను స్తుతించాడు. మీరు పునీతులు, నీతిమంతులు, అపోస్తలులు అని కీర్తించాడు. ఆ పిమ్మట మకేరియస్ దగ్గరికి వచ్చి నీవు చెప్పినట్లే చేసి వచ్చానని విన్నవించాడు. ఆ ముని వాళ్లు నీకేమీ జవాబు చెప్పలేదా అని ప్రశ్నించగా యతి లేదన్నాడు. అప్పుడు మకేరియస్ “నాయనా! ఆ మృతులను నీవు దూషించినా భూషించినా ఏమీ చలించలేదు. రక్షణం పొందాలంటే నీవు కూడ ఆ చనిపోయిన వాళ్ళలా తయారు కావాలి. లోకం లోని నరుల పొగడ్తలనూ తెగడ్తలనూ పట్టించుకోనివాడు తప్పక రక్షణం పొందుతాడు” అని చెప్పాడు.

42. మోషే అనే సన్యాసి కామ సంబంధమైన తలపుల్లో చిక్కుకొని నిరాశచెంది ఆశ్రమాన్ని వదలి వెళ్లిపోవాలనుకొన్నాడు. అతడు ఈసిడోర్ అనే ముని చెంతకు వెళ్ళి తన బాధను చెప్పుకోగా ఆ ముని మోషేను తిరిగి తన గదికి వెళ్ళమన్నాడు. కాని మోషే నేను వెళ్ళలేనని పలికాడు. అప్పుడు ఈసిడోర్ మోషేను ఇంటిమీదికి తీసికొని వెళ్ళి ఆకాశంలో పడమటి వైపు చూడమన్నాడు. మోషే అలాగే చూడగా అతనికి ఆదిక్కున చాల దయ్యాలు కన్పించాయి. అవి రణగొణ ధ్వని చేస్తూ నరులను శోధించడానికి సంసిద్ధమౌతూన్నట్లుగా కన్పించాయి. అంతట ఈసిడోర్ మోషేను ఆకాశంలో తూర్పుదిక్కునకు చూడమన్నాడు. అతడాలాగే చేయగా అసంఖ్యాకులైన దేవదూతలు దేదీప్యమానంగా వెలిగిపోతూ కన్పించారు. అటుపిమ్మట ఈసిడోర్ మోషేతో “నాయనా! ప్రభువు తూర్పున నున్న దేవదూతలను భక్తులకు సహాయం చేయడానికి పంపిస్తాడు. పడమట నున్న పిశాచాలు నరులకు అపకారం చేయడానికి వెళ్తాయి. కాని దేవదూతలు పిశాచాల కంటె ఎక్కువ సంఖ్యలో వున్నారు చూడు. కనుక మనకు ఆధ్యాత్మిక జీవితంలో శోధనల కంటె దైవసహాయమే అధికంగా లభిస్తుంది” అని చెప్పాడు. ఆ మాటలకు మోషే తెప్పరిల్లి దేవునికి వందనాలర్పించి తిరిగి తన గదికి వెళ్లిపోయాడు.

43. షేటిస్ ఎడారిలో ఓ ఆశ్రమంలో ఓ తాపసి ఏదో తప్పు చేసాడు. అతన్ని ఖండించడానికి అక్కడి తాపసులంతా ప్రోగై ఆ ప్రక్కనే నివసిస్తున్న మోషే మునికి గూడ కబురుపెట్టారు. కాని అతడు వెళ్ళలేదు. ఆశ్రమం నుండి గురువు అతనికి మళ్లా కబురు

పంపి "నీవు తప్పక రావాలి. ఇక్కడివాళ్లంతా నీ కొరకు ఎదురుచూస్తున్నారు" అని చెప్పించాడు. మోషే ముని ఓ ఓటి కూజాను నీటితో నింపుకొని ఆ యాశ్రమానికి వెళ్లాడు. దారిపొడుగునా నీళ్ల బొట్లుబొట్లుగా కారుతున్నాయి. అక్కడి తాపసులంతా అతనికి స్వాగతం పలికి అయ్యా! నీవు ఆ వోటి కూజాను తీసికొని రావడంలో భావమేమిటి అని అడిగారు. మోషే ముని "నా తప్పులు నా వెనుక బొట్లుబొట్లుగా కారుతూన్నా నేను గమనించడం లేదు. ఐనా తగుదునయ్యా అని ఈ దినం ప్రక్కవాడి తప్పులు ఎన్నడానికి ఇక్కడికి వచ్చాను" అన్నాడు. ఆ మాటలు విని అక్కడి సన్యాసులంతా తప్పు చేసిన ఆ తాపసిని క్షమించి వదలివేసారు.

44. పట్టణాధికారి మోషేముని పుణ్యకార్యాలను గూర్చి విని అతన్ని సందర్శించడానికి వెళ్లాడు. కాని అధికారి వస్తున్నాడని మోషేకు ముందుగానే తెలిసింది. కనుక అతడు తన నివాసాన్ని వీడి సముద్రం వైపుగా పారిపోవడం మొదలెట్టాడు. దారిలో అధికారి అతన్ని కలసికొన్నాడు. కాని అతడే మోషే అని గుర్తించలేక అధికారి అయ్యా! ఈ ప్రాంతంలో మోషే అనే మహాత్ముడు వసిస్తున్నాడని విన్నాను. అతని నివాసం ఎక్కడ వుందో నీకు తెలుసా అని అడిగాడు, ఆ మాటలకు మోషేముని "నీవు ఆ మూర్ఖుణ్ణి చూడ్డానికి యింత దూరం వచ్చావా?" అన్నాడు. అధికారి మోషేను గూర్చి పూర్వం తాను విన్న వార్తలు నిజం కాదేమోనని శంకించి నిరాశతో పట్టణానికి తిరిగిపోయి అక్కడి గురువులకు జరిగిన సంగతి చెప్పాడు. ఆ గురువులు నీకు కన్పించిన వ్యక్తి ఆకారం ఏలా వుందని అడగ్గా అధికారి "అతడు వృద్ధుడు. చింపిరి గుడ్డలు తొడుక్కొని నల్లగా పొడుగ్గా వున్నాడు" అని చెప్పాడు. గురువులు అయ్యా! అతడే మోషేముని. నిన్ను తప్పించుకోడానికే అతడాలా మాట్లాడాడు అని చెప్పారు. అధికారి మోషే వినయాన్ని మెచ్చుకొంటూ వెళ్లిపోయాడు.

45. మాటోవ్ అనే ముని ఈలా నుడివాడు. "నరుడు దేవుణ్ణి సమీపించేకొద్దీ తన పాపాలను అధికాధికంగా గుర్తిస్తాడు. కావుననే యెషయా ప్రవక్త దేవుణ్ణి దర్శించగానే "నానోటి నుండి వెలువడేవన్నీ పాపపు మాటలే" అనుకొని భయపడ్డాడు.

46. పేటిష్ ఎడారిలో వసించే సిల్వేనస్ మునికి 12 మంది శిష్యులుండేవాళ్ళు. వీళ్ళల్లో మార్కు అంటే ఆ మునికి ఎక్కువ యిష్టం. మార్కు లిఖిత ప్రతులను వ్రాసే వ్రాయసకాడు. సిల్వేనస్ మార్కును అధికంగా ప్రేమించడం సహించలేక తతిమ్మా 11 మంది శిష్యులు ఆ ప్రక్కనే వున్న ఆశ్రమంలోని తాపసులకు ఫిర్యాదు చేసారు. ఆ సన్యాసులంతా ఓ దినం సిల్వేనస్‌తో మాట్లాడ్డానికి అతని ఆశ్రమానికి వచ్చారు. సిల్వేనస్ వారి ఫిర్యాదు విన్నాడు. అతడు వారందరినీ వెంటబెట్టుకొని ఒక్కో శిష్యుని గది దగ్గరికి

వెళ్లి తలుపు తట్టి పేరెత్తి పిలచి వారిని బయటికి రమ్మన్నాడు. ఐనా ఆ పదకొండు మందిలో ఒక్కడూ త్వరగా బయటికి రాలేదు. కాని సిల్వేనస్ మార్కు తలుపు తట్టగానే అతడు తలుపు తీసి బయటికి వచ్చాడు. వాళ్లంతా మార్కు గదిలోనికి వెళ్లి చూడగా అప్పుడు ఆ శిష్యుడు గ్రీకు భాషలోని చివరి అక్షరమైన ఓమెగా వ్రాస్తున్నాడు. కాని సిల్వేనస్ తలుపు తట్టడం వల్ల ఆ యక్షరపురాత సగంలోనే ఆపివేసి వెలుపలికి వచ్చాడు. అప్పుడు సిల్వేనస్ ఇతర మునులను చూచి ఆ పదకొండు మంది యేరీ అని ప్రశ్నించాడు. వారు "అయ్యా! నీవు ఈ మార్కుని అధికంగా ప్రేమించడం సబబే. మేమూ ఇతన్ని ప్రేమిస్తున్నాం. భగవంతుడూ ఇతన్ని ప్రేమిస్తాడు" అని చెప్పారు.

47. మోయస్ అనే ముని వుండేవాడు. ఓ దినం ఓ సైనికుడు అతని దగ్గరికి వచ్చి అయ్యా! దేవుడు నరుల పశ్చాత్తాపాన్ని నిజంగా అంగీకరిస్తాడా అని అడిగాడు. మోయస్ అతినికి కొన్ని వేదవిషయాలు బోధించి కడన "నీ బట్ట చినిగిపోతే దాన్ని అవతల పారేస్తావా?" అని అడిగాడు. సైనికుడు "ఎందుకు పారవేస్తాను! దాన్ని కుట్టించి మళ్లా వాడుకొంటాను" అని చెప్పాడు. మోయస్ "నీ వస్త్రం పట్ల నీకు అంత ఆదర భావముంటే, దేవునికి తాను చేసిన ప్రాణుల పట్ల ఆదరభావముండదా?" అని ప్రశ్నించాడు.

48. ఒకసారి పట్టణాధికారి పోయెమన్ అనే మునిని దర్శింపగోరాడు. కాని ముని అతన్ని చూడ్డానికి ఇష్టపడలేదు. అధికారి ముని మేనల్లుడి మీద నేరం మోపి అతన్ని చెరలో పెట్టించాడు. పోయెమన్ వచ్చి అడిగితే అతన్ని విడిపిస్తానని చెప్పాడు. ఆ విధంగానైనా మునిని సందర్శించవచ్చు గదా అని అతని పన్నాగం. అంతట పోయెమన్ చెల్లెలు వచ్చి అన్న తలుపు తట్టింది గాని అతడేమీ జవాబీయలేదు. ఆమె దుఃఖాన్ని ఆపుకోలేక అన్నా! నీది మాంసపు గుండా లేక రాతి గుండా? నాకు వాడొక్కడే కొడుకు అని బోరున యేడ్చింది. కాని పోయెమన్ "నీకు ఒక్కడే కొడుకు కావచ్చు. నాకు ఏ కొడుకూ లేడు" అని జవాబిచ్చాడు. ఆమె వెళ్ళిపోయిన తర్వాత అధికారి పోయెమన్ దగ్గరికి బంటునంపి అయ్యా! నీవు అర్థిస్తే చాలు, నేను నీ మేనల్లుణ్ణి చెరనుండి విడిపిస్తాను అని కబురు పంపాడు. కాని ముని ఆ యధికారికి ఈ విధంగా ప్రత్యుత్తరమంపాడు. "నీవు ఖైదీకి న్యాయం తప్పకుండా తీర్పుచెప్పు. అతడు వధ్యుడైతే చంపివేయి. లేకపోతే నీ యిష్టం వచ్చినట్లు చేయి."

49. ఓసారి ఓ సన్యాసి పోయెమన్ మునిని "అయ్యా! పొరుగువాడు తప్పు చేయడం చూచి దాన్ని దాచిపెట్టడం ఉచితమేనా అని అడిగాడు. ముని అతనికి "మనం ఇతరుల తప్పులను దాచిపెట్టినప్పుడెల్లా దేవుడు మన తప్పులు దాచిపెడతాడు. మనం ఇతరుల దోషాలను బట్టబయలు చేసినపుడెల్లా దేవుడు మన దోషాలను వెల్లడిచేస్తాడు" అని జవాబు చెప్పాడు.

50. ఆ ముని యింకా ఈలా చెప్పాడు. "ఏ వస్తువు నీ హృదయం లోని కోర్కెలను తీర్చలేదో దానికి నీ హృదయాన్ని అర్పించవద్దు."

51. పోయెమన్ ముని యింకా ఈలా నుడివాడు. నీవు నీ కంటితో చూచిన దానికి సాక్ష్యమిమ్మని వేదగ్రంథం చెప్తుంది. కాని నేను చెప్పేదేమిటంటే, నీవు నీ చేతితో తాకి చూచినదానికి గూడ సాక్ష్యం ఈయవద్దు. ఒక సన్యాసి ఈలాగే మోసపోయాడు. అతడు తన ప్రక్కన వసించే మరో సన్యాసి ఓ స్త్రీతో పాపం చేస్తున్నాడని భ్రమపడ్డాడు. అతనికి పట్టరాని కోపం వచ్చింది. వాళ్ళ దగ్గరికి పోయి "ఆగండి. మీరింకా యెంతకాలం ఈలా పాపం చేస్తారు" అంటూ వాళ్ళను కాలితో ఒక్క తన్ను తన్నాడు. (వాళ్లు నరులనే అతని భ్రాంతి!) కాని అవి ఒక దానిపై ఒకటి పడి వున్న గోదుమపంట మోపులు! కనుకనే మీరు చేతులతో తాకి చూచినదానికి గూడ సాక్ష్యమీయవద్దని నేను ముందుగానే చెప్పాను.

52. ఆ ముని యింకా ఈలా వాకొన్నాడు. "ఇతరులకు బోధ చేయాలని చాలమంది తహతహలాడుతూంటారు. కాని తనలోని ఆశాపాశాలను అణచుకొన్న భక్తిమంతుడే గాని అన్యులను బోధ చేయడానికి అర్హుడు కాడు. మన యిల్లు కూలిపోతూండగా ప్రక్కవాడి యిల్లు బాగుజేయ బూనడం అవివేకం గదా?"

53. ఎవరో సన్యాసి మన పొరుగువారిని గూర్చి చెడ్డగా మాట్లాడకుండా వుండాలంటే యేమి చేయాలని పోయెమన్ మునిని అడగ్గా అతడీలా చెప్పాడు. మనం వేరు, మన పొరుగువారు వేరు. నరుడు తన్ను గూర్చి తాను జాగ్రత్తగా పరిశీలనం చేసి చూచుకొని తన పాపాలకు తాను పశ్చాత్తాప పడితే, ఇతరుడు తనకంటె యోగ్యుడని తలుస్తాడు. కనుక అతన్ని గూర్చి చెడ్డగా మాట్లాడడు. కాని తన్ను తాను ఉత్తమునిగా భావించుకొంటే, అన్యుడు అతనికి తక్కువవాడు గానే కన్పిస్తాడు. కనుక అతన్ని కించపరుస్తూ మాట్లాడతాడు.

54. జాన్ అనే సన్యాసి పోయెమన్ మునిని గూర్చి యీలా చెప్పాడు. ఓసారి మేము పోయెమన్ మునిని చూడ్డానికి సిరియా దేశానికి వెళ్లాం. మేము హృదయ శుద్ధిని గూర్చి ప్రశ్నింపగా అతడీలా చెప్పాడు. నీరు మెత్తగా వుంటుంది. రాయి గట్టిగా వుంటుంది. కాని మనం నీటి సీసాను రాతికి పైగా వ్రేలాడగట్టి దానినుండి నీరు రాతిపై బొట్లుబొట్లుగా పడేలా చేసామంటే, కొంతకాలానికి ఆ బొట్ల తాకిడికి రాయి అరిగిపోతుంది. దైవ వాక్యం గూడ యీలాగే చేస్తుంది. అది మృదువైంది, మన హృదయం కఠినమైంది. కాని పలుసారులు దైవవాక్యాన్ని వినేవాడి హృదయం దైవభీతితో నిండిపోతుంది.

55. షేటిస్ ఎడారిలో తపస్సు చేసికొనే ఓ యతి తప్పుచేసాడు. అతనికి తీర్పు తీర్చడానికి అక్కడి మునులంతా ప్రోగయ్యారు. వారంతా లేచి ఆ యతి తప్పును గూర్చి మాట్లాడారు. కాని మఠాధిపతి మాట్లాడకుండా మౌనంగా వుండిపోయాడు. కాసేపయ్యాక

అతడు సభనుండి లేచి బయటికి వెళ్ళిపోయాడు. మళ్లా సభలోనికి వచ్చాడు. ఈమారు అతని భుజంపై రెండు ఇసుక సంచులు వ్రేలాడుతున్నాయి. అతని రొమ్ము మీద్ది చిన్న సంచి. వీపు మీద్ది పెద్ద సంచి. మునులు ఈ సంచుల భావమేమిటని అడగ్గా ఆ మఠశ్రేష్ఠుడు ఈలా చెప్పాడు. "ఎక్కువ ఇసుకతో గూడిన వెనుకటి సంచి నా తప్పులు. నేను నా తప్పులను గమనించకుండటానికి గానూ, వాటికి పశ్చాత్తాప పడకుండటానికి గానూ, వాటిని నా వెనుక పెట్టుకొన్నాను. ఈ ముందటి చిన్న సంచి నా పొరుగువాని తప్పులు. నేను నిత్యం వీటిని గమనిస్తూ నా పొరుగువానికి తీర్పు విధిస్తూంటాను. కాని యిది పద్ధతికాదు. నేను నా పాపాల సంచి నా ముందుంచికొని నిత్యం నా తప్పులను గమనిస్తూండాలి. వాటిని మన్నించమని దేవునికి మనవి చేసుకొంటూండాలి". ఆ మాటలు విని మునులంతా లేచి నిల్చుండి రక్షణమార్గమంటే యిదే అని పల్కారు.

56. రోమానస్ అనే ముని చనిపోతూండగా శిష్యులంతా అతని చుట్టూ గుమిగూడి అయ్యా! నీవు కాలం చేసాక మేమేలా ప్రవర్తించాలో తెలియజేయమని అడిగారు. అతడు ఈలా అన్నాడు. "నేను మీకేదైనా ఆజ్ఞ యిచ్చినపుడల్లా మీరా యాజ్ఞను పాటించకపోతే నేను కోపపడగూడదని నిర్ణయం చేసికొనే ఆ యాజ్ఞ నిస్తూవచ్చాను. కనుకనే మనం ఇంతకాలం శాంతితో జీవించగలిగాం."

57. ఓ సన్యాసి సీసోమెస్ మునిని అయ్యా! కామ క్రోధాదులు నన్ను వదలడం లేదేమిటి అని ప్రశ్నించాడు. ముని "బాబూ! వాటి వ్రేళ్లు నీ హృదయంలోనికి లోతుగా చొచ్చుకొని పోయాయి. వాటిని పెరికివేయి, అప్పుడు నీకు శాంతి కలుగుతుంది" అని చెప్పాడు.

58. సీమోను అనే మునిని గూర్చి ఈ వుదంతం ప్రచారంలో వుంది. ఓసారి పట్టణాధికారి ఆ ముని పుణ్యాన్ని గూర్చి విని అతన్ని సందర్శించడానికి రాదల్చుకొన్నాడు. తోడి సన్యాసులు అయ్యా! పట్టణాధికారి నిన్ను సందర్శించి నీ యాశీర్వాదాన్ని పొందడానికి వస్తున్నాడు. జాగ్రత్తగా సిద్ధంకా అని చెప్పారు. వెంటనే అతడు ఓ ముతక బట్టను ధరించాడు. కొంచెం రొట్టా వెన్నా తీసికొని వాకిటిలో కూర్చుండి పరమానందంగా వాటిని తినడం మొదలెట్టాడు. పట్టణాధికారి తన పరివారంతో వచ్చి అలా తింటూన్న మునిని చూచి ఏ మాత్రం మెచ్చుకోలేదు. నేను మహాభక్తుడని విన్న ముని యితడేనా అనుకొంటూ చిరాకుగా వెళ్ళిపోయాడు. తన పన్నాగం ఫలించనందులకు సీమోను ముని సంతోషించాడు.

59. సింక్లేటికా అనే సన్యాసిని యిలా చెప్పింది. "లోకంలో మనం పొరపాటున తప్పుచేసినా మనలను జెయిల్లో పెడతారు. కనుక మన పాపాల కొరకు మనలను మనమే చెరలో బంధించి వుంచుకొందాం. ఈలా మనం బుద్ధిపూర్వకంగా తెచ్చుకొన్న శిక్ష, రానున్న పరలోక శిక్షను తప్పిస్తుంది".

# 7 పునీత ఇగ్నేష్యస్ సూక్తులు

బైబులు భాష్యం - 106

## 1. నిరీక్షణం

1. మనంచేసే పనులన్నిటిలోను ఈ క్రింది సూత్రాన్ని పాటించాలి. ఓ వైపున మనం చేపట్టే కార్యాల విజయం దేవునిమీదగాక మనమీదనే ఆధారపడి వుందో అన్నట్లుగా పనిచేయాలి. మరోవైపున ఆ పనులు మన కృషివల్లగాక దేవుని సహాయంవల్లనే సఫలమౌతాయో అన్నట్లుగా భగవంతుణ్ణి నమ్మాలి.

2. మన తరపున మనం దేవుని వరాలను స్వీకరించలేక అలసిపోతామేమోగాని, దేవుడు మాత్రం వాటిని ఈయలేక అలసిపోడు.

3. ఓ వున్నతాధికారంలోవున్న వ్యక్తి ఇగ్నేష్యస్‌కి వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నాడనీ, అతడు ఇగ్నేష్యస్ సంకల్పించిన కార్యాన్ని భగ్నం చేయవచ్చుననీ ఎవరో ఇగ్నేష్యస్‌తో చెప్పారు. ఆ మాటలకు ఇగ్నేష్యస్ "ఈ లోకమంతా కలసి నన్ను నాశంచేయడానికి పూనుకొన్నా అంతకంటే అదనంగానే దేవుడు నన్ను రక్షించడానికి ముందుకి వస్తాడు. ఆ సమయం వచ్చినపుడు నీవే ఈ సత్యాన్ని గుర్తిస్తావు" అని పల్కాడు.

4. దేవుడు గడ్డిమొక్కలను సుందరమైన పూలు తొడుగుతాడు. ఆకాశపక్షులకు ఆహారం అందిస్తాడు. అవి విత్తనాలు విత్తవు, పైరు కోయవు, ధాన్యం గాదెల్లో దాచుకోవు. అలాంటి ప్రభువు ఏ జీతంలేకుండానే తన ద్రాక్షతోటలో శ్రమజేసే పనివాళ్ళ అక్కరలు తీర్చడా?

5. దేవుని కొరకు గొప్పకార్యాలు సాధించగోరేవాడు కేవలం తన తెలివితేటల మీదను శక్తిసామర్థ్యాలమీదను మాత్రమే ఆధారపడకూడదు. అపోస్తలులు కొద్దిమంది. తెలివిలేనివాళ్ళు. లోకం దృష్టిలో ఎందుకూ పనికిరానివాళ్ళు. ఐనా వాళ్ళు లోకాన్ని క్రీస్తుకి జయించి పెట్టడానికి పూనుకొన్నారు. సిలువతో ఈ లోకపు రాజులనూ జ్ఞానులనూ జయించబూనారు. తమ శక్తివల్లగాక క్రీస్తు బలంవల్ల గెలుస్తామని వాళ్ళకు తెలుసు.

## 2. దైవప్రేమ

6. నరులుగాని దేవదూతలుగాని దేవునికి కీర్తి చేకూర్చి పెట్టడంకంటె గొప్పకార్యమేమీ చేయలేరు. మొదట మన ద్వారాను తర్వాత ఇతరులద్వారాను ప్రభువుకి కీర్తి సిద్ధించేలా చేయాలి.

7. ప్రభూ! నీ ప్రేమను నీ వరప్రసాదాన్నీ నాకు దయచేయి. వీటితో నేను సంపన్నుణ్ణవుతాను. నాకు ఇంకేమి అక్కరలేదు.

8. స్వర్గంవైపు జూస్తుంటే ఈ లోకం ఎంత నిస్సారమైందా అన్పిస్తుంది.

9. ప్రేమను మాటల్లోగాక చేతల్లో చూపించాలి. మన మాటలు చేతలుగా మారిందాకా వాటికి దేవుని యెదుట ఏ విలువా వుండదు.

10. దేవుణ్ణి ప్రేమించడంకంటె మధురమైన వస్తువేదీ లోకంలో లేదు. ప్రేమకు నిజమైన గురుతేమిటిటంటే, మనం ప్రేమించే వాళ్ళకొరకు బాధలు అనుభవించడం. కనుక దేవుని కొరకు శ్రమలు అనుభవించడం మహానందం అనుకోవాలి. క్రీస్తు కొరకు మనం అనుభవించే శ్రమలే దేవుడు మనకు దయచేసే మహాభాగ్యాలు అని చెప్పాలి.

11. భగవంతుణ్ణి హృదయంలో నిల్పుకొనేవాడు ఎక్కడికి వెళ్ళినా మోక్షాన్ని తనతో తీసికొని పోతాడు.

12. దేవుడు కలవాడికి ఏమీ లేకపోయినా అన్నీ వున్నట్లే. మంచి అంతా ఆ భగవంతుల్లోనేవుంది. కనుక అతన్ని సంపాదించుకొన్నవాడికి అన్ని భాగ్యాలూ లభిస్తాయి.

13. "దేవుణ్ణి అర్థంచేసికొన్న భక్తుడు ఆ ప్రభువుని జ్ఞప్తికి తెచ్చుకోవాలంటే ఆకాశంవైపో చుక్కలవైపో చూడనక్కరలేదు. చిన్నగడ్డిపోచకూడ అతనికి దేవుణ్ణి జ్ఞప్తికి తెస్తుంది". ఈ సూత్రం ప్రకారం ఇగ్నేష్యస్ ఓ చిన్న పూవును చూచినంత మాత్రాన్నో లేక ఓ పక్షికూతను విన్నంత మాత్రాన్నో భగవంతుని ప్రేమతో నిండిపోయేవాడు.

## 3. సోదరప్రేమ

14. దేవునికి అన్నీ వున్నాయి. మన సేవలు అతనికి అక్కరలేదు. కాని దేవుని ప్రేమకొరకు మనం ఆ సేవలను తోడినరులకు చేయాలి.

15. నరులు ఎంత అయోగ్యులైనా మనం వాళ్ళను ప్రేమించవలసిందే. ఇప్పుడు కాకపోయినా పూర్వం వాళ్ళల్లో వున్న విశ్వాసాన్నీ పుణ్యాలనూ చూచి మనం వాళ్ళను ప్రేమించవలసిందే.

16. తల్లి బిడ్డను ఆరోగ్యంగా వున్నప్పటి కంటె వ్యాధిగా వున్నప్పుడు ఎక్కువగా పరామర్శిస్తుంది. ఎక్కువగా సేవలు చేస్తుంది. మనంగూడ పాపాత్ములతో మెలిగేప్పుడు ఈ సూత్రాన్ని పాటించాలి.

17. ఇరుగుపొరుగువాళ్ళకు మేలు కలిగినప్పుడు మనం తప్పకుండా సంతోషించాలి. ఎందుకంటే వాళ్లు దేవుని పోలికగా కలిగింపబడినవాళ్లు. క్రీస్తు చిందించిన నెత్తురు వలన పాపవిమోచనం పొందినవాళ్లు. మనం ఇతరుల్లో క్రీస్తుని మాత్రమే చూడాలి. వాళ్ళ తప్పులనూ పొరపాట్లనూ గమనిస్తూ కూర్చోగూడదు. ఈ లోపాలను చూడ్డం మొదలు పెట్టామంటే మన హృదయంలో ప్రేమ ఇంకిపోతుంది. అసహ్య భావాలు కలుగుతాయి. ఇక మనం ప్రేమించవలసినవాళ్ళను ప్రేమించలేం.

18. నిరంతరం ఇతరుల తప్పులను గమనించేవాడు తన తప్పులను గుర్తించలేడు.

19. తోడినరుడు ఏదో తప్పుచేసాడని తెలియగానే అతని తప్పు మనకు ఓ అద్దంలా ఉపయోగపడాలి. ఈ యద్దంలో మన లోపాన్ని మనం బాగా పరిశీలించి చూచుకొని దాన్ని సవరించుకొనే ప్రయత్నంచేయాలి. లేకపోతే అతనికి పట్టినగతే మనకూ పట్టవచ్చు.

20. మనం త్వరపడి ఇతరుని కార్యాలను తప్పులనుగా గణించకూడదు. ఎందుకంటే ఆ పనులు చేయడంలో అతని వుద్దేశం మంచిదే ఐయుండవచ్చు. బయటికి మాత్రం ఆ కార్యాలు మనకు చెడ్డవిగా కన్పించవచ్చు. ఇగ్నేష్యస్ ఎప్పుడు ఈ సూత్రాన్ని పాటిస్తూండేవాడు. కనుక ఎవరైనా పలానా వ్యక్తి కార్యాలు మీరనుకొన్నట్లుగా చెడ్డవికావని వాదిస్తుంటే ఇతరులు "అతడు ఇగ్నేష్యస్‌లా మాటలాడుతున్నాడు" అనేవాళ్లు.

21. ఎవరైనా నిజంగా తప్పుడుపనిచేస్తే, ఆ కార్యాన్ని సమర్థించడానికి ఏ మాత్రం వీలులేకపోతే; అప్పుడుకూడ అతన్ని ఖండించవద్దు. అతనికి ఎంత బలమైన శోధనం వచ్చి వుంటుందో ఆలోచించిచూడు. ఆ తీవ్రమైన శోధన నీకూ వచ్చినట్లయితే నీవూ అంత తప్పో లేక అంతకంటె ఇంకా పెద్ద తప్పో చేసివుండేవాడివేకదా?

22. పొరుగువాని తప్పును ఇతరులకు తెలియజేసినప్పుడల్లా మన తప్పునే వెల్లడిచేసికొంటాం. ఇతరుల తప్పులను అవసరమైనవారికేగాని అనవసరమైన వారికి తెలియజేయగూడదనే విషయాన్ని ఇగ్నేష్యస్ ఖండితంగా పాటించాడు. ఒకసారి యిద్దరు గురువులు మాట్లాడుకొంటున్నారు. ఇగ్నేష్యస్ వారిని కలసికొని ఒకానొక యేసుసభ సభ్యుని లోపాలను కూర్చి మాట్లాడాడు. తర్వాత ఆ ఇద్దరిలో ఒకరికి మాత్రమే ఆ సభ్యుని లోపాలను తెలిసికొనే అధికారం వుందని ఇగ్నేష్యస్‌కి తట్టింది. వెంటనే అతడు నా సోదరుని

తప్పిదాలను అనవసరంగా ఇంకొకరికి తెలియజేసానుకదా అని బాధపడ్డాడు. శీఘ్రమే ఆత్మగురువు దగ్గరికివెళ్ళి పాపసంకీర్తనం చేసికొన్నాడు.

23. మనం చెప్పేదే ఒప్పయినా యితరులు చెప్పేది మాత్రం తప్పనకూడదు. ఎప్పుడుకూడ మనం యితరుల అభిప్రాయాన్ని గౌరవించాలి.

24. కొన్నిసార్లు మనం దేవుణ్ణి దేవునికే వదలివేసి అతన్ని తోడి నరుల్లో పరామర్శించాలి. అతనికి చేయగోరిన సేవలు తోడివారికి చేయాలి. నాకు కావలసింది కరుణ కాని బలి కాదు అన్నాడు ప్రభువు.

25. మనం చేసే కార్యాలను దేవుడు మాత్రమేకాక దేవదూతలూ నరులూ కూడ చూస్తారు. కనుక మనం దేవుని యెదుట మాత్రమేకాక నరుల యెదుటకూడ ఒప్పేగాని తప్పుచేయకూడదు. మన క్రియల్లో మనం మొదట దేవుని అంగీకారాన్ని పొందాలి. అటుతర్వాత నరుల అంగీకారాన్ని గూడ పొందాలి. ఎవరుకూడ మన కార్యాల్లో తప్పులు పట్టనట్లుగా నడచుకోవాలి. అప్పుడుగాని మన సేవలు యితరులకు ఉపయోగపడవు.

26. మన మనస్సును దేవునిమీద నిల్పివుంచుకొంటూనే యితరులకు పరిచర్య చేయవచ్చు. దైవసాన్నిధ్యాన్ని నిరంతరం గుర్తుంచుకొంటూ ఆ ప్రభువుని అన్నితావుల్లోను అన్ని పనుల్లోను దర్శించవచ్చు. ప్రేమించవచ్చు. ఇతరులకు పరిచర్య చేసేపుడు మనం దేవదూతలను అనుకరించాలి. వాళ్ళు స్వర్గాన్ని వదలిపెట్టి లోకంలోని నరులకు సేవలు చేయడానికి వచ్చినపుడు ఆ స్వర్గంలోని దేవుణ్ణి మరచిపోరు. ఈ లోకంలో మనకు సేవలు చేసేపుడుగూడ వాళ్ళు దేవుని దివ్యముఖాన్ని దర్శిస్తూనే వుంటారు, అతన్ని ప్రేమిస్తూనే వుంటారు.

27. మనం తోడి నరులతో స్నేహపూర్వకంగా మెలుగుతూ వాళ్ళను దేవుని దగ్గరికి తీసికొని రావాలి. మనతరపున మనం ఎప్పుడుకూడ ఇతరులకు అనుకూలంగా ప్రవర్తించాలి. మనం యితరుల అభిరుచులనూ కోరికలనూ అంగీకరిస్తే వాళ్ళు సులువుగా మనకు స్నేహితులౌతారు. అటుపిమ్మట వాళ్ళను క్రమేణ దేవుని దగ్గరికి రాబట్టవచ్చు.

28. ఇతరులతో మెలిగేప్పుడు మనమే వాళ్ళకు అనుకూలంగా ప్రవర్తించాలి. వాళ్ళే మనకు అనుకూలంగా ప్రవర్తిస్తారు అనుకోగూడదు. మనం అందరిపట్ల ఒద్దికగా ప్రవర్తిస్తే కొందరినైనా క్రీస్తు దగ్గరికి రాబట్టవచ్చు.

29. చిన్నచిన్న బహుమతులద్వారా తినుబండారాల ద్వారా చిన్నపిల్లలచేత గూడ పుణ్యకార్యాలను అభ్యాసం చేయించవచ్చు. నరులు జంతువులు చిన్నవిగా వున్నపుడు వాటికి తిండిపెట్టి వాటిచేత తాము కోరిన పనులెల్ల చేయిస్తూంటారు.

30. ఇగ్నేషియస్ చివరి రోజుల్లో వృద్ధాప్యం వలన యేసుసభ పరిపాలనాభారాన్ని వదలివేసాడు. వ్యాధిగ్రస్తులను పరామర్శించడం ఒక్కటే అతడు అట్టిపెట్టుకొన్న పని. అతడు ఆ ప్రాయంలోగూడ రోగుల్ని రోజూ చాలసార్లు సందర్శించేవాడు. వైద్యుడు వాళ్ళకు ఈయమన్న మందులూ ఆహారపదార్థాలూ వాళ్ళకు సకాలంలో అందేలా చూచేవాడు. వారిపట్ల ఎంతో ఆసక్తి మెలకువా చూపేవాడు.

31. అతడు ఈలా చెప్పేవాడు. సజ్జనులు ఆరోగ్యంగా వుండాలనీ దుష్టులు రోగాలవాత పడాలనీ నా కోరిక. సజ్జనులు ఆరోగ్యంగా వుంటే తమ శక్తిసామర్థ్యాలన్నీ దేవుని సేవకు వినియోగిస్తారు. దుష్టులు రోగగ్రస్తులైతే బుద్ధితెచ్చుకొని దేవుని దగ్గరికి తిరిగివస్తారు.

32. దేవుని ద్రాక్షతోటలో శ్రమజేసేవాడు బంగారంతోగాక మురికితో పనిచేయాలి. అతడు కుష్ఠరోగులకు సేవలు చేయబోతున్నాడు. అందుచేత వాళ్ళకుష్ఠ తనకుగూడ సోకకుండా వుండేలా చూచుకోవాలి.

## 4. వినయం

33. అగస్టీను భక్తుడు ఈలా చెప్పాడు. "గర్వితుడు తన్నుతాను గాఢంగా ప్రేమించుకొని దేవుణ్ణి అసహ్యించుకొంటాడు. వినయవంతుడు తన్నుతాను అసహ్యించుకొని దేవుణ్ణి ప్రేమిస్తాడు". ఈ వాక్యంతో నేను పూర్తిగా ఏకీభవిస్తాను.

34. "నీకు రెక్కలు వచ్చిందాకా ఎగరవద్దు". ఒకసారి యేసుసభకు చెందిన సభ్యుడొకడు తన సొంత సలహాలతోనే ఇతరులను ఆధ్యాత్మిక మార్గంలో నడిపించడం మొదలెట్టాడు. కాని అతడు తన అజ్ఞానంవల్ల చాలమందిని తప్పు త్రోవ పట్టించాడు. ఈ సంగతి తెలిసి ఇగ్నేషియస్ అతనికి కఠినమైన శిక్ష విధించాడు. అతన్ని రెండు భుజాలకు రెండు రెక్కలు కట్టుకొని యేసుసభ భవనంలోని సభ్యుల యెదుటికి రమ్మన్నాడు. "నీకు రెక్కలు వచ్చిందాకా ఎగరవద్దు" అంటూ మరోసభ్యుడు అతన్ని అందరి యెదుట మందలించేలా చేసాడు. అనాటినుండి పైవాక్యం యేసుసభలో సామెతగా మారిపోయింది.

35. ఓ యేసుసభ గురువు అయ్యా! శీఘ్రంగా వినయాన్ని అలవర్చుకొనే మార్గమేమిటి అని ప్రశ్నింపగా ఇగ్నేషియస్ ఈలా చెప్పాడు. మనం లోకంలోని జనం ప్రవర్తించేదానికి కేవలం భిన్నంగా ప్రవర్తించాలి. లోకంలోని ప్రజలు అసహ్యించుకొనేదాన్ని మనం ఆశతో కోరుకోవాలి. వాళ్ళు ఆశతో కోరుకొనేదాన్ని మనం అసహ్యించుకోవాలి.

36. ఓసారి ఇగ్నేష్యస్ లయినెస్ కలసి ప్రయాణం చేస్తున్నారు. గొర్రెలను గాచుకొనే పల్లెటూరి పిల్లవా డొకడు వాళ్ళను చూచాడు. ఇగ్నేష్యస్ వాలకమూ పేదదుస్తులూ అతనికి వింతగొల్పాయి. అతడు ఇగ్నేష్యస్‌ని చూచి పగలబడి నవ్వాడు. ఛలోక్తులు విసురుతూ అతన్ని ఎగతాళి చేసాడు. ఇగ్నేష్యస్ ఆ పిల్లవాడికి ఎదురుగా నిలబడి వాడు తన్నింకా అధికంగా గేలి చేసేలా ప్రోత్సహించాడు. లయినెస్ ఈ మొరటువాడితో మనకెందుకు; త్వరగా వెళ్ళిపోదాం రా అన్నాడు. కాని ఇగ్నేష్యస్ నెమ్మదిగా "ఈ పిల్లవాణ్ణి తనకిష్టమొచ్చినట్లుగా నవ్వుకోనీయి. వీడికి ఎప్పుడో అరుదుగా లభించే ఈ కొద్దిపాటి ఆనందాన్ని మనం చెడగొట్టకూడదు" అన్నాడు.

37. రోములోని యేసుసభ భవనంలో వసించే సభ్యులు తన్ను మెచ్చుకొన్నా పొగడినా గూడ ఇగ్నేష్యస్ బాధపడేవాడు. నన్ను పొగడేవాళ్ళు నన్ను కొరడాతో మోదినట్లే అనేవాడు. ఈ యింటిలోనివాళ్ళు ఇంత పుణ్యవంతమైన జీవితం గడుపుతూంటే నేను వాళ్ళకు దురాదర్శం చూపుతూన్నాను. నా సోదరుల్లో ప్రతి వొక్కరికి నాకులేని సద్గుణాలున్నాయి. వాళ్ళను చూస్తుంటే నాకు సిగ్గువేస్తుంది అని పల్కేవాడు.

38. జీవితంలో విజయాన్ని సాధించాలంటే మొదట చిన్న కార్యాలతో మొదలుపెట్టు. అప్పుడు దేవుడు నీకు పెద్దకార్యాన్ని చేయడానికి సహాయం దయచేస్తాడు. అతడు ఎప్పుడు కూడ గర్వాత్ములను కాదని వినయాత్ములకు తన వరప్రసాదాన్ని దయచేస్తాడు.

## 5. పేదరికం

39. సంపదలు మన అధీనంలో వుండాలి. మనం వాటి అధీనంలో వుండకూడదు.

## 6. బ్రహ్మచర్యం

40. మన ఇంద్రియాలు, విశేషంగా కండ్లు, చెవులు, దేహానికి ద్వారాల్లాంటివి. మనం వీటిని జాగ్రత్తగా అదుపులో పెట్టుకోవాలి.

41. పరలింగ వ్యక్తులతో మెలిగేప్పుడు ఎంతో జాగ్రత్తగా వుండాలి. ఈ సందర్భంలో మనం ఏ పాపం చేయకపోయినా చెడ్డపేరు తెచ్చుకొనే ప్రమాదముంది. నిప్పువల్ల గాకపోయినా దాని పొగవల్ల మసిబారి పోతాంగదా!

# 7. విధేయత

42. గ్రిగోరీ భక్తుడు చెప్పినట్లు, మనం మన పెద్దలకు విధేయులమైతే దేవుడు మన ప్రార్థనలకు విధేయుడౌతాడు.

43. మనం పెద్దలకు విధేయులమైనప్పుడు వాళ్లే మనలను పుణ్యమార్గంలో నడిపించుకొని పోతారు. పని చేస్తున్నా విశ్రాంతి పొందుతున్నా విధేయులైనవాళ్ళ జీవితం పుణ్యవంతమౌతూనే వుంటుంది. ఓడలోపోయే వాళ్లు నిద్రపోతున్నా ముందుకు సాగిపోతుంటారు కదా!

44. విధేయతలో మూడుమెట్లు ఉంటాయి. మొదటిది, పెద్దలు చెప్పిన పనిని మాత్రమే చేయడం. కాని బానిసలు కూడ యజమానులు చెప్పిన పనిని చేస్తారు. కనుక ఇది శ్రేష్ఠమైన మెట్టుకాదు. రెండవది, పెద్దలు చెప్పిన పని ఇష్టంతో చేయడం. వేదగ్రంథం "బలిని సమర్పించడం కంటె విధేయత మెరుగు" అని చెప్తుంది. ఎందుకంటే బలిలో పశువులను అర్పిస్తాం. విధేయతలో మన చిత్తాన్నే అర్పిస్తాం. ఇది మొదటి మెట్టుకంటె మెరుగైంది. మూడవది, పెద్దలు చెప్పిన పనిని ఇష్టపూర్తిగా చేయడం మాత్రమేకాక, వాళ్ళు చేసిన నిర్ణయాన్ని గూడ అంగీకరించడం. అనగా వాళ్ళ నిర్ణయం మంచిదేనని అంగీకరించి వాళ్ళు చెప్పినపని చేయడం, ఇది శ్రేష్ఠమైన విధేయత.

45. దేహం క్షేమంగా వుండాలంటే శిరస్సు ఇతర అవయవాలు కలసి పని చేయాలి. అవయవాలు తల ఆజ్ఞలను నెరవేర్చాలి కాని తల అవయవాల ఆజ్ఞలను నెరవేర్చకూడదు. అలాగే పిన్నలు పెద్దల శాసనాలను పాటించాలే కాని పెద్దలు పిన్నల శాసనాలను పాటించ కూడదు.

46. మనం మన పెద్దల్లో పొరపాట్లకూ బలహీనతలకూ గురయ్యే సామాన్యమానవులను చూడకూడదు. వారిలో క్రీస్తుని చూడాలి. ఆ ప్రభువు మహాజ్ఞాని, అనంతమైన సద్గుణాలు కలవాడు, ప్రేమమూర్తి. అతడు మనలను మోసగించడు, మన మోసానికిలొంగడు. మన పెద్దల్లో వుండి మనలను ఒడ్డుజేరుస్తాడు.

47. విధేయత వ్రతాన్ని చేపట్టి మఠజీవితం గడిపే వ్యక్తి ఓ శవంలా వుండాలి. దానికి సొంత చిత్తమూ అభిప్రాయాలూ వుండవు. అతడు ఓ ప్రతిమలా వుండాలి. దాన్ని ఎటు తిప్పినా అది కాదనదు. ఇంకా అతడు ముసలివాని చేతిలోని ఊతకర్రలా వుండాలి. అతడు దాన్ని తన యిష్టంవచ్చినట్లు వాడుకొంటాడు. వాడుకొన్నంక ఎక్కడైనా పెడతాడు. ఈలాగే విధేయులైనవాళ్లు పెద్దలు తమ్ము ఏలా వినియోగించుకొన్నా అడ్డుచెప్పకూడదు.

48. పెద్దలు ఆజ్ఞలు ఇచ్చేవాళ్ళు. విధేయులు ఆజ్ఞలు పాటించేవాళ్ళు. వివేకం ఆజ్ఞలు ఇచ్చే పెద్దల కుండాలి. ఆ యాజ్ఞలను పాటించే విధేయులకు వివేకం అక్కరలేదు. వాళ్ల పని మంచిచెడ్డలు ఆలోచించడం కాదు, పెద్దల ఆజ్ఞలను పాటించడం.

## 8. వివేకం

49. ఎక్కువ వివేకమూ తక్కువ పవిత్రతా కలవాళ్లు ఎక్కువ పవిత్రతా తక్కువ వివేకం కలవాళ్ళకంటె గొప్ప కార్యాలు సాధిస్తారు.

50. ఏదైనా పనిని చేపట్టకపూర్వం, అసలు ఏమిచేయాలో ముందుగా ఆలోచించుకోవాలి. పనినిచేసి ముగించాక దాన్ని ఏలా చేసామో పరిశీలించి చూచుకోవాలి. పనిని బాగా చేయడానికి ఈ రెండు సూత్రాలు వుపయోగపడతాయి.

51. మనం చేసే పనిని మొదట మన అంతరాత్మ అంగీకరించాలి. అటుపిమ్మట లోకులు దాన్ని తప్పక అంగీకరిస్తారు.

52. క్రియాశీలురు రెండు రకాలుగా వుంటారు. మొదటి రకంవాళ్లు ఇంటిని పడగొట్టకుండా కడతారు. వాళ్లు తమపని అందరికి ఉపయోగ పడేలాను ఎవరికీ హాని చేయకుండా వుండేలాను చూచుకొంటారు. తమ కార్యం ఎవరికైనా అసంతృప్తి కలిగిస్తే దాన్ని వెంటనే మానుకొంటారు.

రెండవరకంవాళ్లు ఒకవైపు ఇంటిని పడగొడుతూ మరోవైపు కట్టబోతారు. వాళ్ళుఒకవైపు బట్టను నేస్తూనే వుంటారు, మరోవైపు కోసివేస్తుంటారు. వారి ఆసక్తి మంచిదే గాని దానిలో ఉచితజ్ఞత ఉండదు. తమ పనివల్ల కలిగే చెడ్డను తామే గుర్తించరు. వీళ్ళు ఒక ఆత్మను రక్షింపబోయి పది ఆత్మలను నాశంజేస్తారు. ఇతరులు అడ్డువచ్చినా ఆగరు. ఇతరులతో విరోధాన్ని కొనితెచ్చుకొంటారు. తమ మఠసభలకుగూడ చెడ్డపేరు తెస్తారు.

53. ఆధ్యాత్మిక విషయాలమీద ప్రీతిలేనివారితో మెలిగేప్పుడు మొదట వాళ్ళను లోకవిషయాలను గూర్చి మాట్లాడనీయాలి. కడన మనం పరలోక విషయాలనుగూర్చి మాటలాడాలి. ఎప్పుడు గూడ మనం ఇతరుని తలుపుగుండా లోపల ప్రవేశించి మన తలుపుగుండా బయటికి రావాలి.

54. చిన్న కార్యాలను పట్టించుకోకుండా పెద్దకార్యాలను మాత్రమే చేయాలనుకోవడం, వాటికొరకు వేచివుండ అవివేకం. పెద్ద కార్యాలు ఎప్పుడోగాని మన పాలబడవు. కాని చిన్న కార్యాలను చేసే అవకాశం ఎల్లపుడూ మనకు లభిస్తూనే వుంటుంది. చిన్న కార్యాలు చాల తగులుతుంటాయి. కనుక వాటిని చేయడం వల్ల ఎంతో పుణ్యాన్ని

ఆర్జించవచ్చు. ఈ సూత్రమంటే ఇగ్నేష్యస్‌కి ఇష్టం. అతడు స్వీయదేశమయిన స్పెయినుకి వెళ్ళినపుడు అక్కడి ప్రజలకు జ్ఞానోపదేశం బోధించగోరాడు. కాని అతని అన్నకు ఈ కార్యం యిష్టంలేదు. కనుక అతడు జనం రారు అని సాకులు చెప్పాడు. ఇగ్నేష్యస్ ఒక్కడు వచ్చినా చాలు, చిన్నపిల్లవాడు ఒక్కడు వచ్చినా నాకృషి విఫలంకాదు అని పల్కి పనికి పూనుకొన్నాడు.

55. ఇగ్నేష్యస్ తాను వ్రాసిన జాబులను మూడు నాల్గుసార్లు సవరించిన పిదపగాని పంపవలసిన వారికి పంపేవాడు కాదు. ఎవరైనా ఇతరులమీద నేరం తెస్తే వాళ్ళ ఫిర్యాదును కాగితంమీద వ్రాయించి సంతకం చేయించి తన దగ్గర వుంచుకొనేవాడు. అన్ని విషయాల్లోను జాగ్రత్తగా వుండడం అతనికి అలవాటు.

# 9. స్వీయబలం

56. మన హృదయంలో అలజడి వుండకూడదు. శాంతి, క్రమశిక్షణ నెలకొని వుండాలి. చచ్చినవాణ్ణి జీవంతో లేపడం కంటె మనలను మనం జయించడం గొప్పకార్యం.

57. ఒకసారి ఇగ్నేష్యస్ జబ్బుపడి వుండగా డాక్టరు అతనితో నీ హృదయంలోనుండి విచారకరమైన భావాలను పూర్తిగా తొలగించుకోవాలి అని చెప్పాడు. తనకు విచారం కలిగించే భావమేమిటా అని ఇగ్నేషియస్ ఆలోచించి చూడగా ఏమీతట్టలేదు. చివరకతడు తాను జీవితకాలమంతా శ్రమించి స్థాపించిన యేసుసభ నాశమైపోతే తనకు విచారం కలుగుతుంది కదా అనుకొన్నాడు. ఈ విచారం ఎంతసేపుంటుందని తన్నుతాను మళ్లా ప్రశ్నించుకొన్నాడు. తనకు తాను ఈలా జవాబు చెప్పుకొన్నాడు. యేసుసభ అంతా నాశమైపోయినా నేను పదిహేను నిముషాలు దేవునికి ప్రార్థన చేసికొంటేచాలు. మరల చిత్తశాంతిని పొందగలను.

# 10. పవిత్రత

58. కొద్దిపాటి పవిత్రతతోను మంచి ఆరోగ్యంతోను గొప్ప ప్రేషితసేవ చేయవచ్చు. కాని కొద్దిపాటి ఆరోగ్యంతోను గొప్ప పవిత్రతతోను పెద్ద ప్రేషితసేవ చేయలేం.

59. బాగ ఆరోగ్యంగావుంటే ఇతరులకు ఎంతో సేవ చేయవచ్చు. అనారోగ్యంగా వుంటే ఏమిసేవ చేస్తాం?

60. తొలిరోజుల్లో పవిత్రులూ విద్వాంసులూ ఐన నరులు చాలమంది ఇగ్నేష్యస్‌ను చూచి యేసు సభలో చేరారు. అతడు మాట్లాడనక్కర లేకుండానే కేవలం అతని భక్తివల్లనే ఆకర్షితులై వాళ్ళు యేసుసభలో చేరారు.

# 11. సన్యాస జీవితం

61. అది చలికాలం. ఇగ్నేష్యస్ నిప్పుదగ్గర కూర్చుండి ప్రార్థన చేసికొంటున్నాడు. లొయోలా కోటలోని బంధువులనుండి అతనికి జాబులు వచ్చాయి. ఆ జాబులను వెంటనే ఇగ్నేష్యస్‌కి ఇస్తే అతడు అమితానందం చెందుతాడన్న భావంతో ఇంటిలోపనిచేసే బ్రదరు వాటిని అతని దగ్గరికి తీసికొనిపోయాడు. కాని ఇగ్నేష్యస్ పరలోక సేవలో చేరినవాళ్లు ఇహలోక విషయాలతో కాలం వెళ్ళబుచ్చగూడదని బ్రదరుకి తెలియజేయగోరి, ఆ జాబుల కట్టను విప్పనైన విప్పకుండా అక్కడికక్కడే అగ్నిలో పడవేసాడు.

62. మఠజీవితం గడిపేవాళ్ళు లోకం తమకు సిలువ వేయబడిందనీ, తాము లోకానికి సిలువ చేయబడ్డామనీ గ్రహించాలి. వాళ్లు తమ సొంత కోరికలను అవతలబెట్టి క్రీస్తుని ధరించిన నూత్నమానవులై యుండాలి. తమకుతాము చనిపోయి ధర్మంకొరకు జీవించేవాళ్ళయి ఉండాలి.

63. నిరంతరం మీ మనసును దేవుళ్ళోను, దేవుణ్ణి మీ మనసులోను ఉంచుకోండి. ఆ ప్రభువుని దప్పితే మరొకరిని గూర్చి ఆలోచించవద్దు. అతన్ని దప్పితే మరొకరిని ప్రేమించవద్దు. మీరుచేసే కార్యాలన్నీ అతని చిత్తాన్ని నెరవేర్చేవిగా వుండాలి. మీరు ఎప్పుడూ అతన్ని గూర్చి మాట్లాడండి. మీ శ్రమలన్నిటిలోను అతన్ని దప్పితే మరో బహుమానాన్ని ఆశించకండి. క్రీస్తు జీవితాన్ని ఆదర్శంగా వుంచుకొని దాన్ని మీ జీవితంమీద ముద్రించుకోండి. మీరు అతనికి ప్రతిబింబాలుగా తయారుకండి.

64. ఆధ్యాత్మిక సూత్రాలు ఇవి :

- ఎవరికీ, చిన్నవారికికూడ ఎదురు చెప్పవద్దు.
- ఇతరునిమీద విజయాన్ని సాధించడంకంటె నీ తరపున నీవు లొంగి వుండడమే గొప్ప అని తలంచు.
- అన్ని విషయాల్లోను విధేయుడవై యుండు. ఇతరుని అభిప్రాయానికి లొంగు.
- ఇతరుల తప్పులనుగూర్చి ఆలోచించవద్దు. ఒకవేళ నీవు పరుల దోషాలను గమనిస్తే వాటిని దాచివుంచు.
- నీ తప్పులను మాత్రం బాగా తెలిసికో. అవి బహిర్గతం కావాలనికూడ కోరుకో.
- నీవు ఏమితలంచినా ఏమి మాట్లాడినా ఏమిచేసినా, ఇది తోడివారికి ఉపయోగపడేదేనా, దేవునికి ప్రీతి కలిగించేదేనా అని ఆలోచించిచూడు.

- ఎల్లప్పుడు నీ మానసిక స్వేచ్ఛను నిలబెట్టుకో. ఏ సంఘటనంగాని, ఏ వ్యక్తిగాని దాన్ని భంగపరచకూడదు.
- ఎవరితోను సులభంగా స్నేహం చేయవద్దు. ఇతరునితో స్నేహానికి పూనుకోకముందు నీ బుద్ధిశక్తి ఆ స్నేహాన్ని అనుమతిస్తుందో లేదో పరిశీలించి చూచుకో.
- నీ జీవితాన్నంతటినీ భక్తితో గడుపు. నరుల దృష్టిలో పిచ్చివాడివిగా కన్పించు. అప్పుడు దేవుని దృష్టలో తెలివైనవాడి వౌతావు.

65. సజ్జనుని లక్షణాలు ఇవి :

- అతని తలంపులు ఉన్నంతగాను భక్తి మంతంగాను ఉంటాయి. అతడు తన్నుతానే నమ్మడు.
- ఉత్తమునికి నిదానముంటుంది. అతడు వినయవంతుడుగా ఉల్లాససపరుడుగా వుంటాడు.
- మంచివాని పోకడలు వివేకవిజ్ఞానాలతోను మర్యాదతోను భక్తితోను నిండివుంటాయి.
- సత్పురుషుని దుస్తులు శుభ్రంగా, తగినట్లుగా వుంటాయి.
- అతడు మితభోజనాన్ని పాటిస్తాడు. సాధారణ భోజనంతో సంతృప్తి చెందుతాడు.
- ఉత్తముడు మితంగా, తగినకాలంలో నిద్రిస్తాడు.
- అతడు భక్తిశ్రద్ధలతో ప్రార్థన చేస్తాడు. ఆ జపంలో విశ్వాసం నిరీక్షణం దేవప్రేమ వుంటాయి.
- అతడు ఏ పనినైనా దేవునితో ఐక్యమైగాని చేయడు.

# 12. ప్రార్థనం

66. లోకంలోని నరులంతా ప్రపంచంలోని కారణాలన్నీ నిన్నేదైనా పని చేయమని కోరినా, దేవుణ్ణి సంప్రతించందే నీవాపని చేయవద్దు. మొదట దేవునికి ప్రార్థనచేయందే ఏ ముఖ్యకార్యాన్నీ ప్రారంభించకూడదు. అతడు తండ్రులందరికంటె ఉత్తముడైన తండ్రి. మహాజ్ఞానియైన తండ్రి. కనుక మన నమ్మకమంతా అతనిమీదనే వుండాలి. అతడు మన కార్యాన్ని సఫలం చేయాలని వేడుకోవాలి.

67. ఇగ్నేష్యస్ దృష్టిలో "తపోభ్యాసాలు" అమూల్యమైన వరప్రసాదాలను దయచేసే సాధనాలు. కనుక అతడు తనకు మేలు చేసిన వారందరిచేత తపోభ్యాసాలు చేయించగోరేవాడు. తన ఋణాన్ని తీర్చుకోడానికి ఇది ఉత్తమ మార్గమని యెంచేవాడు. ఈ జీవితంలో తాను ఇంతకంటె మంచికార్యం ఏమీ చేయించలేనని తలంచేవాడు.

68. చాల వేదసత్యాలను తెలుసుకొన్నంత మాత్రాన్నే మన ఆత్మకు తృప్తి కలుగదు. ఏదైనా వొక వేదసత్యాన్ని బాగా అర్థంచేసికొని దాన్ని ఆంతరంగికంగా రుచిచూడ్డంవల్ల ఆత్మ సంతృప్తి చెందుతుంది.

69. మనం ప్రార్థనం చేసికొనేప్పుడు మాత్రమే దేవుణ్ణి జ్ఞప్తికితెచ్చుకొంటే చాలదు. మన పనులన్నిటిలోను అతన్ని గుర్తుపెట్టుకొంటూండాలి. మన పనులన్నిటినీ జపాత్మాకంగా చేయాలి. మన జీవితమంతా ప్రార్థనం కావాలి.

70. మనం ధ్యానంచేసి ముగించాక దాన్ని ఏలా చేసామా అని ఒకటిరెండు నిమిషాలు పరిశీలించి చూచుకోవాలి. దాన్ని బాగా చేసినట్లయితే దేవునికి వందనాలు చెప్పాలి. బాగా చేయనట్లయితే కారణమేమిటా అని పరిశీలించి చూచుకోవాలి. మన తప్పిదానికి పశ్చాత్తాపపడి మరుసటిసారి దాన్నింకా బాగా చేయాలని సంకల్పించుకోవాలి.

71. గురుజీవితానికి తయారయ్యే బ్రదర్లు తమ చదువులను తాముపడే శ్రమలను పలుమార్లు దేవునికి సమర్పించు కోవాలి. అవి తమకు ఇష్టమైనా కాకపోయినా దేవుని ప్రేమకొరకు వాటిని అంగీకరించాలి. భావిజీవితంలో ఆత్మలకు సహాయం చేయడానికీ దేవునికి సేవలు చేయడానికీ ఆకార్యాలు ఏదోరీతిలో ఉపయోగపడతాయి.

## 13. తపస్సు

72. మనదేహం మనదికాదు, దేవునిది. కనుక మనం దాన్ని ఏలా వాడుకొన్నామో ఓనాడు దేవునికి లెక్క ఒప్పజెప్పాలి. మన శరీరాన్ని సుఖభోగాలతో చెడగొడితే దేవునికి లెక్క చెప్పాలి. లేదా శరీరాన్ని తీవ్రంగా కృశింపజేసి దాని వలన పొందవలసిన మేళ్ళను పొందకపోయినా దేవునికి జవాబుదారులం కావాలి.

73. మన శరీరం మన ఆత్మకు లొంగి వుండాలి. శరీరం ఆత్మకు లొంగకుండా ఎదురు తిరిగి పాపకార్యాలను అభిలషిస్తే, మనం వెంటనే దాన్ని అదుపులోకి తీసికొని రావాలి. తపస్సును చేపట్టి శరీరవాంఛలను అణచివేసి కోవాలి. అప్పుడది తిరుగుబాటును మానుకొని ఆత్మకు లొంగి, తన బాధ్యత ప్రకారం ప్రవర్తిస్తుంది. తాను ఆత్మకు సేవకుణ్ణని గ్రహిస్తుంది.

74. ఆధ్యాత్మిక మానవుడు శరీరానికంటె గూడ మనసును ఎక్కువగా అదుపులో వుంచుకోవాలి. ఆంతరంగికమైన సంయమనంతో మనసును చెప్పుచేతల్లో వుంచుకొంటాం. ఈ సంయమనాన్ని ఎప్పుడూ పాటింపవలసిందే. ఇది అతి ముఖ్యమైంది. ఇక బాహిరమైన సంయమనంతో శరీరాన్ని అదుపులో వుంచుకొంటాం. ఇది అంత ముఖ్యమైందీకాదు, నిరంతరం పాటించవలసిందీ కాదు. ఆయా సందర్భాల్లో అవసరాన్నిబట్టి పాటించదగింది.

# 14. సిలువలు

75. లోకంవల్ల కలిగే ఆనందానికీ క్రీస్తు సిలువవల్ల కలిగే ఆనందానికీ ఓ వ్యత్యాసం వుంది. మొదటిది అనుభవించే కొద్దీ అసహ్యం పుట్టిస్తుంది. రెండవది అనుభవించే కొద్దీ ఎక్కువ ఆనందాన్ని కలిగిస్తుంది.

76. అనారోగ్యం గూడ ఆరోగ్యమంతటి భాగ్యం. కనుక వ్యాధి బాధలను గూడ దేవుని వరంగానే భావించాలి.

# 15. హింసలు

77. ఇగ్నేష్యస్ అల్కలా పట్టణంలో చెరలో వున్నపుడు ఉన్నత పదవుల్లో వున్నవాళ్లు కొందరు అతన్ని సందర్శించడానికి వచ్చారు. వాళ్లు అతన్ని శీఘ్రమే చెరనుండి విడిపిస్తామన్నారు. కాని అతడు వారికి వందనాలు చెప్పి వారి ప్రయత్నాన్ని విరమించుకోమన్నాడు. "ఎవని ప్రేమకొరకు నేను ఈ చెరలో బంధింపబడ్డానో అతడే అదను వచ్చినపుడు నన్ను ఈ సంకెలలనుండి విడిపిస్తాడు" అని చెప్పాడు.

78. సాలమంకాలో ఇగ్నేష్యస్‌ని బంధించి చెరలో వుంచారు. అతని అనుచరులను ఇద్దరిని గూడ బంధించి అదే చెరలో మరో గదిలో వుంచారు. ఓ రాత్రి ఆ చెరలోని ఖైదీలు గలాటాచేసి కారాగారం తలుపులు పగులగొట్టి తప్పించుకొని పోయారు. ఇగ్నేష్యస్ అనుచరులు కూడ అలా పారిపోయి వుండవచ్చు గాని పారిపోలేదు. అతడు నేర్పిన పాఠంవల్ల ప్రభావితులై వాళ్లు అలా చెరలోనే వుండిపోయారు. ఆ పాఠం ఇది. "క్రీస్తు కొరకు మనం అనుభవించే శ్రమలను దేవుడు దయచేసే అతి శ్రేష్ఠమైన వరాలనుగా గణించాలి"

79. ఇగ్నేష్యన్ తాను స్థాపించిన మతసభను అధికార పూర్వకంగా అంగీకరించమని పాపుగారిని అడగడానికి రోముకి వెళ్తున్నాడు. అతని అనుచరులు కూడ అతనివెంట పోతున్నారు. క్రీస్తు కుటుంబంలో ఓ సేవకుడుగా చేరే భాగ్యాన్ని తనకు దయచేయమని అతడు అప్పటికే చాలసారులు ప్రార్థన చేసాడు. క్రీస్తుకి చేరువలో వుండి

అతనికి ప్రత్యేక రీతిలో పరిచర్యలు చేసే భాగ్యాన్ని దయచేయమని తండ్రిని మరియమాతనూ చాలసారులు అర్థించాడు. దారిలో అతడు రోముకి సమీపంలో వున్న లస్టోర్టా అనే గ్రామంలో ఓ పాడువడిన దేవాలయంలోకి ప్రవేశించి ప్రార్థన చేసికొంటున్నాడు. ఆ దేవళంలో క్రీస్తు అతనికి తన సిలువతోను తండ్రితోను దర్శనమిచ్చాడు. ఆ దర్శనంలో తండ్రి కరుణతో ఇగ్నేష్యస్ వైపు చూచాడు. తన కుమారుడైన క్రీస్తుతో "నీవు ఇతన్ని నీ సేవకునిగా స్వీకరించు' ' అని చెప్పాడు. క్రీస్తుకూడా అతనివైపు కరుణతో జూచి "నీవు నాకు సేవలు చేయి. నేను రోములో నీకు అండగా వుంటాను" అని చెప్పాడు. తర్వాత ఇగ్నేష్యస్ తన అనుచరులను కలసికొని వారికి ఈ దర్శన వృత్తాంతాన్ని తెలియజేసాడు. రోములో మన కొరకు ఏవో శ్రమలు కాచుకొని వున్నాయి. అక్కడ శత్రువులు మనలను సిలువచేయవచ్చు లేదా చంపవచ్చు. కాని అక్కడ క్రీస్తు మనకు తప్పక సహాయం చేస్తాడు. మన శత్రువుల బలం కంటె క్రీస్తు సహాయం గొప్పది. కనుక మనం నమ్మకంతో సంతోషంగా రోముకి వెళ్దాం అని అనుచరులతో చెప్పాడు.

80. పుణ్య పరిపూర్ణతను సాధించడానికి దగ్గరిమార్గం ఏమిటి అని ఓ గురువు అడగ్గా ఇగ్నేష్యస్ ఈలా చెప్పాడు. "క్రీస్తు కొరకు చాల శ్రమలను అనుభవించి అతన్ని గాఢంగా ప్రేమించడమే దగ్గరి మార్గం. దేవుని నుండి మనం ఈ యనుగ్రహాన్ని అడుగుకోవాలి. ఈ వొక్క భాగ్యంలో ఎన్నో అమూల్యమైన వరాలు ఇమిడి వున్నాయి. క్రీస్తు కొరకు చాల బాధలు అనుభవించినవారి హృదయంలో పరిపూర్ణమైన ఆనందం నెలకొని వుంటుంది. ఇతరానందాలు ఏవికూడ దీనికి సాటిరావు.

81. ఇగ్నేష్యస్ తన చివరి రోజుల్లో ఓమారు గాఢ భక్తితో ప్రార్థన చేస్తున్నాడు. యేసుసభ సభ్యులు తండ్రీ! నీవు ఏ వరం కోసం ఇంత భక్తితో ప్రార్థన చేస్తున్నావు అని అడిగారు. అతడు ఈలా జవాబు చెప్పాడు. "హింసలు ఏనాడూ మీకు దూరంగా వుండకూడదని నేను దేవుని ప్రార్థిస్తున్నాను. వాటివల్ల మీకు ఎంతో లాభం కలుగుతుంది. హింసలు మెండుగావుంటే మీరు సక్రమ మార్గంలో నడుస్తారు. అశ్రద్ధకూ సుఖభోగాలకూ లొంగకుండా భక్తిగా జీవిస్తారు"

# 16. ప్రలోభాలు

82. పిశాచం కొన్నిసార్లు మనలను తీవ్రంగా శోధిస్తుంది. అది తన శోధనలను విశేషంగా రాత్రికాలాన్ని ఎన్నుకొంటుంది. మనం ఎప్పుడు మేల్కొంటామా అని కాచుకొని వుంటుంది. వేకువనే మెలకువరాగానే అది మనకు దుష్టాలోచనలు కలిగిస్తుంది. అప్పుడు మనం ఒంటరిగా వుంటాం. అప్పుడే మేల్కొన్నాం గనుక ఇంకా దివ్యమైన భావాలేమీ

మన హృదయంలో చోటుచేసికొని వుండవు. ఈలాంటి పరిస్థితుల్లో మనలను సులభంగా గెలవవచ్చని దాని ఆలోచన.

## 17. పాపం

83. క్రీస్తు సిలువమీద వ్రేలాడ్డం జూచి మరియమాత ఎంతో బాధపడింది. కాని మనం క్రీస్తుకి ద్రోహంగా పాపం చేసేపుడు ఆమె యింకా అధికంగా బాధపడుతుంది.

84. ఇతరులు బలహీనతవల్ల పాపంలో పడిపోవడం చూస్తూంటాం. వారి దుష్టవర్తనం మనకు ఓ అద్దంలా వుపయోగపడాలి. ఆ యద్దంలోకి చూచుకొని మన బలహీనతలను మనం చక్కదిద్దుకోవాలి. లేకపోతే వాళ్ళకు పట్టినగతే మనకూ పడుతుంది.

## 18. పుణ్యం

85. యేసుసభ అధికారులు ఓ యువకుణ్ణి నోవిష్యేటు ముగించగానే పై చదువులకు రోమను కాలేజీకి పంపారు. కాని అతడు పుణ్యార్జనం కంటె విద్యార్జనకు ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చాడు. పిశాచం అతన్ని బలంగా శోధించింది. ఆ శోధనకు తట్టుకోలేక అతడు వినయంగా దేవునికి ప్రార్థన చేసాడు. ఇగ్నేష్యస్ అప్పటికి పదేండ్లకు పూర్వమే చనిపోయాడు. అతడు మోక్షంనుండి ఈ యువకునికి దర్శన మిచ్చి "నీవు ఇక్కడికి వచ్చింది పాండిత్యాన్ని ఆర్జించడానికా లేక పుణ్యాన్ని ఆర్జించడానికా? అసలు నీవు ప్రపంచాన్ని వదలిపెట్టి దేవుని సేవలో చేరింది ఎందుకు? పుణ్యార్జనం కొరకు ఎక్కువ కృషీ, విద్యార్జనం కొరకు తక్కువ కృషీ చేయి బాగుపడతావు" అని మందలించాడు. ఈ హెచ్చరిక ప్రకారం ఆ యువకుడు తన ప్రవర్తనను మార్చుకొని భక్తి గల గురువుగా తయారయ్యాడు. తర్వాత జర్మనీకి అసిస్టెంటుగా పనిచేసి 1597లో చనిపోయాడు. చనిపోవడానికి మూడురోజులు ముందుగా అతడు ఈ వుదంతాన్ని వెల్లడిచేసాడు.

86. పుణ్యార్జనకు దగ్గరి మార్గం ఇది. లోకంలోని నరులు ఏ వస్తువులను గాఢంగా వాంఛిస్తారో వాటిని మనం పూర్తిగా అసహ్యించుకోవాలి. వాటికి మనం అమడదూరంలో వుండాలి.

## 19. మాట్లాడేతీరు

87. మాట్లాడ్డంకంటె వినడం తేలిక. మనం తక్కువగా మాట్లాడాలి. ఎక్కువగా వినాలి.

88. వేనిస్‌లో యేసుసభకు చెందిన ఓ యువగురువు ఓసారి హద్దుమీరి మాట్లాడి శ్రోతల మనస్సు నొప్పించాడు. ఇగ్నేష్యస్ అతన్ని కఠినంగా శిక్షించాడు. "ఇకమీదట నీ

పలుకులు తీరును జాగ్రత్తగా గమనిస్తూండు. నీ మాటలను మొదట తక్కెడలోబెట్టి తూయి. తర్వాత మాత్రమే వాటిని నీ నాల్కతో ఉచ్చరించు" అని మందలించాడు.

89. మనం పరవిమర్శకూ పరనిందకూ పూనుకోగూడదు. తుదితీర్పులో దేవుడు మనలను ఇతరులను గూర్చి అడగడు. మనమేమి చేసామో అడుగుతాడు. కనుక మనలను గూర్చి మనం లెక్కచెప్పుకొంటే చాలు. ఇతరుల తప్పులు మనకు అనవసరం.

## 20. పుస్తకాలు

90. ఇగ్నేష్యస్ తన తనయులు తరచుగా ఆధ్యాత్మిక గ్రంథాలు చదవాలని కోరాడు. ఆ గ్రంథాలు భక్తిని కలిగించేవిగా వుండాలి. తోడివారికి భక్తిని నేర్పించడానికి ఉపయోగపడేవిగా వుండాలి. అంతేగాని కేవలం మానవ విజ్ఞానాన్నీ పాండిత్యాన్నీ పెంచేవిగా వుండకూడదు. అతడు దైవసేవలోచేరి మన్రేసా గుహలో తపస్సు చేసికొనే తొలి రోజుల్లోనే "క్రీస్తు అనుసరణ" గ్రంథాన్ని చూచాడు. అప్పటినుండి ఆ గ్రంథాన్ని ఎప్పుడూ విడిచిపెట్టలేదు. అతనిదృష్టిలో అది ఆధ్యాత్మిక గ్రంథాల్లో ముత్యంలాంటిది. ఆ గ్రంథంనుండి ఒక్కో అధ్యాయాన్ని నిదానంగా చదివి దాని సారాన్ని గ్రహిస్తుండేవాడు. అతడు తన మిత్రులకు ఏదైనా బహుమతి ఈయాలనుకొన్నపుడు ఆ గ్రంథాన్నే యిచ్చేవాడు. బైబులు, క్రీస్తు అనుసరణం - ఇవి రెండే అతడు తనవద్ద నిరంతరం వుంచుకొన్న గ్రంథాలు.

## 21. భక్తిశ్రద్ధలు

91. సోమరితనం అన్ని అనర్థాలకు మూలం. కనుక దానికి మన జీవితంలో తావుండకూడదు.

92. ఓ పనిని ఆలస్యంగా జేయడంకంటె ముందుగానే చేయడం మంచిది. కావున నీవేదైనా కార్యాన్ని రేపుచేస్తానని మాటయిస్తే ఈనాడే చేయి.

93. చాలపనులను ఒకేసారి నెత్తిన పెట్టుకోగూడదు. ఒక్కోవిడత ఒక్కోకార్యాన్ని మాత్రమే చేసేవాడు దాన్ని చక్కగా చేస్తాడు.

94. మనం దుర్బలులనూ సోమరిపోతులనూ ఆదర్శంగా తీసికోగూడదు. ధైర్యశాలులనూ భక్తిమంతులనూ ఆదర్శంగా పెట్టుకోవాలి.

95. వింటిని అతిగా వంచితే విరిగిపోతుంది. కనుక దాన్ని విప్పివుంచాలి. కాని ఆత్మను పనిపాటలు లేకుండా కులాసాగా వుంచితే అది పూర్తిగా చెడిపోతుంది.

96. సోమరిపోతు చాలకాలం కృషిజేసి సాధించిన పుణ్యానికంటె భక్తిమంతుడు కొద్దికాలంలోనే ఎక్కువ పుణ్యాన్ని ఆర్జిస్తాడు.

97. ఓసారి లోకంవైపు చూడండి. దేవుణ్ణి ఆరాధించి గౌరవించేవాళ్ళు ఎంతమంది? అతని చిత్తప్రకారం జీవించేవాళ్లు ఎంతమంది? ఎన్ని తావుల్లో జనులు అతని దివ్యనామాన్ని విస్మరిస్తున్నారో చూడండి. ఎన్నిచోట్ల ప్రజలు అతన్ని దూషిస్తున్నారో గమనించండి. నరులు అతని బోధలను ఏలా పెడచెవిని పెడుతున్నారో పరికించండి. ఈ కారణాలన్నీ మనం భక్తితో జీవించాలని ఉద్బోధించడం లేదా?

98. గురువులు కావడానికి సెమినరీల్లో చదువుకొనే బ్రదర్లు తామింకా దైవసేవ చేపట్టలేదుకదా అని నిరుత్సాహం చెందకూడదు. తామింకా అధ్యాత్మిక రంగంలో తోడి నరులకు ఉపయోగపడ్డం లేదుకదా అని విచారించకూడదు. వాళ్ళు సెమినరీలో వుండగానే దేవునికి సేవచేయవచ్చు. తోడివారికి ఉపయోగపడవచ్చు. నాల్గు మార్గాల ద్వారా వాళ్ళు ఈ కార్యాన్ని సాధించవచ్చు. మొదటిది, బ్రదర్లు తమ చదువులను ప్రభువుకి అర్పించుకోవడం ద్వారా. ఇప్పుడు చదువుకొంటే తర్వాత తోడివారికి ఉపయోగపడవచ్చుగదా! యుద్ధానికి తర్ఫీదుపొందే సైనికులు తర్వాత రాజుకి ఉపయోగపడరా? అలాగే ఇప్పుడు ఆధ్యాత్మిక విద్య నేర్చుకొనేవాళ్ళు తర్వాత దాన్ని ప్రజలకు బోధించరా? రెండవది, వాళ్లు సెమినరీలో పుణ్యాన్నీ పవిత్రతను ఆర్జించడంద్వారా. ఇక్కడ తాము పవిత్రులైతే తర్వాత లోకంలోని ప్రజలను పవిత్రులను చేయవచ్చుకదా? భౌతిక రంగంలో బిడ్డను పుట్టించాలంటే మొదట తండ్రి వుండాలి. ఆలాగే ఆధ్యాత్మికరంగంలోకూడ నరులను పవిత్రులను చేయాలంటే మొదట పవిత్రుడైనవాడు ఒకడుండాలి. మూడవది, వాళ్లు మంచి ఆదర్శాన్ని చూపించడంద్వారా. మన బోధవల్లకంటె మన ఆదర్శంవల్ల నరులు త్వరగా మారతారు. నాల్గవది, మంచి కోరికలు కోరడంద్వారా. నరులు దేవుని దగ్గరికి రావాలనీ భక్తిని అలవర్చుకోవాలనీ పుణ్యజీవితం గడపాలనీ బ్రదర్లు కోరుకోవాలి. ఈ కోరికలు మన మర్పించే ప్రార్థనల్లాగే ఇతరులమీద బలంగా పని చేస్తాయి.

99. ఒకసారి బ్రదరు పాల్మియోకు రోము నందలి యేసుసభ భవనంలోని పెద్దదేవాలయంలో ఆదివారం ప్రసంగం చేసే అవకాశం లభించింది. అతడింకా గురుపట్టం పొందలేదు. పాల్మియో తన ప్రసంగాన్ని గూర్చి కంగారుపడజొచ్చాడు. తన ప్రసంగం వినడానికి ఎక్కువమందిని రాబట్టాలనే కోర్కెకూడ అతనికి మిక్కుటంగా వుంది. అతడు రోడ్డుమీద నడచిపోతూండగా ఓ ముసలమ్మ ఎదురుపడింది. ఆమె బిచ్చగత్తె. పాల్మియో ఆమెను తన ప్రసంగాన్ని వినడానికి ఆదివారం గుడికిరమ్మని ఆహ్వానించాడు. ఈ సంగతి ఇగ్నేష్యస్ చెవినిబడింది. అతడు పాల్మియో ఆసక్తిని మెచ్చుకొన్నాడు. కనుక ఆ బ్రదర్ని తన గదికి పిలిపించి అతనికేదో చిన్న పనిని ఒప్పజెప్పాడు. "పాల్మియో! నీ వీ కార్యాన్ని సాధించుకొని వచ్చావంటే ఆదివారం నీ ప్రసంగం వినడానికి నేను ఇద్దరు ముసలమ్మలను పంపుతాను" అని హాస్యంగా పలికాడు.

# 22. నరుని ధ్యేయం

100. ఇగ్నేష్యస్ ఈ క్రింది వాక్యాలతో ఫ్రాన్సిస్ జేవియర్ మనసు మార్చి అతన్ని తన శిష్యుణ్ణిగా జేసికొన్నాడు "నరుడు ఈ లోకాన్నంతటినీ జయించినప్పటికీ తన ప్రాణాన్ని కోల్పోతే అతనికి ఏమి లాభం కలుగుతుంది? ఈ లోకజీవితం మాత్రమేవుంటే, ఈ లోకమహిమ మాత్రమే వుంటే నీవు ఇక్కడ గొప్పవాడివిగా చలామణీ కావడంలో అర్థంవుంది. కాని శాశ్వత జీవమనేది ఇంకొకటివుంటే – అది తప్పకుండా వుంది – నీవు నీ కోరికలను ఈ యిహలోకానికి పరిమితం చేసికోవచ్చా? కలలా దాటిపోయే ఈ లోకాన్ని నమ్ముకొని ఏనాటికీ ముగియని ఆ నిత్యలోకాన్ని పోగొట్టుకొంటావా? నీ ప్రయత్నంవల్లనే నీవు మోక్షంకంటె విలువైన వస్తువునీ, శాశ్వతంకంటె ఎక్కువకాలముండే సంపదనీ గడించగలవా? ఆ మోక్షమూ శాశ్వతత్వమూ నీ కొరకు ఉద్దేశింపబడినవి కావా? నీవు వాటిని సంపాదించుకోవాలనుకొంటే నీకు ఎవరు అడ్డమొస్తారు? నీవు వాటిని సంపాదించుకొన్నాక నీ నుండి వాటిని ఎవరు తీసికొనిపోగలరు? నీవు నా ఆత్మకు ఈ లోకానందాన్ని చేకూర్చి పెట్టాలనుకొంటున్నావు. కాని ఆ యాత్మ పరలోకానికి చెందింది కాదా? దేవుణ్ణి ప్రేమించి అతన్ని శాశ్వతంగా పొందగలిగే ఆత్మకు క్షణికమైన ఈ లోకవస్తువులు తృప్తి నిస్తాయా? ఈ లోకం తానీయ గలిగిన ఆనందాలన్నిటినీ నీకు తత్క్షణమే యిచ్చినా, నీవు వాటిని ఎంతకాలం అనుభవిస్తావు? నీవు ఇక్కడ గడిపే కొద్ది పాటి జీవిత కాలంలోనే గదా? నీవు ఎన్నివందల యేండ్లు జీవించినా ఒకరోజు మరణించక తప్పదు కదా! ఈ తాత్కాలికానందం కోసం దేవుణ్ణి శాశ్వతంగా కోల్పోతే నీకేమైనా లాభం కలుగుతుందా? నీకు ముందు ఈ లోకంలో ఎందరు ధనవంతులు బలవంతులు జీవించలేదు? వాళ్ళల్లో ఎవరైనా తమ సంపదలను గాని గొప్పతనాన్ని గాని అధికారాన్ని గాని తమతో తీసికొని పోగలిగారా? వాళ్ళు ఆ శాశ్వత లోకంలో అడుగు పెట్టగానే తమభూలోక సంపదలు ఇతరుల హస్తగత మయ్యాయని గుర్తించారు. వాళ్ళకు ఈ లోక సంపదలకు బదులుగా పరలోకంలో నూత్నసంపదలు లభింపలేదు. ఇక్కడ తాముచేసిన పనులనుబట్టి మాత్రమే వాళ్లకు పరలోకంలో ప్రతిఫలం ముట్టింది. ఈ లోక గౌరవాలు నీకు తృప్తినీయలేవు. ఈ లోకాన్నంతటినీ స్వాధీనం చేసికొన్నా నీ హృదయం తృప్తి జెందదు. దేవుడు తప్ప మరే వస్తువూ నీ హృదయాన్ని నింపలేదు. కీర్తిని గణించాలనే నీ కోరికను నేను అణచివేయడంలేదు. నేను నీకు క్షుద్రమైన ఆశయాలను చూపించడంలేదు. నీవు గొప్ప కోరికలే కోరుకో. ఉన్నతమైన ఆశయాలే పెట్టుకో. కాని నీవు నశ్వరమైన ఇహలోక వస్తువులను త్యజించి అనశ్వరమైన పరలోక వస్తువులను కోరుకో. ఇప్పుడే ఈలోక వస్తువులవల్ల నాకు ఏమి లాభం కలుగుతుందా అని ఆలోచించి చూచుకో. లేకపోతే వీటిని ఈ లోకంలో కొంత కాలంపాటు గ్రుడ్డిగా అనుభవిస్తావు. అటుతర్వాత పరలోకంలో ఆ భూలోక వస్తువులవల్ల నాకు ఏమి ప్రయోజనం కలిగిందా అని శాశ్వతకాలం వరకు దుఃఖిస్తావు."

# 8. విశ్వాసం



## విషయ సూచిక



### మనవిమాట

విశ్వాసం, నిరీక్షణం, దైవప్రేమ అనేవి దైవపుణ్యాలు. రోజువారి క్రైస్తవ జీవితంలో విశ్వాసానికున్న ప్రాముఖ్యం అంతాయింతాకాదు. ఆదిలేందే భక్తి లేదు, మతాచరణమూ లేదు.

ఇంత ప్రముఖమైన పుణ్యమైనా విశ్వాసాన్ని అర్థంచేసి కోవండ ఎంతమాత్రం సులభంకాదు. దాన్నిగూర్చి ప్రజలకు బోధించడంగూడ ఎంతమాత్రం తేలికకాదు.

ఈ సంచికలో విశ్వాసాన్ని సులువైన పద్ధతిలో వివరించే ప్రయత్నంచేసాం. మొదటి భాగంలో బైబులురీత్యా విశ్వాసమంటే యేమిటో తెలియజేసాం. రెండవ దానిలో దైవశాస్త్రరీత్యా విశ్వాశమంటే యేమిటో వివరించాం.

# 1. విశ్వాసాన్ని గూర్చిన బైబులు బోధలు

## 1. పూర్వవేదం

### 1. అబ్రాహాము విశ్వాసం

(ఈ వ్యాసంలో విశ్వాసం, శ్రద్ధ పర్యాయపదాలుగా వాడుతున్నాం.) అబ్రాహాము విశ్వాసానికి పెట్టింది పేరు. మూడు విడతల అతని శ్రద్ధ రుజువైంది. మొదటిసారి,

కాల్దియా దేశంలో వసిస్తూండగా యావే అబ్రాహాముని పిల్చాడు. అతడు తాను కొలుస్తున్న దేవుళ్ళనూ చుట్టపక్కాలనూ వదలి యావే వెంటబడి వచ్చాడు. కొన్ని వేల మైళ్ళు ప్రయాణంచేసి కనాను దేశాన్ని చేరాడు - ఆది 12, 1-4. రెండవమారు, ముసలి ప్రాయంలోగూడ అబ్రాహాముకి బిడ్డపాప కలగలేదు. అతడు తన బానిసయైన యెలియసేరుని తన ఆస్తికి వారసుని చేద్దామనుకొంటున్నాడు. కాని ప్రభువు అతనితో నేను నీకొక కుమారుని దయచేస్తాను. అతని ద్వార నీ సంతానం ఆకాశంలోని చుక్కల్లాగ వ్యాప్తి చెందుతుంది అన్నాడు. ముసలి ప్రాయంలో తనకూ సారాకు ఏలా బిడ్డడు పుడతాడా అని అబ్రహాము శంకించలేదు. అతడు ప్రభువు మాటలు నమ్మాడు. ఆ నమ్మకాన్నిబట్టి దేవుడు అతన్ని పుణ్య పురుషునిగా గణించాడు - 15, 4-6. మూడవ పర్యాయం, ప్రభువు ఈసాకుని బలి యీయమని అడిగాడు. అబ్రహాముకి అతడు ఏకైక కుమారుడు. ప్రీతిపాత్రుడు. విలువలన్నిటికి పై విలువ. ఐనా ఆ పుణ్యపురుషుడు ఈసాకుని దేవునికి బలి యీయడానికి జంకలేదు - 22, 12. ఈలాంటి మహానుభావుడు దేవుణ్ణి నమ్మిన వాళ్లందరికి తండ్రి కావడంలో వింత లేదుకదా!

## 2. సీనాయి నిబంధనం

యిస్రాయేలీయులు ఈజిప్టులో బానిసలయ్యారు. ఫరోపెట్టే కష్టాలను భరించలేక దేవునికి మొరపెట్టారు. యావే వారికి మోషే అనే నాయకుణ్ణి ప్రసాదించాడు. అతని ద్వారా వాళ్లకు ఈజిప్టునుండి తరలించుకొని వచ్చాడు. సీనాయి కొండ దగ్గర వాళ్లతో నిబంధనం చేసికొన్నాడు - నిర్గ 24, 8. ఈ నిబంధనం ద్వారా వాళ్లు యావే ప్రజలయ్యారు. యావే ఆ ప్రజలకు దేవుడయ్యాడు. ఇక యావే ఆ ప్రజను ఒక మహాజాతిగా చేసి కాచికాపాడతాడు. వారికి వాగ్దత్త భూమిని దయచేస్తాడు. ఆ ప్రజలు యావేను మాత్రమే కొలవాలి. అతడు మోషే ద్వారా దయచేసిన ధర్మశాస్త్రాన్ని పాటించాలి. యిస్రాయేలీయులు కనాను దేశములో స్థిరపడిన పిదపగూడ ఏటేట ఈజిప్టు నిర్గమనాన్ని స్మరించుకొంటూ పండుగ చేసికొనేవాళ్లు. అదే వాళ్ళ పాస్కోత్సవం - నిర్గ 12, 26-27.

కనుక యిస్రాయేలీయుల విశ్వాసానికి కేంద్రబిందువులాంటిది సీనాయి నిబంధనం. ఆ నిబంధనను బట్టే వాళ్లు యావేను విశ్వసించి అతన్ని ఆరాధించే ప్రజలుగా రూపొందారు. తర్వాత ఆ నిబంధన నియమాలను విశ్వాసంతో పాటించమని ప్రవక్తలు యూదులను నాల్గువందల యేండ్ల పొడుగున హెచ్చరిస్తూ వచ్చారు.

## 3. ప్రవక్తల ప్రబోధాలు

కనాను దేశంలో స్థిరపడ్డాక యూదులు ఎన్నో ప్రలోభాలకు గురయ్యారు. వాళ్ళ ప్రధాన ప్రలోభం విగ్రహారాధనం. ఆ రోజుల్లో యూదుల చుట్టుపట్ల వున్న ప్రజలంతా బాలుని కొల్చేవాళ్ళు. యూదులుకూడా మాటిమాటికి ఈ దేవుణ్ణి ఆరాధించి పాపం కట్టుకొనేవాళ్ళు. వాళ్ళను హెచ్చరించడానికి దేవుడు ప్రవక్తలను పంపాడు. ఆ దైవ భక్తులు ప్రజల విగ్రహారాధనను ఖండించేవాళ్ళు. వాళ్ళను చీవాట్లుపెట్టి మళ్లా దేవుని దగ్గరికి రాబడుతుండేవాళ్ళు.

యెషయా ప్రజలకు శ్రద్ధను బోధించిన మహా ప్రవక్త. అతడు దేవుణ్ణి నమ్మి నెమ్మదిగా వుండడంలోనే మీ బలం ఇమిడి వుందని ఆనాటి ప్రజలను హెచ్చరించాడు - 30,15. దేవుని పలుకులు నమ్మకపోతే నీ వసలు నిలువనే నిలువని అహాసు రాజుని మందలించాడు - 7, 9. హిజ్కియా రాజు కాలంలో అస్సిరియా రాజు సన్హెరీబు యెరూషలేము మీదికి దాడి చేసాడు. ఐనా దేవుణ్ణి నమ్మి నిమ్మళంగా వుండమని ప్రవక్త రాజుని హెచ్చరించాడు. తర్వాత సన్హెరీబు ముట్టడిని ఆపి స్వీయ దేశానికి వెళ్ళిపోవలసి వచ్చింది - 2 రాజు 19.

క్రీస్తుపూర్వం 587లో బాబిలోనియా రాజు నెబుకద్నెసరు యూదులను జయించి వారి నగరాన్నీ దేవళాన్నీ నాశం జేసాడు. వారిని బాబిలోనియాకు బందీలనుగా తీసికొని పోయాడు. ఆ దేశంలో యూదులు తీరని నిరాశకీ నిరుత్సాహానికీ గురయ్యారు. భక్తివిశ్వాసాలు కోల్పోయి యావే కంటెగూడ బాబిలోనియుల దేవుళ్లే గొప్పవాళ్ళని యెంచారు. ఈ కాలంలో గూడ ప్రవక్తలు యిస్రాయేలీయులను హెచ్చరించి ప్రోత్సహించారు. మీరు యావేను నమ్మండి. ప్రవాసం శీఘ్రమే ముగుస్తుందని ఓదార్చారు.

యిస్రాయేలూ!నా సంగతి ప్రభువుకి తెలియదు
నాకు జరిగిన అన్యాయాన్ని దేవుడు గుర్తించలేదు
అని నీవు ఫిర్యాదు చేస్తావా?
అతడు అలసిపోయినవారికి శక్తి నొసగుతాడు
దుర్బలులకు బలాన్ని దయచేస్తాడు
యువకులు అలసిసొలసిపోతారు
లేబ్రాయంవాళ్ళు పడిపోతారు
కాని ప్రభుని నమ్మినవాళ్ళు నూత్న బలాన్ని పొందుతారు
వాళ్ళు పక్షిరాజులా రెక్కలుచాచి పైకెగురుతారు.
అలసట లేక పరుగెత్తుతారు
బడలిక లేక నడక సాగిస్తారు - యెష 40, 27-31.

బాబిలోనియాలోని యూదులు ఆనాటి ప్రవక్తల బోధలను నమ్మారు. ఆ దైవభక్తులు చెప్పినట్లుగానే క్రీస్తు పూర్వం 583లో ప్రవాసం ముగిసింది. యూదులు మళ్లా యెరూషలేముకి తిరిగి వచ్చారు. ఈలా బాబిలోనియాలో యూదుల విశ్వాసదీపం ఆరిపోకుండ వెలిగేలా చేసింది ప్రవక్తలే.

## 4. భావికాల ప్రజల విశ్వాసం

ప్రవక్తలు నెత్తీ నోరూ బాదుకొని చెప్పినా యిస్రాయేలీయుల తమ విశ్వాసాన్ని నిలబెట్టుకోలేదు. కనుక ప్రవక్తలు విసిగిపోయి తమ కాలంలో కాకపోయినా భావికాలంలో నయినా ప్రజలు తమ విశ్వాసాన్ని నిల్పుకొంటారని ప్రవచనాలు చెప్పారు. ఈ భావికాలం మెస్సీయా వచ్చే కాలం. తిరుసభ నెలకొనే కాలం. యిర్మీయా యీలా చెప్పాడు. సీనాయి నిబంధనం ఇక చెల్లదు. కనుక రాబోయే కాలంలో ప్రభువు యిస్రాయేలీయులతో నూత్న నిబంధనం చేసికొంటాడు. తన ధర్మశాస్త్రాన్ని వాళ్ళ హృదయాల్లోనే వ్రాస్తాడు. వారి పాపాలను మన్నిస్తాడు. వారికి దైవజ్ఞానాన్ని ప్రసాదిస్తాడు - 31, 31-34.

యెహెజ్కేలు ఈలా నుడివాడు. కడపటి దినాల్లో ప్రభువు యిస్రాయేలీయులకు నూత్న హృదయాన్ని దయచేస్తాడు. వారిలోని రాతిగుండెను తీసివేసి దానిస్థానే మాంసపు గుండెను నెలకొల్పుతాడు. అవిధేయులైనవారిని విధేయులుగా మారుస్తాడు. తన ఆత్మద్వారా ప్రభువు ఈ మార్పుని తీసికొని వస్తాడు - 36, 26-27. ఈ నూత్న నిబంధనం ద్వారా, ఈ గుండెల మార్పిడి ద్వారా భావికాలపు ప్రజలకు దేవుని మీద విశ్వాసం పుడుతుంది.

ప్రవక్తలు భావికాలంలో చిన్న భక్తసమాజం ఏర్పడుతుందనీ, ఆ బృందం భక్తి విశ్వాసాలతో ప్రభువుని కొలుస్తుందనీ చెప్పారు. ఈ భక్తబృందానికే "శేషజనం" అని పేరు. ఈ శేషజనం మొదట ప్రవక్తల శిష్యులే. రానురాను ఈ శేషజనం యిస్రాయేలు దేశమంతటా వ్యాపించారు. దేవుణ్ణి నమ్మి అతనిమీద ఆధారపడి జీవించడం వీళ్ళ ముఖ్యలక్షణం. వీళ్ళు తరచుగా పేదలు. కష్టాలు అనుభవించేవాళ్ళు. కనుక వీరికి "దీనులవర్గం" అనికూడ పేరు. (హీబ్రూలో "హనవిం"). నేను మీ నడుమ వినయాత్ములూ దీనులూ ఐన ప్రజలను వుంచుతాను. వాళ్ళు నన్నే నమ్ముకొంటారు" అని జెఫన్యా వీరిని గూర్చే చెప్పాడు - 3,12. "నీతిమంతులు భక్తివిశ్వాసాలవలన జీవిస్తారు" అని హబక్కూకు వీరిని గూర్చే వాకొన్నాడు - 2,4. ఈ శేషజనం, ఈ దీనుల వర్గం, దేవుని పట్ల విశ్వాసంతో జీవిస్తారు. యెషయా వర్ణించిన బాధామయ సేవకుడు కూడ ఈ భక్త బృందానికి ప్రతినిధిగా వుంటాడు. ఆ మహానుభావుడు వధ్యస్థానానికి కొనిపోబడే గొర్రెపిల్ల లాగ, ఉన్ని కత్తిరింపబడే గొర్రెలాగ మౌనంగా వుంటాడేగాని నోరు తెరవడు - 53,7.

ఈ భక్త బృందానికి యూదులకులేని విశ్వాసం వుంటుంది. ఈ భక్త సమాజం నూత్నవేదంలో రాబోయే తిరుసభను సూచిస్తుంది. ఆ సభలో ఆదిమ సభ్యులైన క్రీస్తు, మరియమాత, శిష్యులు మొదలైన వాళ్ళనందరినీ సూచిస్తుంది.

## 5. జ్ఞానులు మొదలైనవాళ్ళ విశ్వాసం

పూర్వవేదాంతకాలంలో జ్ఞానులు యూదులకు బోధ చేసారు. వీళ్లు వ్రాసినవే విజ్ఞానగ్రంథాలు. వీళ్లు కూడ ప్రజలకు విశ్వాసాన్ని బోధించారు. నీవు ప్రభుని నమ్మితే అతడే నిన్ను కాపాడతాడు అంటుంది సామెతల గ్రంథం 20,22. యోబు కష్టాల్లోగూడ ప్రభుని నమ్మాడు. నా విమోచకుడు సజీవుడుగా వున్నాడు. అతడు కడన నన్ను సమర్థించి తీరుతాడు అని ఆ భక్తుడు వాకొన్నాడు - 19,25.

కీర్తనల గ్రంథం నరుడు ప్రభుని నమ్మి జీవించాలని చాలసార్లు నొక్కి చెప్తుంది.
కొందరు రథాలనూ గుర్రాలనూ నమ్ముకొన్నారు
మేమైతే ప్రభుని నమ్ముకొన్నాం - 20,7
ప్రభువే నాకు కాపరి, యిక యే కొదవా లేదు - 23,1
నన్ను నీ చేతుల్లోకి అప్పగించుకొంటున్నాను - 31,5
ప్రభువు తల్లి పక్షిలా నిన్ను తన రెక్కలతో కప్పుతాడు
అతని రెక్కలక్రింద నీవు సురక్షితంగా వుండిపోతావు
అతడు నమ్మదగినవాడు - 91,4.

క్రీస్తుపూర్వం రెండవ శతాబ్దంలో అంటియోకస్ ఎపిఫానిస్ అనే గ్రీకురాజు యూదులను క్రూరంగా హింసించాడు. వాళ్ళు యూదమతాన్ని విడనాడి గ్రీకుమతాన్ని అనుసరించాలని నిర్బంధం చేసాడు. ఈ వేదహింసల్లో ఎందరో యూదులు వేదసాక్షులుగా మరణించారు. ఒక తల్లీ ఆమె ఏడ్గురు కుమారులూ ఒక్కరోజులోనే యూదమతం కోసం ప్రాణాలర్పించారు - 2మక్క 7. అలాగే ఎలియాసరు అనే వృద్ధుడు మతంకోసం ప్రాణత్యాగం చేసాడు - 6, 18-31. ఈ భక్తులంతా దేవునిపట్ల అచంచల విశ్వాసాన్ని ప్రకటించినవాళ్లే. వీళ్ళంతా పూర్వం ప్రవక్తలు పేర్కొన్న శేషజానానికి చెందినవాళ్లే.

పూర్వవేదకాలంలో కొందరు అన్యజాతి ప్రజలుకూడ యూదమతంలో చేరిపోయారు. పూర్వం వాళ్ళు కొలిచే దేవుళ్ళను విడనాడి యావేప్రభువుని పూజించారు. ఎలీషా ప్రవక్తనుండి కుష్ఠవ్యాధిని నయంచేయించుకొన్న నామాను ఈలాంటివాడు - 2 రాజు 5. యోనా ప్రవక్త బోధలు విని పశ్చాత్తాపపడిన నీనివే పౌరులు ఈలాంటివాళ్లు - 3,4. యూదితు విజయాన్ని చూచి యూదసమాజంలో చేరిన అమ్మోనీయుడు అరియోకు ఈలాంటివాడు - 14,10. వీళ్ళందరూ ప్రభువుపట్ల గాఢమైన విశ్వాసాన్ని ప్రదర్శించినవాళ్ళే.

# 2. నూత్నవేదం

## 1. క్రీస్తుపట్ల విశ్వాసం

చాలమంది క్రీస్తుబోధలు విన్నారు. అతని అద్భుతాలు చూచారు. కాని కొద్దిమంది మాత్రమే అతన్ని విశ్వసించారు. ఆలా విశ్వసించినవాళ్ళే అతనికి శిష్యులయ్యారు. యోహానులాంటి భక్తుడే క్రీస్తే మెస్సీయా అని నిస్సందేహంగా విశ్వసించలేకపోయాడు. కనుక శిష్యులను పంపి రాబోయేవాడివి నీవేనా అని అడిగించాడు - మత్త 11,3. పరిసయులు క్రీస్తుని అసలే విశ్వసించలేదు. వాళ్ళు క్రీస్తు దయ్యాలకు నాయకుడైన బెల్జెబూలు సహాయంతో అద్భుతాలు చేస్తున్నాడని నిందించారు - 12,24.

కాని కొద్దిమంది మాత్రం క్రీస్తుని పూర్తిగా విశ్వసించారు. వారిలో శిష్యులు ముఖ్యులు. వారి నాయకుడైన పేత్రు యేసే మెస్సియా అని రూఢిగా ప్రకటించాడు - మత్త 16,16. వాళ్ళంతా క్రీస్తు చుట్టు పోగయ్యారు. వీళ్ళే నూత్నవేదం లోని మొదటి విశ్వాసబృందం. పూర్వవేదం పేర్కొన్న శేషజనాన్నీ దీనులవర్గాన్నీ గుర్తుకుతెచ్చేది వీళ్ళే. వీళ్ళల్లో క్రీస్తు తల్లి మరియ అగ్రగణ్య. ఆమె ప్రభువు తన దాసురాలి దీనత్వాన్ని కటాక్షించాడు అని వినయంగా చెప్పుకొంది - లూకా 1,43.

క్రీస్తు యావే సేవకుడు. అతడు తండ్రి ఆజ్ఞలను పాటించి సిలువమీద అసువులు పాయడానికి యెరూషలేముకి అభిముఖుడైపోయాడు - లూకా 9, 51. ఆ నగరంలో చనిపోయి అతడు తన్ను నమ్మేవాళ్ళ విశ్వాసానికి పరిపూర్ణత నిచ్చాడు - హెబ్రే 12,2.

శిష్యబృందం క్రీస్తుని విశ్వసించినా వారి శ్రద్ధ అచంచలమైంది కాదు. అతని సిలువ మరణాన్ని వాళ్ళు అంగీకరించలేదు. పేత్రు సిలువమరణం క్రీస్తుకి దూరం కావాలనే కోరుకొన్నాడు - మత్త 16,22.

ప్రభువు పేత్రు విశ్వాసం దృఢంగా వుండాలని అతని కోసం ప్రత్యేకంగా ప్రార్థనం చేసాడు - లూకా 22,32. ఐనా యితర శిష్యులతోపాటు అతడు కూడ ప్రభుని ఎరుగనని బొంకాడు. అతని విశ్వాసంకూడ చలించింది. ప్రభువు శత్రువుల చేతికి చిక్కినపుడు శిష్యులందరూ అతన్ని విడనాడి పారిపోయారు - మత్త 26, 56.

కాని ప్రభువు ఉత్థానానంతరం, విశేషంగా ఆత్మ దిగివచ్చాక వాళ్ళ విశ్వాసం బలపడింది.

## 2. తిరుసభ విశ్వాసం

తిరుసభ విశ్వాసం ఏలా ప్రారంభమైంది? ఉత్థాన క్రీస్తు చాలసార్లు శిష్యులకు కన్పించి వాళ్ళ విశ్వాసాన్ని బలపరచాడు. ఆత్మకూడ వారిమీదికి దిగివచ్చింది. ఫలితంగా శిష్యులు తాము పోగొట్టుకొన్న విశ్వాసాన్ని మళ్లా పొంది భక్త్యావేశంతో క్రీస్తునిగూర్చి బోధించడం మొదలెట్టారు. ఆత్మ దిగివచ్చిన దినాన్నే పేత్రు యెరూషలేములోని యూదులకు బోధించాడు. హృదయ పరివర్తనం చెంది క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొంది పాపపరిహారాన్నీ పవిత్రాత్మనీ స్వీకరించండని వారిని హెచ్చరించాడు. ఆ రోజే మూడువేలమంది ప్రభుని విశ్వసించి అతని శిష్యులయ్యారు - అచ 2.41. ఆ రోజే తిరుసభ విశ్వాసం ప్రారంభమైంది.

తొలినాటి క్రైస్తవులు ఏమి నమ్మారు? శిష్యులు క్రీస్తునిగూర్చి చేసిన బోధను నమ్మడమే ఆదిమ క్రైస్తవుల విశ్వాసం. ఆ బోధ సంగ్రహంగా యిది. తండ్రి క్రీస్తుని మెస్సీయాగ పంపాడు. యూదులు అతన్ని సిలువ వేసారు. కాని తండ్రి అతన్ని మరణంనుండి లేపాడు. యేసు మరణోత్థానాలద్వారా మనకు పాపపరిహారం జరిగింది. ఇప్పుడు క్రీస్తుని విశ్వసించి అతనిలోనికి జ్ఞానస్నానం పొందితే మనకు రక్షణం కలుగుతుంది. ఈ బోధే సువిశేష సందేశం ఐంది. పేత్రు పౌలు ఈ సందేశాన్ని బోధించారు. ప్రజలుకూడ ఈ సందేశాన్ని కేవలం నరుల వాక్యంగాగాక దేవుని వాక్యంగా స్వీకరించారు. ఆ సందేశం భక్తుల హృదయాల్లో విశ్వాసం పుట్టించింది - 1 తెస్స 2,13. దానివల్ల వాళ్ళు తమ విగ్రహాలను విడనాడి సత్యమూర్తీ సజీవుడూ ఐన దేవుణ్ణి సేవించడానికి పూనుకొన్నారు - 1,9. క్రీస్తునందు దేవుని రక్షణ ప్రణాళిక నెరవేరిందని గుర్తించారు - అచ 13, 32-33. జ్ఞానస్నానం పొంది తండ్రిని కుమారుని పవిత్రాత్మను విశ్వసించారు.

విశ్వాసుల జీవితం ఏలా వుండాలి? తిరుసభ విశ్వాసులు భక్తిశ్రద్ధలతో సిలువబలిలో పాల్గొనాలి - అచ 2,46-47. ప్రభువు విశ్వాసులను రక్షించేది ప్రధానంగా పూజబలిలోనే. విశ్వాసంతో జీవించేవాళ్ళు నైతిక జీవనం గడపాలి. దేవుని ఆజ్ఞలప్రకారం జీవించాలి. వేదవాక్యాన్ని విన్నంతమాత్రాన్నే చాలదు. అది తెలియజేసే ఆజ్ఞలప్రకారం జీవించి నరుడు దేవుని దీవెనలు పొందాలి - యాకో 1, 25. అబ్రాహాము అంతటివాడు దేవుని ఆజ్ఞప్రకారం ఈసాకుని బలియీయడానికి పూనుకొన్న పిదపనేగాని నీతిమంతుడు కాలేదు - 1,31.

మన విశ్వాసం ప్రధానంగా సోదరప్రేమలో ప్రదర్శితంకావాలి. దేవుణ్ణి ప్రేమించేవాడు దేవునికి పోలికగావున్న తోడినరుణ్ణి గూడ అంగీకరించాలి. మనకు వుండి తోడివాళ్ళు లేక బాధపడుతూంటే మనం వాళ్ళకు తప్పక సాయం చేయాలి - యాకో 2, 15.

విశ్వాసంగలవాడు దేవుని కొరకు ప్రాణాలర్పించడానికిగూడ జంకడు. స్తెఫను అలాంటివాడు - అచ 8,59-60. క్రీస్తుకూడ తన తండ్రిపట్లగల విశ్వాసంతోనే చనిపోయాడు. అతడు తండ్రీ నా యాత్మను నీ చేతుల్లోకి అప్పగిస్తున్నాను అని చెప్పి మరణించాడు. ఆ ప్రభువే నేడు మనకు కూడ ఆదర్శం.

నేడు మనకు ప్రభువుపట్ల విశ్వాసం పుట్టించేది ప్రధానంగా పవిత్రాత్మే. ఆ యాత్మ అనుగ్రహంతోనే క్రీస్తుని దేవుణ్ణిగా అంగీకరిస్తాం - 1 కొ 12,3.

## 3. పౌలు యోహానుల విశ్వాసం

నూతనవేదంలో పౌలు విశ్వాసాన్ని గూర్చి కొన్ని ప్రత్యేకాంశాలు చెప్పాడు. అతని భావాలు సంగ్రహంగా ఇవి.

క్రీస్తు వచ్చిందాకా మోషే ధర్మశాస్త్రం యూదులను రక్షించింది. కాని క్రీస్తు వచ్చాక ఇక ధర్మశాస్త్రం ప్రజలను రక్షించదు. క్రీస్తు మరణోత్థానాలే మనలను రక్షిస్తాయి. కనుక ఇప్పుడు మనం క్రీస్తుని విశ్వసించి మోక్షం పొందాలి. నరుడు ఏసుక్రీస్తునందలి విశ్వాసంద్వారా నీతిమంతుడౌతాడు. ధర్మశాస్త్రాన్ని పాటించడంవల్ల కాదు - గల 2,16.

ప్రభువు రక్షణాన్ని పొందడానికి పాపపు నరులమైన మనకు ఏ అర్హతాలేదు. ప్రభువు దాన్ని మనకు ఉచితంగా దయచేయవలసిందే. మన తరపున మనం కృషిచేయాలి. పుణ్యకార్యాలు సాధించాలి. కాని మన పుణ్యకార్యాలే మనలను రక్షించవు. అవి మన కృతజ్ఞతను తెలియజేస్తాయి. దేవుని రక్షణానికి మనం తెల్పుకొనే ధన్యవాదాన్ని సూచిస్తాయి. మన రక్షణంమాత్రం ఉచితంగా, అనగా కేవలం దేవుని దయ వలన లభించవలసిందే. క్రీస్తు, మరణోత్థానాల వల్ల లభించవలసిందే. కనుక ఏ నరుడూ నా పుణ్యక్రియల వల్లనే నేను నీతిమంతుణ్ణయ్యానని గర్వించకూడదు.

పౌలులాగే యోహానుకూడ విశ్వాసాన్ని గూర్చి కొన్ని ప్రత్యేకాంశాలు చెప్పాడు. అతని భావాలు ఇవి. క్రీస్తుని విశ్వసించేవాణ్ణి దేవుడు ఖండించడు -5,24. విశ్వసించనివాణ్ణి ఖండిస్తాడు - 3,18. క్రీస్తుని విశ్వసించేవాడు నిత్యజీవం పొందినట్లే - 3,16. ప్రభుని నమ్మేవాడు వెలుగులో నడుస్తాడు - 12, 46.

యూదుల ప్రధానమైన తప్పు క్రీస్తుని విశ్వసించక పోవడమే. అతని అద్భుతాలు చూచికూడ అతన్ని బుద్ధిపూర్వకంగా నిరాకరించడమే - 15,24-25.

యోహాను దృష్టిలో నరులు క్రీస్తుని నమ్మడమే ప్రధానమైన విశ్వాసం. ఇందుకోసమే అతడు సువిశేషాన్ని వ్రాసాడు. ప్రజలు యేసు దేవుని కుమారుడని విశ్వసించి ఆ విశ్వాసంద్వారా రక్షణాన్ని పొందడానికే నేనీ గ్రంథాన్ని వ్రాసానని చెప్పుకొన్నాడు - 20,31. కనుక మన శ్రద్ధ ఎప్పుడుగూడ క్రీస్తుమీదనే కేంద్రీకృతమై వుండాలి.

# 2. విశ్వాస స్వరూపం

## 1. విశ్వాసం అంటే యేమిటి?

1. దేవుడు మనకు తెలియజేసిన వేదసత్యాలను దృఢంగా నమ్ముతాం. దేవుని వాక్కునుబట్టే ఈ సత్యాలను నమ్ముతాం. ఇదే విశ్వాసం. విశ్వాసానికి మరో పేరు శ్రద్ధ.

తండ్రి క్రీస్తుద్వారా మనతో మాట్లాడాడు. పూర్వం ప్రవక్తలద్వారా మాట్లాడిన దేవుడు ఈ కడపటి దినాల్లో తన కుమారునిద్వారా మనతో మాట్లాడాడు - హెబ్రే 1,1. తండ్రి క్రీస్తు మరణోత్థానాలద్వారా మనలను రక్షిస్తానని మాట యిచ్చాడు. ఆ మాట ప్రకారమే క్రీస్తుని పంపి మనలను రక్షించాడు. క్రీస్తుద్వారా మన రక్షణ ప్రణాళిక నెరవేరింది.

ఇక, తండ్రి క్రీస్తు ద్వారా మనతో చెప్పిన మాటలకు మనమిచ్చే జవాబే విశ్వాసం. అనగా తండ్రి మనకు తెలియజేసిన రక్షణ ప్రణాళికను మనం అంగీకరిస్తే అదే మన విశ్వాసం ఔతుంది.

2. మనం దేనితో నమ్ముతాం ? బుద్ధిశక్తితో. మొదట దేవుడు తెలియజేసిన సత్యాలను గ్రహించేది మనలోని బుద్ధిశక్తే. మనం చూచికాక చూడకుండా విశ్వసించాలి. కాని తాను చూడని సంగతులను బుద్ధిశక్తి ఏలా గ్రహిస్తుంది? ఏలా అంగీకరిస్తుంది? దేవుని వరప్రసాదం మన బుద్ధిశక్తిమీద పనిచేసి దానికి ఓ రకమైన వెలుగుని ప్రసాదిస్తుంది. ఆ వెలుగువల్ల మన బుద్ధిశక్తి దేవుడు నమ్మదగిన వాడని గ్రహించి అతడు తెలియజేసిన వేదసత్యాలను అంగీకరిస్తుంది.

3. విశ్వాసంతో ఏమి నమ్ముతాం? వేద సత్యాలను నమ్ముతాం. అవి సంగ్రహంగా ఇవి. దేవుడు ఒక్కడే. కాని అతడు త్రీత్వంగా వుంటాడు. అతనిలో పిత సుతుడు పరిశుద్ధాత్మ అని ముగ్గురు వ్యక్తులున్నారు. ఈ దేవుడే లోకాన్ని సృజించినవాడు. త్రీత్వంలోని సుతుడైన సర్వేశ్వరుడు నరావతారమెత్తాడు. సిలువమీద చనిపోయి ఉత్థానమై మనలను రక్షించాడు. ఇప్పుడు మనం క్రీస్తుని విశ్వసించి పాపపరిహారం పొందుతాం. లోకాంతంలో సంభావనా దండనావున్నాయి. దేవుడు పుణ్యాత్ములకు మోక్షాన్ని దయచేస్తాడు. పాపాత్ములకు నరకశిక్ష విధిస్తాడు. ఈ సత్యాలన్నీ పరలోకంలో నెరవేరడం మనం ఓ దినం చూస్తాం. వీటినే ఈ లోకంలో విశ్వసిస్తాం. వీటినే దివ్యశ్రుతి, లేక దైవావిష్కరణం, లేక దేవుడు తెలియజేసిన సత్యాలు అంటాం. ఇవన్నీ బైబుల్లోను, పారంపర్య బోధలోను మనకు తగులుతాయి. నేడు తిరుసభ ఈ సత్యాలనే మనకు బోధిస్తుంది. నేడు మనం నమ్మేది వీటినే.

4. కాని దేవుని మాటలను మనం ఎందుకు నమ్మాలి? రోజువారి జీవితంలో ఓ పెద్దమనిషి లేక సత్యసంధుడు చెప్పిన మాటలను వింటాం. ఎందుకంటే అతడు అబద్ధం

చెప్పడు. నమ్మదగినవాడు. ఈ పెద్దమనిషి మాటలకంటె గూడ అధికంగా దేవుని మాటలు నమ్మదగినవి. అతడు మనలను మోసగించేవాడు గాదు. ఓ తండ్రిలా తల్లిలా మన శ్రేయస్సును కోరేవాడు. ఇంకా మనం అతన్ని మోసగించలేం. ఈలా మనలను మోసగించనివాడూ, మన మోసానికి లొంగనివాడూ ఐన దేవుని పలుకులను నమ్ముతాం, అంగీకరిస్తాం. విశ్వాసంలో ముఖ్యమైన అంశం ఇదే. ఇక్కడ ఏమి నమ్మాం అన్నదానికంటె ఎందుకునమ్మాం, ఎవరిని బట్టి నమ్మాం అన్నవి ముఖ్యమైన ప్రశ్నలు. విశ్వసమంటే ఏవో కొన్ని అమూర్తమైన వేద సత్యాలను నమ్మడంకాదు. వాటిని తెలియజేసిన దేవుణ్ణి నమ్మడం.

5. వేద సత్యాలను పూర్తిగా అర్థంజేసికొని నమ్మం. అర్థంజేసికోకుండానే నమ్ముతాం. వాటిని పూర్తిగా తెలిసికొని అంగీకరించం. తెలిసికోకుండానే అంగీకరిస్తాం. శ్రద్ధలోని చిక్కంతా ఇక్కడే వుంది. చూడకుండా నమ్మడం కష్టం గదా? కాని మోసగించనివాడూ మోసానికి లొంగనివాడూ ఐన దేవుణ్ణి బట్టే ఈ సత్యాలను నమ్ముతాం.

కంటికి గోచరమయ్యే అంశాలపైగాక అగోచరమైన అంశాలపై మా శ్రద్ధను కేంద్రీకరిస్తున్నాం అన్నాడు పౌలు - 2 కొ 4,18. ఇంకా అతడే ఇప్పుడు మనం చూచేది అద్దంలో మసకగా కన్పించే ప్రతిబింబంలాంటిది. కాని అప్పుడు ముఖాముఖి చూస్తాం అన్నాడు - 1కొ 13, 12. క్రీస్తు కూడ తోమాతో చూడకుండా నన్ను విశ్వసించేవాళ్ళు ధన్యులు అన్నాడు - యోహా 20, 29.

కనుక విశ్వసించేవాళ్ళు ఎప్పుడూ చీకట్లో, సొరంగంలో నడుస్తూంటారు. తడువుకొని తిరుగుతూంటారు. అబ్రాహాము జీవితాంతం ఆలా తడువుకొంటూనే పోయాడు. మరియమాతా అర్చ్యశిష్టులుకూడ చీకట్లోనే నడచారు. కార్డినల్ న్యూమను కూడ

నడిపించు నన్ను కరుణామయ జ్యోతీ
ఆలముకొన్నవి చీకట్లు అన్నివైపులా
ఎటుచూచినా గాఢాంధకారం
నేనింకా యిల్లు చేరలేదు
నడిపించు నన్ను ముందుకి జ్యోతీ
కోరుకోను దూరాన వున్నవి చూడాలని
నిలుపు నీవు నా పాదాలను దృఢంగా
ఒక్క అడుగు ముందుకి వేయించు నాచేత

అని ప్రార్థించాడు. నేడు మనంకూడ విశ్వాస జీవితం గడపాలంటే చీకట్లో పయనింపవలసిందే.

6. అన్ని ఆధ్యాత్మికాంశాల్లాగే మన శ్రద్ధకూడ ఈ లోకంలో ప్రారంభమై పరలోకంలో ముగుస్తుంది. అసలు మన శ్రద్ధకు క్రీస్తే ఆధారం. క్రీస్తు రక్షణగాథ అతని రెండవ రాకడతోగాని ముగియదు. కనుక మన శ్రద్ధకూడ ప్రభువు రెండవ రాకడతోగాని

ముగియదు. పౌలు చెప్పినట్లుగా, మనం పరలోక పౌరులం. దివినుండి మన ప్రభువైన యేసుక్రీస్తు రాకకై ఆతురతతో వేచివున్నాం - ఫిలి 3,20. ఆ రెండవ రాకడతోనేగాని మన విశ్వాసం పరిపూర్ణం కాదు. ఈ మధ్యకాలంలో ప్రభువు వరప్రసాదం మనకు తోడ్పడుతూంటుంది. అది మన విశ్వాసాన్ని బలపరుస్తూంటుంది. ఆ విశ్వాసానికి తగిన బహుమతిని మనం దేవునినుండి పొందేలా చేస్తూంటుంది.

మనం నిరీక్షించేవాటికి ఆధారభూతమైందీ
మనం చూడలేనివాటిని నిరూపించేదీ విశ్వాసం

అంటుంది హెబ్రేయుల జాబు 11, 1. అనగా విశ్వాసం వల్లనే మనం భవిష్యత్తులో రానున్న మోక్షాన్నీ క్రీస్తు సాక్షాత్కారాన్నీ నమ్ముతూన్నాం. కంటితో చూడకపోయినా భావిమోక్ష జీవితంమీద ఆశ పెట్టుకొని జీవిస్తూన్నాం.

## 2. విశ్వాస ఫలితాలు

1. విశ్వాసం మన క్రైస్తవ జీవితానికంతటికీ పునాది లాంటిది. మన రక్షణం దానితోనే ప్రారంభమౌతుంది. దాని మీదనే పునాదిలాగ నిలుస్తుంది. దానిలోనికే వేళ్లు పాతుకొంటుంది.

మన రక్షణం విశ్వాసంతోనే ప్రారంభమౌతుంది. దానితోనే మనం దేవుణ్ణి అంగీకరిస్తాం, పూజిస్తాం, ప్రేమిస్తాం. విశ్వాసం వల్లనే భావిలో రానున్న ఉత్థానాన్నీ, మోక్షమహిమనీ నమ్ముతాం. శ్రద్ధలేందే దేవుణ్ణి సంతోషపెట్టలేం. అసలు మొదట మనం దేవుడున్నాడని విశ్వసించాలి. ఆ దేవుడు మన పుణ్యానికి తగిన ప్రతిఫలమిస్తాడని నమ్మాలి. కనుక ఆధ్యాత్మిక జీవితానికి మొదటిమెట్టు శ్రద్ధే - హెబ్రే 11,6.

భవనం పునాదిమీద నిలుస్తుంది. ఆలాగే మన ఆధ్యాత్మిక జీవితంగూడ శ్రద్ధ మీదనే నిలుస్తుంది. పునాది గట్టిగా వుంటే కట్టడానికి ముప్పులేదు. మన శ్రద్ధ బలంగా వుంటే మన క్రైస్తవ జీవితంగూడ పటిష్ఠంగా వుంటుంది.

చెట్టు నేలలోనికి వేళ్లు పాతుకొంటుంది. దాని వేళ్లు నేలలోనికి చొచ్చుకొనిపోయి సారాన్ని గ్రహిస్తాయి. ఆలాగే మన ఆధ్యాత్మిక జీవితమనే చెట్టుకి వేరు మన విశ్వాసమే. మన విశ్వాసపు వేరు ఎంత లోతుగా వుంటే మన ఆత్మ అంత బలంగా ఎదుగుతుంది.

2. శ్రద్ధ మనలను దేవునితో ఐక్యం జేస్తుంది. దానిద్వారా దేవుని జీవనం మనలోకి ప్రసరిస్తుంది. అతని ఆలోచనలు మనలోకి ప్రవేశిస్తాయి. మనం దేవునితో కలసిపోతాం.

శ్రద్ధద్వారా దేవుని వెల్తురు మనమీద ప్రసరిస్తుంది. మనం దైవ జ్ఞానంతో నిండిపోతాం. నరులు ఇంద్రియాలద్వారా, బుద్ధిశక్తి ద్వారా, విశ్వాసం ద్వారాగూడ జ్ఞానాన్ని ఆర్జిస్తారు. కాని విశ్వాసం ద్వారా ఆర్జించే జ్ఞానం అన్నిటికంటె శ్రేష్ఠమైంది. ఇది ఆధ్యాత్మిక జ్ఞానమే. దీనితోనే మనం వేదసత్యాలను గ్రహించేది.

కేవలం బుద్ధిశక్తి వల్ల మనకు దేవుణ్ణి గూర్చి తెలిసేది చాల తక్కువ. విశ్వాసం వల్లనే ఆ ప్రభువు పిత సుతుడు పవిత్రాత్మ అనే ముగ్గురు వ్యక్తులుగా వున్నాడని నమ్ముతాం. సుతుడు నరావతారమెత్తి మనలను రక్షించాడనీ, అతని ద్వారానే మనం దేవునికి దత్తపుత్రుల మౌతామనీ గ్రహిస్తాం. దేవుని ఆత్మ మన హృదయాల్లో వసించి మనలను దేవాలయాలుగా మారుస్తుందని విశ్వసిస్తాం.

శ్రద్ధ ద్వారా దేవుని నుండి దైవబలాన్ని పొందుతాం. ఈ బలంద్వారానే ఈ లోకంలో సంభవించే కష్టాలను భరించగల్గుతున్నాం. పౌలు చెప్పినట్లుగా, ఇప్పుడు మనం అనుభవించే కష్టాలు మనకు రాబోయే మహిమతో ఎంతమాత్రం పోల్చదగినవి కావు అని నమ్మగల్గుతూన్నాం - రోమా 8, 18.

శ్రద్ధ మనకు ఓదార్పునిస్తుంద. ఈ ఓదార్పువల్ల జీవితంలో ఎదురయ్యే కష్టాలను భరిస్తాం. మనకు ప్రీతిపాత్రులైనవారు చనిపోయినప్పుడు కలిగే శోకానికి తట్టుకొంటాం. మరణం వల్ల మన జీవితం అంతంగాదు, మనకు క్రొత్త జీవితం ప్రారంభమౌతుందని నమ్ముతాం.

శ్రద్ధ మనకు ఎంతో పవిత్రతను ఆర్జించి పెడుతుంది. దేవుడు ఉన్నాడని నమ్మి అతన్ని ఆరాధించడం వల్ల మనకు ఎంతో పుణ్యం కలుగుతుంది. దేవుణ్ణి నమ్మి మనం చేసే కార్యాలకు గూడ ఎంతో విలువ వుంటుంది. దేవుణ్ణి విశ్వసించేవాళ్ళ బుద్ధిశక్తి చిత్తశక్తి క్రియాశక్తి దేవునికి లోబడతాయి. దీనివల్ల కూడ ఎంతో పుణ్యం లభిస్తుంది. కనుక విశ్వాసం ద్వారా నరుడు అన్నివిధాల పునీతుడౌతాడు.

## 3. విశ్వాసాన్ని పెంచుకోవడం ఏలా?

1. మొదట చాలినంత భక్తిలేని క్రైస్తవుల విషయం చూద్దాం., విశ్వాసంలో వృద్ధి చెందాలంటే దేవునికి ప్రార్థన చేసికోవాలి. శ్రమచేసి భక్తిమంతమైన జీవితం గడపాలి.

ఈ దేశంలో మనం నిరంతరం అన్య మతస్థుల మధ్య వసిస్తూంటాం. ఐనా మన విశ్వాసాన్ని కొద్దో గొప్పో నిల్పుకోగల్గుతున్నాం. దీనికి దేవునికి వందనాలు చెప్పుకోవాలి. శ్రద్ధ ప్రభువు దయచేసే వరం. ఈ వరానికి మనం దేవునికి కృతజ్ఞులమై యుండాలి - 2 కొ 9,15.

ఎప్పుడూ మనకు చాలినంత విశ్వాసం వుండదు. కనుక శిష్యుల్లాగే మనం కూడ ప్రభూ! మా విశ్వాసాన్ని పెంపొందించు అని క్రీస్తుని అడుగుకోవాలి - లూకా

17,5. అప్పుడప్పుడు కాసేపు స్తిమితంగా కూర్చుండి కేవలం విశ్వాస ప్రార్థనం చేసికోవడం మంచిది. ఈ ప్రార్థనలో ప్రభుని గాఢంగా విశ్వసించే భాగ్యం కొరకు అడుగుకోవాలి.

మన తరపున మనం భగవద్భక్తినీ శ్రద్ధనీ పెంపొందించే గ్రంథాలు చదవాలి. బైబులు, క్రీస్తు అనుసరణ గ్రంథం ఈలాంటివి. కొన్ని పుస్తకాలు దైవభక్తిని హేళన చేస్తాయి. నాస్తిక భావాలను ప్రబోధిస్తాయి. ఈలాంటి గ్రంథాలు మనకు పనికిరావు.

అన్ని వేదసత్యాలు మనకు అర్థంకావు. కాని మనం అర్థం చేసికోలేని వేదసత్యాలను నిరాకరించకూడదు. ఒకోసారి దేవుడు మనతో మెలిగేతీరు మనకు సరిగా బోధపడదు. విశేషంగా దేవుడు అయా కష్టాలను ఎందుకు పంపుతాడో మనకు తెలియదు. కనుక శ్రమలు వచ్చినపుడు మనం దేవునిమీద మొరపడకూడదు.

కొన్నిసార్లు విశ్వాసానికి వ్యతిరేకమైన శోధనలు వస్తూంటాయి. పరలోకం మోక్షనరకాలు నిజంగా వున్నాయా అని సందేహం కలుగుతూంటుంది. అసలు భగవంతుడు ఉన్నాడా అని అనుమానం కలుగుతుంది. అనాదికాలం నుండి నరులంతా వట్టినే భ్రాంతి పడుతున్నారేమో అని శంక కలుగుతుంది. అలాంటప్పుడు కూడ వినయంతో దేవునికి ప్రార్థన చేసికోవాలి. మూగదయ్యం పట్టిన పిల్లవాడి తండ్రిలాగ ప్రభూ! నేను నిన్ను నమ్ముతూనే వున్నాను. ఐనా నాలో ఏమైనా అవిశ్వాసముంటే దాన్ని నీవే తొలగించు అని అడుగుకోవాలి - మార్కు 9,24. తెలిసినవాళ్ళనడిగి వేదసత్యాలను గూర్చిన సందేహాలను నివృత్తి చేసికోవాలి.

దేవద్రవ్యానుమానాలన్నీ విశ్వాసాన్ని పెంచేవే. కనుక మనం భక్తితో పూజలో పాల్గొని దివ్యసత్ప్రసాదాన్ని స్వీకరించాలి. శ్రద్ధతో పాపసంకీర్తనం చేసికోవాలి. వివాహ దేవద్రవ్యానుమాన మిచ్చే ప్రత్యేక వరప్రసాదంతో పవిత్రంగా జీవించాలి.

జీవితంలో ఎన్నో కష్టాలు ఎదురౌతాయి. తరచుగా మనలను తన దగ్గరికి రాబట్టుకోవడానికే దేవుడు కష్టాలను పంపుతూంటాడు. అవి లేకపోతే మనం ఆ ప్రభువుని పూర్తిగా మర్చిపోతాం. శ్రమలు మనకు ఎన్నో పాఠాలు నేర్పిపోతాయి. అవి చేసే మంచిపని మన విశ్వాసాన్ని పెంచడం. అగ్ని బంగారాన్ని పరీక్షిస్తుంది. మన విశ్వాసాన్ని శ్రమలు పరీక్షిస్తాయి. నిప్పువల్ల బంగారం మెరుగెక్కుతుంది. బాధలవల్ల మన విశ్వాసం మెరుగెక్కుతుంది - 1 పేత్రు 1,6-7. కనుక మనం కష్టాల్లో దేవుని హస్తాన్ని గుర్తించి ఆ ప్రభువుని ఇంకా అధికంగా నమ్మాలి.

నేడు చాలమంది క్రైస్తవులు వట్టి లౌకిక జీవితం గడుపుతున్నారు. వీళ్ళు దేవుడు లేడనిచెప్పరు. కాని రోజువారి జీవితంలోమాత్రం దేవుడు లేడో అన్నట్లుగానే ప్రవర్తిస్తూంటారు. కూడు గుడ్డ యిల్లు వాకిలి డబ్బుజేసికోవడం ఉద్యోగం - వీటితోనే సరిపెట్టుకొంటారు. దైవకార్యాల్లో ఏమాత్రం శ్రద్ధజూపరు. వీళ్ళు సిద్ధాంతరీత్యా కాదుగాని

ఆచరణ రీత్యా నాస్తికులు. వీళ్లల్లో విశ్వాసం పూర్తిగా చచ్చిపోలేదు కాని చురుకుగా పనిమాత్రం చేయదు. ఈలాంటి వాళ్లు ఆధ్యాత్మిక విషయాలపట్ల తమకు ప్రీతి పుట్టించమని వినయంతో దేవుణ్ణి అడుగుకోవాలి. తమ హృదయంలో లౌకిక మనస్తత్వం వేళ్లు పాతుకోకుండా వుండేలా చూచుకోవాలి.

2. ఇక భక్తిగల క్రైస్తవుల విషయాన్ని చూద్దాం. వీళ్ళల్లో విశ్వాసదీపం ప్రకాశవంతంగా వెలుగుతూనే వుంటుంది. ఐనా వీళ్ళు తమ శ్రద్ధను ఇంకా అధికంచేసికోవచ్చు.

భక్తిగల క్రైస్తవులు బైబులును, విశేషంగా సువిశేషాలను శ్రద్ధతో చదువుకోవాలి. క్రీస్తు బోధలనూ అతని ప్రవర్తనా సరణినీ క్షుణ్ణంగా అర్థంచేసికోవాలి. అతన్ని అనుకరించాలి, ధ్యానం చేసికోవాలి. క్రీస్తుపట్ల భక్తి మన విశ్వాసాన్ని బలపరుస్తుంది.

భక్తిపరులు అన్నిటిలోను దేవుని సాన్నిధ్యాన్ని గుర్తించాలి. మొదట వాళ్లు సృష్టివస్తువుల్లో దేవుణ్ణి చూడాలి. మమ్మూ మేము చేసికోలేదు దేవుడే మమ్మూ చేసాడు అని అని ఘోషిస్తాయి. ఇంకా వాళ్ళు అందరు నరుల్లోను దేవుణ్ణి గుర్తించాలి. తోడి నరులు భగవంతుని బిడ్డలు, అతని రూపాలు. క్రీస్తుకి తమ్ముళ్ళూ చెల్లెళ్ళూను. కనుక తోడివారిలో దేవుణ్ణి దర్శించడం గొప్ప భక్తి. పైగా వాళ్ళు అన్ని సంఘటల్లోను దేవుని హస్తాన్ని గుర్తించాలి. దేవుని అనుమతిలేందే లోకంలో ఏ కార్యమూ జరగదు. ప్రభువుకి తెలియకుండా మన తలవెంట్రుక ఒక్కటి ఊడిపడదు - మత్త 10, 30. ప్రభువు ఈ జీవితంలో జరిగే మంచిచెడ్డలన్నీ మన రక్షణకు ఉపయోగపడేలా చేస్తాడు. అన్ని సంఘటనలు మన మంచికే జరిగేలా చూస్తాడు - రోమా 8, 28. ఈ విధంగా సృష్టి వస్తువుల్లోను, తోడినరుల్లోను, ఆయా సంఘటనల్లోను దేవుని సాన్నిధ్యాన్ని గుర్తించి మన విశ్వాసాన్ని పెంచుకోవాలి.

మంచివాళ్లు తమ ఆలోచనల్లోను చేతల్లోను మాటల్లోను విశ్వాసాన్ని ప్రదర్శించాలి. వాళ్ళ తలపులు సువిశేష సూక్తులవల్ల ప్రభావితమై వుండాలి. వాళ్ళ పలుకుల్లో ఈ లోకపు విలువలుకాక ఆధ్యాత్మిక విలువలు కన్పిస్తుండాలి. వారి పనులు క్రీస్తు పనులను పోలివుండాలి. అంతేకాని ఈ లోకంలోని పాపపు మానవుల పనులను పోలివుండకూడదు. ఈ విధంగా మన త్రికరణాల్లోను విశ్వాసం ప్రదర్శితమౌతుండాలి.

నీతిమంతులు తమ విశ్వాసం వలన జీవిస్తారు - హబ 2,4. పైగా వాళ్ళు తాము సాధించిన విశ్వాసాన్ని ఇతరులకుకూడ అందిస్తారు. వాళ్లు ప్రజల్లో భక్తి విశ్వాసాలు పెంపొందాలని ప్రార్థనచేస్తారు. నీతిమంతుల మంచిపనులనూ పుణ్యక్రియలనూ చూచి భక్తిని కోల్పోయినవాళ్లుకూడ దేవుని దగ్గరకు తిరిగివస్తారు. వారి మృదువైన మందలింపులనూ హెచ్చరికలనూ గుర్తించి భక్తిలేనివాళ్లు సిగ్గుతెచ్చుకొంటారు. శీఘ్రమే ప్రబోధంచెంది దేవుని దగ్గరికి తిరిగివచ్చి ఆ ప్రభువును పూజించుకొంటారు. విశ్వాసప్రభావం ఈలా వుంటుంది.

# 9. వేదబోధ



## విషయసూచిక



## 1. వేదబోధ

ఈ మొదటి అధ్యాయంలో ఐదంశాలు పరిశీలిద్దాం.

1. వేదబోధకు పూనుకోవడమనేది వ్యక్తిగతమైన విషయమా లేక తిరుసభ కోరికా? ఇది వ్యక్తిగతమైన అంశంకాదు. తిరుసభే వేదబోధను అధికార పూర్వకంగా ఆదేశించింది. రెండవ వాటికన్ మహాసభ 30 ఏండ్లకు పూర్వమే ఈ విషయాన్ని ప్రస్తావించింది. ఆరవ పాల్ పాపుగారు వేదబోధను గూర్చి పెద్ద శ్రీముఖమే వ్రాసారు. ఇక రెండవ జాన్‌పాల్ పాపుగారు చాల తావుల్లో, చాల సందర్భాల్లో ఈ యంశాన్ని నొక్కి చెప్తూ వచ్చారు. కనుక ఈ కార్యక్రమాన్ని మనమందరమూ శ్రద్ధతో చేపట్టాలి.

2. నూత్న వేదబోధ చేయడానికి ఇప్పుడు మంచి తరుణం లభించింది. దీన్ని మనం సద్వినియోగం చేసికోవాలి. ఏమిటి ఈ తరుణం? నేడు పాశ్చాత్యదేశాల్లో విశ్వాసం నశించింది. మనం చూస్తూ ఊరుకోగూడదు. ప్రయత్నంచేసి నశించిన విశ్వాసాన్ని నూత్నబోధద్వారా పునరుద్ధరించాలి. గత 80 ఏండ్లూ కమ్యూనిస్టులు రష్యా పాలనలోకి వచ్చిన దేశాల్లో విశ్వాసాన్ని రూపుమాపారు. కాని ఇప్పుడు ఆ దేశాలకు స్వేచ్ఛ లభించింది. కనుక ఆ దేశాల్లో వేదబోధ చేయడానికి మనకు మంచి అవకాశం లభించింది అనుకోవాలి. ఇంకా ఇండియా చైనా, ఆఫ్రికా మొదలైన దేశాల్లోకూడ వేదబోధ చేయడానికి ఇది మంచి తరుణం. ఈ యవకాశం దాటిపోతే మళ్ళా వేదబోధకు పూనుకోవడం కష్టం. సువార్తను బోధించిన తావులన్నిటిలోను ఎన్నో సత్ఫలితాలు లభించాయి. ఇండియాలాంటి పెద్ద దేశాలకు మాత్రం ఈ ఫలితాలు అందవద్దా?

అన్నిటికంటె గొప్ప తరుణం ఇది. క్రీస్తు జన్మించి రెండువేల యేండ్లు ముగిసాయి. ఆ ప్రభువు జ్ఞాపకార్థంగా ప్రపంచ వ్యాప్తంగా పెద్దయెత్తున జూబిలీ జరుపుకొన్నాం. ఈ సమయంలో సహజంగా భక్తి ఉత్సాహాలు చూపుతాం. కనుక ఇది వేదబోధకు మంచి తరుణం.

3. ఈ వేదబోధను ప్రస్తుత పాపుగారు చాలసార్లు "నూత్న వేదబోధ" అని పేర్కొన్నారు. కాని దీనిలోని నూత్నత్వం ఏమిటి? ఇంతకు పూర్వం వేదబోధ జరగలేదని భావమా? పూర్వవేదంలో ప్రవక్తల కాలం నుండీ, నూత్నవేదంలో శిష్యుల కాలంనుండీ వేదబోధ జరుగుతూనే వుంది. అనగా యిప్పటికి 3000 ఏండ్లనుండి ఈ వేదబోధ జరుగుతూనే వుంది. ఇకమీదట కూడా జరగబోతూంది. ఐనా ఇప్పుడు తలపెట్టిన బోధలో కొన్ని నూత్నాంశాలున్నాయి. అవి యివి.

1965లో రెండవ వాటికన్ మహాసభను ప్రారంభించడానికి ముందూ, 1975లో వేదబోధను గూర్చి ఆరవ పాల్ పాపుగారి శ్రీముఖం వెలువడక ముందూ క్రైస్తవేతరులకు జ్ఞానస్నానమీయడానికి చేసేదాన్ని మాత్రమే వేదబోధ అన్నారు. ఆ రోజుల్లో మత విషయాలు, ఆత్మకు సంబంధించిన విషయాలు మాత్రమే వేదబోధ క్రిందికి వస్తాయి అనుకొన్నారు. కాని యిప్పుడు వేదబోధ అంటే నరుల ఆత్మకూ దేహానికీ సంబంధించిన అంశాలుకూడ. దేహాత్మలతో కూడిన నరుల పూర్తి శ్రేయస్సును కోరేదే వేదబోధ అని యిప్పుడు భావిస్తున్నారు. ప్రజలను కేవలం ఆధ్యాత్మికంగా మాత్రమేకాక, ఆర్థికంగా సాంఘికంగాగూడ వృద్ధిలోకి తీసికొని రావాలని నేటి వేదబోధకుల తలంపు. ఈ విధంగా వేదబోధకు విస్తృతార్థం వచ్చింది. కనుక ఇది నూత్న వేదబోధ ఐంది.

మరో అర్థంలోకూడ ఈ బోధ నూత్న బోధ ఔతుంది. విశ్వాసాన్ని కోల్పోయిన పాశ్చాత్య దేశాలకు ఇప్పుడు మళ్ళా రెండవసారి బోధ చేయబోతున్నారు. కనుక ఇది వాళ్ళకు క్రొత్త బోధ ఔతుంది కదా!

ప్రస్తుత వేదబోధలో ఇంకో నూత్నాంశం కూడ ఉంది. ఇప్పుడు మనం ప్రార్థనలతో, ఉత్సాహంతో, ప్రాయశ్చిత్తంతో, నియమిత ప్రణాళికతో, బృందాలు గాను మూకుమ్మడిగాను వెళ్లి వేదబోధ చేయబోతున్నాం. పూర్వం జరిగిన వేదబోధలో ఈ సన్నాహాలన్నీ లేవు. కనుక, పై మూడంశాలను పురస్కరించుకొని దీన్ని నూత్న వేదబోధ అన్నారు.

4. ఈ వేదబోధ ఎవరికి ఉపయోగపడుతుంది? ఇది విశేషంగా మూడు వర్గాల ప్రజలకు ఉపయోగపడుతుంది. మొదటి వర్గం వాళ్ళు భక్తివిశ్వాసాలు కల క్రైస్తవ ప్రజలు. వీళ్ళు కొదిలగానో గొప్పగానో ప్రపంచమంతటా వ్యాపించి వున్నారు. ప్రస్తుత వేదబోధ వీళ్ళ విశ్వాసాన్ని పెంచుతుంది. వీళ్లు పూర్వం కంటె గూడ ఎక్కువ భక్తిని అలవర్చుకొంటారు.

రెండవ వర్గంవాళ్ళు భక్తిని కోల్పోయిన క్రైస్తవులు. తమ తాతలూ తండ్రులూ క్రైస్తవులైనా ఇప్పుడు వీళ్లు మాత్రం క్రైస్తవులుగా జీవించటం లేదు. వీళ్ళు ఎక్కువగా యూరపులోను అమెరికాలోను వున్నారు. ప్రస్తుత వేదబోధ వీళ్ళకు మళ్ల విశ్వాసాన్ని పుట్టిస్తుంది.

మూడవ వర్గంవాళ్ళు క్రైస్తవులుకాని అన్యమతాల ప్రజలు. వీళ్ళు విశేషంగా ఆఫ్రికా ఖండంలో, ఇండియా చైనా దేశాల్లో, ఆస్ట్రేలియాలోని ఆదిమవాసుల తెగల్లో వున్నారు. ప్రస్తుత వేదబోధ వీళ్ళకు మొట్టమొదటి సారిగా విశ్వాసాన్ని పుట్టిస్తుంది. ఈ విధంగా ఈ బోధ మూడు పెద్ద వర్గాల ప్రజలను ప్రభావితం చేస్తుంది.

5. నూత్న వేదబోధ పరిధి ఏ మేరకు? ప్రజలకు జ్ఞానస్నానమిచ్చి వారిని క్రైస్తవ మతంలోకి చేర్చడం మాత్రమే ప్రస్తుత వేదబోధ లక్ష్యంకాదు. నరులు దేహాత్మలకు చెందిన సంపూర్ణ విమోచనాన్ని సాధించాలి. వాళ్ళు సాంఘికంగా, ఆర్థికంగా, ఆధ్యాత్మికంగా విమోచనాన్ని పొందాలి. ఈ కార్యం క్రీస్తుద్వారా జరగాలి. నూత్న వేదబోధ ఆశయమిది.

# 2. బైబులు - వేదబోధ

ఇక్కడ మనం నాల్గంశాలు పరిశీలించాలి.

## 1. పంపకం

వేదబోధకులు ప్రధానంగా దేవునిచే పంపబడినవాళ్ళు. కనుక ఇక్కడ బైబుల్లోని "పంపకం" అనే భావాన్ని కొంచెం విపులంగా పరిశీలిద్దాం.

పూర్వం వేదంలో మొదట పంపబడినవాళ్ళు ప్రవక్తలు. వీళ్ళు ప్రధానంగా ప్రభువు దాసులుగా, రాయబారులుగా ప్రజల దగ్గరికి వెళ్ళి వాళ్ళకు ధర్మశాస్త్ర నియమాలను బోధించారు. ప్రజలు సీనాయి నిబంధనం షరతుల ప్రకారం జీవించాలని హెచ్చరించారు. పాపాలకు పశ్చాత్తాప పడమని నొక్కి చెప్పారు. మోషే మొదటి ప్రవక్త. తర్వాత యేలీయా, యెలీషా, హోషేయా, యెషయా, యిర్మీయాలాంటి మహా ప్రవక్తలు దైవ వాక్కును విన్పించారు. యిస్రాయేలీయులను నడిపించిన యోషువా, సమూవేలు, దావీదు మొదలైన నాయకులు కూడ ప్రవక్తలే.

పై ప్రవక్తలతో పాటు యిస్రాయేలు జనమంతా గూడ పంపబడినవాళ్ళే. ప్రభువు వాళ్ళను అన్యజాతులకు జ్యోతిగా నియమించాడు -యెష 42,6. కనుక అన్యజాతులకు దేవుణ్ణి తెలియజేసి వాళ్ళనుకూడ ప్రభువు దగ్గరికి రాబట్టడం ఆ ప్రజల పూచీ. అంత్యకాలంలో ఓ భక్తుడు ప్రభువుకి దూతగా వచ్చి అతనికి మార్గం సిద్ధం జేస్తాడని మలాకీ ప్రవచనం నుడువుతుంది - 3,1. క్రీస్తు బోధల ప్రకారం ఈ దూత స్నాపక యోహానే. అతడు పూర్వవేదంలో చివరి ప్రవక్త.

నూత్న వేదంలో తండ్రి పంపగా వచ్చినవాడు ప్రధానంగా క్రీస్తే. పిత మొదట తన సేవకులైన ప్రవక్తలను పంపి కట్టకడన తన కుమారుణ్ణే పంపాడు - మార్కు 12,

6-8. క్రీస్తు చాలసార్లు తన్ను తండ్రిచే పంపబడినవాణ్ణిగానే వర్ణించుకొన్నాడు. ఉదాహరణకు అతడు నన్ను పంపినవాని చిత్తాన్ని నెరవేర్చడం, అతని పనిని పూర్తి చేయడం నాకు ఆహారం అన్నాడు - యోహా 4,34.

క్రీస్తు ప్రవక్తలందరిలోను గొప్పవాడు. అతడు ప్రజలకు తండ్రినిగూర్చి తెలియజేసాడు. తన మరణోత్థానాలద్వారా వారి పాపాలకు పరిహారం చేసాడు. అతడు తిరిగి పిత దగ్గరికి వెళ్ళిపోకముందు శిష్యులతో "తండ్రినన్ను పంపినట్లే నేనూ మిమ్ము పంపుతున్నాను" అన్నాడు - యోహా 20,21. క్రీస్తు తర్వాత శిష్యులు పంపబడినవాళ్ళుగా వేదబోధ చేయాలి. కనుకనే ఉత్థానక్రీస్తు వారితో "మీరు ప్రపంచమంతట తిరిగి సకల జాతులకు సువార్తను బోధించండి" అని చెప్పాడు - మార్కు 16,15. తనకు సాక్షులుగా వుండమని ఆజ్ఞాపించాడు - అ.చ. 1,8.

ప్రభువు అన్యజాతులకు బోధ చేయడానికి పౌలుని ప్రత్యేకంగా ఎన్నుకొన్నాడు - అ.చ. 22,21. పేత్రు యూదులకు లాగే అతడు గ్రీకు రోమను ప్రజలకు సువార్తను బోధిస్తాడు.

కాని క్రీస్తునిగూర్చి బోధించాలన్నా అతనికి సాక్షులుగా వుండాలన్నా శిష్యులకు శక్తి చాలదు. కనుక ఉత్థానక్రీస్తు పెంతెకోస్తు దినాన శిష్యుల మీదికి పవిత్రాత్మను పంపాడు. ఆ యాత్మ శక్తితోనే వాళ్ళు నేల నాలుగు చెరగుల వరకు పోయి వేదబోధ చేస్తారు. క్రీస్తుకి సాక్షులౌతారు - అ.చ. 1,8.

నేడు మనం పైయపోస్తలుల స్థానంలో వుండి వారికి అనుచరులంగా మెలుగుతూ, వేదబోధ చేయాలి. క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందిన వాళ్లంతా క్రీస్తుని బోధింపవలసిందే దేవుని ఆత్మే మనలను దేవుని బిడ్డలనుగా చేసి, మనచే వేదబోధ చేయిస్తుంది - గల 4,6.

## 2. కుమార పవిత్రాత్మల పంపకం

పవిత్ర త్రీత్వమే మన ప్రేషిత సేవకు ఆధారం. తీత్వంలోని తండ్రి కుమారుని ఈ లోకంలోకి పంపాడు. క్రీస్తు ఈ లోకంలోకి వచ్చి నరులకు తండ్రి ప్రేమను తెలియచేసాడు. అటుపిమ్మట తండ్రి కుమారుని ద్వారా ఆత్మను కూడ ఈ లోకంలోకి పంపాడు. అతడు క్రీస్తు ప్రారంభించిన రక్షణోద్యమాన్ని లోకాంతం వరకు కొనసాగించుకొని పోతాడు. ఉత్థాన క్రీస్తు తన తరపున తాను శిష్యులను వేదబోధకు పంపాడు. ఈ వేదబోధనే నేడు మనంకూడ కొనసాగించుకొని పోయేది. ఈలా తండ్రి మొదట కుమారునీ ఆత్మనూ పంపడమే నేడు మనంకూడ వేదబోధకు పంపబడ్డానికి ఆధారం.

ఇద్దరు దైవ వ్యక్తుల పంపకం నేడు మన పంపకానికి ప్రేరణం పుట్టిస్తుంది.
క్రీస్తు తండ్రిచే పంపబడ్డవాడు. తన తరపున తాను శిష్యులను పంపేవాడు - యోహా 20,21. ఆత్మడు తండ్రి నుండి బయలుదేరి క్రీస్తుద్వారా లోకంలోకి వచ్చేవాడు - 15,26. ఈ యాత్మడు వచ్చాకనే తిరుసభ లేక దైవప్రజ ప్రారంభమైంది. నేడు తిరుసభను వేద బోధకు పురికొల్పేది ప్రధానంగా ఈ యాత్మడే. అతడు క్రీస్తుఉద్యమాన్ని కొనసాగించేవాడు కదా! కుమారుడు పవిత్రాత్మ తండ్రి నుండి బయలుదేరి లోకంలోకి వచ్చినట్లే నేడు మనం కూడ వేదబోధకు లోకం లోనికి పోవాలి. ఆ దైవవ్యక్తుల పంపకం మన పంపకానికి ఆదర్శం, ప్రేరణం కూడ.

## 3. వేదబోధను గూర్చిన క్రీస్తు ఆజ్ఞ

నల్గురు సువిశేషకారులు వేదబోధను గూర్చిన క్రీస్తు ఆజ్ఞను పేర్కొన్నారు. కాని నల్గురు తమ సొంత భావాలను అనుసరించి ఆ యాజ్ఞను వేరువేరు విధాలుగా వర్ణించారు. మార్కు గ్రంథం ప్రకారం, శిష్యులు వేదబోధ చేయాలి. ప్రభువుని విశ్వసించినవారిలో వివిధ అద్భుత శక్తులు కన్పిస్తాయి. 16, 15-18. మత్తయి సువిశేషం ప్రకారం, ఉత్థాన క్రీస్తుకి సర్వాధికారం వుంటుంది. శిష్యులు వేదబోధ చేయాలి. ముగ్గురు దైవవ్యక్తుల పేర్ల మీదిగా నరులకు జ్ఞానస్నానమీయాలి. ఉత్థాన క్రీస్తు సాన్నిధ్యం క్రైస్తవ సమాజాన్ని నడిపిస్తుంది - 28, 18-20. నేడు మనకు బాగా పరిచయమైంది ఈ మత్తయి సువిశేష భాగమే. లూకా సువిశేషం ప్రకారం, శిష్యులు వేద బోధ, చేయాలి. వాళ్ళ ప్రభువుకి సాక్షులుగా గూడ వుండాలి. ఆత్మను పొందాలి - 24, 45-48. యోహాను పుస్తకం ప్రకారం, శిష్యులు వేదబోధకు పంపబడతారు. పవిత్రాత్మను పొంది పాపాలను మన్నిస్తారు - 20, 21-23.

పై యాలోకనాల్లో నల్గురు సువిశేషకారులు వేదబోధ చేయడం ముఖ్యమని చెప్పారు. ఈ బోధను గూర్చిన క్రీస్తు ఆజ్ఞ నేడు మనకు ప్రేరణం పుట్టించాలి. క్రీస్తు అనుచరులు ప్రధానంగా ఆ ప్రభువుని బోధించేవాళ్ళు.

## 4. జూబిలీ

2000 యేట క్రీస్తు ప్రభువు పేరుమీదిగా జూబిలీ జరుపుకొన్నాం. అసలు జూబిలి అంటే యేమిటి?

పూర్వవేదంలో ప్రతి 50వ యేటిని జూబిలి సంవత్సరంగా పాటించేవాళ్ళు. ఆయేడు బానిసలకు విమోచనం లభించేది. అన్యాక్రాంతమైన భూములు తిరిగి

సొంతదారులకు ముట్టేవి - లేవీ 25,8-10. హీబ్రూలో యోబెల్ అంటే పొట్టేలికొమ్ము. యూదులు ఈ కొమ్ముని బూరగా వాడేవాళ్ళు. ఈ బూరను ఊదడంతో జూబిలి సంవత్సరం ప్రారంభమయ్యేది. ఇంగ్లీషు మాటయైన జూబిలి ఈ యోబెల్ పదం నుండే వచ్చింది.

నూత్నవేదంలో క్రీస్తుకూడ ఈ జూబిలి సంప్రదాయాన్ని పాటించాడు. అతడు తన వేదబోధను ప్రారంభించినపుడు నజరేతు ప్రార్థనా మందిరానికి వచ్చి జూబిలి ఉత్సవాన్ని ప్రకటించాడు. ప్రభువు దాన్ని హితవత్సరం అన్నాడు - లూకా 4,18-19. ఈ హితవత్సరం ద్వారా అతడు పేదలకు సువార్తను బోధించడానికీ, పీడితులకు విమోచనాన్ని దయచేయడానికీ పూనుకొన్నాడు. క్రీస్తు బోధలు అద్భుతాల ద్వారాను, మరణోత్థానాల ద్వారాను ఈ విమోచనం సిద్ధించింది. తర్వాత పవిత్రాత్మ శిష్యుల మీదికి దిగివచ్చి ఈ జూబిలీని లేక విమోచనాన్ని తిరుసభ అంతటికీ వ్యాపింప జేసింది. 2000 సంవత్సరంలో మనం జరుపుకొన్న జూబిలికూడ ఈ క్రీస్తు జూబిలికి కొనసాగింపే. ఈ జూబిలి సందర్భంలో, క్రీస్తు అంతటి గొప్ప రక్షకుణ్ణి దయచేసినందుకు మనం తండ్రిని స్తుతించి కీర్తించాం. నేడు మన క్రైస్తవ పెద్దలు జరుపుకొనే జూబిలికూడ పై బైబులు సంప్రదాయం నుండి వచ్చిందే. ఇప్పుడు జూబిలి అంటే ఉత్సవం, వేడుక, కృతజ్ఞత అనే భావాలు వ్యాప్తిలో వున్నాయి.

# 4. భారతదేశ పరిస్థితి

## 1. వేదబోధలో మాంద్యం

పూర్వం మనదేశంలో వేదబోధ ముమ్మరంగానే జరిగేది. కాని యిప్పుడు ఈ వుద్యమం చప్పబడి పోయింది. ఏవరో పేద దళితులు కొద్దిమంది తప్ప ఇప్పుడు క్రైస్తవ ధర్మాన్ని స్వీకరించేవాళ్ళు అరుదు. నేడు వేదబోధ చేయడానికి ఉత్సాహం చూపేవాళ్ళు తక్కువై పోతున్నారు. దీనికి కారణాలు చాలా వున్నాయి.

1. నేటి వేదశాస్త్రులు కొందరు వేదబోధను గూర్చి చులకనగా మాట్లాడుతున్నారు. వీళ్ల భావాల ప్రకారం ఇతర మతాల్లో కూడ రక్షణం లభిస్తుంది. క్రీస్తు ఏకైక రక్షకుడు కాదు. కనుక శ్రమపడి వేదబోధచేయడం, అన్ని మతాల వారిని క్రైస్తవ మతంలోకి రాబట్టడం అంత అవసరం కాదు. ఈలాంటి భావాలను జీర్ణంచేసికొన్న యువగురువులు వేదబోధపట్ల ఆసక్తిని కోల్పోతున్నారు.

2. మన దేశంలో హిందూనాయకులు తీవ్రవాదులు వారి మతాన్ని పునరుద్ధరించుకొనే ప్రయత్నంలో వున్నారు. మతం పేరుమీదిగా అంతట ఘర్షణలు

చెలరేగుతున్నాయి. దౌర్జన్యాలు హింసలు పెచ్చుపెరుగుతున్నాయి. ఈ పరిస్థితుల్లో మనం వేదప్రచారానికి పూనుకోవడం సబబు కాదని కొందరు భావిస్తున్నారు. ఇంకా, మన ప్రభుత్వం క్రైస్తవులైనవారికి ఉచిత వేతనాలు, ఉద్యోగవకాశాలు తగ్గిస్తుంది. కనుక చాలామంది క్రైస్తవులు కూడ హిందువులుగానే చలామణి కాగోరుతున్నారు. ఈలాంటి పరిస్థితుల్లో హిందువులను క్రైస్తవ మతంలోకి రాబట్టడ మెందుకని కొందరి వాదన.

3. పాశ్చాత్య దేశాల్లో కూడ ప్రజలకు క్రైస్తవమతం పట్ల ఆదరం సన్నగిల్లిపోతూంది. మతం వ్యక్తిగతమైన విషయమని పాశ్చాత్యుల వాదం. నరుడు క్రైస్తవుడుగా జీవించడం కంటె మంచి పౌరుడుగా, మంచి వ్యక్తిగా జీవించడం మెరుగని వీళ్ళ తలంపు. ఈలా క్రైస్తవ దేశాల్లోనే క్రైస్తవ మతం పట్ల అభిమానం క్షీణించి పోతూంది. ఈ దేశాల ప్రజలభావాలు మన ప్రజల్లో కూడ వేదబోధపట్ల ఆసక్తిని తగ్గిస్తున్నాయి.

4. మతమూ ఆధ్యాత్మిక విలువలూ వట్టిభ్రమ అని మార్క్సిస్టు నాయకులు చాలా కాలం నుండి వాదిస్తున్నారు. శ్రమజేసి సంపదను ఉత్పత్తి చేయడం, అలా ఉత్పత్తియైన సంపదను అందరూ కలసి సమంగా పంచుకోవడం ముఖ్యమని వీళ్ళ సిద్ధాంతం. వీళ్ళకు భగవంతుడు మత నియమాలు అట్టే రుచించవు. వీళ్ల భావాలుకూడ మన ప్రజల మీద సోకి వీళ్ళను ప్రభావితం చేస్తున్నాయి.

ఇలాంటి కారణాలు అనేకం మన ప్రజల్లో వేదబోధ పట్ల ఉత్సాహాన్ని చంపివేసాయి. ఐనా ఇవన్నీ తప్పుడు సిద్ధాంతాలు. వేదబోధ ఎప్పుడూ అవసరమే. నేటి పరిస్థితుల్లో ఇంకా అవసరం.

## 2. భారతదేశ తిరుసభలో లోపాలు

ఇండియా దేశపు తిరుసభ కేవలం సంస్థలను నడిపే తిరుసభగా తయారైంది. భారత దేశ క్రైస్తవులు విద్యాసంస్థలు, ఆస్పత్రులు, సాంఘికసేవా సంస్థలు నడపడంతోనే సతమతమై పోతున్నారు. వీళ్ళకు విదేశ నిధులు ప్రధానం. నియమాలు పాటించడం ముఖ్యం. ఈలా మన దేశంలో సంస్థలను నడిపే తిరుసభ తానూ ఓ పెద్ద సంస్థయిపోయింది.

భారతదేశ తిరుసభకు ప్రధానంగా కావలసింది దైవానుభూతి. మన ప్రజలు ఉత్థాన క్రీస్తుని అనుభవానికి తెచ్చుకోవాలి. అతడు తిరుసభలోని విశ్వాసుల్లోవుండి వారిని నడిపించే తీరును అర్థం చేసికోవాలి. ఇంకా, మన ప్రజలు పవిత్రాత్మ శక్తిని గుర్తించి ఆ యాత్మచే నడిపింపబడాలి. ఆత్మ దయచేసే వరాలను వాడుకోవాలి. పెంతెకోస్తు నాటి అగ్ని మన హృదయాలకు ప్రేరణం పుట్టించాలి. కనుక మన తిరుసభ ఓ సంస్థగా జీవించడం మానివేసి ఓ భక్తసమాజంగా జీవించడం మొదలుపెట్టాలి.

## 3. భారతీయ తిరుసభకే మొదట వేదబోధ

భారతీయ తిరుసభలో రెండు పనులు ఆవశ్యం జరగాలి. మొదటిపని, భారతీయ తిరుసభే వేదబోధను పొందాలి. మన ప్రజలకు వ్యక్తిగతమైన పరివర్తనం అవసరం. మనం కొలిచే భగవంతుడు పరమ పవిత్రుడు. అపవిత్రుడైన నరుడు అతని సన్నిధిలోనికి రాలేడు.

మన ప్రజల్లో కుల భేదం, వర్గభేదం పోవాలి. క్రీస్తు ద్వారా మనమందరం సరిసమానం. కులాల వారిగా విడిపోతే క్రీస్తుశక్తి మన మీద పనిచేయదు.

మనదేశంలో చాలమంది నిరుపేదలు. ఉన్నవాళ్లు ఈ లేనివాళ్ళను ఆదుకోవాలి. అన్యాయాలు పరపీడనంపోయి ప్రజలకు విముక్తి రావాలి. సమ సమాజం ఏర్పడాలి.

బిషప్పులకీ గురువులకీ మఠసభల సభ్యులకీ మధ్య వుండే తగాదాలూ సమసిపోవాలి. మనలో మనం కొట్లాడుకొంటుంటే దైవరాజ్యాన్ని ఏలా స్థాపిస్తాం? అలాగే గృహస్థులకూ మఠాధికారులకూ వుండే తగాదాలు కూడ సమసిపోవాలి. మన తిరుసభలో గృహస్థుల ప్రమేయం ఇప్పటికంటె అదనంగా పెరగాలి. భారతీయ తిరుసభ క్రైస్తవ సమైక్యతను గూడ సాధించాలి. ఇవన్నీ భారతీయ తిరుసభ వేదబోధను పొందినందువల్ల కలిగే ఫలితాలు. మొదట మనం వేదబోధను పొంది హృదయ శుద్ధినీ ఆత్మ ప్రేరణనూ సాధించిన పిదపనేగాని వేరేవాళ్ళకు వేదబోధ చేయలేం. మన కార్డినల్సు బిషప్పులు మొదట భారతీయ తిరుసభే వేదబోధను పొందాలని కోరారు.

## 4. భారతీయ తిరుసభ చేయవలసిన వేదబోధ

ప్రపంచ మంతటా క్రీస్తుని బోధించాలని పాపుగారి కోర్కె. మనదేశంలో మనం కూడ ఆ ప్రభువుని గూర్చి బోధించాలి. ఇది రెండవ పని. ముందుగా వేదబోధకులు పాటించవలసిన సూత్రాలను కొన్నిటిని పరిశీలిద్దాం.

1. వేదబోధకులకు గొప్ప వినయం వుండాలి. మన శక్తిసామర్థ్యాల వల్లనే మనం అన్యుల హృదయాల్లో విశ్వాసం పుట్టిచంలేం. విశ్వాసం ప్రధానంగా దేవుడిచ్చే వరం. మనం కేవలం సాధన మాత్రులం.

2. భగవంతుణ్ణి గూర్చి బోధించే వాళ్ళకు భక్తి కూడ వుండాలి. మనకు అనుభవానికి రాని భగవంతుణ్ణి గూర్చి ఇతరులకు చెప్పలేం. వారిని సులువుగా నమ్మించలేం. బోధ చేయకముందు మనం దీర్ఘకాలం ప్రార్థనలో గడిపి వుండాలి. విశేషంగా మన బోధ

వినేవారికొరకు మనం ప్రార్థనం చేయాలి. మన ఉపన్యాసాలకంటె గూడ ఎక్కువగా మన ప్రార్థన ద్వారా ఇతరుల మనసు మారుతుంది. ప్రార్థనతోపాటు కొంత తపస్సు కూడ చేయడం మంచిది. ఉపవాసం మొదలైనవాటిని పాటించడం శ్రేయస్కరం.

3. వేదబోధ చేయగోరిన ప్రజలతో స్నేహపూర్వకంగా మెలుగుతుండాలి. వారితో మనకు వ్యక్తిగతమైన సంబంధం వుండాలి. పూర్వపరిచయం లేనివారికి దిడీలున మత విషయాలను చెప్తే వినరు. స్నేహం ద్వారా ఒక్క లౌకిక రంగంలోనేగాక ఆధ్యాత్మిక రంగంలోగూడ మంచి ఫలితాలను సాధించవచ్చు.

4. మన గురువులు, మఠకన్యలు, బ్రదర్లు మొదలైనవాళ్ళు చాలమంది సాంఘిక సేవ చేస్తుంటారు. విద్యాసంస్థలు నడుపుతూంటారు. ఆస్పత్రుల్లో సేవలు అందిస్తుంటారు. కాని వీళ్ళు మత విషయాలను అట్టే పట్టించుకోరు. క్రీస్తుని ప్రజలకు తెలియజేయరు. ఇది మంచి పద్ధతికాదు. మనం విద్యా వైద్య సాంఘిక సేవలు అందించేపుడు మన దగ్గరికి వచ్చినవాళ్ళకు క్రీస్తుని గూర్చి కూడ చెప్పాలి. మనం ప్రభువు సేవకులమన్న సంగతిని ప్రజలు గుర్తించాలి. మన విశ్వాసాన్ని ఎన్నడు దాచిపెట్టుకోగూడదు.

5. మన క్రైస్తవ సమాజంలో కొందరు సంచార బోధకులుగూడ వుండాలి. వీళ్ళు ఎప్పుడూ తావునుండి తావుకి కదలిపోయి క్రీస్తుని బోధిస్తుండాలి. ప్రజలను ప్రోగుచేసి వారిచే ప్రార్థన చేయిస్తుండాలి. ఆదిమ క్రైస్తవ సమాజంలో ఈలాంటి బోధకులు వుండేవాళ్ళు.

6. కొన్ని భక్తిగల కుటుంబాలను సందర్శించి అక్కడ క్రీస్తుని గూర్చి చెప్పి ప్రార్థన చేయిస్తే ఫలితం కలగవచ్చు.

7. మన క్యాతలిక్ సమాజంలో గురువులు సిస్టర్లు గృహస్థుల సేవలను అంతగా వినియోగించుకోరు. ఇదిపెద్ద పొరపాటు. అంతా మనం చేయలేం. మనం చేయలేని పనులు మన గృహస్థులు చేయగలరు. వాళ్ళద్వారా గూడ పవిత్రాత్ముడు మాటలాడతాడు. కనుక మనం వారికి ముందుగా తర్ఫీదునిచ్చి వారిని వాక్య పరిచర్యకు వినియోగించుకోవాలి. గృహస్థుల సేవలను వినియోగించుకోందే మనదేశంలో తిరుసభ వ్యాప్తి చెందదు. ఇక, గృహస్థులు వాళ్ళ తరపున వాళ్ళు ఆత్మ తమకు దయచేసిన వరాలను వినియోగించుకొని వేదబోధ చేయాలి. క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినవాళ్ళంతా ఆ ప్రభుకి సాక్షులుగా వుండాలి. అతన్ని గూర్చి బోధించాలి.

8. బైబులు వాక్యం భగవత్ప్రేరితమైంది. కనుక ప్రజల హృదయాలను నేరుగా తాకుతుంది. దానిలో గొప్పశక్తి వుంటుంది. కనుక దైవవాక్కునే ఎక్కువగా బోధించాలి.

ఐనా మనం తరచుగా ప్రజలకు జ్ఞానోపదేశం బోధిస్తాం. దీనికంటె వాక్యబోధే ముఖ్యం. విశేషంగా పెద్దవాళ్లకు చెప్పేపుడు బైబులునే ఎక్కువగా బోధించాలి.

ఇక మన దేశంలో, మన ప్రాంతంలో, వేదబోధను చేయడాన్ని గూర్చి కొన్ని సంగతులు చూద్దాం.

1. భారతదేశ తిరుసభ తనకొరకు తాను జీవిస్తుంది. తన లాభాన్ని తాను వెదుకుతూంది. స్వప్రయోజనాలను నెరవేర్చుకొంటుంది. తెలివీ పులుకుబడీ కలవాళ్లు చాలమంది తిరుసభను తమ స్వార్థలాభం కొరకు వాడుకొంటున్నారు. ఈ పద్ధతి పోవాలి. భారత తిరుసభ అన్యుల కొరకు జీవించడం నేర్చుకోవాలి. సేవా మార్గాన్ని అవలంబించాలి. విశేషంగా పేదసాదలను ఆదుకోవాలి. దరిద్రులకు సేవలుచేస్తే ఈ దేశంలో తిరుసభకు మంచిరోజులు వస్తాయి. లేకపోతే లేదు.

2. మనదేశ క్రైస్తవులు ఉత్థాన క్రీస్తునీ అతని శక్తినీ అనుభవానికి తెచ్చుకోవాలి. రోజువారి జీవితంలో, విశేషంగా కష్టాల్లో ఆ ప్రభువుని ఆశ్రయించి అతని నుండి బలాన్ని పొందుతూండాలి. తరచుగా మన విశ్వాసులు దైవానుభూతిలేని ప్రజలుగా జీవిస్తున్నారు. విశేషంగా దైవ వాక్యంలోను దేవద్రవ్యానుమాల్లోనువాళ్లు క్రీస్తు దివ్యశక్తిని గుర్తించాలి.

3. భారతీయ క్రైస్తవులు ఈ దేశ సంస్కృతినీ ఆచార వ్యవహారాలనూ జీర్ణం చేసికోవాలి. మన లౌకిక జీవితంలోను ఆధ్యాత్మిక జీవితంలోను కూడ ఈ దేశ సంస్కృతి ప్రతిబింబిస్తుండాలి. లేకపోతే ఈ దేశంలో క్రైస్తవమతం ఎప్పటికి విదేశమతంగానే వుండిపోతుంది. విశేషంగా మన సంగీతం, దేవాలయ శిల్పం, పండుగలు జరుపుకొనేతీరు, మన గ్రంథాల్లోని భాష చాలవరకు మారాలి.

4. మనకు స్థానిక ఉత్సవాలూ స్థానిక భక్తిమార్గాలూ వున్నాయి. సామాన్య క్రైస్తవుల భక్తిని నిలబెట్టేది ఇవే. కనుక వీటిని జాగ్రత్తగా పదిలపరచుకోవాలి. ఈ వుత్సవాలకూ భక్తిమార్గాలకూ ప్రజలు ప్రోగయినప్పుడు వీరికి వాక్యాబోధ చేయాలి.

5. తరచుగా వేదబోధ ఎవరో చేస్తారులే అనుకొంటాం. ఇది పొరపాటు. ప్రతి విచారణా, ఆ విచారణలోని ప్రతి కుటుంబమూ వేదబోధకు పూనుకోవాలి. ఆ మాటకొస్తే ప్రతివ్యక్తి ఇది నాపని అనుకోవాలి. వేదబోధలో వ్యక్తిగతమైన శ్రద్ధ చూపాలి.

6. మఠసభలకు చెందిన గురువులూ సిస్టర్లూ వేదబోధలో ప్రత్యేకమైన శ్రద్ధ చూపాలి. వీళ్ళకు సభ్యులుంటారు. వనరులు వుంటాయి. కనుక వీళ్లు శ్రద్ధతో పనిచేసి ఈ కార్యాన్ని చక్కగా సాధించాలి.

7. వేదబోధలో మన దేశీయ సమస్యలు కూడ రావాలి. మన ప్రజలు సులువుగా గర్భస్రావాలకు పాల్పడుతున్నారు. పిల్లలను కని పెంచగలిగిన ధనికులే ఈ పాపానికి ఎక్కువగా ఒడిగడుతున్నారు. ప్రాణాన్ని నాశంజేసే హక్కు ఎవరికీ లేదు. ప్రాణాలు పోసేవాడు తీసేవాడు భగవంతుడు మాత్రమే. కనుక మన బోధలో గర్భస్రావం పనికిరాదని ఖండితంగా తెలియజెప్పాలి.

8. మన వుద్యోగులు చీటికిమాటికి లంచం తీసికొంటారు. ఇది వట్టి అవినీతి. ఈ యవినీతికి పాల్పడవద్దని మన శ్రోతలను హెచ్చరించాలి.

9. నేటి ప్రజలు వట్టి భోగప్రియులు. తినడం, త్రాగడం, సుఖించడం ఇవే ముఖ్యమనుకొంటుంటారు. ఆధ్యాత్మిక విలువలను పట్టించుకోరు. ఐనా ప్రాచీన భారతదేశం పారమార్థిక విలువలకు పెట్టిందిపేరు. కనుక మన బోధల్లో ఈ భోగవాదాన్ని ఖండించాలి.

10. నేడు అన్యమతాలవారితో సంప్రతింపులు జరపడం, వారి మతాల్లోని విలువలను గుర్తించడం కూడ ముఖ్యం. కనుక అన్యమతాలనుగూర్చి చులకనగా మాట్లాడకూడదు. పరమతనిందకు పూనుకోకూడదు. లోకంలో అనేక మతాలు వుండడం గూడ దేవుని చిత్తమే. ఈ మతాల్లోని మంచి అంశాలను స్వీకరించడానికి మనం సిద్ధంగా వుండాలి. అన్యమతాల పవిత్రగ్రంథాలను గౌరవంతో చూడాలి. వాటినుండి కూడ సూక్తులను ఉదాహరించాలి. తరచుగా హిందువులు చూపినంత మతసహనాన్ని క్రైస్తవులమైన మనం చూపనందుకు సిగ్గుపడాలి.

11. కులవ్యవస్థ, అంటరానితనం మొదలైనవాటిని పాటించడం మహాపాపం. ఐనా మనదేశంలో ఈదురాచారం ఇప్పటికీ వేళ్ళు పాతుకొనివుంది. అందరిలోను దేవుని రూపముంది. ఐనా నరుడు తోడినరుణ్ణి కేటాయిస్తున్నాడు. అణగద్రొక్కుతున్నాడు. నేడు మన తిరుసభలో కుల ప్రాబల్యం తక్కువేమికాదు. మన గురువులూ, మఠకన్యలూ, పెద్దలూ కుల పక్షపాతానికి అతీతులు కారు. కనుక మన వేదబోధలో ఈ కులతత్వాన్ని తప్పక ఖండించాలి.

12. చాలసార్లు మన బోధకంటె మన జీవిత విధానం అధిక శక్తితో పనిచేస్తుంది. మన జీవితం ఆదర్శవంతంగా వుండాలి. మనలను చూస్తుంటే భగవంతుణ్ణి ప్రేమించి సేవించే మహానుభావులు ఈ భూమి మీద ఇంకా కొందరైనా వున్నారు అనిపించాలి. కనుక మంచి జీవితం గడపమని మన సమాజాల్లో ప్రజలకు నిరంతరం బోధిస్తుండాలి.

13. తీసికోవడం కంటె ఈయడం ధన్యం. మనమెప్పుడూ ఎవరివద్దనుండి ఏమి తీసికొందామా అని చూస్తుంటాం. మనకున్నది తులమో ఫలమో మనకంటె హీనులూ

దీనులూ ఐనా వారికి పంచిపెట్టాలని ఏనాడు అనుకోం. ఈ దేశంలో కటిక పేదలు చాలమందివున్నారు. సంపన్నులయినవాళ్ళు ఒక్క పేద కుటుంబాన్నయినా పట్టించుకొని వృద్ధిలోకి తీసికొనివస్తే ఎంత బాగుంటుంది! దేవుడు మననుండి ఆరాధనకంటె కరుణను అధికంగా కోరుతాడు. తన్ను పూజించడంకంటె అక్కరలో వున్న తోడి నరుణ్ణి ఆదుకోవడం ముఖ్యమని చెప్తాడు. కనుక వేదబోధలో మనం ఉన్నవాళ్ళు లేనివాళ్ళకు సహాయం చేయాలని నొక్కిచెప్పాలి. ఆధునిక ప్రపంచంలో దీనజనోద్ధరణలాగ మరేదీ నరుల హృదయాలను కదిలించదు. కనుక నేడు తిరుసభ వ్యాప్తిలోకి రావాలంటే దిక్కులేని వారిని పట్టించుకోవడం దాని ముఖ్య కార్యమైయుండాలి. ఈ యంశాన్ని మన బోధలో గొంతెత్తి చాటాలి.

14. మన ఆంధ్రరాష్ట్రాన్నే తీసికొంటే, 16వ శతాబ్దంనుండి విదేశ గురువులు ఇక్కడ వేదబోధ చేస్తూవచ్చారు. మన పొరుగు రాష్ట్రమైన తమిళనాడులో అంతగా కాకపోయినా, ఇక్కడ కూడ ఒక పాటిగానైనా క్రైస్తవమతం రూపుదిద్దుకొంది. భారతదేశంలో నేటికీ మన రాష్ట్రం వేదబోధక రాష్ట్రంగా చలామణి ఔతుంది. నేడు మన స్థానిక గురువులు, మఠకన్యలు, ఉపదేశులు పట్టుదలతో వేదబోధ చేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో ఏటేట భక్తులు నూత్నంగా క్రైస్తవమతాన్ని స్వీకరిస్తూనే వున్నారు. ఈ యంశాలన్నీ మనకు ప్రేరణం పుట్టించాలి. మనం భక్తిశ్రద్ధలుకల ప్రాచీన వేదబోధకులకు వారసులం. ఆ ప్రాచీన భక్తులవలె నేడు మనంకూడ విశ్వాసజ్యోతిని వెలిగించుకొంటూ పోవాలి. కనుక నేడు మనం వేదబోధలో ఏ మాత్రం వెనుకంజ వేయకూడదు. ఈ భాగ్యం కొరకు అందరమూ దేవుని ప్రార్థిద్దాం.

# 10. పని

బైబులు భాష్యం - 135o

బైబుల్లో పనిని గూర్చి మూడు ప్రధాన భావాలు వున్నాయి. తొలిపాపానికి ముందు నరులకు పని బాధ అనిపించలేదు. తొలిపాపం తర్వాత అది బాధను కలిగించింది. ఇప్పుడు క్రీస్తు మరణోత్థానాల ద్వారా మనపని మనలను రక్షిస్తుంది. ఈ మూడంశాలను క్రమంగా పరిశీలిద్దాం.

## 1. తొలిపాపానికి ముందు పని బాధను కలిగించలేదు

తొలిపాపానికి ముందే పని వుంది. ఐనా అది ఆదాముకి బాధను కలిగించలేదు. భగవంతుడు సృజించిన ఆదాము వట్టినే కాలిమీద కాలు వేసికొని కూర్చోలేదు. దేవుడైన యావే నరుని కొనిపోయి ఏదెను తోటను సాగుచేయడానికి కాయడానికి దానిలో వుంచాడు - ఆది 2,15. ఇంకా యావే ఆదిదంపతులతో మీరు బిడ్డలను పెక్కుమందిని కనండి. భూమండలం అంతట వసించి దాన్ని వశంజేసికొనండి అని చెప్పాడు - 1,28. కనుక ఆదాము తొలిపాపానికి ముందే పనిచేసాడు. ఏదెను తోటను సాగుచేసాడు. భూమిని వశంజేసికొని దానినుండి ఫలసాయం పొందాడు. ఐనా ఈ పని అతనికి కష్టమనిపించలేదు. సంతోషంగానే వుంది.

ఒక్క ఆదామేకాక అతన్ని సృజించిన భగవంతుడు కూడ పనిచేసాడు. పూర్వవేదంలో యావే చేసిన ప్రధానమైన పనులు రెండు. మొదటిది జగత్తుని సృజించడం, రెండవది యిస్రాయేలీయులను ఫరో దాస్యం నుండి విడిపించడం. మొదట లోక సృష్టిని పరిశీలిద్దాం.

"ప్రభువు తన పలుకుతో ఆకాశాన్ని సృజించాడు
తన శ్వాసతో సూర్యచంద్ర నక్షత్రాదులను చేసాడు" అంటుంది కీర్తన 33,6.

ఇంకా, అతడు ఆజ్ఞ యీయగా ఆకాశమూ దాని పైనున్న జల సముదాయమూ పుట్టాయి - 148,5.

ఆకాశం దేవుని మహిమను చాటుతుంది
అంతరిక్షం ప్రభువు సృష్టిని వెల్లడి చేస్తుంది 19 , 1.

జ్ఞాన గ్రంథాల్లో జ్ఞానమనే మరోశక్తి కన్పిస్తుంది. అనాది కాలంనుండి ఈ శక్తి దేవునితో వుంది. ఈ శక్తి మహా శిల్పి. దీని ద్వారానే దేవుడు సృష్టిచేసాడు.

నేను ప్రధాన శిల్పిలాగ
అతని చెంత నిల్చివున్నాను
అతడు చేసిన పుడమిమీద క్రీడిస్తూ
ప్రమోదంగా మానవాళి మధ్య మనుతున్నాను

– సామె 8, 31. ఈ జ్ఞానం ద్వారానే దేవుడు సృష్టి నంతటినీ చేసాడు. దేవుడు లోకాన్ని ఏలా చేసాడు అని ప్రశ్నించుకొని పవిత్ర రచయితలు ఈలా వాకొన్నారు. కుమ్మరి కుండను చేసినట్లుగా దేవుడు లోకాన్ని చేసాడు. అతడు నేలమట్టిని తీసికొని దానినుండి మానవాకృతిని మలిచాడు. దాని ముక్కు రంధ్రాల్లోనికి ప్రాణవాయువును వూదగా అది జీవించే ప్రాణి ఐంది. ఆ ప్రాణే ఆదాము – ఆది 2,7. యెషయా ప్రవచనం 45,9లో కూడ ఇదే భావం కన్పిస్తుంది

మట్టి తన్ను చేసిన కుమ్మరితో వాదం చేస్తుందా?
మన్ను కుమ్మరితో నీవేమి చేస్తున్నావని అడుగుతుందా?
కుండ కుమ్మరితో నీకు నేర్పు చాలదని అంటుందా?

కాని ఇది కేవలం రచయితల ఊహ మాత్రమే. దేవుడు మనలాగ చేతులతో పనిచేసాడు అనుకోగూడదు. అతడు ఇచ్ఛామాత్రంగానే, ఒక్క ఆజ్ఞతోనే, ఒక్క పలుకుతోనే లోకాన్ని చేసాడు. కనుకనే రబ్బయిలు "ఎవడు ఒక్క పలుకు పలకగానే లోకాలు పుట్టాయో ఆ దేవుడు" అని వాకొన్నారు.

యిస్రాయేలీయులు ఆరవ శతాబ్దంలో బాబిలోనియా ప్రవాసంలోగాని దేవుణ్ణి లోకాన్ని చేసిన సృష్టికర్తనుగా అర్థం చేసికోలేదు. భగవంతుడు చేసిన సృష్టిలో ఉత్తమోత్తముడు నరుడు. దేవుడు అతన్ని తనకు పోలికగా చేసాడు – ఆది 1,27. అనగా తనలాంటి వాణ్ణిగా చేసాడు. దేవుని శ్వాస, ఆత్మ అతనిలో వున్నాయి. అసలు దేవుడే భూమిమీద తిరుగుతున్నాడో అనిపించేవాడు నరుడు. ఇక దేవుడు సృష్టి చేసేవాడు అన్నాం. కనుక అతనికి పోలికగా వున్న నరుడుకూడ సృష్టి చేసేవాడు కావాలి. నరుడు నూత్న సృష్టి చేయడుకాని దేవుడు చేసిన సృష్టిని కొనసాగించుకొని పోతాడు. దాన్ని పరిపూర్ణం చేస్తాడు. అందుకే దేవుడు మీరు భూమిమీద వ్యాపించి దాన్ని వశం చేసికొనండి అని ఆదిదంపతులతో చెప్పాడు – ఆది 1,28. ఆదాము కాలంనుండి నరులు పనిచేస్తూనే వున్నారు. ఈ నరుల పనిలో మళ్లా తేడాలున్నాయి. కొందరు గొప్ప కార్యాలు చేస్తారు. కాని అధిక సంఖ్యాకులు చేసేది మామూలు పనులే. కాని వాళ్లు తాము చేసే మామూలు పనితోనే లోకాలు నిల్పుతారు – సీరా 38,34. ఈ సామాన్య నరులు చేసే మామూలు పనినిగూర్చే కీర్తన 104,23.

ప్రొద్దుపొడవగానే నరుడు పనికి బయలుదేరుతాడు

సాయంకాలం వరకు పాటుపడతాడు

అని చెప్తుంది. ఇది చాల మంచి భావం. ఫలితార్థమేమిటంటే, నరుడు భగవంతునితో కలసి పనిని చేసేవాడు. అతని సృష్టిని పరిపూర్ణం చేసేవాడు. అతని చిత్తాన్ని పాటించేవాడు. అతనికి తోడి పనివాడు - 2 కొరి 6,1.

పూర్వవేదంలో యావే చేసిన రెండవపని, యిస్రాయేలీయులను ఫరో దాస్యం నుండి విడిపించడం. యోసేపు కాలంలో యూదులు ఫరో మన్నన పొందారు. గౌరవంగా బ్రతికారు. కాని కొన్ని యేండ్లు కడచాక రమ్సెసెస్ అనే క్రొత్త ఫరో అధికారంలోకి వచ్చాడు. ఇతడు యూదులకు శత్రువు, వారిని నాశం చేయడానికీ దీక్షపూనినవాడు. ఇతడు పెద్ద భవనాలు కట్టిస్తూ యూదులచే వెట్టిచాకిరి చేయించుకొన్నాడు. ఇక ఆ చాకిరికి అంతులేదు. యిస్రాయేలీయులు పుడుతూ బానిసలుగా పుట్టారు. జీవిస్తూ బానిసలుగా జీవించారు. చనిపోతూ బానిసలుగా చనిపోయారు. ఈ బాధలు భరించలేక వారు దేవునికి మొరపెట్టారు. దేవుడు వారిగోడు విని వారి కోపుతీసికొన్నాడు. మోషే నాయకత్వం ద్వారా ఆ ప్రజను బానిసం నుండి విడిపించాడు. ఈ సందర్భంలో యావే మోషేతో ఈలా చెప్పాడు. "నేను ప్రభువును. ఐగుప్తీయులు మీ నెత్తికెత్తిన బరువును తొలగిస్తాను. వారి దాస్యం నుండి మీకు విముక్తి కలిగిస్తాను. శక్తిగల నా చేతిని చాచి మీ శత్రువులను శిక్షిస్తాను. మిమ్ము దాస్యంనుండి విడిపిస్తాను" - నిర్గ 6,6. తర్వాత అతడు చెప్పినట్లే చేసాడు. ఇదే దాస్య విముక్తి.

యావే యిస్రాయేలును దాస్యం నుండి విడిపించడం అతడు చేసిన రెండవ పెద్దపని అని చెప్పాం. ఈ దాస్య విముక్తినే పూర్వవేదం రక్షణం అని చెప్తుంది. పూర్వవేదంలో రక్షణం ప్రధానంగా పాపం నుండి కాదు, ఈజిప్టు దాస్యం నుండే. పాపం నుండి రక్షణం అనే భావం తర్వాతి కాలంలో వచ్చింది. కీర్తనకారులూ ప్రవక్తలూ పాపం నుండి రక్షణం అనే భావాన్ని ఎత్తుకొన్నారు. కాని అది తర్వాత వచ్చిన భావం. తొలిరక్షణం దాస్య విముక్తే.

యావే పని చేసేవాడు, అతనికి పోలికగా వున్న నరుడు కూడ పనిచేసేవాడు అనే అంశం పూర్వ వేదంలోని ప్రధాన భావాల్లో వొకటి. దేవుడే పని చేసేవాడు కనుక పని విలువైంది, గౌరవ ప్రదమైంది అని ఫలితార్థం.

## 2. తొలి పాపం తర్వాత పని భారమైంది.

ఆదిదంపతుల పాపం దేవుని రక్షణ ప్రణాళికను భగ్నం చేసింది. ఈ పాపం తర్వాత అంతవరకు సంతోషదాయకమైన పని దుఃఖ పూరితమైంది. తొలి పాపం తర్వాత ఆదామేవలు శాపం తెచ్చుకొన్నారు.

ఆదాముకి వచ్చిన తిప్పలు ఇవి. భూమి శాపం పాలయింది. అది పంటలు పండక ముండ్ల తుప్పలతో నిండిపోయింది. ఆదాము చెమటోడ్చి పొట్టకూడు సంపాదించుకోవాలి. మట్టినుండి పుట్టిన నరుడు మట్టిలోనే కలసిపోవాలి - ఆది 3:17-19. ఏవకు కలిగిన బాధలు ఇవి. ఆమె ప్రసవవేదన అనుభవించి బిడ్డలను కనాలి. పురుషుడి పెత్తనానికి లొంగిపోవాలి -3:16. కాని శాపంవలన వచ్చిన ప్రధాన శిక్ష మరణం. అంతవరకు చావులేక అమరులుగా వుండిపోయిన నరులు ఇప్పుడు చావువాత పడ్డారు. ఈ చావువల్ల మన ప్రణాళికలూ మనం సాధించిన కార్యాలూ మన విజయాలూ నాశమైపోతాయి. మన పనులు ఏవీ శాశ్వతంగా నిలువవు. ఈ యంశం మనకు బాధను కలిగిస్తుంది.

పాపఫలితంగా నరుల్లో అన్యాయం, దురాశ, ద్వేషం, అసూయ, హింస పెరిగిపోయాయి. కయీను తన తమ్ముడైన హేబెలుని హత్య చేసాడు - అది 4:8. కయీను పాపంవల్ల నేల పంటల పండకుండ పోయింది - 4:12. ఇంకా చాల దుష్పరిణామాలు సిద్ధించాయి. యజమానులు పనివారికి కూలి చెల్లించక అన్యాయం చేసారు - యాకో 5:4. ధనికులు పేదలను మోసం చేసారు - ఆమో 5:11. శత్రురాజులు తమకు ఓడిపోయిన వారిని బానిసలను చేసారు. యజమానులు బానిసలను పీడించి వెట్టిచాకిరి చేయించారు. ఈజిప్ప ప్రభువులు యిస్రాయేలీయులను బానిసలను చేసి వారిని ముప్పుతిప్పులు పెట్టారు. లోకం అన్యాయంతోను, దుఃఖంతోను కూడిన చాకిరితో నిండిపోయింది. పాపానికి పూర్వం పనివేరు, పాపం తర్వాత పనివేరు.

హేబెలు నెత్తురు (ప్రాణం) కయీనుపై పగతీర్చుకొమ్మని దేవునికి మొరపెట్టింది - ఆది 4:10. నరులపని ఈలా అన్యాయానికీ దుఃఖానికీ నిలయమైంది. ఇంకా జనులు దేవునిమీద ఎదురు తిరిగారు. అతడు విధించిన పనిని తప్పించుకోజూచారు. పనిని మానివేసి హాయిగా తిరుగుదామనుకొన్నారు. శ్రమ చేయడం వారికి అనిష్టమైంది. కాని అనిష్టంగా వున్నా కష్టంగా వున్నా దేవుడు వారిని వదలిపెట్టలేదు. నొసటి చెమటోడ్చి పొట్టకూడు సంపాదించుకోవడం అందరికీ తప్పనిసరి ఐంది. వారంలో ఆరురోజులు పని చేయాలనే దైవాజ్ఞను ఏ నరుడూ తప్పించుకోలేకపోయాడు - నిర్గ 20:9. నేడు మనం పనిని తప్పించుకో జూస్తాం. కాని తప్పించుకొలేం. శ్రమ అనేది దైవ శాసనం. కనుక కష్టంగావున్నా శ్రమ చేయవలసిందే.

పూర్వవేదం పాపం వలన పని భారంగా మారిపోయిందని మాత్రమే చెప్పదు. పనిని గూర్చి ఇంకా చాలవిషయాలు చెప్తుంది. ప్రస్తుతానికి కొన్ని అంశాలను మాత్రం పరిశీలిద్దాం.

పూర్వవేదంలో విశ్రాంతిని తీసికొమ్మనే దైవాజ్ఞ వుంది - నిర్గ 20:10. కాని పనిచేయమని చెప్పే దైవాజ్ఞయేదీ ధర్మశాస్త్రంలోని 613 ఆజ్ఞల్లోను లేదు. ఎందుకు? నరుడు సహజంగా పని చేయాలి. దానిని గూర్చి దేవుడు ప్రత్యేకంగా ఆజ్ఞ ఈయనక్కరలేదు.

శ్రమించి పని చేయడానికి భిన్నమైన గుణం సోమరితనం. కనుక జ్ఞానులు సోమరితనాన్ని చాలతావుల్లో ఖండించారు. సోమరి తిండి దొరక్క చస్తాడు - సామె 13:4. సోమరి కోరికలే వానిని చంపివేస్తాయి. వాడు కష్టించి పనిచేయడానికి అంగీకరించడు - 21:25. ఇంకా బద్ధకస్తుడు చీమలను చూచి బుద్ధి తెచ్చుకోవాలి. పని చేయనివారికి ఈ చీమల ఉపమానం ప్రబోధం కలిగిస్తుంది.

సోమరీ! చీమలను చూడు
వాటి జీవితాన్ని చూచి బుద్ధితెచ్చుకో
వాటికి నాయకుడు లేడు,
పర్యవేక్షకుడు అధికారి లేడు
ఐనా అవి వేసవిలో ఆహారం చేకూర్చుకొంటాయి
కోతకాలంలో ధాన్యాన్ని సేకరించుకొంటాయి
సోమరీ! నీవెంత కాలం పండుకొంటావు?
ఎప్పుడు నిద్ర మేల్కొంటావు? - 6:6 -9.

దీనికి భిన్నంగా ఆదర్శగృహిణి చక్కగా పనిచేస్తుంది. సోమరితనానికి ఏమాత్రం లొంగక కుటుంబ పరిస్థితుల్ని మెలకువతో చక్కదిద్దుకొంటుంది -31:27. కాని అలసుని విషయమేమిటి?

తలుపు బందు మీద తిరిగినట్లే
సోమరిపోతు పడక మీద దొర్లుతాడు
సోమరి కంచంలో చేయి పెడతాడు గాని
అన్నమెత్తి నోట పెట్టుకోవడం కష్టమనుకొంటాడు 26:14.15. ఈ వాక్యాల్లో బోలెడంత హాస్యముంది.

ఐతే బైబులు చక్కగా చేసిన పనిని మెచ్చుకొంటుంది. రైతు బాగా పొలం దున్నే తీరునీ, కుమ్మరి చక్కగా కుండలు చేసే రీతినీ ప్రశంసిస్తుంది.

రైతు దృష్టి అంతా
తిన్నగా నాగటి చాలు వేయడం మీదనే వుంటుంది
అతడు రేయి ప్రొద్దుబోయినదాక పసులను మేపుతాడు
కుమ్మరి తన పని మీదనే మనసు నిల్పి
నే నెన్నికుండలు చేస్తానా అని ఆలోచిస్తాడు
బంకమట్టిని కాళ్లతో త్రొక్కి చేతులతో మలుస్తాడు
తరువాత కుండకు మెరుగుపూత పూస్తాడు

సీరా - 38: 26-30. ఇంకా బైబులు రచయిత సొలోమోను సింహాసనాన్ని మెచ్చుకొన్నాడు. ఏ రాజు అలాంటి సింహాసనాన్ని చేయలేదని ప్రశంసించాడు - 1 రాజు 10:20. ఈ రాజు ఏడేండ్లలో దేవాలయాన్ని కట్టి ముగించినందుకు అతన్ని ప్రశంసించాడు - 1 రాజు 6:38.

జ్ఞానులు గూడ పనిని గూర్చి చాల మంచి భావాలు చెప్పారు. జీవితంలో విజయాన్ని సాధించాలంటే మన కృషి మాత్రమే చాలదు. దైవ బలం కూడ వుండాలి.

ప్రభువు ఇల్లు కట్టకపోతే
బేలుదారుల శ్రమ వ్యర్థమౌతుంది
దేవుడు నగరాన్ని కాపాడకపోతే
గస్తీలు మేల్కొని వుండీ లాభం లేదు - కీర్త 127:1.

నీ కార్యాలన్నిటిలోను ప్రభువుని స్మరించుకో
అతడు నీ పనులను సులభతరం చేస్తాడు - సామె 3:6

నరుడు పథకాలను సిద్ధం చేయవచ్చుగాక
అతని పనులను నడిపించేది ప్రభువే - 16:9

దేవుడు విశ్వానికంతటికీ అధిపతి. కాని అతడు నరుణ్ణి ఈ భూమికి అధిపతిని చేసాడు. భూమి ఆకాశం సముద్రాల్లో వుండే ప్రాణులన్నిటిని అతని పాదాల క్రిందవుంచాడు - కీర్త 8:6-7.

గ్రీకు ప్రజలు పనిని రెండురకాలుగా విభజించారు. చేతితో చేసేపని లేక కాయకష్టం విలువలేనిది. బానిసలు దాన్ని చేస్తారు. తలతో చేసే పని విలువైనది. సమాజంలో ఉన్నతులు ఆ పనిని చేస్తారు. కాని బైబులు ఈ విభేదాన్ని అంగీకరించలేదు. దేవుని దృష్టిలో ప్రతిపని విలువైందే. ఏ పని చేసినా నరుడు భగవంతునికి ప్రీతి

కలిగించవచ్చు. సౌలురాజు పొలం దున్నుకొని తిరిగి వస్తూ అమ్మోనీయుల దౌర్జన్యానికి కోపించి వారిమీదికి యుద్ధానికి పోయాడు -1 సమూ 11:5. గొర్రెల కాచుకొనే దావీదు కూడ రాజుగా ఎన్నికయ్యాడు. అనగా ఏపనీ నీచమైంది కాదని బైబులు అభిప్రాయం. అందుకే యాదరబ్బయులు చిన్నచిన్న వృత్తులు చేపట్టారు. ప్రతిరబ్బయి ఏదోవొక వృత్తి ద్వారా పొట్టబోసికోవాలని నియమంచేసారు.

దేవుని దయవల్ల నరుడు తన కష్టార్జితాన్ని తాను అనుభవిస్తాడు. ఆనందాన్నీ అభ్యుదయాన్నీ పొందుతాడు - కీర్త 128:2. తాను పండించిన పంటను తానే భుజిస్తాడు. తాను పండించిన ద్రాక్షపండ్లరసాన్ని తానే పానం చేస్తాడు - యెష 62:8-9. దేవుని కృపకు నోచుకోనివారికి ఈ భాగ్యాలు లేవు. వారి కృషి రాణించదు.

బైబులు భావాల ప్రకారం నరుని కార్యాలు రెండు. సంతానాన్ని కనడం, శ్రమ చేయడం. దేవుడు తొలి దంపతుల్ని సంతానాన్ని కని లోకమంతట వ్యాపించమని ఆజ్ఞాపించాడు - ఆది 1:28. మొదటలో భూమి మీద జనసంఖ్య పెద్దగా లేదు. కనుక అబ్రాహాము, ఈసాకు, యాకోబు మొదలైన పితరులు జనాభాను పెంచడమే ముఖ్యమని భావించారు. సంతానం దేవుని పోలిక కల పవిత్రప్రజ అని యెంచారు. ఈ సంతానం నుండే తర్వాత మెస్సీయా ఉద్భవించి సకల జాతులను దీవిస్తాడు. ఇక, నరుడు శ్రమచేసి భూమిని సేద్యం చేయాలి. అది తొలి నరుని పాపం వలన శాపగ్రస్తమైంది. ఐనా నరుని కృషి వలన మళ్లా ఫలిస్తుంది. నరుణ్ణి పోషిస్తుంది.

ఐతే నరుడు చేసే పనులన్నిటిలోను దైవారాధనం ఉత్తమమైంది. కనుక అతడు దేవుణ్ణి పూర్ణమనస్సుతో పూర్ణ హృదయంతో పూర్ణ శక్తితో ప్రేమించాలి - ద్వితీ 6:5. సొలోమోను దైవారాధనకు దేవాలయాన్ని నిర్మించడం ఉత్తమమైన కార్యం.

ఇంకా యూదభక్తులు కరుణ కార్యాలు, పుణ్యకార్యాలు చేయాలని ఆజ్ఞాపించారు. పేదలకు దానధర్మాలు చేయడం, మృతులను భూస్థాపనం చేయడం, వ్యాధి గ్రస్థులను సందర్శించడం, ప్రార్థన ఉపవాసాలు చేయడం మొదలైనవి ఈ సత్కార్యాలు. ఐతే కొందరు ఈ సత్కార్యాల వల్లనే మోక్షాన్ని పొందుతామని వాదించారు. నూత్న వేదంలో క్రీస్తు ఈ భావాన్ని నిరసించాడు. స్వర్గం దేవుడు మనకు ఉచితంగా దయచేసేది గాని మనపుణ్యకార్యాల వల్ల కొనుక్కొనేది కాదు. మన పుణ్యక్రియలు దేవుడు మనకు దయ చేసిన భాగ్యాలకు వందనాలు చెప్పుకోవడానికి మాత్రమే వుపయోగపడతాయి. కనుక నరులు మేము ఇంత

చేసాం అంత చేసాం అని డప్పాలు కొట్టగూడదు. అయోగ్యులమైన సేవకులం, మా కర్తవ్యాన్ని మాత్రమే నెరవేర్చాం అని వినయంగా వుండాలి - లూకా 17:10.

## 3. క్రీస్తు మరణోత్థానాల ద్వారా మన పని మనలను రక్షిస్తుంది

ఆదాము పాపం వలన పని బాధను తెచ్చిపెట్టిందన్నాం. క్రీస్తు మరణోత్థానాలు ఈ బాధను తొలగించవు. కాని అవి బాధలతో గూడిన మన పనిని పునీతం చేసి మనకు మోక్షాన్ని సాధించిపెడతాయి.

పూర్వవేదంలోనే పనినుండి ఉపశాంతిని కలిగించే అంశాలు కొన్ని వున్నాయి. యూదులకు శనివారం విరామదినం. నరులకూ జంతువులకూ గూడ పనినుండి విశ్రాంతి నీయడానికే ఈ దినం ఉద్దేశింపబడింది. మీరు ఆరు రోజులపాటు పనిచేసి ఏడవరోజు విశ్రాంతి పొందాలి. దీని వల్ల మీకు ఊరట కలుగుతుంది - నిర్గ 23;12. ఇంకా బానిసలకూ కూలివారికీ విశ్రాంతి కలిగించాలి. రాత్రి గడవకమునుపే కూలివాని కూలి చెల్లించాలి - లేవీ 19:13. యిస్రాయేలీయులు సీనాయి నిబంధనను పాటిస్తూ జీవిస్తే దేవుడు వారి కృషిని దీవిస్తాడు - ద్వితీ 16:15. ఐతే నూత్న వేదంలో వచ్చిన క్రీస్తు విశేషంగా మన పనిని దీవించేవాడు. ఈ విషయాన్ని విపులంగా పరిశీలిద్దాం.

క్రీస్తు స్వయంగా పనిచేసినవాడు. సువిశేషం అతడు "వడ్రంగి" అని చెప్తుంది - మార్కు 6:3. ఇక్కడ గ్రీకు మూలంలో వాడిన మాటకు (టెక్టోస్) "పనివాడు" అని మాత్రమే అర్థం. వడ్రంగం కూడ అతడు చేసిన పనుల్లో ఒకటై యుండవచ్చు. క్రీస్తు స్వయంగా శ్రమచేసి మన శ్రమకు విలువనిచ్చాడు. అతని పని ఇప్పుడు మన పనిమీద సోకుతుంది. పౌలుకూడ క్రీస్తుని అనుకరించి పనివాడుగానే జీవించాడు. అతడు గుడారాలు తయారు చేసేవాడు - అ.చ. 18:3.

క్రీస్తు ఈ లోకానికీ ఇక్కడి పనికీ విలువ నిచ్చాడు. ఈ లోకం మనలను పరలోకానికి తయారు చేస్తుంది. ప్రభువు తన బోధల్లో లోకవిషయాలు ప్రస్తావించాడు. గొర్రెలు కాచే కాపరి, ద్రాక్షలు సాగుచేసే తోటమాలి, విత్తేవాడు, ఇల్లుపూడ్చే గృహిణి మొదలైన వుపమానాలు వాడాడు. ఇవన్ని శ్రమజేసేవాళ్లను గూర్చి చెప్పేవే కదా! ఇంకా అతడు ప్రేషితసేవను పంటను ప్రోగుజేయడంతో పోల్చాడు - మత్త 9, 37 - 38. చేపలను పట్టడంతో కూడ ఉపమించాడు - 4,19. కనుక పనంటే అతనికి ఇష్టమే. క్రీస్తుని బాగా అర్థంజేసికొన్న పౌలు కూడ సోమరితనాన్ని నిరసించాడు. సోమరులుగా

వుండవద్దని తన క్రైస్తవులను హెచ్చరించాడు. పనిచేయనివాడు తిండి తినడానికి అర్హుడుకాడని శాసించాడు - 2 తెస్స 3,6-10.

క్రీస్తు " నా తండ్రి ఇప్పటికీ పని చేస్తున్నాడు. నేనూ పని చేస్తున్నాను" అన్నాడు - యోహా 5,17. ఈ పని యేమిటి? లోక సృష్టి , లోకరక్షణం. ఈ కార్యాన్ని తండ్రితోపాటు క్రీస్తు కూడ చేస్తాడు. ఇతడు తండ్రి పనిని కొనసాగించేవాడు. అతని అద్భుతాలు ఇందుకు ఉద్దేశింపబడినవే. తండ్రి నాచే చేయించే పనులు నన్ను గూర్చి సాక్ష్యమిస్తాయి అన్నాడు ప్రభువు - యోహా 5:36. ఈ పనులు ఏమిటివి? అతని అద్భుతాలే. తండ్రే క్రీస్తు ద్వారా ఈ యద్భుతాలను నిర్వహించాడు. ఆ పనులన్నీ కూడ అతడు దేవుని కుమారుడు, మెస్సీయా అని రుజువు చేస్తాయి. ఆ పనులు తండ్రిని మహిమపరుస్తాయి కూడ.

ఇంకా క్రీస్తు నన్ను పంపినవాని చిత్తాన్ని నెరవేర్చడమే నాకు ఆహారం అన్నాడు - 4:34. కాని తండ్రి చిత్తం ఏమిటి? కుమారుని సిలువ మరణం ద్వారా మానవ రక్షణ కార్యాన్ని సాధించడమే. ఇంకో పర్యాయం క్రీస్తు "నీవు నాకు అప్పగించిన పనిని పూర్తిచేసి నిన్ను మహిమ పరచాను" అన్నాడు -17,4. ఈ వాక్యం గూడ సిలువ మరణాన్నే సూచిస్తుంది. అసలు క్రీస్తు పనులన్నీ అతని సిలువ మరణంతో సంబంధం కలవే. ఆ సిలువ మరణం తండ్రి అతని కార్యాలపై వేసిన ముద్రలాంటిది - 6, 27. కడన క్రీస్తు "శిష్యుల కొరకు నన్ను నేను ప్రతిష్ఠించు కొంటున్నాను" అన్నాడు - 17;19. ఈ "ప్రతిష్ఠించు కోవడం" అతని విధేయాత్మకమైన సిలువ మరణమే. ఈ సిలువ మరణం ముగిసినప్పుడు అతడు "అంతా సమాప్తమైంది" అని ప్రాణాలు విడిచాడు - 19;30. అనగా తండ్రి అతని కొప్పజెప్పిన రక్షణకార్యం ముగిసింది. నరులకు పాపపరిహారం లభించింది. క్రీస్తు నిర్వహించిన సమస్త కార్యాల ద్వారా, విశేషంగా అతని సిలువ మరణం ద్వారా మన పనులు పవిత్రమయ్యాయి. అతని పనులన్నీ నేటి మన పనిమీద సోకి దాన్ని పునీతం చేస్తాయి. క్రీస్తు ముద్ర మన పనులమీద పడకపోతే వాటికి విలువ లేదు. ప్రభుత్వం వారి ముద్ర తెల్లకాగితం మీదపడి దానికి విలువ నిచ్చినట్లే, క్రీస్తు ముద్ర మన కార్యాలమీద పడి వాటిని పునీతం చేస్తాయి.

క్రీస్తు లోకానికి వెలుగు. అతడుమనం చేసేవి పాప కార్యాలో లేక పుణ్య కార్యాలో నిర్ణయిస్తాడు. దుష్క్రియలు చేసేవాళ్లు క్రీస్తు వెలుగును సమీపించడానికి దడిసి దానికి దూరంగా వుంటారు. వాళ్ల పాపకార్యాలు బట్టబయలు కావడం వాళ్లకు ఇష్టముండదు. సత్క్రియలు చేసేవాళ్ళు మాత్రం వెలుగుని సమీపిస్తారు - 3, 19-21. ప్రభువుని విశ్వసించేవాళ్ళు మంచిపనులే చేస్తారు. విశ్వసించని వాళ్ళు దుష్కార్యాలు చేస్తారు. యోహాను సువిశేషంలో క్రీస్తుని విశ్వసించక పోవడమే పెద్ద పాపకార్యం.

మనం దేవునికి తోడి పనివాళ్లం -1 కొ 3,9. అనగా అతనితో కలసి పని చేసేవాళ్లం. కనుక ఈ లోకంలో మనం చేయవలసిన ప్రధానకార్యం దైవరాజ్యాన్ని వ్యాప్తి చేయడమే. విత్తనం వెదజల్లడం మన బాధ్యత -1 కొ 3,6. అనగా వాక్యాన్ని బోధించడం మన కర్తవ్యం. మనం క్రీస్తుకి రాయబారులం. క్రీస్తు ద్వారా పాపులను దేవునితో సఖ్యపరచవలసిన వాళ్లం - 2 కొ 5, 20. ఆత్మ ఒక్కొక్కరికి ప్రత్యేక వారాలిస్తుంది. ఆ వరాల సహాయంతో నేడు మనం తిరుసభ వ్యాప్తికి తోడ్పడాలి - 1 కొ 12, 7. కాని మనం చాలవరకు దైవరాజ్యాన్ని వ్యాప్తిచేయడమనే ముఖ్యమైన పనిని మానివేసి లోక కార్యాల్లో నిమగ్నుల మౌతున్నాం. స్వప్రయోజనాలను వెదుకుతున్నాం. ఈ విధంగా చేయవలసిన పనులు మానివేసి చేయగూడని పనులు చేస్తున్నాం. ఇది విచారింపవలసిన విషయం.

మన పనులను గూర్చిచెప్తూ పౌలు ఓ అరుదైన సంగతి చెప్పాడు. స్త్రీలు బిడ్డలనుకనే ధర్మం వలన రక్షింపబడతారు అన్నాడు - 1 తిమో 2, 15. తొలి తల్లియైన ఏవ కాలం నుండి మాతృత్వం తల్లికి శాపంగా పరిణమించింది. కాని యిప్పుడు క్రీస్తు సంపాదించి పెట్టిన రక్షణం వలన బిడ్డలను కనడం ద్వారా స్త్రీ రక్షణాన్ని పొందుతుంది. ఇది పెద్ద మార్పు.

పౌలు ఆనాటి బానిసలకు పని విషయంలో కొన్ని ఆజ్ఞలు జారీచేసాడు. ఆనాటి బానిసలు నేటి మన పనివారితో సమానం. కనుక మనం పని చేసేప్పుడు ఈ సూత్రాలు పాటించాలి. మనం ఏ యజమానునికి పని చేస్తున్నమో అతనిలో క్రీస్తుని చూడాలి. ముఖప్రీతి కొరకూ నరులమెప్పు కొరకూ పనిచేయకూడదు. దేవుని పనీ, క్రీస్తుపనీ చేస్తున్నామో అన్నట్లు యజమానుని పనిని చిత్తశుద్ధితో చేయాలి. రోజువారి జీవితంలో ఈ సూత్రం మనకు ప్రేరణం పుట్టిస్తుంది - ఎఫే 6,5-8. కోలో 3,23. ఇంకా పౌలు మనం చేసే ప్రతిపని క్రీస్తుపేరట చేయాలన్నాడు - కొలో 3,17. ఎందుకు? మన పనికి సార్థక్యాన్ని ఇచ్చేది క్రీస్తే. తన మరణం ద్వారా మన పనిని పునీతం చేసేది అతడే. మన కార్యానికి విలువ వచ్చేది అతని నుండే. కనుక మన కార్యాలను క్రీస్తు నామాన చేసి తండ్రికి అర్పించాలి.

క్రైస్తవులంగా మనం రెండు ముఖ్యమైన కార్యాలు చేయాలి. మొదటిది, క్రీస్తుపట్ల గాఢమైన విశ్వాసాన్ని అలవర్చుకోవాలి. లోకంలోని జనం మన పనులను చూచి దేవుణ్ణి స్తుతించేలా మనం పనులను చేయాలి. అనగా మన కార్యాలు నిర్మలంగాను పవిత్రంగాను వుండాలి - మత్త 5,16. మదర్ తెరేసా ఈ కార్యాన్ని చక్కగా సాధించింది. ధర్మశాస్త్రంలో

613 ఆజ్ఞలున్నాయి. క్రీస్తు వీటిని రెండుగా కుదించాడు. అవి దైవ ప్రేమ, సోదరప్రేమ. ఈ రెండు ప్రేమలను పాటిస్తే తప్పక రక్షణాన్ని పొందుతాం - మత్త 22, 36-40. కాని యోహాను సువిశేషం ఈ రెండు ప్రేమలను కూడ విశ్వాసం క్రిందికి తీసుకవచ్చింది. దేవుని కార్యాలను నెరవేర్చడానికి మేము ఏమి చేయాలని యూదులు క్రీస్తుని అడిగారు. దేవుడు పంపినవానిని విశ్వసించండి. అదే దేవుడు మీ నుండి కోరేది అని యేసు సమాధాన మిచ్చాడు - 6, 28-29. కనుక ఇప్పుడు మనలను గూర్చిన దేవుని చిత్తమేమిటి? మనం దేవుడు పంపిన క్రీస్తుని విశ్వసించి అతని ద్వారా రక్షణం పొందాలనే తండ్రి చిత్తం. పౌలు కూడ ఈ భావాన్నే సూచించాడు. అతడు ధర్మశాస్త్రంలోని ఆజ్ఞాలను పాటించడం వల్ల మనకు రక్షణం కలగదన్నాడు. విశ్వాసంతో క్రీస్తు సిలువనూ రక్షణాన్నీ అంగీకరిస్తే రక్షణం కలుగుతుంది అని బోధించాడు. కనుక ఇప్పుడు విశ్వాసమే రక్షణ సాధనం. ఐతే ధర్మశాస్త్రం సూచించినట్లుగా సత్క్రియల వలన లాభం లేదా అంటే వుంది. అవి మన విశ్వాసాన్ని రుజువు చేస్తాయి. యకోబు జాబు కూడ ఈయంశాన్ని ప్రస్తావిస్తుంది. మన పుణ్యక్రియలే రక్షణాన్ని సాధించి పెట్టవు. విశ్వాసంతో కూడిన పుణ్య కార్యాలు రక్షణాన్నిస్తాయి - యాకో 2, 19-24.

రెండవది ప్రేమ. విశ్వాసం ప్రేమను రద్దుచేయదు. అవి రెండూ కలిసే పని చేస్తుంటాయి. ప్రేమాజ్ఞ క్రీస్తు శిష్యులకు ముఖ్య లక్షణం. నేను మిమ్ము ప్రేమించినట్లే మీరూ ఒకరినొకరు ప్రేమించాలని క్రీస్తు నొక్కి చెప్పాడు. దాన్నిబట్టే మనం అతని శిష్యులంగా గణింపబడతాం అన్నాడు - యోహా 13, 34-35. మనం తోడివారిపట్ల ప్రేమ చూపామా లేదా అన్న అంశాన్ని పురస్కరించుకొనే లోకాంతంలో మనకు తీర్పు జరుగుతుంది - మత్త 25, 31-46. ఆ తీర్పును బట్టే మనకు మోక్షమో నరకమో వస్తుంది. ధర్మశాస్త్ర సారమంతా నీ పొరుగువానిని ప్రేమించు అన్న ఆజ్ఞలోనే ఇమిడివుంది - గల 5, 14.

ఇప్పుడు మనం విశ్రాంతిని కోరతాం. కాని ప్రాచీనులకు విరామం అంటే యేమిటో తెలియదు. వాళ్ళు ఎప్పుడూ పని చేసికొంటూనే వుండేవాళ్ళు. హీబ్రూ ప్రజలు కూడ నిరంతరం శ్రమ జేసారు. వారికి ఎప్పుడైనా విశ్రాంతి అనేది వుంటే అది పర్వదినాల్లో మాత్రమే. పండుగలు పని నుండి విశ్రాంతిని పొంది దేవుణ్ణి పూజించడానికి ఉద్దేశింపబడ్డాయి.

ధర్మశాస్త్రం ఆరు రోజులు పని జేసి ఏడవరోజు విశ్రాంతిని పొందమని ఆజ్ఞాపించింది. దేవుడు ఆరు రోజులు సృష్టి చేసి ఏడవరోజు విశ్రాంతి తీసికొన్నాడనీ,

అతడు మనకు ఆదర్శంగా వుండాలనీ వాకొంది. ఏడవదినం యజమానుడూ అతని పనివాళ్లూ, పశువులూ కూడ విశ్రాంతిని పొందాలి. ఆ రోజు ప్రధానంగా ప్రభువుని పూజించే దినం -నిర్గ 20:9 -11.

మనం దేవునికి పోలికగా కలిగింపబడిన వాళ్ళం. ఆ దేవుడే ఆరురోజులు విశ్రాంతి తీసికొంటే, అతనికి పోలికగా వున్న మనకు కూడ విశ్రాంతి అవసరం. దేవుడు కృషి చేసేవాడే. ఐనా అతడు ప్రధానంగా విశ్రాంతిని పొందేవాడు. కనుక మనకు కూడ విశ్రాంతి అవసరం. ఐతే విశ్రాంతి దినాన మనం ప్రధానంగా దేవుని దగ్గరికి రావాలి. అతన్ని పూజించాలి. బెతనీ మరియలాగ అతని పాదాల చెంత కూర్చుండి అతని బోధలు వినాలి - లూకా 10,39. ఈ లోకంలో మనం చేయగల ఉత్తమోత్తమమైన కార్యం దేవుణ్ణి పూజించడమే. దానివలననే మనకు పరలోకంలో దైవదర్శనం కలుగుతుంది. అసలు మన పని విలువయేమిటి? కడపటి దినాన "ఉత్తముడవు నమ్మదగిన వాడవునైన సేవకా! నీ యజమానుని ఆనందంలో నీవుకూడ పాలు పంచుకో" అనే వాక్యాన్ని ప్రభువు నుండి వినడమే మన పనికి సార్థక్యం - మత్త 25,21. ఇంకో విషయం కూడ. పనికి శాశ్వతస్థితి లేదు. అది కేవలం ఈ లోకానికి పరిమితమైంది. మోక్షంలో పని వుండదు. అక్కడ విశ్రాంతి మాత్రమే వుంటుంది. భగవంతుడూ పునీతులూ అంతా అక్కడ విశ్రాంతిని పొందుతూంటారు - దర్శ 14,13. కనుక ఈ లోకంలో మనం ఎడతెగని పనితోనే సతమతమైపోకూడదు. తగినంత విశ్రాంతిని గూడ పొందుతూండాలి. ఇక్కడి విశ్రాంతి మోక్ష విశ్రాంతికి సూచనంగా వుండాలి.

పనికీ పూజబలికీ గూడ సంబంధం వుంది. మిమ్ము మీరు సజీవబలిగా దేవునికి సమర్పించుకోండి అన్నాడు పౌలు - రోమా 12,1. యెరూషలేము దేవాలయంలో జంతుబలులు సమర్పించారు. నేడు మనం పూజలో జంతుబలులను అర్పించం. మనలను మనమే క్రీస్తు ద్వారా తండ్రికి అర్పించుకొంటాం. ఇది దివ్యమైన పని. పూజలో అప్పరసాలను అర్పిస్తాం. ఈ వస్తువులు మనం తయారు చేసినవి. మన కృషికి నిదర్శనంగా వుండేవి. కనుక పూజలో మన కృషిని దేవునికి అర్పిస్తున్నాం. మనలను మనం దేవునికి అర్పించుకొంటున్నాం. మన పనినీ మన జీవితాన్నీ క్రీస్తుతో చేర్చి తండ్రికి అర్పించుకొంటున్నాం. ఆ ప్రభువుతో కలసి మనం అంగీకార యోగ్యమైనబలి ఔతాం. ఈలా పూజబలితో కలసినప్పుడు మన పని ధన్యమౌతుంది.

ఈ సందర్భంలోనే ఉదయకాల సమర్పణను గూర్చి రెండు మాటలు చెప్పాలి. ఉదయాన్నే మనం రోజుపొడుగున చేయబోయే పనులన్నిటిని ప్రభువుకి

సమర్పించుకొంటాం. దీని వలన మన క్రియలన్నీ పవిత్రమౌతాయి. గృహస్థులు పవిత్రతను సాధించడానికి ఈ సమర్పణం బాగా ఉపయోగపడుతుంది. ఇది సులువైన పద్ధతి కూడ. ఈ సమర్పణ ప్రార్థనం మన జపపుస్తకాల్లో వుంది. మనంతట మనమే సొంతంగానే ఈ ప్రార్థనను చెప్పుకోవచ్చు గూడ.

కట్టకడన పనిలోని యీ గొప్ప గుణాలను గూడ గుర్తిద్దాం. పనివాడి ముద్ర అతడు చేసిన పనిమీద పడుతుంది. శిల్పి ముద్ర బొమ్మమీద, రైతుముద్ర పొలంమీద, ఉపాధ్యాయుని ముద్ర విద్యార్థులమీద పడుతుంది. పనివల్ల మనం ఉన్నతుల మౌతాం. మన శక్తిసామర్థ్యాలు పెరుగుతాయి. మనం మనంగా తయారౌతాం. పని ద్వారా కుటుంబాలు నిలుస్తాయి. కృషివల్ల వచ్చే ఆదాయమే కుటుంబాన్ని పోషిస్తుంది కదా! ఇంకా పనివల్ల దేశాలు జాతులు నిలుస్తాయి. శ్రమవల్ల సంపద ఉత్పత్తియై దేశాలు వృద్ధి చెందుతాయి. ఇతరులతో కలసి పని చేయడం ద్వారా మనలోని స్వార్థాన్ని అణచుకొంటాం. కృషి ద్వారా ప్రకృతి శక్తులను లొంగదీసికొంటాం. నరులు వసించడానికి మరింత యోగ్యంగా వుండేలా ఈ లోకాన్ని తీర్చిదిద్దుతాం. బాగా చేసిన పని ఎంతో మందికి ఉపయోగపడుతుంది. కనుక అది సాంఘిక ప్రయోజనాన్ని గూడ సాధిస్తుంది. పూర్వులు మన మేలుకొరకు పనిచేసి పోయారు. అలాగే మనమూ భావితరాలవారి మేలు కొరకు పని చేయాలి. పని ద్వారా దేవుని సృష్టిని పరిపూర్ణం చేస్తాం. నూత్నయుగాన్ని సృజిస్తాం. నూత్నభువినీ నూత్న దివినీ రూపొందిస్తాం - 2 పేత్రు 3,13. కనుక శ్రమపట్ల మనకు గౌరవ భావాలుండాలి. శ్రమ ఏవ జయతే.

## పర్యవసానాలు

పనిని గూర్చిన పూర్వ నూత్న వేదాల్లోని భావాలను చాల పరిశీలించాం. కడన కొన్ని పర్యవసానాలను తిలకిద్దాం.

1. భగవంతుడు క్రియాపరుడు. నరుడు అతనికి పోలికగా వుండేవాడు. మన గొప్పతనం ఆ భగవంతుని లాగ పని చేయడంలోనే వుంది. మనం ఈ లోకంలో దేవుని పనిని కొనసాగిస్తాం. నరుడు దేవుని హస్తం అనుకోవాలి.

2. క్రీస్తు వడ్రంగి. మనం పనిచేసినప్పుడు అతనికి ప్రీతి కలిగిస్తాం. అతని మరణోత్థానాలు మన పనిని పునీతం చేస్తాయి.

3. పని చేయని నరుడు కూడు తినడానికి అర్హుడు కాదు అన్న పౌలు శాసనం మనకూ అక్షరాల వర్తిస్తుంది. కనుక మనకు సోమరితనం తగదు. సోమరిపోతులు చెడ్డ పౌరులు.

4. నేడు భారత దేశంలో చాలమంది పనిని తప్పించుకొంటున్నారు. పని చేయడం నామూషి అనుకొంటున్నారు. పని చేయకుండానే జీతాలు తీసికొని పోతున్నారు. ఇది దుష్ట విలువ. మనకు పనికిరాదు. శ్రమచేయందే సంపద ఏలా వుత్పత్తి ఔతుంది?

5. ఐనా పని నరుని కొరకు వుంది. నరుడు పనికొరకు లేడు. కనుక పని చేయడమే పరమార్థం అనుకోగూడదు. ఓ యంత్రంలా తయారు కాకూడదు. పనితోపాటు తగినంత విశ్రాంతి కూడ వుండాలి. అసలు స్వర్గంలో పనివుండదు. విశ్రాంతి మాత్రమే వుంటుంది.

6. తొలి పాపం తర్వాత పని కష్టమైంది. కనుక చాలమంది దాన్ని ఎగగొట్టాలని చూస్తుంటారు. ఐనా నొసటి చెమటోడ్చి పొట్టకూడు సంపాదించుకో అనే దైవవాక్యాన్ని బట్టి కష్టమైనా కూడ పనిని చేయవలసిందే. తప్పించుకోగూడదు. మనం చేసిన పనిని బట్టే మనకు విలువ వస్తుంది.

7. పని కష్టమైంది. అనిష్టమైంది కూడ. కనుక ఎప్పుడూ పనికి ఆనందాన్ని చేర్చుతూండాలి. పని చేసేవారికి ఆహ్లాదాన్ని చేకూర్చే పరిస్థితులను యజమానులు కల్పించాలి. పనినుండి ఆనందాన్ని తొలిగిస్తే అది యింకా దుర్భరమౌతుంది.

8. పని విలువ పనిని బట్టికాక దాన్నిచేసే వ్యక్తిని బట్టి వస్తుంది. కనుక చిన్న వృత్తులతో బ్రతికేవారి పనినీ, కూలివారి పనినీ చిన్నచూపు చూడకూడదు. ప్రతిపనీ విలువైందే. గాంధీగారు పాకీపని కూడ చేసారు.

9. భగవద్గీత నిష్కామకర్మ అనే భావాన్ని ప్రవేశపెట్టింది. అనగా స్వార్థలాభంకొరకు కాక ప్రజాశ్రేయస్సు కొరకు పని చేయాలి. బాగా చేసిన పని లోకకల్యాణాన్ని సాధించిపెడుతుంది.

10. మన పనిలో చిత్తశుద్ధి వుండాలి. పైవారిని మెప్పించి గుర్తింపూ బహుమతులూ పొందడానికి మాత్రమే పని చేయకూడదు. మన పనిని క్రీస్తు పనితో చేర్చి పరలోకంలోని తండ్రికి అర్పించాలి. పని ఆరాధనగా మారాలి.

# 11. మంచి మరణం

బైబులు భాష్యం - 146

విషయసూచిక

## 1. బైబులు బోధలు

### 1. పూర్వవేదం

1. చావుని గూర్చిన నరుల అనుభవాలు
2. మృత్యువులోని ముఖ్యాంశం
3. చావునుండి విముక్తి

### 2. నూత్నవేదం

4. లోకంలో మృత్యురాజ్యం
5. క్రీస్తు మృత్యువుతో పోరాడి గెల్చాడు
6. క్రైస్తవుడు మృత్యువుని గెలుస్తాడు

## 2. రెండవ ఆదాము

## 3. మరణానికి తయారుకావడం

1. చావు ఓ గమ్యాన్ని ఏర్పరుస్తుంది
2. భక్తులు చనిపోవాలని కోరుకొన్నారు
3. మరణానికి సిద్ధం కావడం
4. దైవార్చన - మరణం

# 1. బైబులు బోధలు

# 1. పూర్వవేదం

## 1. చావును గూర్చిన నరుల అనుభవాలు

చావును గూర్చి పూర్వవేదం చెప్పే ప్రధాన భావం, మృత్యువు పాప ఫలితం అనేది. ఆదాము పాపానికి ముందు చావులేదు. ఆ పాప ఫలితంగా చావు లోకంలోకి వచ్చింది.

ప్రతి నరుడు చావుని స్వయంగా రుచి చూస్తాడు. అది చాల చేదుగా వుంటుంది. ఈ లోక వస్తువులకు అంటిపెట్టుకొని వుండేవాళ్ళకు చావు మరీ చేదుగా వుంటుంది. హిజ్కియా రాజు రాబోయే తన మరణాన్ని తలంచుకొని ఎంతో దిగులుపడ్డాడు - 2 రాజు 20, 2. కాని కష్టాలతో విసిగిపోయినవాళ్ళు యోబులాగ చావుని ఆహ్వానించారు. యోబు 7,15. ఇంకా నరులందరికి చావంటే భయం, అనిష్టం.

పూర్వవేద ప్రజలకు మోక్ష నరకాలను గూర్చి స్పష్టంగా తెలియదు. వాళ్ళు నరుడు చనిపోయాక పాతాళలోకానికి దిగిపోతాడనీ, అక్కడే నిద్రావస్థలో వుండిపోతాడనీ భావించారు. ఈ స్థలాన్ని హీబ్రూ భాషలో షెయోల్ అన్నారు. వాళ్ళ భావాలు ప్రకారం ఈ పాతాళ లోకం పెద్ద గొయ్యి. అక్కడ చీకటీ, మౌనమూ రాజ్య మేలుతుంటాయి. అక్కడకు పోయినవాళ్ళను ఎవరూ స్మరించుకోరు. దేవుడుకూడ వారిని పట్టించుకోడు. పాతాళ వాసులుకూడ దేవుణ్ణి స్మరించుకోరు, స్తుతించరు. వారికి ఆనందమేమాత్రం వుండదు. ఒకసారి పాతాళాన్ని చేరుకొన్నవాళ్ళు అక్కడినుండి బయటికి రాలేరు. కనుక చావు నిరాశనూ విషాదాన్నీ కలిగిస్తుంది.

ఎవరి చావునీ చూచి మనం సంతోషించకూడదు. ఒకరోజు మనందరికీ అదే గతి పడుతుంది. నరులు భిన్నరీతుల్లో చనిపోయారు. మోషే నెబో కొండపై అద్భుతంగా మరణించాడు. సౌలు యుద్ధంలో దౌర్భాగ్య మరణానికి గురయ్యాడు. పితరులైన అబ్రాహాము ఈసాకు యాకోబులు పండువంటి నిండు వయసులో ప్రశాంతంగా మరణించారు. ఎవరికి ఏలాంటి చావు సిద్ధిస్తుందో మనకు తెలియదు. ఐనా మృత్యువు మనందరి గమ్యం. అది నిర్దయతో మన ప్రాణాన్ని కబళించి వేస్తుంది. చావుకున్న శక్తితో పోలిస్తే మన జీవం దుర్బలమైంది. నీడలాగ, నీటి బుడగలాగ, నిట్టూర్పులాగపేలవమైంది, క్షణికమైంది. నరులు కొద్దికాలం జీవించి చనిపోయేవాళ్ళయినా మేము శాశ్వతంగా జీవిస్తామో అన్నట్లు విఱ్ఱవీగుతుంటారు. ఇది అజ్ఞానం, వ్యర్థ ప్రక్రియ. దేవుడు బ్రతికివున్న వాళ్లందరికీ చావుని

విధించాడు. ఇప్పుడు మనం వద్దంటే కుదరదు - సీరా 41,1. మట్టినుండి పుట్టిన నరుడు మళ్ళా మన్నయిపోవలసిందే - ఆది 3,19. నరులందరికీ పట్టేగతి యిదే.

నరునికి చావంటే అనిష్టం. చావాలని ఎవడు కోరుకొంటాడు? కనుక అతడు చావుని ఓ భయంకర మూర్తిగా ఊహించుకొన్నాడు. మృత్యువు మనకు కాపరి. ఆ కాపరి మనలను గొర్రెలను లాగ పాతాళ లోకానికి తోలుకొనిపోతాడు - కీర్త 49,14. అది కొన్ని పర్యాయాలు దేవుడు పంపిన వినాశకారిలాగవచ్చి నరులను చంపిపోతుంది - నిర్గ 12, 23. చావు తరచుగా వ్యాధి రూపంలో వస్తుంది. వచ్చి మనలను పాతాళానికి ఈడ్చుకొని పోతుంది. అది పంజా విసిరితే ఏ నరుడు తప్పించుకోలేడు. అసలు మన జీవితమంతా చావు అనే శత్రువుని తప్పించుకోవడానికి చేసే పోరాటమే.

## 2. మృత్యువులోని ముఖ్యాంశం

ఎవరూ చనిపోవడానికి ఒప్పుకోరు. ఎందుకు? మనందరికీ జీవించాలనే కోరిక బలంగా వుంటుంది. చావు ఈ జీవాన్ని నాశం చేస్తుంది. అది నిరంకుశంగా మన ఆయుస్సుని త్రెంచివేస్తుంది. కనుకనే చావంటే ఎవరికీ గిట్టదు. కాని మరణంలోని ఈ నిరంకుశ గుణం ఎక్కడినుండి వచ్చింది? నరుల పాపంవల్లనే చావుకి ఈ నిరంకుశత్వం వచ్చింది. పాపం చేసిన నరుణ్ణి చావు చంపి తీరుతుంది - యెహె 18,20. దుష్టులు నాశమై పోవలసిందే - కీర్త 37,29. దేవుని ఆజ్ఞ మీరిందాకా ఆదాముకి చావులేదు. తినరాని పండు తిన్న తర్వాతనే అతనికి చావు వచ్చింది - ఆది 2, 17.

అసలు చావు ఎక్కడినుండి వచ్చింది? దేవుడు దాన్ని బుద్ధిపూర్వకంగా కలిగించలేదు. మన పాపంవల్లనే అది పుట్టుకవచ్చింది.

మృత్యువుని దేవుడు కలిగింపలేదు. ప్రాణులు చావడం చూచి అతడు సంతోషించడు. అతడు ప్రాణిని జీవించడానికే సృష్టించాడు - జ్ఞాన 1, 13-14. మృత్యువు లోకలో రావడానికి నరుల పాపం మాత్రమేకాక పిశాచంకూడ కారణం.

దేవుడు నరుణ్ణి అమరుణ్ణిగా చేసాడు
అతన్ని తనలాగే నిత్యునిగా చేసాడు
కాని పిశాచం అసూయ వలన
మృత్యువు లోకంలోకి ప్రవేశించింది - 2, 23-24.

కనుక పాపంవల్లనే చావు లోకంలోకి వచ్చింది అనేది పూర్వవేదం నొక్కి చెప్పే సూత్రం. చావులోని ముఖ్యాంశం ఇదే.

పాపాన్ని దేవుడు అంగీకరించడు. పాపం నరుణ్ణి చావు దగ్గరికి ఈడ్చుకొని పోతుంది. కోరా మోషేకు ఎదురు తిరిగి పాపం చేయగా భూమి నెర్రెలువిచ్చి అతన్ని మింగివేసింది - సంఖ్యా 16,30-31. పాపులు మృత్యువుని స్నేహితురాలినిగా స్వీకరిస్తారు - జ్ఞాన 1, 16. దేవుడు నరునికిచ్చిన వరాలన్నిటిలోను గొప్పవరం ప్రాణమే. పాపం ఈ ప్రాణాన్ని హరిస్తుంది. కనుక అది మహా దుష్టశక్తి ఐయుండాలి.

## 3. చావునుండి విముక్తి

నరుడు తనంతట తాను చావుని తప్పించుకోలేడు. భగవంతుడు నిండు జీవం. కనుక మన చావుని అతడు తొలగింపవలసిందే. కావున భక్తులు మరణాన్ని తొలగించమని దేవునికి ప్రార్థన చేసారు. నీవు నన్ను పాతాళానికి పంపవద్దు. నీ పరిశుద్ధుని గోతిపాలు చేయవద్దు అని వేడుకొన్నారు - కీర్త 16,10. తమ్ము అపదలనుండీ చావునుండీ కాపాడినందుకు దేవునికి వందనాలు చెప్పుకొన్నారు. దేవుడు పాతాళంకంటె, మరణంకంటె శక్తిమంతుడు. కనుక నరులు అతనినుండి మరణ విముక్తినీ అమరత్వాన్నీ పొందాలని కోరుకొన్నారు.

కాని దేవుడు నరుణ్ణి వట్టినే మరణంనుండి విడిపింపడు. నరుని బంధనానికి కారణం పాపం. కావున అతడు పశ్చాత్తాపపడి పాపాన్ని విడనాడాలి. అందుకే ప్రభువు "ఎవడు చనిపోవడం వలన నాకు సంతోషం కలగదు. కనుక మీరు మీ పాపంనుండి వైదొలగి బ్రతకండి" అని హెచ్చరించాడు - యెహె 18,32. అందుచే నరుడు ఎప్పటికప్పుడు పశ్చాత్తాపంద్వారా తన పాపమాలిన్యాన్ని వదలించుకొంటుండాలి. ఈ కార్యంద్వారా జీవాన్ని అధికాధికంగా పొందుతుండాలి. ఈ దృష్టితోనే ఉపాధ్యాయుడు బాలుణ్ణి బెత్తంతో దండించి వాడి మూర్ఖత్వాన్ని వదలించాలి. వాణ్ణి మృత్యువునుండి తప్పించాలి - సామె 23, 13-14. ఫలితాంశ మేమిటంటే, దేవుడు మనలను చావునుండి తొలగిస్తాడు. కాని మనం అడుగుకొన్నప్పుడే.

నరుడు ఈ లోకంలో మృత్యువుని జయించడం మాత్రమేకాదు, పరలోకంలో శాశ్వతంగా జీవించాలని కూడ కోరుకొన్నాడు. ఈ కోరిక పూర్వవేద భక్తుల్లో నిదానంగా కన్పించింది. "ప్రభువైన యావే మృత్యువుని సదా నాశంచేసి ఎల్లరి కన్నీళ్ళను తుడిచివేస్తాడు" అన్నాడు యెషయా - 25,8. చనిపోయి మట్టిలో నిద్రించేవాళ్ళు చాలమంది సజీవులౌతారు. వారిలో కొందరు నిత్యజీవాన్ని పొందుతారు అన్నాడు దానియేలు ప్రవక్త - 12,2. నీవు నీ వుపదేశంతో నన్ను నడిపిస్తావు, కడన నన్ను నీ తేజస్సులోనికి కొనిపోతావు అన్నాడు కీర్తన కారుడు - 73, 24. పూర్వవేద ప్రజల్లో అమరత్వంమీద కోరికలు ఈలానే వికసించాయి. హానోకు చావు

లేకుండానే దేవుణ్ణి చేరుకొన్నాడు - ఆది 5,24. పరలోక జీవితం కొరకే మక్కబీయుల కాలంలోని వేదసాక్షులు తమ ప్రాణాలు అర్పించారు -2 మక్క 7,9. యూదా మక్కబీయుడుకూడ చనిపోయినవారికొరకు బలులు ప్రార్థనలు అర్పించాడు -2 మక్క 12, 43-44.

ఈ సందర్భంలోనే యెషయా వర్ణించిన బాధామయ సేవకుణ్ణిగూడ పేర్కొనాలి. ఈ భక్తుని మరణం పాపపరిహార బలి అయింది. అతని మరణాన్ని అంగీకరించి దేవుడు చాలమంది దోషాలను మన్నించాడు. అతని మరణం ఎల్లరికీ జీవం పోసింది - యెష 53, 8-12. ఈ సేవకుడు రాబోయే క్రీస్తే. ఇతనితో నూత్నవేదం ప్రారంభమౌతుంది.

# 2. నూత్నవేదం

చావు పాపంతో వచ్చిందనేది పూర్వవేదంలో ప్రధానాంశం. నూత్న వేదంలో క్రీస్తు మరణమే ముఖ్యాంశం. క్రీస్తు వచ్చిందాకా లోకంలో మృత్యువు రాజ్య మేలింది. క్రీస్తు ఈ మరణానికి లొంగి దాన్ని గెల్చాడు. ఇప్పుడు మనం క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినపుడు అతని మరణం మన మరణంమీద సోకుతుంది. అతనిద్వారా మనం మృత్యువుని జయిస్తాం. కనుక క్రీస్తు రాకడతో మరణస్వభావం పూర్తిగా మారిపోయింది. ఇక ఈ విషయాన్ని విపులంగా పరిశీలిద్దాం.

## 4. లోకంలో మృత్యురాజ్యం

లోకంలో మృత్యువు రాజ్యం చేస్తుంది. నరుని పాపంద్వారా చావు లోకంలోకి ప్రవేశించింది - రోమా 5,12. ఆదాముద్వారా అందరూ మృతి చెందారు-1 కొ 15,22. చావు లోకాన్ని ఏలింది. ఈ చావు వెనుక పిశాచం హస్తంవుంది. అతడే ఆదాము మరణానికి కారకుడు. అతడు మొదటినుండి నరహంత - యోహా 8,44.

మృత్యువుకి బలం పాపంనుండే వచ్చింది. మరణం ముల్లు లేక కొండె పాపం -1 కొ 15,56. అనగా చావు మనలను పాపం అనే కొండెతో కుడుతుంది. పాప ఫలితమే చావు. క్రీస్తు రానంత కాలం మానవ జాతి మరణనీడలో కూర్చుండి వుంది. చావు గుప్పిటిలో చిక్కుకొని వుంది. ఈ మృత్యు బంధంనుండి మనలను విడిపించే నాథుడెవడు? క్రీస్తు.

## 5. క్రీస్తు మృత్యువుతో పోరాడి గెల్చాడు.

క్రీస్తు మన చావుని స్వీకరించాడు. అతడు మనచావుని తాను ఆహ్వానించి మనలను చావునుండి కాపాడాడు. మరణం అతనికి తలవని తలంపుగా రాలేదు. అతడే

దాన్ని బుద్ధిపూర్వకంగా ఆహ్వానించాడు. తాను మరణమనే నీటిలో మునిగితేలాడు - లూకా 12, 50. ప్రభువు మరణాన్ని చూచి కంపించి పోయాడు - యోహా 12, 27. దానినుండి తన్ను కాపాడమని తండ్రికి కన్నీటితో మొరపెట్టాడు - హెబ్రే 5,7. ఏ ప్రాణి చావడానికి ఒప్పుకోదు. క్రీస్తుకికూడ చనిపోవడం ఇష్టంలేదు. ఐనా అతడు తండ్రి ఆజ్ఞకు బద్ధుడై సిలువమరణం వరకు విధేయుడయ్యాడు - ఫిలి 2,8. సిలువ మరణం అనే పాత్రను త్రాగడానికి అంగీకరించాడు - మార్కు 14,36. క్రీస్తు విధేయత చాల గొప్ప పుణ్యం. అతడు యెషయా ప్రవక్త పేర్కొన్న బాధామయ సేవకుడు - యెష 53, 12. అతడు నరజాతిలో పుట్టి నరులతో ఐక్యమై నరుల పాపాలకొరకు చనిపోయాడు. మన పాపాల ఫలితమైన చావును తాను స్వీకరించాడు. మనలను కాపాడి తాను చనిపోయాడు.

భూమిలో పడిన విత్తనం చివికిపోయి మొలకెత్తి నూరంతలుగా ఫలిస్తుంది. అలాగే క్రీస్తు మరణంకూడ ఫలించింది - యోహా 12,24. అది మనకు పాపపరిహార బలి ఐంది. కయిఫా నుడివినట్లుగా అతడు నరులందరి కొరకు మరణించాడు - యోహా 18,14. విశేషమేమిటంటే, మనం పాపులమై యుండగా అతడు మనకొరకు చనిపోయాడు - రోమా 5,6. దానివలన అతని ప్రేమ ఎంత గొప్పదో తెలిసిపోయింది. అతడు మనకు బదులుగాకాక, మనకొరకు చనిపోయాడు. తన మరణం ద్వారా మనలను తండ్రితో రాజీ పరచాడు.

క్రీస్తు మరణానికి లొంగి దాన్ని గెల్చాడు. కనుకనే అతని మరణం సత్ఫలితాన్ని ఇచ్చింది. ఇక అతని రాజ్యంలో చావు వుండదు. అతడు మరణంనుండి ఉత్థితుడయ్యాడు. చావుని గెల్చి మృత్యుంజయుడు అయ్యాడు. అతని వుత్థానంతో మృత్యువుమీద అధికారంగల పిశాచం ఓడిపోయింది. క్రీస్తులో చావూ బ్రతుకూ ఒకదానితో ఒకటి పోరాడాయి. జీవన మూర్తియైన ప్రభువు చనిపోయాడు. చనిపోయి చావుని జయించాడు. ఇప్పుడు విజయమూర్తిగా పరిపాలనం చేస్తున్నాడు.

క్రీస్తు చనిపోయినప్పటినుండి చావు రూపం మారిపోయింది. అతనిద్వార చావు నీడలో కూర్చుండి వున్న మనపై వెలుగు ప్రసరించింది - లూకా 1, 79. అతడు రాకముందు మనం చావుకి బానిసలం. ఇప్పుడు ఆ బానిసం తొలగిపోయింది. లోకాంతంలో నరులందరూ ఉత్థానమైనపుడు అతని వుత్థానం మన పెన్నిద్దురను పూర్తిగా నాశం చేస్తుంది -1 కొ 15, 26. "మరణమూ! నేనే నీకు మరణాన్నవుతాను. నరకమా! నేనే నిన్ను నాశం చేస్తాను" అనే వుత్థానగీతం క్రీస్తుపట్ల పూర్తిగా నెరవేరింది.

## 6. క్రైస్తవుడు మృత్యువుని గెలుస్తాడు

క్రీస్తు మనకొరకు చనిపోయాడు. కాని అతని మరణం మనకెలా వుపయోగపడుతుంది? తొలి ఆదాములో మనమందరం ఇమిడివున్నట్లే, మలి ఆదామైన క్రీస్తులో కూడ అందరం ఇమిడి వున్నాం -1 కొ 15, 45. అతని మరణంలో మనంకూడ మరణించాం. విశేషంగా జ్ఞానస్నానంలో క్రీస్తు మరణం మనమీద సోకుతుంది. మనం అతనితోపాటు చనిపోయి, అతనితోపాటు భూస్థాపితులమౌతాం - రోమా 6, 3-4. కాని ఈ చావు శారీరకమైంది కాదు, ఆధ్యాత్మకమైంది. అనగా మనం జ్ఞాన స్నానంలో చనిపోయేది పాపానికి - 6, 11. ఈ జ్ఞానస్నాన సమయంనుండి క్రీస్తు మరణం మనమీద సోకి మన మరణాన్ని అణచివేస్తుంది. మృత్యుంజయుడైన ప్రభువు మనకు జీవాన్నిస్తాడు. అతని పలుకులు వినేవాడు మరణాన్ని దాటి జీవంలో అడుగిడతాడు - యోహా 5,24. అతన్ని విశ్వసించేవాడు మరణించికూడ మళ్ళా జీవిస్తాడు 11,25. కాని ప్రభువుని అంగీకరింపనివాడు రెండవ మరణానికి గురౌతాడు - దర్శ 2, 11.

ఐతే మనం పాపానికి చనిపోవడమనేది జ్ఞానస్నాన స్వీకరణం తర్వాతకూడ కొనసాగాలి. క్రైస్తవుడు తనలోని పాపపు మానవుణ్ణి నిరంతరం చంపుకొంటుండాలి - రోమా 8,13 పౌలులాగ మనంకూడ రోజురోజు చనిపోతుండాలి - 1 కొరి 15,31 రోజురోజు క్రీస్తు మరణాన్ని అనుభవించేవాడు అతని జీవాన్ని కూడ పొందుతాడు. పౌలు ప్రేషిత సేవలో దినదినం మరణిస్తుండగా అతనివలన విశ్వాసులకు జీవం లభిస్తుండేది - 2 కొరి 4,12.మన జీవితంకూడ ఈలాగే వుండాలి.

ఇక మన శారీరకమైన మరణం విషయమేమిటి? మనం క్రీస్తుకొరకే జీవించాలి. క్రీస్తుకొరకే మరణించాలి. మన మరణం అతని మరణంతో కలిసిపోవాలి - రోమా 14, 7-8. కొందరు క్రీస్తుకి సాక్షులుగా, అనగా వేదసాక్షులుగా మరణిస్తారు. వారికి జీవకిరీటం లభిస్తుంది - దర్శ 2, 10. ప్రభువునందు మరణించేవాళ్ళు ధన్యులు. అన్ని శ్రమల నుండి వారికి విశ్రాంతి లభిస్తుంది -14, 13. మన తరపున మనం ప్రతిరోజు మన మరణాన్ని క్రీస్తు మరణంతో జోడించాలి. నీతిమంతులు మరణంద్వారా నిత్యశాంతిలోనికి, నిత్యప్రకాశంలోనికి ప్రవేశిస్తారు - జ్ఞాన 3,3.

పూర్వవేద ప్రజలు ఉత్థానంకొరకూ అమరత్వం కొరకూ ఎదురుచూచారు. ఈ నిరీక్షణం క్రీస్తుద్వారా నెరవేరింది. అతనికి ఉత్థానాన్ని దయచేసిన తండ్రి అతనిద్వారానే మనకుకూడ ఉత్థానాన్ని ప్రసాదిస్తాడు - రోమా 8,11. ఆ వుత్థాన జీవితంలో మృత్యువు వుండనే వుండదు - దర్శ 21,4. మరణానికీ పిశాచానికీ దుష్టులకూ మాత్రమే రెండవ మరణం వుంటుంది -21,8.

క్రీస్తు మరణం మనకు రక్ష. కనుక మనం మరణానికి భయపడకూడదు. అది మనకు నష్టంగాదు, లాభమే. అందుకే పౌలు మరణం నాకు లాభం, క్రీస్తు నాకు జీవం అని చెప్పుకొన్నాడు - ఫిలి 1, 21. తాను భౌతిక శరీరాన్ని త్యజించి ప్రభువు సన్నిధిని చేరుకోవడం మేలని తలంచాడు - 2 కొరి 5,8. ఈ జీవితాన్ని త్యజించి క్రీస్తుని చేరుకోవాలని గాఢంగా వాంఛించాడు - ఫిలి 1, 23. ఈలా భక్తిమంతులు మరణానికి భయపడలేదు కదా, దాన్ని ఆహ్వానించారు. దానికొరకు ఉవ్విళ్ళూరారు. క్రీస్తుని అనుభవానికి తెచ్చుకొన్న వాళ్ళంతా ఈలాగే మరణాన్ని ఆహ్వానిస్తారు. ఆ ప్రభువుపట్ల అనుభవం లేనివాళ్ళు మాత్రం చావుకి భయపడతారు.

## 2. రెండవ ఆదాము

పడిపోయిన నరుణ్ణి లేవడానికి తండ్రి కుమారుణ్ణి పంపాడు. ఆ కుమారుడు దీననరరూపంతాల్చి పాపపు మానవుళ్ళాగ ఈ లోకంలోకి వచ్చాడు. సమకాలికులైన యూదులు స్వార్థంవల్లా అజ్ఞానంవల్లా అతన్ని క్రూరమైన సిలువ మరణానికి గురి చేసారు. క్రీస్తు ప్రేమతో తండ్రి చిత్తానికి లొంగి సిలువ మరణాన్ని అంగీకరించాడు. మామూలుగా చావులో అవిధేయతా, తిరుగుబాటూ వుంటాయి. కాని క్రీస్తు మరణంలో తండ్రిపట్ల విధేయతా ప్రేమా వున్నాయి. అతని మరణం పాపపరిహారబలి ఐంది. తండ్రిపట్ల లొంగుబాటు ఐంది. ఈలాంటి ప్రేమపూరితమైన మరణంద్వారా క్రీస్తు మానవ స్వభావం మహిమనూ దివ్యత్వాన్ని పొందింది. క్రీస్తు ఆత్మార్పణం తండ్రికి ప్రీతి కలిగించింది. కనుకనే తండ్రి అతన్ని ఉత్థితుణ్ణి చేసాడు. అతన్ని పవిత్రాత్మతో నింపాడు. క్రీస్తుతో మరణ స్వరూపం పూర్తిగా మారిపోయింది. చావంటే దేవునికి ఎదురు తిరగడం. కాని విధేయతతో కూడిన క్రీస్తుమరణం, తండ్రి నరులకొరకు ప్రేమతో ఏర్పాటుచేసిన రక్షణ ప్రణాళిక అయింది.

క్రీస్తు కేవలం ఓ ప్రత్యేక వ్యక్తిగా మన తరపున చనిపోలేదు. పాపపు నరుల దైవ శిక్షకు గురైయుండగా ఆ శిక్షను తొలగించడానికి మాత్రమే చనిపోలేదు. అతడు నరజాతితో ఐక్యమై వారి ప్రధాన యాజకుడుగా, వారి కొరకు చనిపోయాడు. తొలి ఆదాము మనకు శిరస్సు. కనుకనే అతని పాపమూ చావూ మనకుకూడ ప్రాప్తించాయి. రెండవ ఆదామైన క్రీస్తుకూడ మానవ జాతికి శిరస్సు. కనుకనే ఇతని వుత్థానమూ జీవమూ మనకుకూడ లభించాయి. ఆ యాదాము మనకు వినాశకుడైతే ఈ యాదాము ఉద్ధారకుడు. క్రీస్తు తండ్రికి విధేయుడై మరణించాడు. కనుక తండ్రి అతన్ని చావునుండి లేపి, మహిమపరచి తన కుడి ప్రక్కన కూర్చుండ బెట్టుకొన్నాడు. ప్రభువు అనే తన బిరుదాన్ని కుమారునికిచ్చాడు. ఈ మహిమాన్వితుడైన క్రీస్తు నేడు మనలను రక్షించేవాడు. మనకు ఆత్మనిచ్చేవాడు. పాపపూరితమైన మన చావుని పవిత్రంచేసి మనకు పరలోక వారసత్వాన్ని

దయచేసేవాడు. క్రీస్తు మరణోత్థానాల తర్వాత మనం చావు నీడల్లో కూర్చుండివుండం. మృత్యుంజయుని ముఖకాంతి మనమీద ప్రకాశిస్తుంది. మానవ జాతికిచెంది మృత్యువుని గెల్చిన ఒక నరునిద్వారా మనకు శాశ్వత జీవం లభిస్తుంది.

తొలి ఆదామునందు చనిపోయే నరుడు వేరు. క్రీస్తు నందు చనిపోయేనరుడు వేరు. మన చావు ఇప్పుడు మనలను శిక్షించి నాశం చేయదు. క్రీస్తుద్వారా అది మనలను రక్షించి మహిమ పరుస్తుంది. మనకు జీవాన్ని ప్రసాదిస్తుంది. కనుక మనం దాన్ని చూచి భయపడనక్కరలేదు. దాన్ని అంగీకరించవచ్చు.

# 3. మరణానికి తయారుకావడం

మనం జీవించి వున్నంతకాలం మన దేహాత్మలు కలిసి వుంటాయి. కాని మరణంలో ఇవి రెండూ విడిపోతాయి. ఈలా వేరయి పోవడాన్నే చావు అంటాం. లోకాంతంలో మనం ఉత్థానమైనపుడు ఇవి రెండూ మళ్లా కలిసికొంటాయి.

## 1. చావు ఓ గమ్యాన్ని ఏర్పరుస్తుంది.

మన ఇహలోక జీవితానికి ముగింపు మృత్యువు. చావు తర్వాత ఈ మంటిమీద మరల జీవించం. కొందరు అనుకొన్నట్లుగా పునర్జన్మలేదు. లోకంలో మన జీవితకాలం స్వల్పమైంది. కనుక మనం చేయవలసిన మంచి పనులు ఈ స్వల్ప కాలంలోనే చేయాలి. ఈ దృష్టితో చూస్తే చావు మన జీవితానికి ఓ గమ్యాన్ని ఏర్పరుస్తుంది. మనం ఎటువెళ్ళాలో, ఏమి సాధించాలో తెలియజేస్తుంది. చావే లేకపోతే నరుడు గురి తెలియనివాడుగా వుండిపోతాడు. కార్యోన్ముఖుడు కాడు.

చావు మన ప్రధాన సమస్యల్లో వొకటి. అది మనం జయింపవలసిన చివరి శత్రువు. అయినా చాలమంది చావుని పట్టించుకోరు. మృత్యువు వచ్చి తలుపు తట్టిందాకా అది అసలు లేదో అన్నట్లు నిర్భయంగా వుండిపోతారు. ఇది వట్టి అవివేకం. బుద్ధిమంతుడు తన జీవితకాలమంతా మరణాన్ని స్మరించుకొంటూనే వుంటాడు.

## 2. భక్తులు చనిపోవాలని కోరుకొన్నారు

పౌలు భక్తుడు చనిపోవడం నాకు లాభదాయకం అన్నాడు. మనం క్రీస్తుతో మరణిస్తే అతనితో జీవిస్తాం -2 తిమొ 2, 21. జ్ఞానస్నానంద్వారా మనం క్రీస్తుతో చనిపోయి అతనితో జీవించడం మొదలిడతాం. క్రీస్తుతో చనిపోవడమనే ప్రక్రియ మన శారీరక మరణంతో ముగుస్తుంది. ఆ మీదట ప్రభువు రక్షణం మనకు సంపూర్ణంగా లభిస్తుంది. కనుకనే అంటియోకయ ఇగ్నేష్యసుగారు "నేను ఈ లోకాన్నంతటిని పరిపాలించిన దానికంటే క్రీస్తులోనికి చనిపోవడం మెరుగు. మనకోసం చనిపోయిన ఆ

ప్రభువునే నేను వెదికేది. మనకొరకు ఉత్థితుడైన ఆ ప్రభువునే నేను వాంఛించేది.నేను నూత్నంగా పుట్టబోతున్నాను. స్వచ్ఛమైన వెలుగును పొందబోతున్నాను. ఆ ప్రభువుని చేరుకొన్నపుడు నేను పూర్ణమానవుణ్ణవుతాను" అని వ్రాసారు.

మరణంతో మన జీవితం చివరి మెట్టును చేరుకొని పరిపూర్ణమౌతుంది. కనుకనే చాలమంది భక్తులు త్వరగా చనిపోవాలని కోరుకొన్నారు. పౌలు భక్తుడు "ఈ జీవితాన్ని త్యజించి క్రీస్తుని చేరాలని నేను గాఢంగా వాంఛిస్తున్నాను" అన్నాడు ఫిలి 1, 23. క్రీస్తు తన మరణంలో తండ్రిపట్ల విధేయతా, ప్రేమా, కోరికా చూపాడు. ఈలాగే మనంకూడ మన మరణంలో తండ్రిపట్ల విధేయతా, ప్రేమా కోరికా చూపాలి. అప్పుడేగాని మన మరణం మనలను పవిత్రపరచదు. ఈ సందర్భంలో అంటియోకయా ఇగ్నేష్యసుగారు "నా లౌకికవాంఛ సిలువ వేయబడింది. నాలోని జీవజలం నీవు తండ్రి వద్దకురా అని పదేపదే పిలుస్తుంది" అని వ్రాసారు. భక్తులకు భగవంతుణ్ణి త్వరగా చేరుకోవాలనే కోరిక గాఢంగా వుంటుంది. అవిలా తెరేసమ్మగారు "నేను దేవుణ్ణి చూడాలని కోరుకొంటున్నాను. కాని అతన్ని చూడాలంటే నేను చనిపోవాలి" అని వ్రాసారు. చిన్న తెరేజమ్మగారు "చనిపోయేటపుడు నేను నిజంగా చనిపోను. జీవంలోకి ప్రవేసిస్తాను" అని వ్రాసారు. భగవంతుణ్ణి గాఢంగా ప్రేమించేవాళ్ళ అభిలాషలు ఈలా వుంటాయి. ఈ భక్తులను చూచి మనం లోక వ్యామోహాలను అణచుకోవాలి. దేవునిమీదికి మనసు త్రిప్పుకోవాలి. అతనితో ఐక్యంకావాలని కోరుకోవాలి.

## 3. మరణానికి సిద్ధం కావడం

1. చాలమంది చావుకి ముందుగా తయారుకారు. ఇప్పుడేం తొందర, ఆ విషయం చివరన చూడవచ్చులే అనుకొంటారు. కాని ఇది పెద్ద పొరపాటు. మన జీవితకాలమంతా మరణానికి తయారౌతూనే వుండాలి. వ్యాపారులు డబ్బువిషయం జీవితంలో చివరిదాకా వాయిదా వేస్తారా? రోగి మందు తీసికోవడాన్ని చివరిదాకా వాయిదా వేస్తాడా? వ్యాజ్యెంలో చిక్కుకొన్నవాళ్ళు తమ కేసుని చివరిదాకా పట్టించుకోకుండా వుండిపోతారా? మనకు చావు తథ్యమనీ అది మన జీవితంలో ఎప్పుడైనా రావచ్చుననీ మనకు రూఢిగా తెలుసుగదా! మరి దాన్ని చివరిదాకా వాయిదా వేయడం అవివేకం కదా!

మన మరణ సమయంలో మనం పాపాన్ని పూర్తిగా ద్వేషించాలి. దేవుణ్ణి అన్ని వస్తువుల కంటే అధికంగా ప్రేమించాలి. అప్పుడే మనకు రక్షణం కలిగేది. కాని జీవితకాలమంతా పాపాన్ని ప్రేమించే మనం మరణకాలంలో దాన్ని దిడీలున ద్వేషించగలమా? జీవితకాలమంతా సృష్టివస్తువుల్లో తగుల్కొని వుండే మనం మరణ సమయంలో దిడీలున వాటిని వదలి దేవుణ్ణి ప్రేమించగలమా? కనుక మన చావునిగూర్చి

చివరిరోజుల్లో ఆలోచించుకోవచ్చులే అనుకుంటే ఎలా కుదురుతుంది? బ్రతికి వున్నపుడే దాన్ని పట్టించుకోవాలి గదా!

మామూలుగా మన మరణసమయం భయాందోళనలతో విచారంతో నిండి వుంటుంది. అప్పుడు ప్రశాంతంగా మరణానికి సిద్ధంకాలేం. కనుక దానికి ముందుగానే తయారు కావడం వివేకం. ఇంకా పరలోక జీవితమంతా మన మరణ సమయం మీదనే ఆధారపడి వుంటుంది. కనుక మనం మంచి మరణానికి ముందుగానే సిద్ధం కావాలి.

2. మరణానికి ముందే మన జీవితాన్ని సవరించుకోవాలి. మన పాపాలను పరిశీలించి చూచుకొని వాటికి పరిపూర్ణంగా పశ్చాత్తాప పడాలి. మన దురభ్యాసాలను సవరించుకోవాలి. వేదసత్యాలను ధ్యానించుకొని ప్రార్థనం చేసికోవాలి. బైబులు చదువుకోవాలి. దివ్యపూజ, పాపసంకీర్తనం, దివ్యసత్ప్రసాదం మొదలైన వాటిల్లో పాల్గొనాలి రోజూ ఆత్మశోధనం చేసికోవాలి. మరియమాతా, మంచి మరణానికి పాలకులైన జోజప్పగారు మొదలైన అర్చ్యశిష్టులను శరణువేడాలి. యేసు నామాన్ని జపించాలి. ప్రభువు మరణం మన మరణంమీద సోకి దాన్ని పునీతం చేయాలని అడుగుకోవాలి. మంచి మరణాన్ని కోరుకొనేవాడు ఈ రీతిగా భక్తిమంతమైన జీవితం గడపాలి. మామూలుగా మనం ఎలా జీవిస్తామో అలాగే చనిపోతాం. జీవితమంతా లోక వ్యామోహాల్లో గడిపేవాళ్ళు చివరి గడియల్లో దిడీలున భక్తులౌతారా?

3. దేవుణ్ణి చేరుకోవాలనుకొనేవాళ్ళు ప్రపంచ వ్యామోహాలను విసర్జించాలి. ధనం, సుఖభోగాలు, కీర్తిప్రతిష్ఠలు మొదలైన లోక వస్తువులమీద మోజు పెంచుకోకూడదు. చావు వచ్చినపుడు వీటిని ఎలాగూ వదలుకోవాలి. ఆ కార్యం అప్పుడు మనకు కష్టంగా వుంటుంది. కనుక లోకవ్యామోహ విసర్జనం ఇప్పుడే జరగాలి. చనిపోయేటపుడు కేవలం దేవునిమీదనే మనసు లగ్నంజేసికో గలిగివుండాలి. కాని ముందుగానే ప్రపంచ వ్యామోహాలను విడనాడనిదే ఈ కార్యం సాధ్యపడదు.

మామూలుగా మన లోకవాంఛలు ఎంత బలంగా వుంటాయో మన చావుకూడ అంత చేదుగా వుంటుంది. ఈ లోకాన్ని విడనాడినవాడు సంతోషంగా, ప్రశాంతంగా మరణిస్తాడు. కాని లోకవిసర్జనం మరణ సమయానికి ముందే జరగాలి.

చాలామంది భక్తులు తమ జీవితంలో ఇదే చివరిరోజు అన్నట్లుగా జీవించారు. కావున వాళ్ళు ప్రతిదినం భక్తిగా జీవించగలిగారు. ఈ సూత్రాన్ని మనంకూడా పాటించడం మేలు.

ఇంకా భక్తులు నిరంతరం మరణాన్ని ధ్యానం చేసికొనేవాళ్ళు. కొందరు అర్చ్యశిష్టులు ఎప్పుడు తల పుర్రెను తమ కెదురుగా పెట్టుకొని దాన్ని మననం చేసికొనేవాళ్ళు. దీనివల్ల వాళ్ళు లోకవాంఛలను వదలుకొన్నారు. పాపం చేయడానికి జంకారు. ఈ సందర్భంలో సీరా గ్రంథం "ఒక దినం నీవు మరణిస్తావని నీవు చేసే కార్యాలన్నిటిలోను గుర్తుంచుకో. అప్పుడు నీవు పాపం కట్టుకోవు" అని చెప్తుంది - 7, 36.

4. దేవద్రవ్యానుమానాలను భక్తిగా స్వీకరించడం ద్వారా కూడ మంచి మరణానికి ఆయత్తమౌతాం. జ్ఞానస్నానం ద్వారా క్రీస్తు మరణోత్థానాల్లో పాలు పొందుతాం. ఇక్కడమనం చనిపోయేది పాపానికి, ఉత్థానమయ్యేది పుణ్య జీవితానికి. జ్ఞానస్నానంవల్ల క్రీస్తు మరణం మన చావుమీద సోకి దాన్ని పునీతం చేస్తుంది.

దివ్య సత్ప్రసాదం మనలను క్రీస్తుతో ఐక్యం చేస్తుంది. మనకు ఉత్థానభాగ్యాన్ని దయచేస్తుంది. అది మనం మృత్యువుని జయించేలా చేస్తుంది. నన్ను భుజించినవాణ్ణి నేను అంతిమ దినాన లేపుతానని ప్రభువే చెప్పాడు - యోహా 6,44. అందుకే చనిపోయేటపుడు రోగులకు దివ్యసత్ప్రసాదాన్ని యిస్తారు. అది లోకాంతంలో మనలను పెన్నిద్దురనుండి లేపుతుంది.

పాపంవల్లనే వ్యాధిబాధలు లోకంలోకి వచ్చింది. వ్యాధి బాధను కలిగిస్తుంది. ఈ బాధవల్ల దేవునిపట్ల మమకారాన్ని ప్రేమను కోల్పోతాం. క్రీస్తు తన అద్భుతాల ద్వారా ఈ వ్యాధిబాధలను కొంతవరకు తొలగించాడు. ఇప్పుడు వ్యాధిగ్రస్తుల దేవద్రవ్యానుమానం రోగంలో మనకు బలాన్నిస్తుంది. దేవునిపట్ల మన విశ్వాసం సడలకుండా వుండేలా చేస్తుంది. ఇంకా, మన మరణకాలంలో పిశాచం మనలను తీవ్రంగా శోధిస్తుంది. ఆ శోధనల్లో ఈ దేవద్రవ్యానుమానం మనమీద తన ప్రభావాన్ని చూపి మనం క్రీస్తుకి అంటిపెట్టుకొని వుండేలా చేస్తుంది. కనుక మరణావస్థలో వున్నవాళ్ళు ఈ సంస్కారాన్ని తప్పక పొందాలి.

పాపసంకీర్తనం మనం పాపాలకు పరిహారంచేసే దేవద్రవ్యానుమానం. పాపం తొలగిపోయినపుడు మృత్యువు బాధకూడ చాలవరకు తొలగిపోతుంది. ఈ దేవద్రవ్యానుమానం మనం మృత్యువుని అంగీకరించేలా చేస్తుంది. మన పాపాలకు ప్రాయశ్చిత్తంగా చావుని స్వీకరించేలా చేస్తుంది. క్రీస్తు వరప్రసాదం మన హృదయాన్ని బాగా శుద్ధిచేసి అది మరణానికి సిద్ధపడేలా చేస్తుంది.

## 4. దైవార్చన - మరణం

దైవార్చన, విశేషంగా పూజ మరణంయొక్క పరమార్థాన్ని తెలియజేస్తుంది. మృతుల పూజలో వచ్చే ప్రిఫేస్ ప్రార్థనం "ఓ ప్రభూ! నీ విశ్వాసులకు ఈ జీవితం మారుతుందే కాని అంతంకాదు. ఈ భూలోక నివాసం శిథిలంగాగా మాకు పరలోక నిత్యనివాసం సిద్ధమౌతుంది" అని చెప్తుంది. ఇది చాలా గొప్ప భావం. మరణంతో మన జీవితం ముగియదు. ఇంతకంటె మెరుగైన జీవితం ప్రారంభమౌతుంది. క్షణికమైన భూలోక జీవితంపోయి శాశ్వతమైన స్వర్గలోక జీవితం వస్తుంది. కనుక మనం మరణాన్ని తలంచుకొని భయపడకూడదు, సంతోషించాలి.

తిరుసభ విశ్వాసులు మరణానికి జాగ్రత్తగా సిద్ధంకావాలని కోరుతుంది. మనం "ఆయత్తంలేని ఆకస్మిక మరణంనుండి మమ్ము కాపాడు" అని దేవుణ్ణి వేడుకొంటాం. మా

మరణ సమయంలో మా కొరకు ప్రార్థించండి అని దేవుని తల్లియైన మరియను అడుగుకొంటాం. ఇంకా, మంచి మరణానికి పాలకులైన జోజప్పగారిని మరణ సమయంలో మనలను ఆదుకొమ్మని అడుగుకొందాం.

ఈ సందర్భంలో క్రీస్తు అనుసరణ గ్రంథం ఈలాచెప్తుంది "మన పనులూ ఆలోచనలూ కూడ మనం ఈనాడే చనిపోతామో అన్నట్లుగా వుండాలి. నీయంతరాత్మ సమాధానంగా వుంటే నీకు చావంటే భయం వేయదు. కనుక చావుకి భయపడ్డంకంటె పాపాన్ని విసర్జించడం మేలు. నీవు ఈనాడు చావుని ఎదుర్కొనలేకపోతే రేపుకూడ దాన్ని ఎదుర్కొన లేవు."

అసిస్సీ ఫ్రాన్సిస్ భక్తుడు మృత్యువుని బాగా అనుభవానికి తెచ్చుకొని ఈలా వ్రాసాడు.

"ఓ ప్రభూ! మా సోదరియైన మృత్యువుని
చేసినందుకు నీకు వందనాలు
చావుని ఏ నరుడూ తప్పించుకోలేడు
చావైన పాపంతో చనిపోయినవాళ్ళకు అనర్థం
నీ చిత్త ప్రకారం జీవించేవాళ్ళు ధన్యులు
రెండవ చావైన నరకం వాళ్ళను బాధించదు".

వ్యాధి గ్రస్తులకు అభ్యంగనం చేసేటపుడు గురువు ఈ క్రింది ప్రార్థనను జపిస్తారు.
క్రైస్తవుడా! ఈ లోకంనుండి వెడలిపో
నిన్ను కలిగించిన సర్వశక్తిగల తండ్రి పేరుమీదిగా,
నీ కొరకు శ్రమలనుభవించిన
సజీవ దేవుని కుమారుడైన క్రీస్తు పేరుమీదిగా,
నీ మీద కుమ్మరించబడిన పవిత్రాత్మ పేరు మీదిగా
క్రైస్తవ భక్తుడా! ఈ లోకంనుండి తరలిపో.
ఈ దినం నీవు సమాధానంతో జీవింతువుగాక
నీవు సియోనున దేవునితో వసింతువుగాక
దేవుని కన్యమాతయైన మరియతో,
జోజప్పగారితో, పునీతులతో,
సన్మనస్కులతో కలసి జీవింతువుగాక
నిన్ను మట్టినుండి కలిగించిన సృష్టికర్తను
నీవు మరల చేరుకొందువుగాక
నీవు ఈ జీవితంనుండి తరలిపోతూండగా
మరియ మాత, పునీతులు, సన్మస్కులు
నీ కెదురు వత్తురుగాక
నీ విమోచకుని నీవు ముఖాముఖి చూతువుగాక.

# 12. సన్మనస్కులు

బైబులు భాష్యం - 152

## విషయసూచిక



## 1. బైబుల్లో దేవదూతలు

సన్మనస్కుకి గ్రీకులో అంగెలోస్ అనీ, హీబ్రూలో మాలక్ అనీ పేర్లు. దూత అని ఈ పేర్లకు అర్థం. దేవుడు వాళ్ళను నరుల దగ్గరికి దూతగా పంపుతాడని భావం. హీబ్రూ పూర్వవేదం వారిని వీరులు, సైనికులు, సేవకులు, కావలివాళ్ళు, పవిత్రులు, దేవుని కుమారులు, దేవుళ్ళు అని కూడ పిలుస్తుంది.

బైబుల్లో దేవదూతలను గూర్చి స్పష్టమైన భావాలున్నాయి. కాని యిస్రాయేలు ప్రజలు మొదట కనానీయులనూ తర్వాత పారశీకులనూ జూచి ఈ భావాలను అభివృద్ధి చేసికొన్నారు. పూర్వవేదంలో దేవదూతలు దేవునికీ నరునికీ మధ్య మధ్యవర్తులుగా కన్పిస్తారు. నూత్నవేదంలో క్రీస్తే ప్రధానమైన మధ్యవర్తి. కనుక దూతల ప్రమేయం కొంత తగ్గింది. కాని పూర్వవేద ప్రజలకంటె నూత్నవేద ప్రజలకు దూతల స్వభావాన్ని గూర్చి ఎక్కువగా తెలుసు. మనం బైబుల్లో కన్పించే దేవదూతలను గూర్చిన భావాలను మూడంశాల క్రింద పరిశీలించి చూడవచ్చు.

### 1. దేవదూతల స్వభావం

పూర్వవేదం దేవదూతల స్వభావాన్ని గూర్చి కొన్ని విషయాలు చెప్తుంది. వాళ్ళు దైవలోకంలో, దేవుని కొలువులో వుంటారు. దేవునికి సలహాదారులుగా వుంటారు - 1 రాజు 22, 19-22. మన కంటికి కనిపించరు, మనకు అందుబాటులో వుండరు. శరీరధారులు కారుకనుక మన ఆకలిదప్పులు వారికుండవు - తోబీతు 12, 19. అసలు

వారిది మన లోకం కాదు, దైవలోకం. యాకోబు కలలో చూచిన నిచ్చెన మీదిగా స్వర్గానికీ భూమికీ ఎక్కుతూ దిగుతూ వుంటారు - ఆది 28, 12. వాళ్ళు దేవునికి చెందిన వాళ్ళు - నిర్గ 23, 23. సన్మనస్కులతోపాటు పిశాచం కూడ వుంది. నరులను తప్పు పట్టడం దాని పని - జక 3, 1-2.

కాని నూత్నవేదం సన్మనస్కుల స్వభావాన్ని గూర్చి ఇంకా ఎక్కువ విషయాలు చెప్తుంది. వాళ్ళు ఆత్మస్వరూపులు. శరీరబాధ లేనివాళ్ళు. ఉత్థాన కాలంలో మనం వారిలాంటి వాళ్ళమౌతాము. అనగా వీళ్ళకులాగ మనకు కూడ ఆకలి దప్పులు, స్త్రీ పురుషుల కలయిక, బిడ్డలను కనడం మొదలైన లక్షణాలు వుండవు - లూకా 20, 36. మత్తయి 18,10 దేవదూతలు స్వర్గంలో సదా దేవుని ముఖాన్ని దర్శిస్తుంటారని చెప్తుంది. అనగా వాళ్ళు నిత్యం దేవుణ్ణి స్తుతించి ఆరాధిస్తుంటారని భావం. వాళ్ళ ప్రధాన కార్యం ఇదే. వారికి ఆనందం వుంటుంది - లూకా 15,10. వాళ్ళు మన రక్షణరహస్యాలను అర్థం జేసికోగోరుతారు -1 పేత్రు 1,12. వాళ్ళు మనకంటె ఎంతో బలవంతులు. వాళ్ళను చూచి మనం భయపడిపోతాం. వాళ్ళు ఒకప్పుడు దేవునిమీద తిరగబడ్డారు - 2 పేత్రు 2,4. మికాయేలు పిశాచంతోను దాని దూతలతోను పోరాడి వారినందరిని నరకంలోనికి త్రోసివేసాడు - దర్శ 12, 7-9. ఆనాటినుండి వారికి దేవునితో వైరం. వారికి ఇక పరివర్తనం వుండదు.

దేవదూతలు ఎంతమంది? క్రీస్తు వాళ్ళు 12 దళాలు అని చెప్పాడు - మత్త 26,53. హెబ్రేయుల జాబు వేలకొలది మంది అంటుంది - 12, 22. దర్శన గ్రంథం కోట్ల సంఖ్యలో వున్నారంటుంది. కనుక సన్మనస్కులు ఎంత మందో మనకు రూఢిగా తెలియకపోయినా పెద్ద సంఖ్యలో వున్నారని మాత్రం చెప్పవచ్చు.

## 2. దూతల దర్శనాలు

దేవుడు నరులకు సహాయం చేయడానికి పంపిన దేవదూతలు ఆ నరులకు కనిపించారు. అబ్రాహాముకి ముగ్గురు దూతలు కనిపించారు. తరువాత వీళ్ళు దేవుడేనని తేలింది - ఆది 18, 2. అలాగే ఒక దేవదూత దానియేలుకి దర్శనమిచ్చి అతనికి దర్శనాల భావాన్ని తెలియజేసాడు - దాని 8, 15. మనోవా భార్యకు కూడ ఒక దేవదూత కన్పించి సంసోను జనన వృత్తాంతాన్ని తెలియజేసాడు- న్యాయాధి 13,6. పూర్వవేదంలోని దేవదూతల కథలు కొన్ని యివి :

1. అబ్రాహాము దూతలకు ఆతిథ్యమీయడం - ఆది 18, 1-10
2. దూతలు లోతుని సొదొమ వినాశం నుండి కాపాడ్డం - ఆది 19

3. యాకోబు నిచ్చెన - ఆది 10-1
4. యాకోబు దేవదూతతో కుస్తీ పట్టడం - ఆది 32, 24-29
5. దేవదూత మనోవా దంపతులకు దర్శనమీయడం - న్యాయా 13, 1-20
6. యేలీయాకు భోజనం పెట్టడం - 1 రాజు 19, 5-8
7. తోబీతు కథ

నూత్న వేదంలో సన్మనస్కుల దర్శనాలు చాల వున్నాయి. వీళ్ళు ఆయా వ్యక్తులకు నరరూపంలో కనిపించారు అనుకోవాలి. గబ్రియేలు దూత జకరియాకు మరియకు కనిపించాడు. దేవదూతలు కాపరులకు కన్పించి క్రీస్తు జననాన్ని ఎరిగించారు - లూకా 1,9. అలాగే పుణ్య స్త్రీలకు సమాధి వద్ద కన్పించారు - మత్త 28, 7-5. పేత్రుకి కూడ చెరలో కన్పించారు - అచ 12,7. వీరిలో కొందరు ప్రకాశంతోను కొందరు తెల్లని వెలుగుగాను దర్శనమిచ్చారు. దర్శన గ్రంథంలో చాలమంది చాలసార్లు దర్శనమిచ్చారు.

## 3. దేవదూతల సేవలు

దేవదూతల ప్రధాన కార్యం దేవుణ్ణి స్తుతించి ఆరాధించడం. రఫాయేలు "నేను దేవుని దివ్యసన్నిధిలో నిల్చి అతనికి సేవలు చేసే ఏడ్గురు దేవదూతల్లో వొకణ్ణి" అని చెప్పాడు - తోబీతు 12,15. కీర్తన 103, 20-21

"బలాఢ్యులైన ప్రభువు దూతలారా!
అతని ఆజ్ఞ పాటించి అతనిమాట వినువారలారా!
మీరు అతనిని స్తుతింపుడు
ప్రభువు సైన్యములారా!
అతనికి పరిచారకులై అతని చిత్తమును పాటించు వారలారా!
మీరు అతనిని స్తుతింపుడు"

అంటుంది. ఈ వాక్యాలను బట్టి దేవుని చిత్తానికి లొంగి అతన్ని పూజిస్తుండడం దూతల ముఖ్యకార్యం అనుకోవాలి. ఇంకా వాళ్ళు దేవుని కొలువులో పాల్గొని అతనికి తమ అభిప్రాయాలను తెలియజేస్తుంటారు -1 రాజు 22, 19-22. మనం చేసే మంచి చెడ్డలను గ్రంథంలో వ్రాసి వుంచుకొని న్యాయనిర్ణయ దినాన దాన్ని విప్పుతారు - దానియేలు 7,10. వాళ్ళు దేవుని కోరికపై భూలోకంలోని నరులకు సహాయం చేస్తుంటారు. ఈ సహాయం రకరకాలుగా వుంటుంది. ఒక దేవదూత దేవుని సందేశాన్ని యాకోబుకు తెలియజేసి అతన్ని లాబాను ఇంటినుండి స్వీయ దేశానికి తిరిగి రమ్మని చెప్పాడు - ఆది 31, 11. హిజ్కియా రాజు కాలంలో సన్హెరీబు అనే అస్సిరియా రాజు పాలస్తీనా దేశం

మీదికి దండెత్తి వచ్చాడు. ప్రభువు దూత రాత్రిలో అతని సైన్యాన్ని చంపివేయగా ఆ రాజు భయపడి పారిపోయాడు - 2 రాజు 19-35. ఏలీయా ప్రవక్త నిరుత్సాహ భావాలతో అడవిలో చెట్టుక్రింద పండుకొని వుండగా దేవదూత అతన్ని తట్టిలేపి రొట్టెను భుజించమన్నాడు. ఆ భోజనం వలన ప్రవక్త బలం ఉత్సాహం తెచ్చుకొని హోరేబు కొండకు యాత్ర చేసాడు -1 రాజు 19,5-8. ఈలా దేవదూతల సేవలు నానా రకాలుగా వుంటాయి. కీర్తన 34,7 ప్రభువుకి భయపడేవారి చుట్టూ అతని దూత శిబిరము పన్నుతాడు. సకలాపదలనుండి వారిని కాపాడతాడు అని చెప్తుంది. ఇంకా కీర్తన 91, 11-12

ప్రభువు నిన్ను తన దూతల అధీనంలో వుంచుతాడు
నీవు ఎక్కడికి వెళ్ళినా వాళ్ళు నిన్ను కాపాడుతూంటారు
నీ కాళ్ళు రాతికి తగిలి నొవ్వకుండేలా
వాళ్ళు నిన్ను తమ చేతుల్లో ఎత్తిపట్టుకొంటారు

అని వాకొంటుంది. తోబీతు గ్రంథమంతా దేవదూత నరులను కాచికాపాడ్డాన్ని గూర్చే. రఫాయేలు తోబియాను చేప బారినుండి, అస్మోదియసు అనే పిశాచం బారినుండి కాపాడాడు. గబాయేలు నుండి అతని సొమ్ము తెచ్చియిచ్చాడు. సారాను అతనికి వివాహం చేయించాడు. ముసలి తోబీతుకు చూపు వచ్చేలా చేసాడు. ఈలా నరులకు సాయపడి ఉపకారాలు చేయడమే దూతల పని.

నూత్న వేదం సన్మనస్కుల సేవలను ఇంకా విస్తృతంగా పేర్కొంటుంది. హెబ్రేయుల జాబు "దూతలు దేవుణ్ణి సేవిస్తూ రక్షణను పొందబోయేవారికి సహాయం చేయడానికి దేవునిచే పంపబడిన ఆత్మలు" అని చెప్తుంది -1,14. అనగా దేవుణ్ణి సేవించడం, నరులకు సహాయం చేయడం దూతల ముఖ్య కార్యాలని భావం. నూత్న వేదంలో వాళ్ళు ప్రధానంగా క్రీస్తుకి పరిచర్యలు చేస్తూంటారు. అతని రాజ్యాన్ని వ్యాప్తిచేస్తూంటారు. ఒక దూత జకరియాకూ మరియకూ రాబోయే మెస్సీయాను గూర్చి తెలియజేసాడు. హెరోదు బాలయేసుని నాశం చేయబోతూంటే ఒకతని యోసేపుని హెచ్చరించాడు- మత్త 2, 13. మరో అతని క్రీస్తు జననాన్ని కాపరులకు ఎరిగించాడు - లూకా 2, 9-11. ఎడారిలో తపస్సుచేసి అలసిపోయిన క్రీస్తుకి కొందరు దూతలు పరిచర్యలు చేసారు. ఆలాగే ఒలీవల తోపులో ప్రభువు శ్రమలనుభవించినపుడు కూడ - లూకా 22,43. పుణ్య స్త్రీలు సమాధి దగ్గరికి వచ్చినపుడు దాని మీద బండను తొలగించినది దేవదూతే - మత్త 28,2. వారికి ప్రభువు ఉత్థానవార్త తెలిపింది కూడ అతడే - 28, 5-6. ప్రభువు మోక్షారోహణం చేసేపుడు గూడ దూతలు ప్రత్యక్షమౌతారు - అ.చ. 1,10.

ప్రభువు భక్తులైన చిన్నవారి దూతలు పరలోకంలో దేవుని ముఖాన్ని వీక్షిస్తూ ఆ చిన్నవారిని కాపాడుతుంటారు - మత్త 18,10. పేత్రుని చెరసాలనుండి వెలుపలికి తీసికొని వచ్చింది సన్మనస్కే - అ.చ. 12,11. దైవప్రజల ప్రార్థనలను దేవునికి అర్పించే దూత ఒకడున్నాడు - దర్శ 8,3. యెరూషలేములో యూద నాయకులు అపోస్తలులను చెరలో బంధింపగా సన్మనస్కు వారిని అద్భుతంగా విడిపించాడు- అ.చ. 5,19. ఒకతని ఫిలిప్పుచే ఇతియోపియా ఉద్యోగికి జ్ఞానస్నానం ఇప్పించాడు - అ.చ. 8,26. మరో అతని అన్యజాతివాడైన కొర్నేలికి పేత్రుతో పరిచయం కలిగించాడు -10,3. ఇంకో అతని తుఫానులో చిక్కుకొన్న పౌలుకి ధైర్యం చెప్పి దైవ సందేశాన్ని విన్పించాడు-27, 23-24.

దైవభక్తులను హింసించే హెరోదుని ఒక దూత హతమార్చాడు - అ.చ. 12,23. రెండవ రాకడలో దేవదూతలు కూడ ప్రభువుతో వేంచేస్తారు - మార్కు 8, 13. క్రీస్తు మహిమలో వారికీ భాగం లభిస్తుంది. లోకాంతంలో న్యాయతీర్పు జరిగేప్పుడు భక్తులను దేవుని యెదుట ప్రోగుజేసేది దూతలే - లూకా 9, 26. అప్పుడు దుష్టులను నీతిమంతుల నుండి వేరుచేసేది వాళ్ళే - మత్త 13, 49. పుణ్యాత్ములు దేవదూతలతో కలసి మోక్ష ప్రవేశం చేస్తారు - హెబ్రె 12,22. మనం దేవుణ్ణేకాని దేవదూతలను ఆరాధించకూడదు - కొలో 2, 18. దర్శ 19, 10. చివరి పుస్తకమైన దర్శనగ్రంథం చాల పర్యాయాలు దేవదూతలను పేర్కొంటుంది. వాళ్ళు దేవుని కార్యాలను నిర్వహిస్తూ దైవభక్తులకు సహాయం చేస్తుంటారు.

## 2. వేదశాస్త్రుల భావాలు

పైన పేర్కొన్న బైబులు భావాలను మనసులో పెట్టుకొని వేదశాస్త్రులు సన్మనస్కులను గూర్చి కొన్ని అంశాలు చెప్పారు. ఇక్కడ రెండింటిని మాత్రం పేర్కొందాం.

### 1. సన్మనస్కుల నైతిక వర్తనం

సన్మనస్కులు కేవలం ఆత్మ స్వరూపులు. మన శరీరాలు వాళ్ళకుండవు. అసలు మన భౌతిక పదార్థమేమీ వాళ్ళల్లో వుండదు. వాళ్ళు నరులకు కన్పించినపుడు శరీరధారుల్లాగ కన్పిస్తారు, అంతే.

దేవుడు మొదట సృజించిన సృష్టి ప్రాణులు దేవదూతలు. వారికి తెలివితేటలు, పరిపూర్ణ స్వేచ్ఛ వున్నాయి. కనుక వాళ్ళు పాపం చేయగలిగిన స్థితిలో వున్నారు. పాపం చేసారు కూడ. వాళ్ళ పాపమేమిటో ఎవరికీ రూఢిగా తెలియదు. చాలమంది వేదశాస్త్రుల అభిప్రాయం ప్రకారం వాళ్ళ పాపం గర్వం. దేవుడు వారిని నరుడై జన్మించే సుతుణ్ణి

ఆరాధించమన్నాడు. కొందరు దేవదూతలు తమకంటె తక్కువ స్థాయికి చెందిన నరుణ్ణి ఆరాధించడానికి నిరాకరించారు. దేవుడు వారిని శపించి నరకానికి నెట్టివేసాడు. వాళ్ళే పిశాచాలు. వారి నాయకుడు సైతాను. దేవుని ఆజ్ఞకు విధేయులైనవాళ్ళు స్వర్గంలోనే వుండిపోయారు. వాళ్ళే సన్మనస్కులు. ఇప్పుడు పిశాచాలు నిరంతరం దేవునికి వ్యతిరేకంగా పని చేస్తాయి. తమ స్థానాన్ని పొందే నరుల పట్ల ద్వేషం పెంచుకొని వారిని కూలద్రోయ జూస్తాయి. సన్మనస్కులు నరులకు సహాయం చేస్తుంటారు. కనుక వారికి దేవదూతలకూ నిరంతర వైరం వుంటుంది.

## 2. సన్మనస్కుల సేవలు

సన్మనస్కులు సృష్టిలోని భౌతిక పదార్థాలైన నేల, నిప్పు, వాయువు, జలం మొదలైన వాటిని కూడ కాపాడుతుంటారని కొందరు వేదశాస్త్రులు చెప్పారు. కాని వాళ్ళు ప్రధానంగా సంరక్షించేది నరుల్ని. నరులకు వాళ్ళు చేసే సేవలను వేదశాస్త్రులు పలు రకాలుగా పేర్కొన్నారు. ఈ క్రింద కొన్నిటిని ఉదాహరిస్తున్నాం.

1. యిస్రాయేలు సంరక్షకులు. దేవదూతల యిస్రాయేలు ప్రజలను ప్రత్యేకంగా కాపాడారు. ఎందుకంటే వాళ్ళు దేవుడు ఎన్నుకొన్న ప్రజలు కనుక. వారి దేవాలయాన్నీ నిబంధననీ జాగ్రత్తగా సంరక్షించారు. ఇంకా, ఆ ప్రజలకు ధర్మశాస్త్రాన్ని అందించింది గూడ దూతలే. గలతీయులు 3,19 ఈ విషయాన్ని ధ్రువపరుస్తుంది. స్తెఫను యూదులతో వాదిస్తూ "మీరు దేవదూతల ద్వారా అందింపబడిన దేవుని చట్టాన్ని పొందారు" అన్నాడు - అ.చ. 7,53.

2. అన్యజాతుల మతాల్లో. ఒక్క యూదుల జీవితంలోనేగాక అన్యజాతుల జీవితాల్లోను మతాల్లోను దేవదూతల ప్రమేయం వుంది. ద్వితీయోపదేశకాండ 32,8 ఈలా చెప్తుంది. మహోన్నతుడు వివిధ జాతులకు దేశాలిచ్చినపుడు, ఏ జాతులు ఎచట వసించాలో నిశ్చయించినపుడు, ఒక్కొక్క జాతికి ఒక్కొక్క దేవదూత నొసగాడు. దూతలు అన్యజాతి ప్రజల మనసులను దేవుని వైపు త్రిప్పుతూ వచ్చారు. వాళ్ళ మతాల్లోని సద్బోధలు వాళ్ళకు ప్రేరణం పుట్టించేలా చేసారు. వాళ్ళు అన్యజాతి జనుల్లో రోమనులకు న్యాయశాస్త్రాన్నిచ్చారు. గ్రీకులకు తత్వశాస్త్రాన్నిచ్చారు. హిందువులకు జ్ఞానసంపద నిచ్చారు. ఈ యన్యజనంలో సోక్రటీసు, ప్లేటో, యోబు, మెల్కీసెదెకు మొదలైనవాళ్ళు ముఖ్యులు. ఐనా ఈ యన్యప్రజలు విగ్రహారాధనంలో పడిపోయి నిజ దేవుణ్ణిపూజించలేదు. పిశాచం వారిని అపమార్గం పట్టించింది.

3. మనుష్యావతారంలో. మనుష్యావతారమంటే దేవుడు నరలోకంలోనికి దిగిరావడం. అలా నరుల్లోకి దిగివచ్చిన క్రీస్తుని చూచి దూతలు సంతోషించారు. ఆ దైవ

శిశువు చుట్టూ ప్రోగై "మహోన్నతంలో సర్వేశ్వరునికి మహిమ. భూలోకంలో ఆయన అనుగ్రహానికి నోచుకొన్నవారికి సమాధానం" అని పాడారు - లూకా 2,13-14. వాళ్ళు దేవుని నరావతార రహస్యాన్ని జకరియాకు, మరియా యోసేపులకు, పొలాల్లో గొర్రెలు కాచుకొనే కాపరులకు తెలియజేసారు. క్రీస్తు రాకముందు వాళ్ళు దేవునికీ నరులకూ నడుమ మధ్యవర్తులు. క్రీస్తు వచ్చాక అతడే ప్రధాన మధ్యవర్తి. కనుక క్రీస్తు జననం తర్వాత దూతలు మనకు సహాయకులుగా మాత్రమే మిగిలిపోయారు. వాళ్ళు పూర్వం తమంతట తాము ప్రజలను దేవుని దగ్గరికి రాబట్టలేకపోయారు. ఇప్పుడు క్రీస్తు సహాయంతో ఆ పని చేస్తారు. కనుక క్రీస్తు శిశువు చుట్టూ ఆనందంతో గుమిగూడారు.

4. క్రీస్తు ఉత్థాన మోక్షారోహణాల్లో. సన్మనస్కులు క్రీస్తు జనన కాలంలోను, ఉత్థాన కాలంలోను అతనితో ఎక్కువగా వుంటారు. ప్రభువు మోక్షారోహణమౌతుండగా దేవదూతలు మళ్ళీ ప్రత్యక్షమయ్యారు - అ.చ. 1,10. మనుష్యావతారంలో దేవుడు సన్మనస్కులకంటె తక్కువవా దయ్యాడు. కాని ఉత్థానానంతరం వారికంటె ఎక్కువ వాడయ్యాడు. సన్మనస్కులు మానుష దేహంతో స్వర్గాన్ని చేరుకొన్న క్రీస్తుని ఆరాధించాలి. అతని ద్వారా మన మానవత్వం సన్మనస్కుల స్వభావం కంటె ఉన్నతమైంది ఐంది. కనుక దూతలు ఉత్థాన క్రీస్తుని చూచి విస్తుపోయి అతనికి ప్రణమిల్లారు. పౌలు భక్తుడు చెప్పినట్లుగా, అతడు సన్మనస్కుల వర్గంలోని ప్రభువులకు, అధికారులకు, శక్తులకు నాథులకు అధికుడయ్యాడు - ఎఫే 1,21. కనుక సన్మనస్కులు అతన్ని ఆరాధించి స్తుతించారు.

5. సంస్కారాల్లో. సన్మనస్కులు మన కంటికి కన్పించకుండానే మన ఆరాధనలో పాల్గొంటారు. మన వేదపఠనాలు, ప్రసంగాలు వాళ్ళూ వింటూంటారు. మనలను జ్ఞాన స్నాన స్వీకరణకు సిద్ధం జేస్తారు. ఈ సంస్కారం ద్వారా మనం దైవ ప్రజలమైనందుకు సంతోషిస్తారు. దివ్యసత్ప్రసాద బలిలో కూడ వాళ్ళు ప్రత్యక్షమై వుంటారు. పరలోకంలో నిరంతరం దైవారాధనం జరుగుతూంటుంది. దూతలు స్వర్గంలో ఎల్లవేళల దేవుణ్ణిస్తుతించి కీర్తిస్తుంటారు. దీని ప్రతిబింబమే భూలోకంలో మనం సమర్పించే దివ్యసత్ప్రసాద బలి. కనుక మన పూజలో దూతలు కూడ పాల్గొని దివ్యసత్ప్రసాద ప్రభువుని ఆరాధిస్తారు - హెబ్రే 12, 22-24. ఆరాధనలో దేవదూతలు గూడ పాల్గొంటారు గనుక స్త్రీలు మర్యాదగా తలమీద ముసుగు వేసికోవాలని పౌలు కొరింతు క్రైస్తవులను ఆజ్ఞాపించాడు - 1కొ 11,10.

6. ఆధ్యాత్మిక జీవితంలో. సన్మనస్కులు మన ఆధ్యాత్మిక జీవితంలో తోడ్పడతారు. ఇది మూడు విధాలుగా. మొదటిది, అపవిత్రమైన ప్రాణియేది భగవంతుణ్ణి సమీపించలేదు. కనుక వాళ్ళు మన ఆత్మలను శుద్ధిచేస్తారు. పూర్వం దేవదూత యెషయా ప్రవక్త పెదవులను శుద్ధిచేసాడని చదువుతున్నాం - యెష 6,7. అలాగే ఇప్పుడు మన ఆత్మలను నిర్మలం చేస్తారు.

రెండవది, దేవుడు వెలుగు. సన్మనస్కులు కూడ వెలుగే. వీళ్ళు మనకు వెలుగును ప్రసాదిస్తారు. దీనివలన మనం వేదసత్యాలను అర్థం జేసికొని దేవుణ్ణి ప్రేమిస్తాం. మూడవది, దేవదూతల సాహచర్యంవల్ల మనం కూడ వాళ్ళలాంటి వాళ్ళమౌతాం. వాళ్ళలాగే మనం కూడ దేవునితో ఐక్యమౌతాం. మనం ఆధ్యాత్మిక జీవితంలో ముందడుగు వేస్తూంటే దూతలు సంతోషిస్తారు.

7. మరణ కాలంలో. మన జీవితకాలమంతా మనతో వుండి, మనకు సహాయం చేసిన దూతలు మరణ కాలంలో మనలను విడనాడరు. ఆ చివరి గడియలు అతి ముఖ్యమైనవి కదా! కనుక మన అవసాన దశలో వాళ్ళు మనలను ఓదారుస్తారు. పిశాచ శోధనల నుండి మనలను కాపాడతారు. మనం క్రీస్తు పట్ల విశ్వాసాన్ని విడనాడకుండేలా జాగ్రత్త పడతారు. కడన మన ఆత్మను దేవుని సన్నిధిలోకి చేరుస్తారు. చనిపోయిన లాజరుని అబ్రాహాము ఒడిలోకి చేర్చింది దేవదూతలే గదా ?- లూకా16,22. యూదుల భాషలో అబ్రాహాము ఒడి అంటే మోక్షమే.

8. ఉత్థాన కాలంలో. మనం చనిపోయాక చాలయేండ్లకు ఉత్థానం వస్తుంది. అంతకాలం దూతలు మన దేహాలను కాపాడుతూ మన ఉత్థానం కొరకు వేచిఉంటారు. ఆ దినం వచ్చినపుడు మనలను దేహాత్మలతో దేవుని చెంతకు కొనిపోతారు. దూతలు బూరల నూది దేవుడు ఎన్నుకొన్నవారిని అతని సమక్షంలోకి కొనిపోతారు - మత్త 24,31. ఆ పిమ్మట సాధారణ తీర్పు జరుగుతుంది. దూతలు మనలను ఆ తీర్పుకి సిద్ధం జేస్తారు. తీర్పు జరిగేపుడు మన ప్రక్కన ఉండి మనలను ఆదుకొంటారు - మత్త 25, 31-32. కట్టకడన మనలను మోక్షంలో చేరుస్తారు. ఈలా మనం పుట్టినప్పటినుండి మోక్షంలో అడుగు పెట్టిందాకా మనకు సకలోపచారాలు చేస్తారు.

## 3. దూతల గణాలు

దేవదూతలు ఎంతమంది ఉంటారు? ఎవరికీ స్పష్టంగా తెలియదు. పది లక్షల దాకా ఉంటారని కొందరు వేదశాస్త్రులు వాకొన్నారు. ఈ దూతల్లో ఏడ్గురుని అతిదూతలుగా భావించి గౌరవిస్తూ వచ్చారు. తోబీతు గ్రంథం 12, 15 దీనికి ఆధారం. కాని ఈ యేడ్గురిలో మనకు ముగ్గురిపేర్లు మాత్రమే తెలుసు. వాళ్ళు గబ్రియేలు, మికాయేలు, రఫాయేలు. గబ్రియేలు జకరియాకు మరియకు క్రీస్తు జనన సమాచారం తెలిపినవాడు. దేవుని వీరుడు అని ఈ పేరుకి అర్థం. మికాయేలు సైతానుతో పోరాడి అతన్ని ఓడించినవాడు. దేవుని వంటివాడు ఎవడు అని ఆ పేరుకి అర్థం. రఫాయేలు తోబియాకు ప్రయాణ స్నేహితుడు. చికిత్స చేసేవాడని ఆ పేరుకి అర్థం. కాని తోబీతు గ్రంథం చారిత్రకమైంది కాదు. నీతిబోధకమైన కల్పిత కథ మాత్రమే.

ఆరవ శతాబ్దంలో స్యూడో డయనీష్యస్ అనే రచయిత దూతలను 9 గణాలుగా విభజించాడు. ఆ గణాలను మళ్ళీ మూడేసి బృందాలతో గూడిన మూడు వర్గాలుగా విభజించాడు. ఆ వైనం ఇది:

1. సెరాపులు - కెరూబులు - సింహాసనాలు
2. అధికారులు - నాథులు - శక్తులు
3. పరిపాలకులు - అతిదూతలు - దూతలు

ఈ గణ విభజనం ప్రాచీన క్రైస్తవ లోకంలో బాగా ప్రచారంలోకి వచ్చింది. కాని దీనికి బైబుల్లో ఆధారంలేదు. కనుక ఆధునికులు ఈ విభజనను పట్టించుకోరు.

సెరాపులు యెషయా దర్శనంలో చూచిన దేవదూతలు - యెష 6,2. ఒక్కొక్కరికి ఆరేసి రెక్కలు. వీళ్ళు దైవ ప్రేమతో మండిపోతుంటారు కనుక భక్తి జ్వాలకులు. కెరూబులు ఏదెనులోని జీవ వృక్షాన్ని కాపాడేవాళ్ళు - అది 3, 24. దేవుని సింహాసనాన్ని మోసేదికూడ వీళ్లే - కీర్త 80, 2.

## 4. కావలి సన్మస్కులు

యాకోబు యోసేపు కుమారుల తలమీద చేతులు పెట్టి "ఎల్ల కీడుల నుండి నన్ను తప్పించిన దేవదూత ఈ బాలురను ఆశీర్వదించును గాక" అంటాడు - ఆది 48, 16. దీన్నిబట్టి యాకోబుని ఒక ప్రత్యేక దేవదూత కాపాడినట్లుగా అర్థం జేసికోవాలి. క్రీస్తు "ఈ చిన్నవారి దూతలు పరలోకంలో నా తండ్రి ముఖాన్ని దర్శిస్తుంటారు" అన్నాడు - మత్త 18,10. దీన్నిబట్టి చిన్నవారికి ప్రత్యేక దూతలు ఉన్నారనుకోవాలి. చెరనుండి బయటికి వచ్చిన పేత్రుని చూచి ప్రజలు ఇతడు పేత్రు దూత అనుకొన్నారు - అ.చ. 12,15. అనగా పేత్రుకి ఒక ప్రత్యేక దూత ఉన్నాడని భావం. ఈ ప్రత్యేక దూతలే కావలి సన్మనస్కులు.ప్రాచీన క్రైస్తవులు ఈ సన్మనస్కులను ఎక్కువగా నమ్మి వారి పట్ల భక్తివిశ్వాసాలు చూపారు. వారికి కాపలా కాసేవాళ్ళు, మార్గదర్శకులు, సంరక్షకులు, సహాయకులు, కాపరులు, నావికులు, సేనాపతులు అని పెక్కు పేర్లు పెట్టారు. ఈ పేర్లను బట్టే కావలి సన్మనస్కులు మనకు చేసే సహాయమేమిటో అర్థం జేసికోవచ్చు. వాళ్ళ సేవలు మూడు రకాలుగా ఉంటాయి.

1. దూతలు మనలను అపాయాల నుండి కాపాడుతుంటారు. వీళ్ళు మన ప్రయాణాల్లో మనలను కాపాడుతారు. రఫాయేలు తోబీయాను ఈలా కాపాడాడు. కీర్తన 91, 11-12

ప్రభువు నిన్ను తన దూతల అధీనంలో వుంచుతాడు
నీవు ఎక్కడికి వెళ్ళినా వాళ్ళు నిన్ను కాపాడుతుంటారు
నీ కాళ్ళు రాతికి తగిలి నొవ్వకుండేలా
వాళ్ళు నిన్ను తమ చేతుల్లో ఎత్తిపట్టుకొంటారు

అని చెప్తుంది. నిర్గమనకాలంలో దూత యిస్రాయేలును నడిపించాడు - నిర్గ 20, 20-22. దూతలు మనలను పిశాచం నుండి కాపాడతారు. దయ్యానికీ మనకూ నిరంతరం యుద్ధం జరుగుతూంటుంది. ఈ పోరులో దూతలు మన పక్షాన నిలుస్తారు. మన కష్టాల్లో వాళ్ళు మనకు ఓదార్పు, శాంతి, ఆనందం దయచేస్తారు.

2. మనం పాపంలో పడిపోయినపుడు దూతలు మనకు పశ్చాత్తాపం, పరివర్తనం కలిగిస్తారు. మనలను చక్కదిద్దుతారు. పాపం వలన గాయపడిన మన ఆత్మకు చికిత్స చేస్తారు.

3. మన ప్రార్థనలను దేవునికి అర్పిస్తారు. రఫాయేలు తోబీతు సారాల ప్రార్థనలను దేవునికి అర్పించాడు - తోబీ 12, 12. ఒక దేవదూత దైవప్రజల ప్రార్థనలను ధూపకలశంలో బెట్టి దేవునికి అర్పించాడు - దర్శ 8,3. పిశాచం, కావలి సన్మనస్కు ఎప్పుడూ మన చుట్టూ ఉంటారు. పిశాచం మనకు చెడ్డ ఆలోచనలు, ప్రేరణలు పుట్టిస్తుంది. సన్మనస్కు మంచి ఆలోచనలు ప్రబోధాలు కలిగిస్తాడు. మనకు ఒకరిద్దరు మంచి స్నేహితులు ఉండవచ్చు. కాని వారి కంటె మంచి స్నేహితుడు కావలి సన్మనస్కు. అతన్ని గుర్తించకపోతే, అతని సహాయాన్ని పొందకపోతే, నష్టపోయేది మనమే. పునీత ఫ్రాన్సెస్ అనే భక్తురాలు తన కావలి సన్మనస్కును కంటితో చూచేది.

## 5. చిత్రాల్లో, బొమ్మల్లో సన్మనస్కులు

ప్రాచీన చిత్రకారులు నానా సందేశాలతో దూతల బొమ్మలు గీసారు. శిల్పులు నానా భావాలతో దూతల శిల్పాలు చెక్కారు. వీటిని వీక్షించడం వల్ల సామాన్య ప్రజలకు దూతల పట్ల నమ్మకమూ భక్తీ పెరిగాయి.

సన్మనస్కులకు లింగం లేకపోయినా వారిని పురుషులనుగానే మలిచారు. వాళ్ళు యౌవనంలో బలంగా వున్నట్లుగా కన్పిస్తారు. బాల దేవదూతలుకూడ ఉన్నారు. వీళ్ళు బాల యేసునీ పిల్లలనూ సంరక్షిస్తున్నట్లుగా కన్పిస్తారు.

ఈ దూతలకు తెల్లని అంగీలు ఉంటాయి. వారి ముఖం నుండి కాంతి వెలువడుతూంటుంది. కొన్నిసార్లు వీళ్ళు సైనికుల్లాగ ఆయుధాలు ధరించి వున్నట్లుగా కన్పిస్తారు. వీళ్ళు రారాజు సేవలో, పిశాచంతో పోరాడే యోధులు.

మామూలుగా సన్మనస్కులకు రెక్కలుంటాయి. సెరాపుకి ఆరూ, కెరూబుకి నాల్గూ, దూతలకు రెండూ రెక్కలుంటాయి. దేవుడు పంపగా నరుల దగ్గరికి శీఘ్రంగా వచ్చే వార్తావహులని ఈ రెక్కల భావం.

కొందరు దూతలను క్రీస్తుకీ, మరియకూ దైవ సందేశం తీసికొని వస్తున్నట్లుగా చిత్రించారు. కొందరిని వేదసాక్షులకు కిరీటాలు, ఖర్జూరపు మట్టలు అందిస్తున్నట్లుగా చిత్రించారు. ఆ భక్తులు అనుభవించిన శ్రమలకు ఇవి బహుమతులు. సువిశేష రచయితలకూ, పునీతులకూ దివ్య ప్రేరణలు కలిగిస్తున్నట్లుగా చిత్రించారు. దైవార్చనలో దేవుణ్ణీ, దివ్యసత్ప్రసాదాన్నీ ఆరాధిస్తున్నట్లుగా గీసారు.

దేవదూతల్లో కెల్లా మికాయేలు సుప్రసిద్ధుడు. ఇతడు పిశాచంతోను సర్పంతోను పోరాడి ఆ దుష్ట శక్తులను జయిస్తున్నట్లుగా బొమ్మలు మలిచారు. ఇతన్ని భూలోకంలో నరుల పాపపుణ్యాలను తమ గ్రంథంలో లిఖిస్తున్నట్లుగా, పరలోకంలో చనిపోయినవారి మంచి చెడ్డలను తక్కెడలో పెట్టి తూస్తున్నట్లుగా మలిచారు. ప్రాచీన దేవాలయాల్లో కన్పించే ఈ బొమ్మలు, చిత్రాలు భక్తులకు తప్పకుండా ప్రేరణం పుట్టిస్తాయి.

## 6. ఆధునికుల అవిశ్వాసం

ప్రస్తుత క్రైస్తవులు కొంతమంది దేవదూతలను నమ్మరు. దూతలు కేవలం బైబులు రచయితలూ కళాకారులూ సృజించిన కల్పనలు, కట్టు కథలు, ఊహలు అని చెప్తారు. ప్రాచీన నరుల కోరికలూ, భయాలూ దేవదూతలనూ దయ్యాలనూ సృజించాయని వాదిస్తారు. భూకంపాలు, వరదలు మొదలైన వినాశాలు ప్రకృతి నియమాల వల్లనే కలుగుతాయి, దేవదూతలు వీనిని కలిగించరు అంటారు.

సన్మనస్కులు ఆత్మ స్వరూపులు. మన కంటికి కన్పించేవాళ్ళు కాదు. కనుక వాళ్ళు నిజంగా వున్నారని మనం ప్రత్యక్షంగా నిరూపించలేం. ఐనా దేవదూతలు ఉన్నారని బైబులు మొదటి నుండి చివరిదాకా చెప్తుంది. బైబులు రచయితలను కొంతవరకు ప్రభావితం చేసిన కనానీయులు, ఈజిప్టు ప్రజలు, పారశీకులుకూడ దేవదూతలను నమ్మారు. తిరుసభ దేవదూతలను నమ్మాలని అధికార పూర్వకంగా బోధించింది. మన హృదయంలోని విశ్వాసం కూడ దేవదూతలున్నారనీ, వాళ్ళు మనలను ప్రేరేపిస్తుంటారనీ హెచ్చరిస్తుంటుంది. చాల పర్యాయాలూ వాళ్ళనుండి సహాయం పొందామనే మన అనుభవం. ఇన్ని కారణాల వల్ల దేవదూతలు నిజంగా ఉన్నారని అంగీకరించాలి.

## 7. సన్మనస్కుల పట్ల భక్తి

దేవదూతల్లాగ మనకు ఉపకారం చేసేవాళ్ళెవరూలేరు. కనుక మనకు వాళ్ళపట్ల గౌరవం, భక్తి, నమ్మకం, కృతజ్ఞతాభావం వుండాలి. 1. నిరంతరం మనతో మెలిగే దూతల పట్ల మనకు గౌరవం వుండాలి. వాళ్ళు సర్వేశ్వరుని దర్బారులో యువరాజుల్లాగ సంచరిస్తుంటారు. దేవుని నుండి మన దగ్గరికి రాయబారులుగా వస్తారు. అన్ని విధాల నరమాత్రులమైన మనకంటె

గొప్పవాళ్ళు. మనలను నిరంతరం దేవుని దగ్గరికి రాబడతారు. అలాంటి వాళ్ళపట్ల మనం గౌరవం చూపించవద్దా? పునీత జాన్ బర్కుమాన్సు గారు తన గదిముందు నిల్చుండి తనకంటె ముందుగా తన కావలిసన్మనస్కు గదిలోకి ప్రవేశించాలని బ్రతిమాలుకొనేవాడు. పునీత ఇగ్నేష్యసుగారు త్రోవలో తన కెదురుపడిన వారి సన్మనస్కులకు నమస్కరించేవాడు. పునీత బెర్నార్డుగారు చెప్పినట్లు, అన్ని తావుల్లో అన్ని వేళలా మనం సన్మనస్కులను గౌరవించాలి. మన పనులన్నిటికి వాళ్ళు సాక్షులుగా వుంటారు. మనమున్న చోట్లల్లా వాళ్ళు వుంటారు. కనుక మనం ప్రజల సమక్షంలో ఏ పనులు చేయడానికి జంకుతామో ఆ పనులను దూతల సమక్షంలో గూడ చేయకూడదు. వారిపట్లగల గౌరవంచే విశుద్ధంగా జీవించాలి.

2. దూతలు నిరంతరం దేవుని సన్నిధిలో వుండి అతన్ని పూజించేవాళ్ళు. పరమ పవిత్రులు. మనలను పట్టించుకొని ఎల్లవేళల ప్రేమభావంతో మనకు సేవలు చేస్తుంటారు. మనమంటే వాళ్ళకు పరమప్రీతి. అలాంటి వాళ్ళపట్ల మనకు భక్తి వుండాలి. చిన్నతెరేసమ్మ తన ఆత్మకథలో "నేను బలహీనపు బాలికనని యెరిగి బలవంతుడవైన నీవు నన్ను ముందుకు నడిపించుకొని పోతున్నావు" అని వ్రాసికొంది. పునీత ఫ్రాన్సిస్ జేవియర్‌గారు తనకు మిక్కిలి ఇష్టులైన హిందూ జపాను దేశాల కావలి సన్మనస్కులకు ప్రతిరోజు చేయెత్తి నమస్కారం చేసేవాడు. పీటర్ ఫేబర్ అనే యేసుసభ గురువు ఆయా నగరాలకు వేదబోధ చేయడానికి పోయినపుడు ఆ పట్టణాల పొలిమేరల్లో ఆగి అచటి ప్రజల కావలి సన్మనస్కులకు ప్రార్థన చేసేవాడు. ఆ ప్రజలు తన బోధలను ఆలించేలా వారి హృదయాలను సిద్ధంచేయమని వేడుకొనేవాడు. పునీత బెర్నార్డుగారు "నీ సన్మనస్కుని నీ స్నేహితుని జేసికో. నీ యక్కరలు బాధలు ఎంత గొప్పవైనా అతని సహాయంతో నీవు గట్టెక్కుతావు" అని వ్రాసారు. కనుక మన కావలి సన్మనస్కుని భక్తితో స్మరించుకోవాలి. అన్నా! నీవు నాకు సహాయం చేయి అని ఎల్లవేళలా అతన్ని అడుగుకోవాలి.

3. మన సన్మనస్కు ఇన్నిసార్లు ఇన్నివిధాల మనకు సహాయం చేస్తూ వచ్చాడు. కనుక మనం అతన్ని నమ్మాలి. ఇతరులు మనలను నమ్మి మనపై ఆధారపడితే మనం సంతోషిస్తాంగాదా? దేవదూతకూడ అంతే. అతనికి మనకు సహాయం చేసే శక్తి వుంది, కోరికా వుంది. అతడు మనలను ఏనాడు అపమార్గం పట్టించడు. ఎల్లపుడూ దేవుని దగ్గరికే నడిపించుకొని పోతూంటాడు. కనుక అతనిపట్ల మనకు పూర్ణ విశ్వాసముండాలి. మనలను మనం అతని కాపుదలకు అర్పించుకోవాలి. అతని అండదండల్లో వుండడం, అతని సలహాలు విని అతనిచే నడిపింపబడ్డం మహా భాగ్యం అనుకోవాలి.

4. ప్రతివొక్కరికీ ఒక కావలి సన్మనస్కు ఉంటాడు. విశేషంగా జ్ఞానస్నానం పొందిన వాళ్ళను అతడు జాగ్రత్తగా కాచికాపడుతూంటాడు. మనం పుట్టినప్పటినుండి

చనిపోయి మోక్షాన్ని చేరేవరకూ అతడు మనకు సేవలు చేస్తూనే వుంటాడు. ఈలాంటి మహోపకారిపట్ల మనం కృతజ్ఞులమై వుండాలి. రోజుపొడుగున చాలసార్లు మన కావలి సన్మనస్కుని ప్రేమభావంతో గుర్తుకి తెచ్చుకోవాలి. వినయంతో అతనికి నమస్కారం చేయాలి. అక్టోబరు రెండు అతని పండుగ. ఆ రోజున, ఆ నెలో అతని పట్ల విశేష భక్తిని చూపాలి. అవకాశం కలిగినప్పుడు తోడి వారినిగూడ కావలి సన్మనస్కుపట్ల భక్తిని పెంపొందించు కొందని హెచ్చరించాలి. బైబుల్లో సన్మనస్కులను గూర్చిన వాక్యాలనూ, ఘట్టాలనూ జాగ్రత్తగా చదువుకొని మననం జేసికోవాలి. మన సన్మనస్కు మనకు కలిగించే ప్రబోధాలనూ, ప్రేరణలనూ జాగ్రత్తగా గమనిస్తూండాలి. అతని హెచ్చరికను పెడచెవిని పెట్టినపుడు శీఘ్రమే అతనికి క్షమాపణం చెప్పుకోవాలి. అతని పేరు మీదిగా, అతనికి సంతోషం కలిగేలా పలుసార్లు ఏవైనా చిన్న పుణ్యకార్యాలు చేస్తుండాలి. సంగ్రహంగా చెప్పాలంటే, మన జీవితంలో "కావలి సన్మనస్కుల సంస్కృతిని" అలవర్చుకోవాలి.

## కావలి సన్మనస్కునికి ప్రార్థనం

పవిత్రుడవైన కావలి సన్మనస్కూ! నీవు నాకు ఉత్తమ స్నేహితుడివి, మంచి మార్గదర్శివి. నేను పుట్టినప్పటినుండి ఇప్పటివరకు నీవు నాకు చేసిన నానా ఉపకారాలకు నీకు హృదయపూర్వకంగా వందనాలు చెప్తున్నాను. రేయింబవళ్ళు నీవు నాకు కాపలా కాస్తున్నావు. అనేక అపాయాలనుండి నన్ను కాపాడావు. ఎల్లవేళల నన్ను సంరక్షిస్తూ వచ్చావు. అనేక పర్యాయాలు చెడ్డనుగూర్చి నన్ను హెచ్చరించావు. పాపం నుండి నన్ను కాపాడావు. నేను దేవునికి ద్రోహంగా పాపం చేసినపుడు నా అంతరాత్మను ప్రబోధించి నాకు పశ్చాత్తాపం పుట్టించావు. నేను పాపంలో చనిపోయి నరకంలోనికి పోలేదంటే దేవుని తర్వాత నీవే ముఖ్యకారణం.

మిక్కిలి ప్రియుడవైన కావలి సన్మనస్కూ ! నేను నీ దయకు, మంచితనానికీ ఏలా కృతజ్ఞత తెల్పుకోగలను? నాకున్నవి దేహాత్మలు రెండే. ఈ రెండిటినీ నీ అధీనంలో వుంచుతున్నాను. నేను నిరంతరం నీ సన్నిధిలో మెలుగుతూ నీ ప్రేరణలకు లొంగుతానని మాటయిస్తున్నాను. ఓ పవిత్ర సన్మనస్కూ! నీ తరపున నీవు సకలాపదలనుండి నన్ను కాపాడుతూండు. నేను విచారంగా వున్నపుడు నాకు ఆనందాన్ని దయచేయి. హింసలకు చిక్కినపుడు నన్ను సంరక్షించు. అపాయాల్లో నన్ను కాపాడు. నా అక్కరల్లో నాకు సహాయం చేయి. నేను అజ్ఞానినిగా వున్నపుడు నాకు బోధచేయి. సందేహాల్లో నాకు సలహానివ్వు. రోజువారి పనుల్లో నాకు సూచనలివ్వు. విశేషంగా పిశాచతంత్రాలనుండి నన్ను కాపాడు. నీ సహాయం వలన నేను అన్ని పనులు దేవుని కీర్తికొరకే చేసి కడన మోక్షభాగ్యాన్ని పొందుదునుగాక. ఆమెన్.

# 13. బైబులు వాక్యామృతం

## మనవి మాట

ఈ పొత్తంలో బైబుల్లోని అతి ప్రశస్తమైన వాక్యాలను కొన్నిటిని ఎంపికచేసి ముద్రించాం. ఈ వాక్యాలను 18 అధ్యాయాలుగా విభజించి ప్రతి అధ్యాయానికి పరిచయ వాక్యాలు వ్రాసాం. మొత్తం మీద ఇది శ్రేష్ఠమైన బైబులు వాక్యాల సంకలనం. ఇందులో అధిక భాగాన్ని పూర్వవేదం నుండి, విశేషంగా కీర్తనల గ్రంథం నుండి గ్రహించాం.

మన క్యాతలిక్ క్రైస్తవులకు బైబులుతో అట్టే పరిచయముండదు. కనీసం ఆ గ్రంథంలోని ముఖ్యమయిన, భక్తిమంతమయిన, వాక్యాలు కొన్నయినా మన ప్రజలకు బాగా తెలిసి వుండాలి. ఆ ఉద్దేశంతోనే ఈ సంకలనాన్ని తయారుచేసాం. ఇది నాల్గవ ముద్రణం.

## విషయ సూచిక

# 1. భగవంతుని మీద కోర్కె

భక్తునికి భగవంతుణ్ణి దర్శించాలనే కోర్కె గాఢంగా వుంటుంది. అతడు కలకాలమూ ప్రభు మందిరంలోనే నివసించ గోరుతాడు. ప్రభుని ప్రసన్నుణ్ణి చేసుకోవాలనీ, ఆయనను సంప్రతించి చూడాలనీ ఉవ్విళ్ళూరిపోతాడు. ఓమారు అతడు ప్రభువు మందిరము ప్రవేశించి అటూ యిటూ పరిశీలించి చూచాడు. పిచ్చుకలూ వానకోవిలలూ దేవాలయంలో గూళ్ళు పెట్టుకొని వున్నాయి. దేవుని పీఠం దగ్గరే పిల్లలను చేసాయి. ఆ పక్షుల్లాగ నిత్యమూ ప్రభుమందిరంలో వసించేవాళ్ళు ఎంతటి ధన్యులో గదా అనుకొన్నాడు ఆ భక్తుడు. పాపుల యిండ్లల్లో వేయి దినాలు నివసించిందానికంటె ప్రభుమందిరంలో ఒక్కరోజు గడిపింది మేలుగదా అనుకొన్నాడు.

దప్పికగొనిన దుప్పి సెలయేటి నీళ్ళకుమల్లె భక్తుని హృదయం భగవంతుని కొరకు తహతహలాడుతుంది. ఎప్పుడెప్పుడు ప్రభు ముఖపద్మాన్ని దర్శిస్తానా అని అతడు ఆతురపడతాడు. ఎండి బీటలువారిన నేల వానకొరకుమల్లె అతని హృదయం కూడ దేవునికొరకు తపించిపోతుంది. కావలివాళ్ళు వేకువజాముకొరకు లాగే అతడూ ప్రభువుకొరకు కనిపెట్టుకొని కూర్చుంటాడు. ఆ ప్రభుని దర్శిస్తేనేగాని, అతని అనుగ్రహాన్ని సంపాదిస్తేనేగాని, అతని కోర్కెలు తీరవు. ఈలా భగవంతుని కొరకు ఉవ్విళ్ళూరే నరుడు ఎంతటి పుణ్యాత్ముడో గదా!

1. నేను కలకాలం ప్రభుమందిరములోనే వసిస్తాను - కీర్త 23,6
2. ప్రభుని ఒక్క వరం కోరుకున్నాను
   నాకు కావలసింది ఇదొక్కటే -
   నా జీవితకాలమంతా ప్రభు మందిరంలో వసించాలనీ
   అతని దయను అనుభవానికి తెచ్చుకోవాలనీ
   దేవళంలో అతణ్ణి సలహా అడుగుకోవాలనీ నా కోరిక - 27,4
3. సైన్యాల కధిపతివైన ప్రభూ!
   నీ మందిరం ఎంత సుందరంగా వుంటుంది!
   ప్రభు మందిరానికి వెళ్ళాలని నా హృదయం ఆరాటపడుతూంది
   నిండుహృదయంతో, పూర్ణానందంతో
   నేనా ప్రభుని యెలుగెత్తి పాడతాను - 84, 1-2
4. రాజువూ దేవుడవూ ఐనా ప్రభూ!
   నీ మందిరంలో పిచ్చుక గూడు కట్టుకొంది

వానకోయిలగూడ గూడుపెట్టింది
అవి నీ పీఠాల దగ్గరే పిల్లలను చేసాయి
నీ దేవాలయంలో వసిస్తూ నిన్ను కీర్తిస్తూండేవాళ్ళు
ఎంతటి ధన్యులో కదా! - 84, 3-4

5. ప్రభూ! అన్యుల యిండ్లల్లో వేయిదినాలు గడిపిందానికంటె
నీ మందిరంలో ఒక్కరోజు గడిపింది మేలు
దుష్టుల యిండ్లల్లో వసించే దానికంటె
నీ మందిర ద్వారంవద్ద పడివుండడం మేలు - 84,10

6. ప్రభూ! దప్పిగొనిన దుప్పి
సెలయేటి నీళ్ళకుమల్లె
నా హృదయమూ నీ కోసం తహతహలాడుతుంది
సజీవుడైన దేవునికోసం నా హృదయం తపించిపోతుంది
నే నెప్పుడెప్పుడు ప్రభువు ముఖారవిందాన్ని దర్శిస్తానా అని
ఉవ్విళ్ళూరి పోతున్నాను - 42,1-2

7. దేవా! నీవు నాకు దేవుడవు
నేను నీ కొరకు ఉబలాటం చెందుతున్నాను
నీ కొరకు ఆశగొని యున్నాను
నీళ్ళులేక యెండి మాడియున్న నేలవలె
నా యాత్మ నీ కొరకు దప్పిక గొంటూంది - 63,1

8. ప్రభో! చేతులెత్తి నీకు ప్రార్థన చేస్తున్నాను
ఎండిన నేలలాగ నా హృదయం నీకోసం తపించిపోతూంది - 143,6

9. నేను ప్రభువుకోసం వేచివున్నాను
ఆయన మాట నేను నమ్మాను
కావలివాళ్ళు వేకువజాము కొరకులాగే
నా హృదయంకూడ ప్రభువుకొరకు కనిపెట్టుకొనివుంది - 130, 5-6

10. నేను పడక మీద మేను వాల్చి నిన్ను స్మరించుకొంటూంటాను
రాత్రంతా నిన్ను గూర్చి తలంచుకొంటూంటాను
ఎప్పుడూ నీవే నన్ను ఆదుకొంటూంటావు
నీ రెక్కల మరుగున నేను సంతోషంతో పాడతాను
నేను నీకు అంటిపెట్టుకొని వుంటాను
నీవు నన్ను సురక్షితంగా వుంచుతావు - 63, 6-8

11. నేను దేవుని సన్నిధిలో నడుస్తూంటాను
జీవవంతుల లోకంలో తిరుగాడుతూంటాను - 116,8
12. నేను నిత్యం ప్రభుసాన్నిధ్యం కలిగించుకొంటూంటాను
అతడు నా చెంతనే వుంటాడు గనుక నా కేభయమూ లేదు - 16,8
13. నీవు జీవపు చెలమవు
నీ వెలుగులవలననే మేమూ వెలుగు చూస్తాం - 36,9
14. మోక్షంలో మాత్రం నీవుదప్ప ఇంకెవరున్నారు?
ఈ లోకంలో నీవుదప్ప మరొకటి నాకు రుచించదు - 73,25
15. నన్ను నీ సన్నిధికి రమ్మని పిల్చావు
ఇదిగో నేను నీ యెదుటికి వచ్చాను
నీ దివ్యముఖాన్ని నాకు మరుగుజేయకు - 27,8
16. ప్రభు వెవరికి దేవుడో ఆ ప్రజలు ధన్యులు కదా ! 144,15
17. ప్రభువే నాకు వారసభూమి, నాకు పానపాత్రం
నా ప్రాణం అతని యధీనంలో వుంది - 16,5
18. దప్పిక గొనినవాళ్ళకు స్వచ్ఛమైన నీళ్ళు ఆనందాన్నిస్తాయి.
అలాగే ప్రభువు రక్షణాన్ని పొందినవాళ్ళకు ప్రమోదం కలుగుతుంది - యెష 12,3
19. రానున్న దినాల్లో ప్రభువు మందిరమున్న పర్వతం
శైలాలన్నిటిలోను ఉన్నతమైన దౌతుంది
కొండలన్నిటిలోను ఎత్తయిన దౌతుంది
సకలజాతి జనులు దాని చెంతకు వస్తారు
ఆ ప్రజలు ఈలా పలుకుతారు
మనం ప్రభువు పర్వతానికి వెళ్దాం
యాకోబు దేవుని దేవళానికి పోదాం
అతడు తన మార్గాలను మనకు బోధిస్తాడు
మన మతని త్రోవల్లో నడుద్దాం
ధర్మశాస్త్రం సియోనునుండి వస్తుంది
ప్రభువువాక్కు యెరూషలేంనుండి బయలుదేరుతుంది - యెష 2, 2-4
20. నీనుండి దూరంగా వై దొలగేవాళ్ళు చస్తారు
నిన్ను త్యజించేవాళ్ళను నీవు నాశం చేస్తావు
దేవుని చెంత నుండడమే నాకు క్షేమకరం
నేను ప్రభువైన దేవుని ఆశ్రయించాను - కీర్త 73, 27-28

21. దప్పిక కలిగినవాడు నావద్దకు వచ్చి దప్పిక తీర్చుకోవచ్చు. నన్ను విశ్వసించేవాని అంతరంగంలోనుండి జీవజల ప్రవాహాలు పొంగి పారతాయి - యోహా 7, 37-39

22. నేను దాహం గొన్న వాణ్ణి జీవజలపు చెలమునుండి స్వేచ్ఛగా నీళ్ళు త్రాగనిస్తాను - దర్శ 21,6

23. ప్రభువు ఆకలిగొన్నవాళ్ళను సంతృప్తి పరచి ధనవంతులను వట్టి చేతులతో పంపివేసాడు - లూకా 1,53

24. నీవు దేవుని వరాన్ని గుర్తించినట్లయితే, నిన్ను నీళ్ళియమని అడుగుతూంది ఎవరో నీవు తెలిసికొని వున్నట్లయితే, నీవే అతన్ని నీళ్ళు అడిగేదానివి. అప్పుడతడు నీకు జీవజలం యిచ్చి వుండేవాడు - యోహా 4,10.

25. నన్ను పంపిన తండ్రి ఆకర్షిస్తేనే తప్ప ఎవడూ నా వద్దకు రాలేడు - యోహా 6,44.

26. పరలోకంలోని మీ తండ్రి తన్నడిగిన వాళ్ళకు ఆత్మను సమృద్ధిగా దయచేస్తాడు - లూకా 11,13

27. ఎవడూ యిద్దరు యజమానులను సేవింపలేడు - మత్త 6, 24

28. ప్రభో! మా హృదయాన్ని నీ కొరకే సృజించావు. నీ యందు విశ్రమించిందాకా దానికి విశ్రాంతి లేదు - అగస్టీను భక్తుడు

29. బాలస్తావత్ క్రీడాసక్తః
తరుణస్తావత్ తరుణీసక్తః
వృద్ధస్తావత్ చింతాసక్తః
పరమే బ్రహ్మణి కోపి నసక్తః - శంకరాచార్యులు

## 2. పాపమూ, పశ్చాత్తాపమూ

బైబులు భగవంతుడు పరమ పవిత్రుడు. అతడు పాపంవల్ల కోపం చెందుతాడు. పశ్చాత్తాపంవల్ల శాంతిని పొందుతాడు. పాపం నేరుగా భగవంతుణ్ణే ఎదిరిస్తుంది. అతన్నే వ్యతిరేకిస్తుంది. మనం అతనికి ద్రోహంగానే పాపం చేస్తుంటాం. పాపం ఎంత ఘోరమైందో భక్తునికి తెలుసు. కనుకనే అతడు నేడు పాపపు వెల్లువలో మునిగిపోయానని బాధపడతాడు. ఐనా అతడు చిత్తశుద్ధి కలవాడు. కనుక ప్రభువు నెదుట తన పాపాలను ఒప్పుకొంటాడు. ఆ పాపాలను కప్పిపెట్టుకోడు గదా, వాటికోసం పశ్చాత్తాప పడతాడు. ప్రభువుకూడ నెనరుతో అతని తప్పిదాలను క్షమిస్తాడు.

నరుడు పాపం వలన అశుద్ధుడౌతాడు. ఓ కుష్ఠరోగిలా తయారౌతాడు. ప్రభువే అతన్ని శుద్ధిచేస్తాడు. కరుణతో కడుగుతాడు. అప్పుడు నరుడు మంచులా తెల్లనౌతాడు. ప్రభువు తన్ను గెంటివేయకుండా వుండాలనీ, తన హృదయంలోని పరిశుద్ధాత్మను తొలగించకుండా వుండాలనీ పాపి ప్రార్థన. దేవుడు నరుల పాపాలను లెక్కిడితే ఎవరూ ఆ పవిత్రమూర్తి ముందు నిలువలేరు. కాని ప్రభువు నరులను శిక్షించడానికంటె క్షమించడానికే సిద్ధంగా వుంటాడు.

నరుడు సమర్పించుకొనే ఉత్తమ బలి పశ్చాత్తాప హృదయమే, సంతప్త మానసమే. అతడు తన ప్రధాన బలహీనతలను తలంచుకొని గూడ ప్రభుని సహాయం అడుగుకొంటాడు. తాను దుర్భాషలాడకుండా వుండేలాగ తన నోటికి తాళం వేయించవలసిందిగా మనవి చేసికొంటాడు. ఆ మనవిని ప్రభువు ఆలిస్తాడు.

1. ప్రభో నీకే, నీకే ద్రోహంగా నేను పాపం చేసాను
   నీ యెదుట నేను దుష్కార్యాలు చేసాను - కీర్త 51,4
2. నేను పుట్టినప్పటినుండీ పాపాత్ముడనే
   మా యమ్మ కడుపున పడినప్పటి నుండీ దుర్మార్గుడనే - 51,5
3. నా పాపాలనే వెల్లువలో నేను మునిగిపోయాను
   అవి మోయలేని భారంలాగ నా తలమీద నిల్చాయి - 38, 4
4. నా తప్పిదాలను నేను ఒప్పుకొంటున్నాను
   నా పాపాలను తలంచుకొని పశ్చాత్తాప పడుతున్నాను - 38, 15
5. నా తప్పిదాలను కప్పిపెట్టుకోలేదు
   నా దోషాలను నీ యెదుట ఒప్పుకొన్నాను
   నా పాపాలను దేవుని యెదుట ఒప్పుకొంటాను అనుకొన్నాను
   నీవు నా యపరాధాలను క్షమించావు - 32, 5
6. ప్రభూ! నా యౌవనకాలపు పాపాలను జ్ఞప్తికి దెచ్చుకోకు - 25,7
7. ప్రభో! నీవు మా దోషాలను లెక్కపెడితే మేమిక నిలువగలమా!
   కాని నీవు మా తప్పిదాలను క్షమిస్తుంటావు కనుక
   మేము నీ పట్ల భయభక్తులు చూపుతుంటాం - 130, 3
8. నీవు నన్ను నిర్మలుణ్ణి చేస్తే నేను పవిత్రుణ్ణౌతాను
   నీవు నన్ను కడిగితే నేను మంచుకంటె తెల్లనౌతాను -51,7
9. దేవా! నాలో నిర్మల హృదయాన్ని సృజించు
   ఓ క్రొత్త అంతఃకరణాన్ని నాలో నెలకొల్పు

నీ సన్నిధినుండి నన్ను గెంటివేయకు
నీ పరిశుద్ధాత్మను నా యొద్దనుండి తీసివేయకు -51, 10-11

10. ప్రభువు పశ్చాత్తాపపడేవాళ్ళకు సమీపంలోనే వుంటాడు
సంతాప పడేవాళ్ళను రక్షిస్తుంటాడు - 35,19

11. దేవా! నే నర్పించే బలి పశ్చాత్తాప పూరితమైన హృదయమే
పశ్చాత్తాప పూరితమూ వినయాన్వితమూ ఐన హృదయాన్ని
నీ వనాదరం చేయవు - 51, 17

12. మహోన్నతుడు శాశ్వతుడు పవిత్రుడునైన
ప్రభువు ఈలా నుడువుతున్నాడు
నేను ఉన్నతమైన పవిత్రస్థలంలో వసించేవాణ్ణి
ఐనా వినయాత్ములు పశ్చాత్తాపమనస్కులు
ఐనవారితోను వసిస్తాను
వారికి నూత్న బలాన్ని దయచేస్తాను - యెష 57,15

13. ప్రభువు ఈలా అంటున్నాడు
ఆకాశం నాకు సింహాసనం
భూమి నాకు పాదపీఠం
మీరు నా కెట్టి మందిరాన్ని కడతారు?
ఎలాంటి విశ్రమస్థానాన్ని నిర్మిస్తారు?
భూమ్యాకాశాలను నేనే చేసాను
ఇవియెల్ల నావే - ఇవి ప్రభువు పల్కులు
వినయాన్వితుడు పశ్చాత్తాప మనస్కుడు ఐ
నా వాక్కులకు భయపడే నరుణ్ణి
నేను ప్రీతితో జూస్తాను - యెష 66, 1-2

14. ప్రభో! నా నోటికి తాళం వేయించు
నా పెదవులకు గడియ వేయించు
నా మనస్సును దుష్కార్యాలమీదికి పోనీయకు
దుష్టుల దుష్టకార్యాల్లో నన్ను పాల్గొననీయకు - 141, 3-4

15. నీవు నా ముఖం చూడలేవు. ఏ నరుడూ నన్ను జూచి బ్రతకలేడు - నిర్గ 33, 20

16. సైన్యములకు అధిపతియైన ప్రభువుని పరిశుద్ధునిగా గణించండి. అతన్ని చూచి భయపడండి - యెష 8, 13

17. నీ తమ్ముడెక్కడ అని దేవుడు కయీనుని అడిగాడు. అతడు నాకు తెలియదు. నేను వాడికేమైనా కావలి వున్నానా? అని బదులు పల్కాడు - ఆది 4,9

18. దావీదు నాతానుతో నేను యావేకు ద్రోహంగా పాపం చేసాను అన్నాడు. నాతాను ప్రభువు నీ పాపాన్ని క్షమించాడు. నీవు చావుకి తప్పి బ్రతుకుతావు అన్నాడు - 2 సమూ 12, 13

19. నీనివే ప్రజ ప్రభువు సందేశం నమ్మారు. వాళ్ళు జనులందరూ ఉపవాసం చేయాలని ప్రకటిచారు. అధికులనుండి అల్పులవరకు అందరూ గోనె తాల్చారు. ఆ సంగతి విని నీనివే రాజుకూడ సింహాసనం మీదినుండి క్రిందికి దిగాడు. తన రాజవస్త్రాలను తొలిగించి, గోనె తాల్చి బూడిదమీద కూర్చున్నాడు - యోనా 3, 5-6.

20. మీ పాపాలవల్ల మీకు ఎర్రని మచ్చలు పుట్టాయి
కాని నేను మిమ్ము కడిగి మంచువలె శుభ్రం చేస్తాను

21. మీ పాపాలు ఎర్రగా వున్నా
మీరు ఉన్నివలె తెల్ల నౌతారు - యెష 1, 18

22. భూమ్యాకాశములారా వినండి!
ప్రభువు మాటలాడుతున్నాడు
నేను పెంచిన బిడ్డలే నామీద తిరగబడ్డారు
ఎద్దుకి తన యజమానుడు తనకెక్కడ మేత వేస్తాడో తెలుసు
గాడిదకు యజమానుడు తనకెక్కడ మేత వేస్తాడో తెలుసు
కాని యిస్రాయేలీయుల కేమీ తెలియదు
వాళ్ళు ఏమీ అర్థం చేసికోరు - యెష 1, 2-4

23. ఆకాశాన ఎగిరే బెగ్గురు పక్షులకు
తాము తిరిగిరావలసిన కాలం తెలుసు
గువ్వలకు వానకోవిలలకు కొంగలకు
తాము వలసపోవలసిన సమయం తెలుసు
కాని నా ప్రజలైన మీకు
ప్రభువునైన నాయాజ్ఞ లేమాత్రం తెలియవు - యిర్మీ 8,7

24. నీవు కోపించినా లెక్కచేయక మేము పాపం కట్టుకొన్నాం
నీ యాగ్రహాన్ని సరకుచేయక
పూర్వంనుండి మేము పాపం చేస్తూనే వున్నాం
మేమందరమూ అశుద్ధులమయ్యాం

మా పుణ్యక్రియలు మలిన వస్త్రంలాంటి వయ్యాయి
మేము అకుల్లాగ ఎండిపోయాం
మా పాపాలు మమ్ము గాలిలాగ ఎగరగొట్టాయి
నీకు ప్రార్థన చేసేవాడెవడూ లేడు
నిన్నాశ్రయించేవాడు ఎవడూ కన్పింపడు
నీవు నీ దివ్యముఖాన్ని మానుండి మరుగుజేసికొన్నావు
మా యపరాధాలను జూచి మమ్ము చేయి విడచావు
ఐనా ప్రభూ! నీవు మాకు తండ్రివి
మేము మట్టిమి, నీవు కుమ్మరివి
నీవే మమ్మందరినీ సృజించావు
ప్రభూ! మామీద మిక్కుటంగా కోపింపకు
మా పాపాలను సదా జ్ఞప్తియందుంచుకోకు
మమ్ము కరుణతో వీక్షించు
మేమందరం నీ ప్రజలం - యెష 64, 5-9

25. ప్రభువు మిమ్ము రక్షించలేని దుర్బలుడూ కాదు
మీ మనవిని ఆలింపలేని చెవిటివాడూ కాదు
కాని మీ పాపాలు మీకూ మీ దేవునికీ మధ్య
ఓ అగాధాన్ని సృజించాయి
మీ పాపాలవలన అతడు ముఖం మరుగుజేసికొని
మీ వేడికోలును ఆలించడంలేదు
మీరు హత్య, దౌర్జన్యం, అనృతం
అనే పాపాలకు పాల్పడ్డారు - యెష 59, 1-4

26. నా ప్రజలు రెండు నేరాలు చేసారు
జీవజలాల బుగ్గనైన నన్ను పరిత్యజించారు,
నెర్రెలు విచ్చుటచే నీళ్ళు నిలువని
రాతితొట్లను తొలిపించుకొన్నారు - యిర్మీ 2:13

27. యువతి తన ఆభరణాలను మరచిపోతుందా?
వధువు తన వివాహవస్త్రాన్ని విస్మరిస్తుందా?
కాని నా ప్రజలు మాత్రం
లెక్కబెట్టడానికి వీలులేనన్ని నాళ్ళు నన్ను విస్మరించారు - యిర్మీ 2, 32

28. నల్లజాతివాడు తన చర్మాన్ని మార్చుకోగలడా?
చిరుతపులి తన పొడలను మార్చుకోగలదా?
మార్చుకోగలిగితే, దుష్టకార్యాలకు అలవాటుపడిన
మీరుకూడ మంచిని చేయగల్గుతారు - యిర్మీ 13,23.

29. నేను మీమీద నిర్మలజలాన్ని చిలకరించి మీరు శుద్ధిని పొందేలా చేస్తాను. మీ విగ్రహాలనుండీ, మిమ్ము మైలపరచే సమస్త వస్తువుల నుండీ, మీకు శుద్ధి చేస్తాను. నేను మీకు నూత్న హృదయాన్నీ నూత్న మనస్సునీ దయచేస్తాను. మీలోని రాతిగుండెను తీసివేసి దానిస్థానే మాంసపు గుండెను నెలకొల్పుతాను. నా యాత్మను మీ మీదికి పంపుతాను. మీరు నా యాజ్ఞలను పాటించేలా, నా శాసనాల ప్రకారం జీవించేలా చేస్తాను. - యెహె 36, 25-27

30. ప్రభువు సెలవిచ్చేదేమనగా
"ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు
ఉపవాసంతో, దుఃఖంతో, ఏడ్పులతో
హృదయపూర్వక పశ్చాత్తాపంతో నా చెంతకు తిరిగిరండి
మీ బట్టలను చించుకొంటే చాలదు
మీ గుండెలను బ్రద్దలు చేసికొనండి"
కనుక మీరు ప్రభువైన దేవునిచెంతకు తిరిగిరండి
అతడు దయాపరుడు కరుణానిధి
దీర్ఘ శాంతుడు, మాట నిలబెట్టుకొనేవాడు
మిమ్ము క్షమించి వదలివేస్తాడు - యోవేలు 2, 12-13

31. కాలం సంపూర్ణమైంది. దేవుని రాజ్యం సమీపించింది. హృదయ పరివర్తనం చెంది సువార్తను విశ్వసించండి - మార్కు 1, 15

32. సుంకరి దూరంగా నిలబడి, కన్నులు పైకెత్తటానికైన సాహసించక, రొమ్ము బాదుకొని, దేవా! ఈ పాపిని కనికరించు అని ప్రార్థించాడు - లూకా 18,13

33. ఆ కుమారుడు తండ్రీ! నేను దేవునికీ, నీకు ద్రోహం చేసాను. ఇక నీ కుమారుణ్ణి అనిపించుకోవడానికి తగను అని పల్కాడు - లూకా 15,21.

34. పేత్రు ప్రభువు చెప్పినమాట జ్ఞప్తికి తెచ్చుకొని వెలుపలికి వెళ్ళి వెక్కి వెక్కి యేడ్చాడు - లూకా 22,62

35. నేను చేయగోరిన పనిని చేయక, నా కిష్టంలేని పనిని చేస్తున్నాను. మంచిని చేయాలనే కోరిక నాలోవున్నా దాన్ని చేసేశక్తి మాత్రం నాకు లేదు. నేను చేయగోరిన మంచిని చేయక, చేయవద్దనుకొన్న చెడ్డను చేస్తున్నాను - రోమా 7, 15-19

36. చిన్నబిడ్డలారా! మీరు పాపం చేయకుండా వుండడానికి ఈ సంగతులు వ్రాస్తున్నాను. ఎవడైనా పాపం చేసినట్లయితే నీతిమంతుడైన యేసుక్రీస్తు అనే ఉత్తరవాది తండ్రి సమక్షంలో మనకున్నాడు. మన పాపాలకు శాంతిచేసేవా డతడే. ఒక్క మన పాపాలను మాత్రమే కాదు, మానవులందరి పాపాలకూ శాంతి చేసే దతడే - 1 యోహా 2, 1-2.

## 3. దైవవాక్కు

బైబులు ప్రజలకు భగవంతుని వాక్కులన్నా అతని కట్టడలన్నా మహా గౌరవం. ప్రభువు పలుకులు ఏడుసార్లు పుటంవేసిన వెండిలాంటివి. మేలిమి బంగారం లాంటివి. తేనెపట్టునుండి చిప్పిలే తేనె లాంటివి. కనుక భక్తుడు ప్రభువాక్కును రేయింబవళ్ళు మననంచేసికొంటాడు. అతడు నీటియెడ్డున ఎదిగే చెట్టులాగ మంచిపండ్లు ఫలిస్తాడు.

ప్రభువు వాక్కు భక్తుణ్ణి హెచ్చరిస్తూంటుంది. రాత్రుల్లోగూడ హితోపదేశం చేస్తుంటుంది. భగవంతుడే ఓ ఉపాధ్యాయుడై భక్తునికి బోధిస్తుంటాడు. ప్రభువాక్యం ఓ దీపంలా వెలుగుతూ త్రోవ జూపుతూంటుంది. ఆ ప్రభువు చిత్తాన్ని పాటించడమే నరుని ధ్యేయం. ప్రభువు అనుగ్రహంవలన నరుడు ఆయన ధర్మశాస్త్రంలోని అద్భుత పత్యాలను గ్రహిస్తాడు. రాత్రి నాల్గుజాములూ ప్రభువునీ, అతని వాక్కునీ మననం చేసుకొంటాడు. ప్రభువు ఆజ్ఞలను పాటించడమంటే అతనికి పరమానందం.

1. ప్రభువు వాగ్దానాలు నమ్మదగినవి
అవి కొలిమిలో ఏడుసార్లు పుటం వేసిన వెండివలె శ్రేష్ఠమైనవి - కీర్త 12,6
2. ప్రభువు ఆజ్ఞలు మేలిమి బంగారంకంటె మేలైనవి
తేనెపట్టునుండి చిప్పిలే తేనెకంటె తీయనైనవి
ప్రభూ! నీ యాజ్ఞలు ఈ దాసుణ్ణి హెచ్చరిస్తుంటాయి
వాటిని పాటిచడంవల్ల నాకు బహుమానంకూడ లభిస్తుంది - 19, 10-11
3. ప్రభువు కట్టడలను రేయింబవళ్ళు మననం చేసికొంటూ
ఆనందించే నరుడు ధన్యుడు
అతడు ఏటి యొడ్డున నాటగా
సకాలంలో పండ్లనిస్తూ
ఆకులు వాడకయుండు చెట్టువంటివాడు
అతడు తాను చేపట్టిన కార్యాలన్నింటిలోను
విజయాన్ని పొందుతాడు -1, 2-3

4. ప్రభువు ఈలా అంటున్నాడు
నన్ను విడనాడి నరుని నమ్మేవాడు,
నరమాత్రునిమీద ఆధారపడేవాడు, శాపగ్రస్తుడు
అతడు ఎడారిలో ఎదిగే తుప్పలాంటివాడు
అతని కేలాంటి మేలు కలుగదు
ఆ తుప్ప ఎండివున్న మరుభూమిలో,
ఏమీ పెరుగని చౌటి పర్రలో ఎదుగుతుంది
కాని నన్ను నమ్మి నాపై ఆధారపడేవాణ్ణి నేను దీవిస్తాను
అతడు ఏటివొడ్డున ఎదుగుతూ
నీటి చెంతకు వ్రేళ్ళు జొన్పించే చెట్టులాంటివాడు
అది బెట్టకు భయపడదు
దాని యాకులు పచ్చగా వుంటాయి
వానలు కురవకున్నా దానికి చింతలేదు
అది యెల్లపుడు పండ్లు కాస్తుంటుంది - యిర్మీ 17, 5-8
5. ప్రభువే నాకు హితోపదేశం చేస్తూంటాడు
రాత్రుల్లో గూడ అంతరాత్మ నన్ను హెచ్చరిస్తూంటుంది
కనుక నేను ప్రభువుని స్తుతిస్తూంటాను - కీర్త 16, 7
6. ప్రభూ! నీవు బోధించే నరుడు ధన్యుడు
నీవు ధర్మశాస్త్రాన్ని ఉపదేశించే జనుడు భాగ్యవంతుడు - 94,12
7. ప్రభూ! నీ పలుకులు నాకెంతో రుచిగా వున్నాయి
నీ మాటలు తేనెకంటె తీయగా వున్నాయి - 119 -103
8. నీ వాక్యం ఓ దీపం లాంటిది
నా త్రోవకు వెలుగు లాంటిది - 119, 105
9. నీవే నా దేవుడవు
నీ చిత్తాన్ని నేను ఎలా పాటించాలో తెలియజెప్పు
నీ యాత్మ నన్ను సరళ మార్గంలో నడిపిస్తూండు గాక - 143, 10
10. ప్రభూ! నా కండ్లను తెరువు
నేను నీ ధర్మశాస్త్రం బోధించే అద్భుత సత్యాలను తెలిసికొంటాను - 119, 18
11. ప్రభువు తన వాక్కును పంపగానే అది గబగబ పరుగెత్తుకొంటూ భూమిమీదికి వస్తుంది - 147,15

12. నేను పడకమీద పండుకొని నిన్ను స్మరించుకొంటూంటాను. రాత్రి నాల్గుజాములు నిన్ను ధ్యానం చేసికొంటూంటాను - 63, 6

13. ప్రభువు వాక్కిది. నేను దేశంమీదికి కరువుని పంపే కాలం వస్తుంది. ఆ కరువు కూటికీ నీటికీ గాదు. ప్రభువు వాక్కుకే - ఆమోసు 8,11

14. నేడు నేను మీకు విధించే యీ శాసనం కష్టమైందీ కాదు. అందుబాటులో లేనిదీకాదు. అది యెక్కడో ఆకాశంలో లేదు. కనుక మేము ఆ శాసనాన్ని విని పాటించడానికిగాను, ఎవరు ఆకాశాని కెక్కి పోయి దాన్నిక్కడికి తీసికొనివస్తారు అని మీరు అడగనక్కరలేదు. అది యెక్కడో సముద్రాలకు ఆవలలేదు. కనుక మేము ఆ శాసనాన్ని విని పాటించడానికిగాను, ఎవరు సముద్రాలు దాటిపోయి దాన్నిచటికి తీసికొనివస్తారు అని మీరు అడగనక్కరలేదు. అది మీ చెంతనే వుంది. మీ నోటిలోనే, మీ హృదయంలోనే వుంది. కనుక మీరు ఈ శాసనాన్ని పాటించండి - ద్వితీ 30, 11-14.

15. ఈనాడు నేను మీకు విధించిన ప్రభువు ఆజ్ఞల్ని పాటించినట్లయితే, మీరు పెంపుచెంది పెద్దజాతిగా విస్తరిల్లుతారు. మీరు స్వాధీనం చేసుకోబోయే గడ్డమీద ప్రభువు మిమ్ము దీవిస్తాడు. కాని మీరు ప్రభువుని విడనాడి అతని మాటలను తృణీకరిస్తే తప్పక నశిస్తారు. మీరు స్వాధీనం చేసుకోబోయే గడ్డమీదకూడ పెద్దకాలం జీవించరు - ద్వితీ 30, 16-18.

16. ప్రభువు ఆజ్ఞల గ్రంథం విజ్ఞానంతో గూడింది. అది శాశ్వతంగా నిల్చివుండే ధర్మశాస్త్రం. దాన్ని పాటించేవాళ్ళు బ్రతుకుతారు, నిరాకరించేవాళ్ళు చస్తారు - బరూకు 4,1. ప్రభువు నోటినుండి వెలువడే మాటలు నిత్యజీవ మిస్తాయి - యోహా 6,18.

17. నరుడు కేవలం ఆహారంతోనే జీవించడు. ప్రభువు నోటినుండి వెలువడే ప్రతిమాట ద్వారా గూడ జీవిస్తాడు - ద్వితీ 8,3. యథార్థంగా భూమిమీది పైరుపంటలు నరులను పోషించలేవు. ప్రభువుని నమ్మినవాళ్ళని పోషించేది అతని నోటిమాటలే - సోలోమోను జ్ఞాన 16,26.

18. వానా మంచూ ఆకాశం నుండి దిగివస్తాయి. అవి ఆకాశానికి తిరిగి పోవు. భూమిని తడిపి దానిలో నుండి పైరు ఎదిగించి పంట పండిస్తాయి. రైతుకి విత్తడానికి విత్తనాలూ తినడానికి తిండీ సంపాదించి పెడతాయి. నా నోటినుండి వెలువడే వాక్కు కూడ ఈలాగే వుంటుంది. అది వ్యర్థంగా నా వద్దకు తిరిగిరాదు. నా చిత్తాన్ని నెరవేరుస్తుంది. నేను పంపిన పనిని నిర్వహిస్తుంది - యెష 55,10-11.

19. నా వాక్కు నిప్పులాగ దహించదా? సుత్తెలాగ రాతిని ముక్కలు చేయదా? యిర్మీయా 23,29.

20. దేవుడు నరులవలె అసత్యమాడడు. మనుషులవలె ఆడితప్పడు. అతడు మాటయిచ్చి పనిచేయకుండునా? చేసిన ప్రమాణము నిలబెట్టుకొనకుండునా? - సంఖ్యా 23,19.

21. ప్రభువు "మనుష్య కుమారుడా? నేను నికిచ్చినదానిని ఆరగించు. ఈ లిఖిత ప్రతిని భక్షించి వెళ్ళి యిస్రాయేలీయులతో మాటడులాడు" అని చెప్పాడు. నేను నోరు తెరవగా అతడు లిఖిత ప్రతిని ఇచ్చి "మనుష్య కుమారుడా! నీవు ఈ పుస్తకాన్ని భుజించి దీనితో నీ కడుపు నింపుకో" అన్నాడు. నేను దానిని భుజింపగా అది తేనెలా తీయగా వుంది - యెహె 3, 1-3.

22. ప్రభో! నీ దాసుడు ఆలించడానికి సిద్ధంగానే వున్నాడు, సెలవీయి - 1సమూ 3,10.

23. అతడు మార్గంలో మనతో మాట్లాడుతూ లేఖనాలను వివరిస్తుంటే మన హృదయం ప్రజ్వరిల్లలేదా! - లూకా 24,32.

24. మరియ ప్రభువు పాదాలచెంత కూర్చుండి అతని బోధలు ఆలిస్తూంది - లూకా 10:39.

25. ఇద్దరు ముగ్గురు నా పేరు మీదిగా సమావేశమైనకాడ నేను నెలకొని వుంటాను - మత్త 18,20.

26. మరియ ఆ సంగతులన్నీ హృదయంలో పదిలపరచుకొని మననం చేసుకుంటూండేది - లూకా 2,19.

27. యేసు తల్లీ సోదరులూ అతని వద్దకు వచ్చారు. జనం క్రిక్కిరిసి వుండడం వల్ల వాళ్ళు అతన్ని కలుసుకోలేకపోయారు. మీ యమ్మా సోదరులూ నీతో మాట్లాడడానికి వెలుపల వేచివున్నారు అని యెవరో అతనితో చెప్పారు. అందుకు యేసు దేవుని వాక్కుని ఆలించి పాటించేవాళ్ళే నాకు తల్లీ సోదరులూ ఔతారని చెప్పాడు - లూకా 8,19-21.

28. పరిశుద్ధ గ్రంథం దైవ ప్రేరణం వల్ల పుట్టింది. అది సత్యాన్ని బోధిస్తుంది. దోషాన్ని ఖండిస్తుంది. తప్పులను చక్కదిద్దుతుంది. సత్ప్రవర్తన నేర్పుతుంది. దైవప్రజలచే సత్కార్యాలు చేయిస్తుంది - 2తిమో 3,16-17.

29. ప్రభువు వాక్కు సజీవమైంది. క్రియాత్మకమైంది. రెండంచుల కత్తి కంటె పదునైంది. అంతరంగందాకా కోసికొని పోతుంది. అది నరుల హృదయాల్లోని కోర్కెలనూ ఆలోచనలనూ పరిశీలించి చూస్తుంది - హెబ్రే 4,12.

30. సజీవమూ శాశ్వతమూ ఐన దేవుని వాక్కు ద్వారా మీరు నూతన జన్మను పొందారు - 1పేత్రు 1,23. నేను మీతో చెప్పిన మాటల వలన మీరిప్పుడు శుద్ధులయ్యారు - యోహా 15,3.

31. పవిత్రాత్ముడు వచ్చాక మీకు సమస్త విషయాలు బోధిస్తాడు. నేను చెప్పిన సంగతులన్నీ మీకు జ్ఞప్తికి తెస్తాడు - యోహా 14,26. అతడు మిమ్ము సర్వ సత్యంలోకి నడిపిస్తాడు. తనంతట తాను ఏమీ బోధించక తాను నావలన వినిన సంగతులనే మీకు బోధిస్తాడు. జరగబోయే విషయాలను మీకు తెలియజేస్తాడు - యోహా 16,13.

32. నీ బిడ్డలందరికీ ప్రభువే బోధిస్తాడు - యెష 54,13. యోహా6,45.

# 4. భగవంతుడూ నరుడూ, విజ్ఞానం

## 1) భగవంతుడూ నరుడూ

భగవంతునికీ నరునికీ వుండే సంబంధాన్ని కీర్తనలు నానారూపాల్లో వ్యక్తం చేస్తాయి. మూర్ఖుడు దేవుడు లేడులే, అతడు మనం చేసే పని చూడడులే అనుకొంటూంటాడు. కాని ప్రభువు నరులను గమనిస్తూనే వుంటాడు. తన్నెవరైనా పూజిస్తున్నారా అని పరిశీలించి చూస్తూనే వుంటాడు. అతనికి వినయవంతులంటే మాలావు ప్రియం. గర్వాత్ములంటే పరమ అసహ్యం. నరులకు మంచి ఆలోచనలు పుట్టించి వాళ్ళచేత సత్కార్యాలు చేయించేది ప్రభువే. అటుపిమ్మట వాళ్ళను బహూకరించేదీ ఆ ప్రభువే. అతడు నరుణ్ణి నిత్యం పరిశీలించి చూస్తూనే వుంటాడు. నరుడు అతని సన్నిధిలోనుండి పారిపోలేడు. పారిపోయి యెక్కడికి వెళ్ళగలడు?

నరుని తరపున నరుడు ఆ ప్రభువుని నమ్మాలి. దేవుణ్ణి ఓ తండ్రిలా భావించి అతని సన్నిధిలో నడవడం నేర్చుకోవాలి. అతనికి ప్రార్థన చేసికోవాలి. చేతులెత్తి నమస్కరించాలి. నరుల సౌభాగ్యమంతా ఆ భగవంతుణ్ణి పూజించుకొనడంలోనే ఇమిడి వుంది.

1. మూర్ఖులు దేవుడు లేడులే అనుకొంటూంటారు - కీర్త 53,1
2. మూర్ఖులు దేవుడు లేడులే అనుకొంటారు
   వాళ్ళు వట్టి దుర్మార్గులు,
   ఘాతుక కార్యాలు చేస్తూంటారు
   నీతితో ప్రవర్తించేవాడు ఒక్కడూ లేడు - 14,1

3. దేవుడు ఆకాశం నుండి నరులను పరీక్షించి చూస్తుంటాడు
ఎవరైనా జ్ఞానం కలిగి తన్ను పూజిస్తున్నారా అని
పరిశీలించి చూస్తుంటాడు
ఐనా నరులంతా పెడత్రోవ బట్టారు
అంతా దుష్టులైపోయారు
నీతితో ప్రవర్తించేవాడు ఒక్కడూ లేడు - 53, 2-3

4. ఆకాశం ప్రభువుది
భూమిని మాత్రం ఆయన నరుల కిచ్చివేసాడు - 115,16

5. ప్రభువు అంత గొప్పవాడైన దీనులను ఆదరంతో జూస్తుంటాడు
కాని గర్వాత్ములను మాత్రం దూరం నుండే గుర్తుపడతాడు - 138,6

6. నీ యాలోచనలతో నన్ను నడిపిస్తుంటావు
కడపట నన్ను నీ మహిమలోనికి చేర్చుకొంటావు - 73,24

7. నా నడకా, నా పడకా నీవు గమనిస్తూనే వుంటావు
నా ప్రవర్తన నీకు బాగా తెలుసు - 139,3

8. నీ యాత్మ నుండి నేనెక్కడికి పారిపోగలను?
నీ సన్నిధి నుండి నేనెక్కడికి తప్పించుకొని పోగలను - 136,7

9. నేను చేసే పనులన్నీ నీ పొత్తంలో వ్రాయబడే వున్నాయి
నా రోజులింకా ప్రారంభం కాకమునుపే
అవి యిన్నియని నీవు ముందుగానే నిర్ణయించావు - 139,16

10. నా ప్రార్థనను ధూపంలా స్వీకరించు
నేను చేతులెత్తి చేసే ప్రార్థనను సాయంకాలపు బలిలా ఆదరించు - 141,2

## 2) విజ్ఞానం

బైబులు విజ్ఞానాన్ని బోధిస్తుంది. నరుని ఆలోచనలు ఏలా వుండాలో అతడేలా మెలగాలో తెలియజేస్తుంది. మట్టితో జేయబడిన మనిషి మళ్ళా మంటగలిసిపోతాడు. అతడు జీవించేది ఓ డెబ్బైయేండ్లు. ఈ కాలంలో గూడ బాధలూ చింతలూ తప్పితే అతడు పామకొనే దేమీలేదు. ఈ జీవితం మీసాల మీది తేనెలాంటిది. నరుడు క్షణమాత్ర జీవి. ఇవ్వాళ్ళ ఓ పూవులా వస్తాడు, రేపటికల్లా రాలిపోతాడు. అతని రోజులన్నీ ఓ నీడలా మరుగైపోతాయి. కొందరు మూర్ఖులు దేవుడు మనలను చూడడులే అనుకొంటూంటారు. కాని చెవిని చేసినవాడు వినడా? కంటిని చేసినవాడు చూడడా?

మన ఆలోచనలన్నీ వెర్రి ఆలోచనలని అతనికి బాగా తెలుసు. ఐనా ఆ ప్రభువు నరుణ్ణి స్మరించుకొంటూంటాడు. ఆదరిస్తూంటాడు. నరుడు భగవంతుని కంటె తక్కువవాడు గాని, సృష్టి ప్రాణులన్నిటికంటె ఎక్కువవాడు.

కొంతమంది స్వీయబలంమీదనే ఆధారపడుతూంటారు. కాని దైవ బలంగూడ వుండాలి. దేవుడు ఇల్లు కట్టకపోతే ఇల్లు కట్టేవాళ్ళ ప్రయాస అక్కర కొస్తుందా? కొంతమంది ప్రభువు పట్ల భయభక్తులు చూపుతూంటారు. అలాంటివాళ్ళ లోగిళ్లు భార్యాపిల్లలతో కలకలలాడుతూంటాయి. అది ప్రభువు ఇచ్చే దీవెన. దైవప్రజలు కలసి మెలసి ఒద్దికగా జీవిస్తుండాలి. దేవుని నమ్మని దుష్టులు మాత్రం కళ్లంలోని తాలులాగ గాలి కెగిరిపోతారు. ఇవి విజ్ఞాన వాక్యాలు.

1. మనం జీవించేది డెబ్బైయేండ్లు
మహా బలవంతులమైతే యెనభై యేండ్లు
ఈ ఆయుష్కాలంలో గూడ బాధలూ చింతలూ తప్పితే
మనం పొముకొనే దేమీలేదు
అనుకోకుండానే యేండ్లు గడచిపోతాయి
మనమూ ఇక్కడ నుండి దాటిపోతాం
కనుక ప్రభో! ఈ జీవితం మూడునాళ్ళ ముచ్చటేనని
తెలిసికొనేలా చేయి
అప్పుడుగాని మేము విజ్ఞానులం కాము - కీర్త 90, 10-12

2. నరుడు గడ్డిలాగ క్షణికమైనవాడు
అతడు పొలంలోని పూవులా పూస్తాడు
ఓ గాలి వీస్తుంది, అది కాస్త రాలిపోతుంది
ఇక అది ఎవరికంటా బడదు - 103,15-16

3. యిస్రాయేలు దేవుడు మనలను గమనించడనీ
ప్రభువు మనలను గుర్తించడనీ కొందరనుకొంటారు
నాయనలార! మీరు వట్టి మందమతులు
మూర్ఖులార! మీకెప్పుడు జ్ఞానం కలుగుతుంది?
మన చెవులను చేసినవాడు తాను వినలేడా?
మన కండ్లను కలిగించినవాడు తాను చూడలేడా?
సకల జాతులను ఏలేవాడు వాళ్ళను శిక్షింపడా?
సకల నరులకు బోధించేవాడు వాళ్ళను ఎరుగడా?

నరుల తలపోతలు ప్రభువునకు తెలుసు
వాళ్ళు తెలివిలేని ఆలోచనలు ఆలోచిస్తారని
అయనకు బాగా తెలుసు - 94,7-11

4. నీవు నరుణ్ణి స్మరించుకోవడానికి అతడేపాటివాడు?
అల్ప మానవుణ్ణి పరామర్శించడానికి అతడెంతటివాడు?
ఐనా నీవు నరుణ్ణి
నీ కంటె కొంచెం తక్కువవాణ్ణిగా మాత్రమే చేసావు
కీర్తి మహిమలనే కిరీటంతో అతన్ని అలంకరించావు - 8,4-5

5. నీవు నరుణ్ణి ఆదరించడానికి అతడేపాటివాడు?
నరమాత్రుణ్ణి తలంచుకోవడానికి అతడెంతటివాడు?
అతడు గబాలున వీచే గాలివంటివాడు
అతని రోజులు కనిపించకుండా బోయే నీడలా
సమాప్తమౌతాయి - 144,3

6. నీవు మట్టితో జేయబడిన మనిషిని మళ్ళా మట్టిని జేస్తావు
నరులారా మీరు మంటగలసిపొండని ఆజ్ఞాపిస్తావు - 90,13

7. దేవుడు ఇల్లు కట్టకపోతే ఇల్లు గట్టేవాళ్ళ ప్రయాస అక్కరకు రాదు
దేవుడు నగరాన్ని కాపాడకపోతే నగర రక్షకులు
దాన్ని కాపాడగలరా!
వేకువనే లేచీ, అపరాత్రిదాకా మేల్కొని వుండీ
పొట్టకూటికై ప్రాకులాడడం వ్యర్థమే.
ప్రభువు తాను ప్రేమించేవాళ్ళకు సంపద నిస్తాడు - 127,1-2

8. నీ లోగిట నీ భార్య పండ్లు పండిన ద్రాక్షతీగలా వుంటుంది
నీ బిడ్డలు ఓలివు పిలకల్లా యెదుగుతారు
ప్రభువు పట్ల భయభక్తులతో మెలిగేవాళ్ళకు
ఈలాంటి దీవెనలు లభిస్తాయి - 128,3-4

9. దైవప్రజలంతా కలసిమెలసి అన్నదమ్ముల్లా జీవిస్తుంటే
చూడ్డానికి యెంత ముచ్చటగా వుంటుంది ! - 133,1

10. దుష్టులు గాలికెగిరే తాలులా కొట్టుకొనిపోతారు - 1,4

11. దేవునిపట్ల భయభక్తులు చూపడం విజ్ఞానానికి మొదటి మెట్టు
పవిత్రుడైన ప్రభువుని తెలుసుకోవడమే వివేకం - సామె 9,10

12. దేవునికి భయపడ్డమే విజ్ఞానం
దుష్కార్యాలను మానడమే వివేకం - యోబు 28,28

# 5. సృష్టి, ప్రాణిసంరక్షణం

## 1) సృష్టి

కుమ్మరి మట్టితో కుండను జేస్తాడు. తల్లి బిడ్డను కంటుంది. కవి కావ్యం వ్రాస్తాడు. కాని ఇవేవి సృష్టికావు. మానవులు చేసేదల్లా ఒక వస్తువును మరొక వస్తువుగా మార్చడం అంతే. కాని భగవంతుని సృష్టి ఈలాంటిది కాదు. ఆయన సర్వశూన్యం నుండి లోకాన్ని సృజించాడు. ఈ పని అతడొక్కడే చేయగలడు. ఈ సృష్టి అంతా ఓనాడు నాశమైపోతుంది. కాని సృష్టికర్త మాత్రం శాశ్వతంగా వుండిపోతాడు.

1. మీ రక్షకుడైన ప్రభువును నేనే
   మిమ్ము సృజించినవాడను నేనే
   ఆకాశాన్ని బట్టవలె విప్పినవాడను నేనే
   ఎవరి తోడ్పాటు లేకుండానే నేను
   భూమిని సృజించాను - యెష 44,24
2. దేవుడు భూమ్యాకాశాలనూ వానిలో వుండే వస్తువులనూ
   శూన్యం నుండే సృజించాడు - 2 మక్కబీ 7,28
3. ప్రభువు పలుకు పలుకగానే ప్రపంచసృష్టి జరిగింది
   ఆయన ఆజ్ఞ ఈయగానే సృష్టి ఏర్పడింది - కీర్త 33,9
4. ప్రభువు నరుణ్ణి తనకు పోలికగా చేసాడు. ఆ నరుణ్ణి స్త్రీ పురుషులనుగా చేసాడు
   - ఆది 1,27
5. నీవు చేసిన సృష్టికంతటికీ నరుణ్ణి అధిపతిని చేసావు
   గొర్రెలు ఎడ్లూ వన్యమృగాలు
   ఆకాశంలోని పక్షులూ సముద్రంలోని చేపలూ
   వీటికన్నిటికీ అతడే రాజు - కీర్త 8,6-9
6. ప్రభువు మహిమ కలకాలము నిల్చుగాక
   ప్రభువు తాను చేసిన సృష్టిని జూచి ఆనందించుగాక - కీర్త 104,31
7. ప్రభువు కావించిన సృష్టి కార్యాలన్నీ మంచివే
   అతడు సకాలంలో ప్రాణుల యక్కరలు తీరుస్తూంటాడు - సీరా 3,33
8. ఆకాశం ప్రభువు మహిమను చాటిచెప్తూంది
   ఆయన చేసిన సృష్టిని వెల్లడిచేస్తూంది - కీర్త 19,1

9. ఆకాశం ప్రభువుది
భూమిని మాత్రం ఆయన నరుల కిచ్చివేసాడు - కీర్త 115,16

10. పురాతన కాలంలోనే నీవు భూమిని సృజించావు
నీ చేతులతోనే ఆకాశాన్ని చేసావు
భూమ్యాకాశాలూ గతిస్తాయని నీవు గతించవు
అవి చినిగిపోయిన బట్టల్లాగ శిథిలమైపోతాయి
నీవు వాటిని బట్టల్లాగ విప్పివేయగా
అవి కంటికి కన్పించకుండా పోతాయి
ఐనా నీవు మాత్రం ఎప్పుడూ ఒకేరీతిగా వుంటావు
నీ ప్రాణానికి అంతమంటూ లేదు - కీర్త 102, 25-27

11. నీ కిష్టమైతే దేవుని ఆజ్ఞలు అనుసరించగలవు
నీవు కోరుకొంటే దేవుని మాట పాటించగలవు
అతడు నీ ముందట నిప్పూ నీళ్ళూ రెండూ పెట్టాడు
ఆ రెంటిలో నీ కిష్టమైనదాన్ని ఎన్నుకో
నీ యెదుటనే జీవమూ మరణమూ రెండూ వున్నాయి
ఆ రెంటిలో నీ కిష్టమైనదాన్ని తీసికో - సీరా 15, 15-17.

## 2) ప్రాణి సంరక్షణం

ప్రభువు ప్రాణికోటిని సృజించడమే ఓ వింత. కాని అంతకంటె పెద్దవింత, ఆయన తాను సృజించిన ప్రాణులను నిరంతమూ సంరక్షిస్తూండడం. ఔనుమరి, నారుపోసిన దేవుడు నీరుపోయకుండా వుంటాడా? ప్రభువు ప్రతినరుణ్ణి అతనికి మేలైన మార్గంలో నడిపిస్తూంటాడు. అలా నడిపించడం గూడ నిర్బంధపెట్టిగాదు, నరుని స్వాతంత్ర్యాన్ని మన్నిస్తూనే. ఈ సత్యాన్ని గ్రహించినపుడు మనకు ఆ ప్రభువుపట్ల నమ్మికా భక్తిభావమూ కలుగుతాయి.

1. ప్రభువు తాను పోసిన ఊపిరి తీసివేస్తే
ప్రాణికోటి అంతా నశిస్తుంది
నరులంతా మంటగలసిపోతారు - యోబు - 9,14-15

2. యోసేపు సోదరులతో ఈలా అన్నాడు. "మిమ్మందరినీ ప్రాణాలతో కాపాడ్డానికీ, మీ బిడ్డలను భూమిమీద నిల్పడానికీ, మీకు ముందుగా దేవుడే నన్నిక్కడికి పంపాడు. నన్నిక్కడికి పంపింది దేవుడేకాని మీరుగాదు. నన్ను ఫరోరాజునకు మంత్రిగా

జేసింది, అతని యింటికి సర్వాధికారినిగా నియమించిందీ, ఐగుప్తు దేశానికి పాలకుణ్ణిగా చేసిందీ ఆ ప్రభువే"- అది 45,7-8

3. యోసేపు సోదరులతో యింకా యిలా అన్నాడు. "మీరైతే నాకు కీడు తలపెట్టారు. కాని దేవుడు ఆ కీడుని మేలుగా మార్చాడు. మిమ్మందరినీ ప్రాణాలతో కాపాడ్డానికే దేవుడు అలా చేసాడు. - ఆది 50,20

4. నరుడు లాభకాంక్షతో ఓడ కడతాడు
తెలివితేటలతో నావను నిర్మిస్తాడు
కాని దాన్ని నీటిమీద నడిపించేది నీవే
సముద్రంలో ఓ మార్గం కల్పించి
అలలగుండా దాన్ని సురక్షితంగా నడిపించేది నీవే - జ్ఞాన 14,3

5. మంచీ చెడ్డా, మరణమూ జీవమూ
కలిమీ లేమీ, అన్నీ ప్రభువు నుండే వస్తాయి - సీరా 11,14

6. నరులు ఆలోచించి ప్రణాళికలు వేయవచ్చుగాక
వాళ్ళ పనులను నడిపించేదేమో దేవుడే - సామె 16,9

7. ప్రభువు తల్లి పక్షిలా నిన్ను తన రెక్కలతో కప్పుతాడు
ఆయన రెక్కల క్రింద నీవు సురక్షితంగా వుండిపోతావు - కీర్త 91,4

8. ప్రభూ! మా పనులన్నీ నీవే చేసి పెడుతుంటావు
నీ వల్లనే మాకు విజయసిద్ధి కలుగుతుంది - యెష 26,12

9. కుండ కుమ్మరితో వివాదానికి దిగుతుందా?
నీవేమి చేయబోతున్నానని మట్టి కుమ్మరిని అడుగుతుందా?
కుండ కుమ్మరికి నేర్పు చాలలేదని గొణుగుతుందా?
బిడ్డడు తల్లిదండ్రులతో మీరు నన్నెందుకు ఈలా పుట్టించారని వివాదమాడతాడా?
ప్రభువు పనులకు మనం వంకలు బెట్టగూడదు
అతడేమి చేయాలో మనం చెప్పనక్కరలేదు - యెష 45,9

10. ప్రభువే నాకు కాపరి, ఇక యేకొదవా లేదు - కీర్త 23,1

11. అతడు మీ తల వెంట్రుకలను గూడ లెక్కిస్తాడు - మత్త 10,30

12. నేను విత్తనం వేసాను. అపొల్లో నీళ్ళుపోసాడు. కాని దానికి పెరుగుదలను ఇచ్చింది దేవుడే - 1 కొరింతి 3,6

13. దేవుణ్ణి ప్రేమించేవాళ్ళకి అన్నీ అనుకూలంగానే జరుగుతాయి - రోమా 8,28

14. అతడు దుర్జనులకూ సజ్జనులకూ గూడ ఒకే విధంగా సూర్య ప్రకాశాన్ని దయచేస్తాడు. సన్మార్గులకూ దుర్మార్గులకూ గూడ ఒకే రీతిగా వర్షాన్ని ప్రసాదిస్తాడు - మత్త 5,45.

# 6. ప్రాణి పోషణం

యిస్రాయేలు దేవుడు సృష్టికర్త మాత్రమేగాదు, ప్రాణి పోషకుడు గూడ. ఆయన ఆకాశం నుండి భూమివైపు పారజూస్తూంటాడు. నరుల నందరినీ గమనిస్తుంటాడు. పూర్వం ప్రభువు మోషే అహరోనులనే నాయకుల ద్వారా తన ప్రజలను నడిపించాడు. ఆయన మబ్బులను లేపి వానలు కురిపిస్తూంటాడు. వన్యమృగాలనూ, కాకి పిల్లలనూ పోషిస్తూంటాడు. ప్రభువు సృజించిన నదులు పొలాలలో పంటను పండిస్తాయి. లోయలలో గోదుమ పంట ఎదుగుతుంది. పొలాల నిండా పశుజాలం మందలు మందలుగా తిరుగాడుతుంది. చెలమల్లో నుండి పారే నీళ్ళు త్రాగి అడవి గాడిదలు దప్పిక తీర్చుకొంటాయి. నీటి యొడ్డున ఎదిగే చెట్ల కొమ్మల్లో పక్షులు గూళ్ళు కట్టుకొని హాయిగా పాడుతుంటాయి. ప్రాణులన్నీ ఆకలై ప్రభువు వైపు చూస్తాయి. ఆయన చేయిచాచి ఆహారం పెడితే కడుపార తింటాయి. పెట్టకపోతే సొమ్మసిల్లిపోతాయి. ఆయన ప్రాణంతీస్తే చస్తాయి. ప్రాణం పోస్తే బ్రతుకుతాయి. ఈ విధంగా భూమి మీద ప్రాణులు పుడుతూంటాయి, గిడుతుంటాయి. ప్రభువు మాత్రం నిత్యం ప్రాణిపోషకుడుగా వ్యవహరిస్తుంటాడు. ఈ భూమి ప్రభువు చేసిన ప్రాణులతో నిండివుంది. అడవి మేకలనూ, కుందేళ్ళనూ, సింగపు కొదమలనూ పోషించేది అతడే. ఆ ప్రభువు ప్రేమతో, కరుణతో ప్రాణికోటి నంతటినీ తనయందు భరించుకొంటూంటాడు.

1. ప్రభువు ఆకాశము నుండి
   భూమిమీదకి పారజూస్తుంటాడు
   నరుల నందరినీ గమనిస్తుంటాడు
   సింహాసనం మీద కూర్చుండి రాజ్యం చేసే ప్రభువు
   భూమి మీద సంచరించే నరులందరినీ గుర్తిస్తుంటాడు
   నరుల ఆలోచన లన్నిటినీ పరిశీలిస్తుంటాడు
   వాళ్ళు చేసే పనులన్నీ పరీక్షిస్తుంటాడు - కీర్త 33,13-15
2. మోషే ఆరోహనులనే కాపరుల ద్వారా
   నీ ప్రజలను ఓ మందలా నడిపించావు - కీర్త 77,20
3. అతడు ఆకాశంలో మబ్బులు ఆవరించేలా చేస్తుంటాడు
   నేలమీద వానలు కురిపిస్తుంటాడు
   కొండలమీద పచ్చిక మొలిపిస్తుంటాడు

వన్యమృగాలన్నిటికీ ఆహారం చేకూర్చి పెడుతుంటాడు
కావుకావుమని అరచే కాకిపిల్లలను పోషిస్తూంటాడు - 147,8-9

4. నీవు భూమిని సందర్శించి దానిమీద వాన కురిపిస్తావు
దానిని మహైశ్వర్యంతో నింపుతావు
నీ కాలువలు నీటితో నిండివుంటాయి
అవి ధాన్యా న్నొసగుతాయి
నీవు చేసిన కార్యమిది
నీవు కుండపోతగా వాన కురిపించి నేల దుక్కులు తడుపుతావు
మట్టిపెళ్ళలను కరిగించి చదును చేస్తావు
జల్లులతో మట్టిని నానిస్తావు
ఆ మట్టినుండి మొలచిన మొలకలకు పెంపు నొసగుతావు
నీ మంచితనంతో సంవత్సరాన్ని
పంట అనే కిరీటంతో అలంకరించావు
నీవు నడచిన తావులందెల్ల సమృద్ధి నెలకొంది
ఎడారి పొలాలు పచ్చబడ్డాయి
కొండ నేలల్లో ఆనందం నెలకొంది
పచ్చిక పట్టుల్లో గొర్రెల మందలు వస్త్రాలు కప్పినట్లుగా వున్నాయి
లోయల్లో గోదుమ పైరు కంబళ్లు పరచినట్లుగా వుంది
ఆ పొలాలన్నీ ఆనందంతో పాటలు పాడుతున్నాయి - 65,9-13

5. నీవు లోయల్లోని చెలముల్లోనుండి నీళ్ళు ఉబికి వచ్చేలా చేస్తావు
కొండలమధ్య నీళ్ళు వెల్లువలై పారతాయి
పొలాల్లో తిరిగే మృగాలన్నీ నీళ్లు త్రాగుతాయి
అడవి గాడిదలు దప్పిక తీర్చుకొంటాయి
నీటియొద్దున ఎదిగే చెట్ల కొమ్మల్లో పక్షులు గూళ్ళు కట్టుకొని
కమ్మగా పాడుతుంటాయి -104, 10-12

6. సింహాలు కూడ ఆహారం దొరకక్క అలమటిస్తాయి
ప్రభుని ఆశ్రయించేవాళ్ళకు మాత్రం ఏ కొరత వుండదు -34,10

7. ప్రాణులన్నీ ఆకలైనపుడు నీవైపు చూస్తుంటాయి
నీవు ఆహారంపెడితే తింటూంటాయి

నీవు మేతపెడితే సంతృప్తి చెందుతూంటాయి
కాని, నీవు మరుగైపోతే అవి వ్యాకులపడతాయి
నీవు ఊపిరితీస్తే అవన్నీ చచ్చిపోతాయి
ఏ మట్టినుండి పుట్టాయో ఆ మట్టిలోనే కలసిపోతాయి
నీవు ఊపిరిపోయగా అవి బ్రతుకుతాయి
ఈ విధంగా నీవు భూమిమీద ఎప్పటికప్పుడు
క్రొత్త ప్రాణులను సృజిస్తూంటావు - 104, 27-30

8. ప్రాణులన్నీ ఆశతో నీవైపు చూస్తుంటాయి
వాటికి ఆకలైనప్పుడు నీవు ఆహారం పెడతావు
నీవు ప్రాణుల కవసరమైనంతగా ఆహారం ఇస్తూంటావు
వాటి ఆశ తీర్చుతూంటావు
ప్రభువు ఎల్లవేళలా నీతిమంతుడే
అతని కార్యాలన్నీ దయాపూరితాలే - 145, 15-17

9. ఎత్తయిన కొండల్లో అడవి మేకలు నివసిస్తాయి
కొండబొరియల్లో కుందేళ్ళు జీవిస్తుంటాయి
ఋతువులను తెలిపేందుకు నీవు చంద్రుణ్ణి చేసావు
సూర్యునికి తానెప్పుడు అస్తమించాలో తెలుసు
నీవు రాత్రిని కలిగించావు
చీకటిలో వన్యమృగాలు సంచారం చేస్తుంటాయి
సింగపు కొదమలు గర్జిస్తూ వేటకు వెళ్తాయి
నీ విచ్చే ఆహారాన్ని వెదుకుకొంటాయి
సూర్యోదయం కాగానే ఆ మృగాలన్నీ తిరిగివచ్చి
తమ గుహల్లో దాగుకొంటాయి
అప్పుడు నరులు తమ పనికి బయలుదేరుతారు
సూర్యాస్తమయం వరకు పనిచేసుకొంటారు
ప్రభో! నీవు ఎన్ని ప్రాణులను సృజించావు!
తెలివితేటలతో వాటినన్నిటినీ కలిగించావు గదా!
ఈ భూమి నీవు సృజించిన ప్రాణులతో
క్రిక్కిరిసివుంది - 104, 18-24.

# 7. సాంఘిక న్యాయం

దుష్టులు పరపీడనం, హత్య, లంచాలు మొదలైన నేరాలకు పాల్పడతారు. దుర్మార్గుల కానుకలూ బలులూ దేవుడు అంగీకరించడు. సాంఘిక న్యాయాన్ని పాటించడం ఉత్తమారాధన మౌతుంది. అత్యాశవల్ల ఇతరులకు ముట్టవలసినదాన్ని మనం దక్కించుకొని మనసొంతం చేసికొంటాం. నరజాతి చరిత్ర అంతా పరపీడనంతో నిండివుంది.

1. భక్తిమంతులు భూమిమీద కరవైపోయారు
సత్యవంతులు కలికానికైనా లేరు
ప్రతివాడూ హత్యకు పాల్పడేవాడే
ప్రతివాడూ పొరుగువాణ్ణి వేటాడేవాడే
ప్రజలు దుర్మార్గాల్లో ఆరితేరిపోయారు
అధికారులూ న్యాయమూర్తులూ లంచాలు కోరుతున్నారు
పలుకుబడి కలవాళ్ళ కోరికలు నెరవేరుతున్నాయి -మీకా 7, 2-3

2. నిరంతరం మీరర్పించే యీ బలులు నా కెందుకు?
మీరు దహనబలిగా అర్పించే పొట్టేళ్ళూ
కోడెదూడల క్రొవ్వూ నాకు విసుగు పుట్టిస్తున్నాయి
ఎడ్ల నెత్తురూ మేకల నెత్తురూ నాకు గిట్టవు
నా దేవళంలో ఆరాధించడానికి వచ్చేపుడు
మిమ్ము వీటినన్నిటిని తీసికొని రమ్మన్న దెవరు?
మీ కొరగాని బలులు నాకిక వద్దు
వాటి పొగను నేను చీదరించుకొంటున్నాను
మీ అమావాస్య పండుగలు విశ్రాంతిదిన పండుగలు
మీ జాతరలు నాకు అసహ్యంగా వున్నాయి
వాటిని నేనిక భరించలేను, సహించలేను
మీరు ప్రార్థనకై చేతులెత్తినపుడు
నేను మీ మొగంగూడ చూడను
మీరు ఎన్ని జపాలు చేసినా నేను వినను
మీరు వట్టి నరహంతలు - యెషయా 1, 11-15

3. అన్యాయార్జితమైన పశువుని బలిగా అర్పిస్తే
ఆ బలి దోషపూరితమైన దౌతుంది
దుష్టుల బలిని దేవుడు అంగీకరించడు

మహోన్నతుడు దుర్మార్గుల బలివలన సంతుష్టి చెందడు
పెక్కు బలులు అర్పించడం వలన వారి పాపాలు తొలగిపోవు
పేదవాని పశువుని అపహరించి బలిగా అర్పించడం
తండ్రి చూస్తుండగా కుమారుణ్ణి చంపడంలాంటిది
పేదలకు అన్నమే ప్రాణం
ఆ యన్నాన్ని నాశం చేయడమనగా పేదవాణ్ణి చంపడమే
పేదవాడి జీవనోపాధిని చెరచేవాడు వాణ్ణి చంపినట్లే
కూలివాడి కూలి ఎగగొట్టేవాడు వాణ్ణి హత్య చేసినట్లే - సీరా 34, 18-22

4 మీ యొడలు కడుగుకొని శుద్ధిచేసికొనండి
ఇక నా యెదటు దుష్కార్యాలు చేయకండి
మీ పాపపు పనులనుండి వైదొలగి
సత్కార్యాలకు పూనుకొనండి
న్యాయాన్ని పాటించండి, పీడితులకు మేలు చేయండి
అనాథుల హక్కులు నిలబెట్టండి
వితంతువులను ఆదుకొనండి - యెష 1, 16-17

5. దరిద్రులను పీడించే బంధాలను సడలిస్తే
వాళ్ళ మెడమీది అన్యాయపు కాడిని తొలగిస్తే
వాళ్ళకు స్వాతంత్ర్యం ప్రసాదిస్తే
అదే నాకు నచ్చిన ఉపవాసం,
మీ భోజనాన్ని పేదలకు గూడ వడ్డిస్తే
దిక్కులేనివారికి మీ యింటిలో ఆశ్రయమిస్తే
దీనులకు బట్టలు కట్టబెడితే
అక్కరలోవున్న తోడి జనాన్ని ఆదుకొంటే
అదే నాకు నచ్చిన ఉపవాసం - యెషయా 58, 6-7

6. నీతి ఓ నదిలాగ పొంగి పారాలి
న్యాయం ఓ జీవనదిలాగ ప్రవహించాలి - ఆమోసు 5,24

6. A. అందుకు ఆయన వారితో "ఈ నా సోదరులలో అత్యల్పుడైన ఏ వొక్కనికి మీరు ఇవి చేసినపుడు అవి నాకు చేసితిరి అని వక్కాణించుచున్నాను" అని చెప్పును: అందుకు ఆయన "ఈ యత్యల్పులలో ఒకనికైనను మీరివి చేయనప్పుడు నాకును చేయలేదని వక్కాణించుచున్నాను" అని వారితో చెప్పును. -మత్తయి 25, 40-45

6 B. ఏ వ్యక్తియైనా ధనికుడై వుండికూడ అవసరంలో వున్న నరుణ్ణి జూచి హృదయ ద్వారాన్ని మూసివేసికొంటే, ఇక హృదయంలో దైవప్రేమ వుందని ఎట్లా చెప్పుకోగలడు? బిడ్డలారా! మన ప్రేమ కేవలము మాటలు సంభాషణలు మాత్రమే కారాదు. అది చేతలతో నిరూపింపబడే యథార్థ ప్రేమ కావాలి – 1 యోహా 3, 17–18.

6. C. కూడు గుడ్డల కొరకు సహోదరుడైనను లేక సోదరియైనను అలమటించుచున్నచో, వారి జీవితావసరములు తీర్పక "దేవుడు మిమ్ము దీవించుగాక. చలికి కప్పుకొనుడు. హాయిగా భుజింపుడు" అని మీలో ఎవడైన పల్కిన యెడల ప్రయోజనమేమి? క్రియలులేని విశ్వాసము ఒంటిదై నిర్జీవమైపోతుంది... – యాకో 2, 17–18.

7. భగవంతుడు ఈ భూమిని నరులందరి కోసమూ సృజించాడు. దాని ఫలితాన్ని కూడ అందరూ అనుభవించాలనే ఉద్దేశించాడు. కాని అత్యాశవల్ల కొందరు మాత్రమే దాన్ని దక్కించుకొంటున్నారు. – భక్తుడు ఆంబ్రోసు

8. ఆకలితో చచ్చేవాడికి అన్నం పెట్టండి. లేకపోతే మీరే వాణ్ణి చంపినట్లు – ఆంబ్రోసు

9. ఇతరుల వస్తువులను దొంగిలించినవాడిని "దొంగ" అంటాం. బట్టలు లేనివాడికి బట్టలు ఈయగలిగికూడ ఈయనివానిని అదే పేరుతో పిలవవద్దా? నీ యింటిలో సమృద్ధిగా వున్న భోజనం పేదవాడికి చెందుతుంది. అవసరం లేకున్నా నీ యింటిలో భద్రంగా దాచివుంచిన దుస్తులు గుడ్డలులేనివానికి చెందుతాయి. నీ యింటిలో నీవు వాడకుండా అట్టిపెట్టుకున్న ముచ్చలు చెప్పులు లేనివాడికి చెందుతాయి. అలాగే నీవు కూడబెట్టిన డబ్బు కూడ పేదవాడికి చెందుతుంది. – భక్తుడు బాసిల్

10. నీవు కూడబెట్టిన ధనాన్ని ఎలా సంపాదించావు? నరుడు నాటకాన్ని చూడ్డానికి ఓ ఆసనం కొంటాడు. ఇక ఆ యాసనంమీద ఎవరినీ కూర్చోనీయడు. అది అందరికొరకూ ఉద్దేశింపబడినదే ఐనా, ఒక్కడు దాన్ని దక్కించుకొంటాడు. ధనవంతులుకూడా ఈలాగే చేస్తారు. వాళ్ళు ఇతరులకంటె ముందుగా పదిమందికీ చెందిన ఆస్తిని దేన్నో అనుభవిస్తున్నారు. కనుక దాన్ని శాశ్వతంగా తామే దక్కించుకోవాలని కోరుకొంటారు. ప్రతివాడు తనకు అవసరమైనది మాత్రమే వుంచుకొని మిగిలిన దానిని అక్కరలో వున్నవాళ్ళకు ఇచ్చివేస్తే ప్రపంచంలో ధనికులు దరిద్రులు అనే వ్యత్యాసం వుండదుకదా! నరుడు తల్లికడుపునుండి వట్టి చేతులతో వచ్చాడు. వట్టి చేతులతోనే మళ్ళీ భూమాత గర్భం చేరతాడు. మరి ఈ మధ్యలో అతడు కూడబెట్టిన సిరిసంపదలు ఎక్కడనుండి వచ్చినట్లు? –భక్తుడు బాసిల్

11. భగవంతుడు నరుణ్ణి తనకు పోలికగా చేసాడు అని చెప్తారు. కాని నేడు అధిక సంఖ్యాకులైన నరులు నికృష్టులు, దరిద్రులు, అజ్ఞానులు, భయకంపితులు, పీడితులు, దౌర్భాగ్యులు. ఐతే ఆ భగవంతుడు కూడ వీళ్ళలాంటి వాడేనని నమ్మడానికి నాకు మనసురావడం లేదు. మరి ఈ ప్రజలను ఈలా అభాగ్యులనుగా చేసిందెవరు? – జూలియస్ నైరెరె

12. నేను కొయ్యబొమ్మనూ రాతి విగ్రహాన్నీ కాదు
సశరీరుడనూ సజీవుడనూ ఐన దేవుణ్ణి
నేను నరుల నడుమ వసిస్తూన్నాను
ఐనా నరులు నన్ను గుర్తించడంలేదు
నేను మురికివాడల్లో క్షయతో మూల్గుతున్నాను
ఎండకూ వానకూ చలికీ బాధపడుతూన్నాను
ఆకలితో నా కడుపు నకనకలాడుతూంది
నేను ఉపాధ్యాయుణ్ణి విద్యార్థినీ కూడా
యజమానుణ్ణీ పనివాణ్ణీ కూడా
పీడితుణ్ణీ పీడకుణ్ణీ కూడా, దరిద్రుణ్ణీ ధనికుణ్ణీ కూడా
అమెరికాలో, రష్యాలో, చైనాలో
వియత్నాంలో, కంపూచియాలో, ఇండియాలో వసించేది నేనే
నరులున్నకాడల్లా నేనూ వున్నాను
ఐనా నరులు నన్ను గుర్తించడం లేదు – ఓ అజ్ఞాత రచయిత

13. ఉర్వివారికెల్ల నొక్క కంచము పెట్టి
పొత్తు గుడిపి కులము పొలియజేసి
తలను చేయి పెట్టి తగనమ్మ జెప్పరా
విశ్వదాభిరామ వినుర వేమ.

14. ఏ దేశ చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం?
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం
బలవంతులు దుర్బల జాతిని
బానిసలను కావించారు
నరహంతలు ధరాధిపతులై

చరిత్రమున ప్రసిద్ధి కెక్కిరి
ఒక వ్యక్తిని మరొక వ్యక్తి,
ఒక జాతిని వేరొక జాతీ,
పీడించే సాంఘిక ధర్మం
ఇంకనా? ఇకపై సాగదు. - శ్రీశ్రీ, మహా ప్రస్థానం.

## 8. పని

మనకు పని చేయాలంటే యిష్టంగా వుండదు. పనినుండి తప్పించుకొంటే ఎంతో గొప్ప అనుకొంటాం. కాని బైబులు భగవంతుడు స్వయంగా పనిచేసేవాడు. ఆ భగవంతునిలాగే అతని భక్తుడుకూడా పని చేయాలి. చివరికి మనలను రక్షించేదీ, శిక్షించేదీకూడ మనంచేసే పనే.

1. దేవుడు తాను చేసిన సృష్టినంతటినీ చూచాడు. అతని కంటికది బాగా వుంది. అదే ఆరవరోజు. ఈ విధంగా భూమి ఆకాశం సమస్త వస్తువులతో సంపూర్ణంగా రూపొందాయి. ఏడవ రోజు దేవుడు తాను చేస్తూవున్న పనిని ముగించాడు. ఆ రోజు విశ్రాంతి తీసికొన్నాడు. ఏడవనాడు పనిని మానివేసాడు. కావున దేవుడు ఆ రోజును దీవించి పవిత్రదినంగా చేసాడు - ఆది 1,31-2,3
2. దేవుడైన యావే నరుని ఏదెను తోటలో వుంచాడు. ఆ తోటను సాగుచేయడం, కాపాడ్డం అతనిపని - ఆది 2, 15
3. నీవు మట్టిలో కలిసిపోయినదాక నీ నొనటి చెమటోడ్చి పొట్టకూడు సంపాదించుకోవాలి. నీవు మట్టినుండి పుట్టావు, చివరకు మట్టిలోనే కలసిపోతావు - ఆది 3,19
4. సోలోమోను దేవాలయాన్ని కట్టడానికి ఏడేండ్లు పట్టింది - 1 రాజు 6, 38
5. సోమరీ! చీమలను జూడు
వాటి జీవితాన్ని జూచి బుద్ధి తెచ్చుకో
వాటికి నాయకుడు లేదు,
పర్యవేక్షకుడు లేదు, అధికారి లేదు,
ఐనా అవి వేసవిలో ఆహారం చేకూర్చుకొంటాయి
కోతకాలంలో ధాన్యాన్ని సేకరించుకొంటాయి
సోమరీ! నీ వెంతకాలం పండుకొంటావు?
ఎప్పుడు నిద్ర మేల్కొంటావు? - సామె 6, 6-9

6. నేను ఐగుప్తు దేశీయులు మీ నెత్తికెత్తిన బరువు తొలగిస్తాను. వారి దాస్యం నుండి మీకు విముక్తి కలిగిస్తాను. శక్తిగల నా చేతిని చాచి మీ శత్రువులను నిశితంగా శిక్షిస్తాను. మిమ్ము దాస్యంనుండి విడిపిస్తాను - నిర్గ 6,6

7. మనుష్యకుమారుడు సేవలు చేయించుకోవడానికి గాదు, సేవలు చేయడానికి వచ్చాడు. అతడు అనేకుల రక్షణార్థం తన ప్రాణాలను ధారపోయడానికి వచ్చాడు - మార్కు 10,45

8. నన్ను పంపినవాని చిత్తాన్ని నెరవేర్చడం, అతని పని పూర్తి చేయడం, నా కాహారం - యోహా 4,34.

9. అతడు మంచిపనులు చేస్తూ పర్యటించాడు - అ. చ. 10,38

10. మీ వెలుగుని ప్రజల యెదుట ప్రకాశించనీయండి. ప్రజలు మీ సత్కార్యాలను జూచి పరలోకంలోని మీ తండ్రిని కొనియాడతారు - మత్త 5,16

11. మీర్లు మీ బాధ్యతలను నిర్వహించిన పిమ్మటగూడ "మేము అయోగ్యులమైన సేవకులం. మా కర్తవ్యాన్ని మాత్రమే నెరవేర్చాం" అని పల్కండి - లూకా 17,10

12. మంచిచెట్టు మంచిపండ్లనూ చెడుచెట్టు చెడుపండ్లనూ కాస్తాయి. కావున నరుల ప్రవర్తననుబట్టి మీరు వారిని తెలిసికోవచ్చు - మత్త 7, 16-20

13. పని చేయనివాడు కూడు తినడానికి అర్హుడుకాడు - 2తెస్స 3,10

14. నేను మంచి పోరాటం పోరాడాను. నా పరుగు ముగించాను. విశ్వాసం నిలుపుకొన్నాను. ఇప్పుడు నాకొరకు పందెపు బహుమానం వేచివుంది. న్యాయవంతుడూ న్యాయమూర్తియైన ప్రభువు నాకు నీతిమంతుల కిరీటాన్ని బహూకరిస్తాడు. ఒక్క నాకేగాదు. తన దర్శనం కొరకు ప్రేమతో వేచివుండేవాళ్ళందరికీ అతడు అలాంటి బహుమతినే అనుగ్రహిస్తాడు - 2తిమొ 4, 7-8

15. అనగనగ రాగ మతిశయిల్లుచునుండు
తినగ తినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన.

16. ధనాని భూమౌ పశవశ్చ గోష్ఠే
నారీ గృహద్వారి జనాః శ్మశానే
దేహశ్చితాయాం పరలోక మార్గే
కర్మానుగో గచ్ఛతి జీవ ఏకః ॥

# 9. హృదయం

బైబుల్లో హృదయంటే నరుని వ్యక్తిత్వం. విశేషంగా నైతికమైన వ్యక్తిత్వం. హృదయంద్వారా నరుడు భగవంతునితో సంబంధం పెట్టుకొంటాడు. క్రీస్తు హృదయం మన హృదయంమీద సోకి దాన్ని పవిత్రం చేస్తుంది.

1. భూమిమీద మానవులు దుష్టులైపోయారు. వాళ్ళు ఎల్లప్పుడూ చెడ్డ పనులు చేయాలనే కోరుకొనేవాళ్ళు - ఆది 6,5
2. యౌవనంనుండి కూడ నరుని ఆలోచనలు దుష్టంగానే వుంటాయి - ఆది 8,21
3. యిస్రాయేలీయులందరు సున్నతి సంస్కారంలేని హృదయం కలవాళ్ళు - యిర్మీ 9, 26
4. దేవుడు నరుడు చూచే చూపుతో చూడడు. నరుడు వెలుపలి రూపాన్ని మాత్రమే చూస్తాడు. కాని దేవుడు హృదయాన్ని పరిశీలిస్తాడు - 1 సమూ 16,7
5. నరుని హృదయాన్ని ఎవడు అర్థం చేసుకోగలడు?
   హృదయానికున్నంత కపటం దేనికీ లేదు
   అది ఘోరవ్యాధితో కుమిలిపోతుంటుంది
   దాని రోగాన్ని కుదర్చలేం
   ఐనా ప్రభువునైన నేను నరుని మనస్సునీ
   హృదయాన్నీ పరిశీలించి చూస్తూంటాను
   ప్రతినరుణ్ణి అతడు జీవించే తీరునుబట్టీ,
   పనిచేసే రీతినిబట్టీ, సంభావిస్తుంటాను - యిర్మీ 17, 9-10
6. ఈ ప్రజలు నన్ను పెదవులతో గౌరవిస్తున్నారు. వీళ్ళ హృదయాలు నాకు దూరంగా వున్నాయి-యెష 29, 13
7. దేవుని వాక్కు రెండంచుల కత్తిలా మన హృదయాన్ని నరుకుకొని లోపలికి పోతుంది. ఆ హృదయంలోని కోరికలనూ ఆలోచనలనూ పరిశీలించి చూస్తుంది - హెబ్రే 4, 12
8. పాతాళలోకం కూడ ప్రభువుకి తెలియందికాదు అంటే నరుని హృదయాలోచనలు అతనికి తెలియకుండా వుంటాయా? -సామె 15, 11
9. మన ప్రభువైన దేవుడు ఏకైక ప్రభువు. మీ ప్రభువైన దేవుణ్ణి పూర్ణ హృదయంతో, పూర్ణ మనస్సుతో, పూర్ణశక్తితో ప్రేమించండి - ద్వితీ 6, 4-5
10. దేవా! నాలో నిర్మల హృదయాన్ని సృజించు
    నూతనమూ స్థిరమూ ఐన మనస్సును నాలో నెలకొల్పు
    నీ సన్నిధినుండి నన్ను గెంటివేయకు
    నీ పరిశుద్ధాత్మను నా యొద్దనుండి తీసివేయకు - కీర్త 51, 10-11

11. నీవు బలులవలన సంతుష్టిచెందవు
నేను దహనబలి నర్పిస్తే నీవు ప్రీతిజెందవు
దేవా! నేనర్పించే బలి పశ్చాత్తాపపూరితమైన హృదయమే
పశ్చాత్తాప పూరితము వినయాన్వితము ఐన హృదయాన్ని
నీ వనాదరం చేయవు - 51, 17

12. ప్రభువు మీకూ, మీ సంతానానికీ విధేయాత్మకమైన హృదయాలను దయచేస్తాడు - ద్వితీ 30,6

13. ఆ కాలంలో నేను యిస్రాయేలీయులతో జేసికొనే నూత్న నిబంధనం ఇది. నేను నా ధర్మశాస్త్రాన్ని వాళ్ళ అంతరంగంలో వుంచుతాను. నా విధులను వాళ్ళ హృదయాలమీద వ్రాస్తాను. నేను వాళ్ళ దేవుణ్ణవుతాను, వాళ్ళు నా ప్రజ లౌతారు - యిర్మీ 31, 33

14. నేను వాళ్ళకు ఏకైక దృష్టిగల హృదయాన్ని ప్రసాదిస్తాను. అందువలన వాళ్ళు నన్ను శాశ్వతంగా పూజిస్తారు. వాళ్ళూ వాళ్ళ తర్వాత వచ్చేవాళ్ళ సంతతీకూడ బాగుపడిపోతారు - యిర్మీ 22, 33

15. నేను మీకు నూత్న హృదయాన్నీ నూత్న మనస్సునీ దయచేస్తాను. మీలోని రాతిగుండెను తీసివేసి దాని స్థానే మాంసపు గుండెను నెలకొల్పుతాను. నా యాత్మను మీ మీదికి పంపుతాను. మీరు నా యాజ్ఞలను పాటించేలా, నా శాసనాల ప్రకారం జీవించేలా చేస్తాను - యెహెజ్కేలు 36, 26-27

16. హృదయంలోనుండి దురాలోచనలు పుట్టుకవస్తాయి. వీటివలన నరహత్యలు వ్యభిచారాలు అశుద్ధ కార్యాలు దొంగతనాలు కూట సాక్ష్యాలు దూషణలు కలుగుతాయి. నరుని మాలిన్యపరచేది యివే కాని చేతులు కడుగుకోకుండ భుజించడంలాంటి బాహ్యశుద్ధిలేని క్రియలు కాదు - మత్త 15, 19

17. విశుద్ధ హృదయులు దేవుణ్ణి దర్శిస్తారు - మత్త 5,8

18. నేను సాధుశీలుణ్ణి, వినమ్ర హృదయుణ్ణి. మీరు నా నుండి నేర్చుకొనండి - మత్త 11,29

19. సైనికుల్లో వొకడు అతని ప్రక్కను బల్లెంతో పొడిచాడు. వెంటనే రక్తమూ నీరూ స్రవించాయి - యోహా 19,34

20. ఆత్మశుద్ధిలేని యాచార మదియేల
భాండశుద్ధి లేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజ లేలయా?

# 10. నీతిమంతులూ, హృదయశుద్ధీ

బైబులు నీతిమంతులను చాలసార్లు పేర్కొంటుంది. వాళ్ళను దుర్మార్గులతో పోల్చి చూపుతుంది. నీతిమంతుల్లో కనిపించే ప్రధానలక్షణం చిత్తశుద్ధి. వాళ్ళు నిర్దోషులు, ధర్మాన్ని పాటించేవాళ్ళు, సత్యం పలికేవాళ్ళు, తలపుల్లోను చేతల్లోను నిర్మలంగా వుండేవాళ్లు. కనుకనే వాళ్ళకు ప్రభు మందిర ప్రవేశమూ, ప్రభు దర్శనభాగ్యమూ లభిస్తుంది. దేవుడు ఆకాశాన్నుండి భూమిమీదికి పారజూస్తాడు. ఎవరయినా నీతిమంతులు తన్ను పూజిస్తున్నారా అని పరిశీలిస్తాడు. దేవదారులాగ పెరిగి తాత్కాలికంగా వృద్ధిలోకి వచ్చినా, దుర్మార్గులేమో సర్వనాశమైపోతారు. కాని నీతిమంతుణ్ణి ప్రభువు చేయి విడువడు. అతని బిడ్డలు అడుక్కొని తినవలసిన యవసరంలేదు. ఎవరు నీతిమంతులో, ఎవరు కుటిలబుద్ధులో ప్రభువుకి తెలుసు. ఆయన సరళబుద్ధి కలవానితో సరళంగాను, కపటబుద్ధి గలవానితో కపటంగాను ప్రవర్తిస్తాడు. నీతిమంతులు నానా బాధలకు గురౌతారు. ఐనా ప్రభువు వాళ్ళను విడనాడడు. ఒడ్డు చేర్చితీరతాడు. సజ్జనులకు చీకటిలో గూడ వెలుగు ప్రకాశిస్తుంది. దుర్మార్గులు ఆపదల్లో చిక్కి అణగారిపోతారు.

1. ప్రభూ! నీ మందిరంలో వసింపగలవా డెవడు?
నీ పరిశుద్ధ పర్వతంమీద నిలువగలవా డెవడు?
నిర్దోషిగా మెలిగేవాడూ, ధర్మాన్ని పాటించేవాడూ, సత్యపాలకుడూ
పరనింద చేయనివాడూ, మిత్రద్రోహం తలపెట్టనివాడూ!
ఇరుగుపొరుగువాళ్ళమీద నిందలు మోపనివాడూను - కీర్త 15, 1-3
2. ప్రభువు కొండమీది కెక్కగలవా డెవడు?
ఆయన దేవళంలో అడుగు బెట్టగలవా డెవడు?
తలపులలోనూ చేతలలోనూ నిర్మలుడైనవాడూ.
విగ్రహారాధనకు పూనుకోనివాడూ,
దొంగప్రమాణాలు చేయనివాడూను - 24, 3-4
3. ఆకాశంనుండి ప్రభువు భూమిమీదికి పారజూస్తుంటాడు
నరుల్లో ఎవరైనా వివేకవంతులున్నారా అనీ,
ఎవరైనా తన్ను పూజిస్తున్నారా అనీ పరిశీలిస్తుంటాడు - 14, 2
4. నేను ఓ దుర్మార్గుడు వృద్ధిలోకి రావడం జూచాను
అతడు దేవదారులాగ ఎదిగిపోయాడు
నేను మళ్ళా ఆ చోటికివెళ్ళి చూద్దునుగదా అతడు గతించాడు
అతనికోసం గాలించానుగాని అతడు కన్పించలేదు - 37, 35-36

5. నే నిప్పుడు ఏండ్లు కడచిన ముదుసలిని
ఐనా నీతిమంతుడైన నరుణ్ణి ప్రభువు చేయి విడవడంగానీ,
అతని కుమారులు బిచ్చమెత్తుకోవడంగానీ,
నే నింతవరకు చూడలేదు - 37, 25
6. ప్రభూ! నా దోషాలను పరిశీలించబోకు
నీ ముందట నిర్దోషియైనవా డొక్కడూ లేదు -143, 2
7. ఋజువర్తనులతో నీవూ ఋజువుగానే ప్రవర్తిస్తుంటావు,
కాని కపటవర్తనులతో నీవూ కపటంగానే మెలుగుతూంటావు - 18, 26
8. ప్రభువు నీతిమంతులకు సాయపడుతూంటాడు
కాని దుర్మార్గులు సర్వనాశమైపోతారు - 1,6
9. నీతిమంతుడు చాలా బాధలకు గురౌతాడు,
ఐనా వాటన్నిటినుండీ ప్రభువతన్ని రక్షిస్తాడు - 34, 19
10. నీతిమంతులూ దయాపరులూ ఐన సజ్జనులకు
చీకటిలోగూడ వెలగు ప్రకాశిస్తుంది - 112,4
11. అబ్రాహాము తొంబై తొమ్మిది యేండ్ల యీడువాడై యున్నపుడు దేవుడు ప్రత్యక్షమై "నేను సర్వశక్తిమంతుణ్ణయిన దేవుణ్ణి. నీవు నా సన్నిధిలో నడుస్తూ ఉత్తముడివిగా మెలగాలి" అని చెప్పాడు. - అది 17,1
12. ఈ ప్రజలలో సమర్థులనూ, దైవభీతికలవారినీ, లంచగొండులు కానివారినీ యేరి వీరికి నాయకులను చేయి - నిర్గ 18,21
13. ఇకమీదట యావేకు భయపడి ఆ ప్రభువుని చిత్తశుద్ధితో పూజించండి - యోషు 23, 14
14. హిస్కియా గోడవైపు మొగం త్రిప్పి "ప్రభూ! నేను చిత్తశుద్ధితోను నమ్మదగిన తనంతోను నిన్ను సేవించానని జ్ఞప్తికి తెచ్చుకో. నే నెల్లవేళలా నీ చిత్తాన్ని పాటించాను" అని ప్రార్థన చేస్తూ కన్నీళ్ళు కార్చాడు - 2 రాజు 20,3
15. స్వర్గంలోని దేవుణ్ణి పూజించడానికి వచ్చినప్పుడు
నేనేమి తీసికొని రావాలి?
ఏడాది దూడలను దహనబలిగా కొనిరావాలా?
వేలకొలది పొట్టేళ్ళనీ, పదివేల నదుల ఓలివుతైలాన్నీ
కొనివస్తే అతడు సంతుష్టి చెందుతాడా?
నేను చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తంగా
నా జ్యేష్ఠకుమారుని బలిగా అర్పించాలా?

ఓయి! మేలైనదేదో ప్రభువు నీకు తెలియజేసియేయున్నాడు
నీవు న్యాయాన్ని పాటించు, ప్రేమతో మెలుగు,
నీ దేవుని పట్ల వినయంతో ప్రవర్తించు
ప్రభువు నీ నుండి కోరుకొనేది యిదే - మీకా 6, 6-8.

## 11. ప్రభువు సర్వజ్ఞుడు

ప్రభువు కర్మసాక్షి. ఆయనకు అన్నీ తెలుసు. మనం చేసే పనులన్నీ గమనిస్తూనే వుంటాడు. ఆ ప్రభువు మన హృదయంలోని ఆలోచనలనూ కోర్కెలనూగూడ గుర్తుపట్టగలడు. మన భవిష్యత్తు ఎలా వుంటుందో మనకు తెలియదుగాని, ఆయనకు తెలుసు. అతనికి రహస్యాలంటూ లేవు. భక్తుడు ఈ సత్యాన్ని గుర్తించి పాపకార్యాలకు పూనుకోకుండా వుండాలి. మన పాపపుణ్యాలను గుర్తించి వాటికి సంభావనా దండనా విధించే నాథుడొకతున్నాడని అర్థం చేసికోవాలి.

3. ప్రభూ! నేను నీ కోసం ఎంతగా ఆశపెట్టుకొన్నానో
ఎంతగా ఆపసోపాలు పడుతున్నానో నీకు తెలుసు - కీర్త 38,9
4. నీవు దూరంనుండే నా యాలోచనలను గుర్తుపడతావు- కీర్త 139,2
5. ప్రభో! నరుల హృదయాల్లోని ఆలోచనలు తెలిసినవాడివి నీ వొక్కడవే
- 1 రాజు 8,39
6. నీవు మాతృగర్భంలో రూపొందకమునుపే
నిన్ను గూర్చి నాకు తెలుసు
నీవు జన్మింపమునుపే నిన్ను పవిత్రపరచి
జాతులకు ప్రవక్తగా నియమించాను -యిర్మీ, 1.4
7. ప్రభువు నన్ను చూడడు
ఆకాశంలో వుండేవాడు నన్ను స్మరించుకొంటాడా?
లోకంలో ఇంతమంది జనులుంటే దేవుడు నన్ను గుర్తుపడతాడా
అనంతమైన యీ విశ్వంలో నేనేపాటివాణ్ణి అనుకోబోకు - సీరా 16,17
8. నీవు చేసేపని నీకు సబబుగానే వుండవచ్చు. కాని నీ ఉద్దేశాలను పరిశీలించి చూచేవాడు ప్రభువు -సామె 16,2
9. నేను పుట్టకమునుపే నన్ను గూర్చి నీకు తెలుసు
నాకు నిర్ణయింపబడిన దినాలన్నీ
నీ గ్రంథంలో లిఖింపబడి వున్నాయి
- అవి యింకా ప్రారంభం కాకమునుపే -కీర్త 139, 16

10. నిత్యుడవైన ప్రభూ! నీవు రహస్యాలను గుర్తుపట్టేవాడివి
పనులు జరగకముందే వాటినిగూర్చి తెలుసుకొనేవాడివి - దాని 13,42

11. ప్రభో! నీవు నరులు చేసే పనులన్నీ గమనిస్తూనే వుంటావు
ఎవరి కార్యాలకు తగినట్లుగా వాళ్ళను బహూకరిస్తూంటావు -యిర్మీ 32, 19

12. మా దేవుడు మోక్షంలో వున్నాడు
అయన తన కిష్టమొచ్చిన కార్యాలన్నీ చేస్తాడు
నరులు వెండి బంగారాలతో విగ్రహాలను చేస్తారు
మానవమాత్రులే వాటిని మలుస్తారు
కావుననే అవి నోళ్ళున్నా మాట్లాడలేవు
కండ్లున్నా చూడలేవు
చెవులున్నా వినలేవు - 15, 2-6

13. ప్రభువు కంటబడకుండా దాగి ఉండేదేదీ లేదు - హెబ్రె 4,13.

# 12. ప్రభువు సర్వాంతర్యామి

ప్రభువు అంతటా వుండేవాడు. అతడు ప్రాణికోటిలో వుంటాడు అనడంకంటె ప్రాణికోటే అతనిలో వుంటుంది అనడం సబబు. పక్షి ఆకాశంలో లాగ, తమరాకు వీళ్ళల్లోలాగ, మనమూ నిత్యం ఆ ప్రభువులో మునిగి తేలుతూంటాం. ఐనా చిత్రమేమిటంటే, మనం ఆ ప్రభువులో ఉన్నా అతన్ని గమనించనే గమనించం. కంటికి కన్పించే సృష్టి వస్తువులు మన హృదయాన్ని బలంగా ఆకర్షించి కంటికి కన్పించని ఆ సృష్టికర్తను పూర్తిగా విస్మరించేలా చేస్తాయి. ఐనా నరుడు ఆలోచనతో జీవించేవాడు. ప్రాణాత్మకుడైన ఆ ప్రభువు ప్రాణం పోస్తూండబట్టే అల్పప్రాణులమైన మనం ఇప్పటిదాకా ప్రాణాలతో బ్రతికి ఉన్నామని గుర్తించగలడు. ఈ సత్యాన్ని గుర్తించి దేవునికి కృతజ్ఞులమై యుండాలి. సజీవుడైన ఆ ప్రభువుని నిత్యం స్మరించుకొంటూండాలి.

1. ఏ నరుడూ నా కంటబడకుండా రహస్యంగా దాగుకోలేడు. నేను భూమ్యాకాశాల యందంతటా నెలకొని ఉండేవాణ్ణి - యిర్మీ 23,24
2. ప్రభువు ఎక్కడ ఏమిజరిగేదీ గమనిస్తూనే ఉంటాడు. మనం మంచి జేసినా చెడ్డజేసినా అతడు పరికిస్తూనే ఉంటాడు - సామె, 15,3
3. ప్రభువు నరులుచేసే పనులన్నీ గుర్తిస్తూనే వుంటాడు. వాళ్ళు ఎక్కడికి వెళ్ళినా ఏమిచేసినా అతడు ఒక కంట కనిపెడుతూనే వుంటాడు - సామె 5, 21
4. ప్రభువు కండ్లు సూర్యునికంటె పదివేలరెట్లు కాంతిమంతంగా వుంటాయి. అవి నరులుచేసే పనులన్నీ పరికిస్తూ వుంటాయి. రహస్య కార్యాలను గూడ గుర్తిస్తూనే వుంటాయి - సీరా 23, 19

5. నేను నిన్ను తప్పించుకొని ఎక్కడికి పోగలను?
నీ సన్నిధి నుండి పారిపోయి యెక్కడికి వెళ్ళగలను?
నేను ఆకాశానికి వెళ్తే నీవు అక్కడుంటావు
పాతాళానికి వెళ్తే అక్కడా వుంటావు
రెక్కలు కట్టుకొని మిన్నులు పడ్డచోటికి ఎగిరిపోతే
అక్కడా నీవు నన్ను ఆదుకోవడానికి సిద్ధంగా వుంటావు
చీకటిలో దాగుకొందామనుకొన్నా,
నా చుట్టూరా వున్న వెలుతురు చీకటి కావాలని కోరుకొన్నా
చీకటి నీకు చీకటిగా వుంటుందా?
చీకటిగూడ నీకు పగలుగాదా?
రేయింబవళ్ళు నీకు సమానం గాదా? - కీర్త 139, 7-12

6. దేవుడు నా ప్రక్కగా పోతున్నా నేనతన్ని గుర్తు పట్టలేకుండా వున్నాను
- యోబు 9,11

7. మన ప్రభువులాంటి దేవుడు లేనేలేడు
ఆయన మహోన్నతమైన ఆకాశంలో వుంటాడు
ఐనా క్రిందికి వంగి భూమిమీదికి పారజూస్తూంటాడు
దీనులను దుమ్ములోనుండి పైకి లేపుతాడు
అక్కరలోనున్నవారి యిక్కట్టులను తొలగిస్తూంటాడు - కీర్తన 113, 5-7

8. ప్రభో! జీవించివున్న ప్రతి ప్రాణినీ నీవు ఆదరంతో చూస్తూంటావు. నీవు సృజించిన జీవులను వేటినీ నీవు అసహ్యించుకోవు. అసహ్యించుకొనేవాడివైతే నీవు వాటిని కలిగించేవుండవు. నీవు పుట్టించందే ఏ ప్రాణి పుడుతుంది? నీవు సంరక్షించందే ఏజీవి మనుతుంది? ప్రతి ప్రాణి నీదే గనుక నీవు ప్రాణులన్నిటినీ ఆదరిస్తూంటావు. నీకు ప్రాణమంటే యిష్టం. నాశంలేని నీయాత్మ ప్రతి ప్రాణిలోను నెలకొని వుంటుంది
- జ్ఞాన 11, 24 -12,1

9. మీరు లోతైన నీళ్ళను దాటిపోయేప్పుడు నేను మీతో వుంటాను. మీ బాధలు మిమ్ము క్రుంగదీయలేవు. మీరు నిప్పుమంటలగుండా నడచిపోయేప్పుడు ఆ మంటలు మిమ్ము కాల్చివేయలేవు. మీ కడ్డువచ్చే యాతనలు మిమ్ము బాధించలేవు. మీ దేవుడనూ యిస్రాయేలు కొలిచే ప్రభువునూ ఐన నేను మిమ్ము తప్పక రక్షిస్తాను
- యెష 43,2

10. ప్రతి తరానా ప్రభువు జ్ఞానం కొంతమంది భక్తులను ఆవేసిస్తుంది. వాళ్ళను దేవుని స్నేహితులుగాను ప్రవక్తలుగాను మారుస్తుంది - జ్ఞాన 7,27

11. మనం ఆ ప్రభువులో మనుతూంటాం, జీవిస్తూంటాం, చలిస్తూంటాం - అచ 17,28.

# 13. ప్రభువు పవిత్రుడు

బైబులు భగవంతుడు మహాపవిత్రుడు. ఈ సంగతిని గుర్తించక క్రైస్తవులమైన మనం మంచినీళ్ళు త్రాగినంత సులభంగా పాపం చేస్తూంటాం. ఈలా చేయడం తగదు. మనం కొలిచే పవిత్ర ప్రభువు మనంకూడ తనలాగే పవిత్రులంగా వుండాలని కోరుకొంటాడు. మోషేలాంటి మహాభక్తులే పరిశుద్ధుడైన ఆ ప్రభువువైపు తేరిపారజూడలేక ముఖం కప్పేసుకున్నారు అంటే, పాపులమైన మనం ఆ దేవుణ్ణి ఆరాధించగలమా? ఐనా ఆ ప్రభువే మన హృదయాన్ని శుద్ధిచేసి మనలను తన్నారాధించే ప్రజలనుగా తయారుచేస్తాడు.

1. ప్రభువు పరిశుద్ధుడు, పరిశుద్ధుడు, పరిశుద్ధుడు
   ప్రపంచమంతా ఆయన మహిమతో నిండివుంది - యెష 6,3
2. ప్రభువువలె పరిశుద్ధుడైనవా డెవడూ లేడు
   అతనిలాంటివాళ్ళు లేరు
   అతనిలాగ రక్షించేవాళ్ళూ లేరు - 1 సమూ 2,2
3. దేవుని యెదుట ఏ నరుడైనా పుణ్యాత్ముడుగాను
   నిర్మలుడుగాను పరిగణింపబడతాడా?
   ఆయన కంటికి చంద్రుడే స్వచ్ఛంగా వుండడు
   నక్షత్రాలే నిర్మలంగా వుండవు
   మరి ఓ క్రిమీ కీటకమూ వంటివాడైన నరుడెంత?
   దేవుని ముందట నరుని విలువెంత? - యోబు 25, 4-6
4. దేవుని ముందట ఏ నరుడైనా
   పుణ్యాత్ముడుగా గణింపబడతాడా?
   సృష్టికర్త ముందట ఏ జనుడైనా
   నిర్మలుడుగా కన్పిస్తాడా?
   ప్రభువు స్వర్గంలోని దూతలనే నమ్మడు
   ఆయనకు దేవదూతల్లోనే లోపాలు కన్పిస్తూంటాయి
   మరి ఆ ప్రభువు ఓ మట్టిమానిసిని నమ్ముతాడా?
   పురుగులా కాలిక్రిందబడి నలిగిపోయే
   ఓ దుమ్ము మానసిని లెక్కజేస్తాడా? - యోబు 4,17-19
5. మీ దేవుణ్ణీ ప్రభువునీ ఐన నేను పరిశుద్ధుణ్ణి. కనుక మీరూ
   పరిశుద్ధులై యుండాలి - లేవీ 19,2

6. ప్రభో! నీవు దుష్కార్యాన్ని సహింపవు
పాపకార్యాన్ని నీ చెంతకు రానీయవు
నీవు గర్వాత్ములను చీదరించుకొంటావు
పాపకార్యానికి పూనుకొనేవాళ్ళంటే
నీకు పరమ అసహ్యం - కీర్త 5, 4-5

7. సకల జాతుల్లోను మీరే నా జనులు, నా సొంత ప్రజలు. మీరే నాకు యాజక రూపమైన రాజ్యం, మీరే నా పవిత్ర ప్రజ - నిర్గ 19, 5-6

8. అబ్రాహాము తొంబై తొమ్మిది యేండ్లవాడై యున్నప్పుడు దేవుడు ప్రత్యక్షమై "నేను సర్వశక్తిమంతుణ్ణయిన దేవుణ్ణి.నీవు నా సన్నిధిలో మెలుగుతూ ఉత్తముడవుగా ఉండాలి" అని చెప్పాడు -అది 17,1

9. మోషె దేవుణ్ణి చూడ్డానికి భయపడి ముఖం కప్పుకొన్నాడు - నిర్గ 3, 6

10. నీవు నా ముఖం చూడలేవు. ఏ నరుడు నన్ను జూచి బ్రతకజాలడు - నిర్గ 33, 20

11. అప్పుడు నేను "హా! చెడితినిగదా! నా పెదవులనుండి వెలువడేవన్నీ పాపపు మాటలే. నాతో వసించే యీ ప్రజలు పలికేవిగూడ పాపపు మాటలే. ఐనా నా యీకండ్లతో సర్వశక్తి మంతుడైన మహాప్రభువుని దర్శించానుగదా!" అనుకొన్నాను - యెష 6,5.

12. సైన్యాల కధిపతియైన ప్రభువు పరిశుద్ధుడని గ్రహించండి. అతన్ని చూచి భయపడండి - యెష 8,12

13. అటుపిమ్మట మెల్లని స్వరం విన్పించింది. ఆ స్వరాన్ని వినగానే యేలియా తన అంగీ చెంగుతో ముఖాన్ని కప్పుకొన్నాడు - 1 రాజు 19, 12

14. అలా వలలో విస్తారంగా చేపలుపడ్డం చూచి సీమోనుపేత్రు యేసు పాదాలమీదపడి "ప్రభో! నేను పాపిని. నీవు నన్ను విడిచివెళ్ళిపో" అన్నాడు - లూకా 4,8

15. పవిత్రాత్మ నీమీదికి దిగివస్తుంది. సర్వోన్నతుని శక్తి నిన్ను క్రమ్ముకొంటుంది. అందుచేత పుట్టబోయే శిశువు పరిశుద్ధుడై దేవుని కుమారుడు అనబడతాడు - లూకా 1, 35

## 14. ప్రభువు ప్రేమమయుడు

భగవంతుడు ప్రేమమయుడు. కరుణానిధి. బైబులు ఆ ప్రభువుని తల్లితోను, తండ్రితోను, భర్తతోను పోలుస్తుంది. ఆ దయామయుడు విధవలనూ అనాథబాలలనూ గూడ మరచిపోడు. పాపి అంటే ఆయనకు ఎంతో జాలి. భక్తుడు తన మననంద్వారా ప్రేమమూర్తియైన భగవంతుణ్ణి అనుభవానికి తెచ్చుకొంటూండాలి.

1. ప్రభువు కయీనుని దేశదిమ్మరివి కమ్మని శపించాడు. అతడు ఆ శాపానికి భయపడి నా కెదురుపడినవాళ్ళు నన్ను చంపివేస్తారు గదా అని దేవునికి మొరపెట్టుకొన్నాడు. కయీనుకు ఎదురుపడినవాళ్ళు అతన్ని చంపకుండా వుండేలా ప్రభువు అతని నొసటిమీద ఓ గురుతుపెట్టాడు. ఆ రీతిగా ప్రభువు కయీనుని కరుణించాడు. - ఆది 4, 12-15
2. నీవు మరియొకని అంగీని కుదువసొమ్ముగా తీసికొంటే దాన్ని ప్రొద్దుక్రుంకకముందే అతనికి తిరగి యిచ్చివేయాలి. అతడు ఒంటిమీద కప్పుకొనే నిలువుటంగీ అదే. అతడేమి కప్పుకొని పండుకొంటాడు? నేను దయామయుడనైన దేవుణ్ణి గనుక ఆ పేదవాడు నాకు మొరపెట్టుకొంటే నేనతని గోడు వింటాను - నిర్గ 22, 26
3. ప్రభువు మోషే ముందుగా సాగిపోతూ ఈలా ప్రకటించాడు. "ప్రభువు! ప్రభువు! అతడు కరుణామయుడు దయాపరుడైన దేవుడు. సులభంగా కోపపడేవాడు కాదు. నిత్యమూ ప్రేమ చూపేవాడు. నమ్మదగినవాడు. వేలకొలది ప్రజలను కృపతో జూచేవాడు. మన దోషాలనూ అపరాధాలనూ పాపాలనూ మన్నించేవాడు" - నిర్గ 34, 6-7
4. ప్రభో! నీవు కరుణామయుడవూ ప్రేమపూరితుడవూ అని నే నెరుగుదును. నీ వెప్పుడూ సహనంతోను దయతోను మెలుగుతూంటావు. నరులమీద కోపపడకుండా వుండాలనీ, వాళ్ళను శిక్షించకుండా వుండాలనీ, నీ వెప్పుడూ కోరుకొంటావు. - యోనా 4,2
5. ప్రాణులన్నీ ఆశతో నీవైపు చూస్తూంటాయి
వాటికి ఆకలైనప్పుడు నీవు ఆహారం పెడతావు
నీవు ప్రాణులకు అవసరమైనంతగా తిండి పెట్టి
వాటి అక్కర తీరుస్తుంటావు - కీర్త 145, 15-16
6. ఇతరజాతులకంటె మీదేమో పెద్దజాతి అని ప్రభువు మిమ్ము ఎన్నుకోలేదు. ప్రపంచములోని జాతులన్నిటికంటె మీది చాల చిన్నజాతి. కాని ప్రభువు మిమ్ము అధికంగా ప్రేమించాడు కనుక, మీ పితరులతో తాను చేసిన ప్రమాణాన్ని నెలబెట్టుకోగోరాడు గనుక, మిమ్మే ఎన్నుకొన్నాడు - ద్వితీ 7,7-8
7. గరుడపక్షి తనపిల్లలను రెక్కలమీద మోసికొనిపోయినట్లే నేనూ మిమ్ము ఐగుప్తునుండి మోసికొనివచ్చి నా కడకు చేర్చుకొన్నాను - నిర్గ 19,4
8. నేను మిమ్ము శాశ్వతమైన ప్రేమతో ప్రేమించాను. కనుక ఇప్పుడు మిమ్ము కరుణతో ఆదరిస్తాను - యిర్మీ 31,3

9. తల్లి తన ప్రేవున బుట్టిన బిడ్డను మరచిపోతుందా? తన శిశువును ప్రేమించకుండా వుంటుందా? ఒకవేళ తల్లి తాను కనిన బిడ్డను మరచిపోతే పోతుందేమోకాని, నేను మాత్రం మిమ్ము మరచిపోను - యెష 49, 15

9 ఎ. యెరూషలేమూ ! నేను నిన్నెన్నడూ మరువలేను
నీ పేరు నా యరచేతులమీద వ్రాసికొన్నాను - యెష 49, 16

10. యిస్రాయేలు బాలుడైయుండగా నేనతన్ని ప్రేమించాను. ఐగుప్తునుండి నా కుమారుణ్ణి పిలిపించాను - హోషే 11,1

11. తండ్రి తన కుమారునిమీద కరుణ జూపినట్లే
ప్రభువు తనకు భయపడేవాళ్ళమీద జాలి చూపుతాడు - కీర్త 103, 16

12. మా అమ్మా నాన్నా నన్ను గెంటివేసినా
ప్రభువుమాత్రం నన్ను చేరదీస్తాడు - కీర్త 27, 10

12ఎ. నీ ప్రేమ ప్రాణంకంటె మెరుగైంది
కనుక నేను నిన్ను స్తుతిస్తాను - కీర్త 63, 3

13. నిన్ను సృజించిన ప్రభువే నీ భర్త. సర్వశక్తిమంతుడని ఆయనకు పేరు. భర్తవలన పరిత్యక్తయై దుఃఖాక్రాంతురాలైన పడుచు భార్యను ఆ భర్తలాగే ప్రభువుకూడ నిన్ను మళ్ళా చేపడతాడు. ప్రభువు నీతో ఈలా అంటున్నాడు. నేను ఒక్క క్షణకాలం నిన్ను విడనాడాను. కాని యిప్పుడు గాఢానురాగంతో నిన్ను మళ్ళా చేరదీసుకుంటాను. కోపావేశంతో ఒక్కనిమిషం నీనుండి నా ముఖం మరల్చుకొన్నాను. కాని యిప్పుడు శాశ్వతమైన కృపతో నిన్ను కరుణిస్తాను. కొండలు కదిలితే కదలవచ్చుగాక, తిప్పలు తావుదప్పితే తప్పవచ్చుకాక. నా కరుణమాత్రం నిన్ను విడనాడదు - యెష 54, 5-10

14. ప్రభువు పీడితులకు అనుకూలంగా తీర్పుజెప్తాడు
ఆకలిగొన్నవాళ్ళకు అన్నం పెడతాడు
బందీలను చెరనుండి విడిపిస్తాడు
గ్రుడ్డివాళ్ళకు చూపు దయచేస్తాడు
క్రిందపడినవాళ్ళను లేవనెత్తుతాడు
తన భక్తులను ప్రేమతో ఆదరిస్తాడు
మన దేశంలో నున్న పరదేసులను కాపాడతాడు
విధవలనూ అనాథబాలలనూ ఆదుకొంటాడు
దుర్మార్గుల పన్నాగాలనుమాత్రం నాశం చేస్తాడు - కీర్త 146-8-9

15. ప్రభువు పరిశుద్ధమందిరంలో వసిస్తూంటాడు
విధవలనూ అనాథబాలలనూ సంరక్షిస్తూంటాడు - కీర్తన 68,6
16. పాపి చనిపోవడంవల్ల నాకేమీ సంతృప్తికలుగదు. అతడు పాపంనుండి వైదొలగి మళ్ళా జీవించడంవల్ల నాకు సంతోషం కలుగుతుంది - యెహె 33,11.
17. భూమికి ఆకాశం ఎంత యెత్తుగా ఉంటుందో
ప్రభువుకి భయపడేవాళ్ళపట్ల
అయన ప్రేమ అంత మిక్కుటంగా వుంటుంది - కీర్త 103, 11
18. ప్రభూ! నీవు మా తండ్రివి. మేము మట్టిముద్దలాంటివాళ్ళం. నీవు కుమ్మరివి. నీవే మమ్ము చేసావు - యెష 64,8
19. మనం పాపులమైయుండగా క్రీస్తు మనకొరకు చనిపోయాడు అంటే దేవునికి మనపట్ల ప్రేమవుందని అనుకోవాలి - రోమా 5,8
20. దేవుడు ప్రేమస్వరూపుడు - 1 యోహా 4,8
21. దేవుడు లోకాన్ని యెంతో ప్రేమించి తన యేకైక కుమారుణ్ణి ప్రసాదించాడు. ఆ కుమారుణ్ణి విశ్వసించే ప్రతివాడు నాశం చెందక నిత్యజీవం పొందడానికే దేవుడు అలాచేసాడు –యోహా 3,16
22. తన స్నేహితుల కొరకు ప్రాణాన్ని ధారబోసేవాడికంటె ఎక్కువ ప్రేమకలవాడెవడును లేడు - యోహా 15,13
23. ఇకమీదట నేను మిమ్ము దాసులని పిలవక స్నేహితులని పిలుస్తాను - యోహా 15,15
24. నన్ను ప్రేమించి నాకొరకు ప్రాణత్యాగం చేసికొనిన దేవుని పుత్రునియందలి విశ్వాసముచేతనే ఇప్పుడు నేను ఈ శారీరక జీవితం గడుపుతున్నాను - గల 2, 20
25. మనకు అనుగ్రహింపబడిన ఆత్మద్వారా దేవుని ప్రేమ మన హృదయాల్లోకి కుమ్మరింపబడింది - రోమా 5,5.

## 15. ప్రభువు విశ్వసనీయుడు

బైబులు భక్తులకు భగవంతునిమీద అచంచలమైన విశ్వాసం. భక్తుడు తాను నిద్రనుండి మేల్కొనడంగూడ భగవంతుడు చేసిన ఉపకారమేనని భావిస్తాడు. ప్రభువు అతనికి కోటా, దుర్గమూ, రక్షణమూను. శత్రుసైన్యాలు దండెత్తివచ్చినా అతడు భయపడడు. అతడు రథాలు గుర్రాలు మొదలైన అంగబలాన్ని కాక, దైవబలాన్ని నమ్మేవాడు. ప్రభువు అతని యెదుట దీపం వెలిగిస్తాడు. చీకట్లు తొలగిస్తాడు. అతడు తన భక్తుణ్ణి ఓ కాపరిలా ఆదరిస్తాడు. పచ్చిక పట్టుల్లో మేపుతాడు. చీకటి లోయలో పయనిస్తున్నపుడుకూడ తన చేతికోలతో అతన్ని కాపాడుతూంటాడు. భక్తుడు మాతృగర్భంనుండి బయటపడినప్పటినుండి

ప్రభువే అతనికి దేవుడు. అతడు నరులనుగాక దేవుణ్ణి నమ్ముకొని బ్రతికేవాడు. అంచేత పాలుత్రాగి తల్లి రొమ్ముమీద పండుకొన్న పసిబిడ్డలాగ అతని హృదయం నిమ్మళంగా వుండిపోతుంది. అతడు తన ఆత్మను ప్రభువు చేతుల్లో పెట్టి ప్రశాంతంగా ఉండిపోతాడు.

1. నేను పండుకొని నిద్రపోయాను
   మళ్ళా సురక్షితంగా లేచాను
   ప్రభువే నన్ను కాపాడాడు - కీర్త 3,5
2. నాకు పండుకోగానే హాయిగా నిద్రపడుతుంది
   ప్రభూ! నా రక్షణభారం వహించేవాడివి నీవే - 4,8
3. ప్రభువు నాకు శైలము, కోట, రక్షణము
   ప్రభువు నేను తలదాచుకునే దుర్గము
   ప్రభువు నాకు డాలు, మహాశ్రయం - 18,2
4. సైన్యాలు నామీదికి దండెత్తివచ్చినా
   నా హృదయం భయపడదు - 27,3
5. రాజునకు మహాసైన్యం వలననే విజయం కలగదు
   సైనికునికి మహాబలం వలననే రక్షణం కలగదు - 33,16
6. కొందరు రథాలనూ గుర్రాలనూ నమ్ముకొంటారు
   మేమైతే ప్రభుని నమ్ముకొంటాం - 20,7
7. ప్రభువు నాకు దీపం వెలిగిస్తాడు
   నా త్రోవలోని చీకటిని తొలగిస్తాడు - 18,28
8. ప్రభువు నాకు దీపమూ, రక్షణమూ
   ఇక నేనెవరికి భయపడాలి? - 27,1
9. ప్రభువే నాకు కాపరి, యిక యే కొదవా లేదు - 23, 1
10. నేను చీకటి లోయగుండా పయనించినా ఏ యపాయానికీ జంకను
    నీవు నాకు తోడైయుంటావు
    నీచేతి కోలా, నీ బడితా నన్ను కాపాడుతూంటాయి - 23, 4
11. పుట్టినప్పటినుండి నన్ను నీ రక్షణంలోనే వుంచారు
    మా తల్లికి జన్మించినప్పటినుండి నీవే నాకు దేవుడవు - 22,10
12. నేను ప్రభు మందిరం దగ్గిర పెరిగే ఓలివు చెట్టులా వున్నాను
    ఆ ప్రభువు ఆదరాన్ని నమ్ముకొని బ్రతుకుతున్నాను - 52,8

13. ప్రభువు నా చెంతనే వుంటాడు
నరులు నాకేమి కీడు చేయగలరు
నరులమీద ఆధారపడ్డం కంటె
ప్రభువునే నమ్ముకోవడం మేలు
గొప్పవాళ్ళను ఆశ్రయించడం కంటె
ప్రభువు మీదనే భారం వేయడం మేలు - 118, 7-9

14. పాలుత్రాగి తల్లి రొమ్ము మీద ప్రశాంతంగా పండుకొన్న పసిబిడ్డలాగ
నా హృదయం నిమ్మళంగా వుంది
నా మనసు సంతుష్టి చెందుతూంది 131,2

15. నన్ను నేను నీ చేతుల్లోకి అర్పించుకొంటున్నాను - 31, 5

16. ప్రభువు తల్లి పక్షిలా నిన్ను తన రెక్కలతో కప్పుతాడు
అతని రెక్కలక్రింద నీవు సురక్షితంగా వుండిపోతావు
అతడు నమ్మదగినవాడు
ఓ డాలులాగ నిన్ను కాపాడేవాడు - 91,4

17. ప్రభువు నిన్ను తన దూతల రక్షణంలో వుంచుతాడు
నీ వెక్కడికి వెళ్ళినా వాళ్ళు నిన్ను కాపాడుతూంటారు
నీ కాలు రాతికి దగిలి నొవ్వకుండా వుండేలా
వాళ్ళు నిన్ను తమ చేతుల్లో మోసికొనిపోతూంటారు - 91, 11-12

18. మా పితరులుగూడ నిన్నే నమ్ముకొన్నారు
నిన్ను నమ్ముకోగా, నీవు వాళ్ళను రక్షించావు - 22,4

19. ప్రభువు పేదలను దుమ్ములోనుండి పైకి లేపుతాడు
దీనులను దిబ్బల మీదినుండి లేవనెత్తుతాడు
రాజుల సరసన కూర్చుండబెడతాడు - 113, 7-8

20. ప్రభువే దేవుడని తెలిసికొనండి
అతడు మనలను కలిగించాడు
మనం అతని వాళ్ళం
ఆ ప్రభు ప్రజలం, అతడు మేపే మందలం - 100,3

21. పనివాళ్ళు పనికిరాదని నిరాకరించిన రాయే
చివరకు భవనానికి మూలరాయి అయింది - 118, 22

22. ప్రభువే మనకీ సుదినాన్నిచ్చాడు
కనుక సంతోషిద్దాం, ఉత్సవం జేసికొందాం - 118, 24

23. యువకులు అలసిపోవచ్చు, సొమ్మసిల్లి పడిపోవచ్చు
కాని ప్రభువుని నమ్మినవాళ్ళు నూత్నబలాన్ని పొందుతారు
వాళ్లు పక్షిరాజులా రెక్కలువిప్పి పైకెగురుతారు
వాళ్ళు పరుగెత్తుతూ గూడ అలసిపోరు
నడుస్తూగూడ సొమ్మసిల్లి పడిపోరు - యెష 40, 30 -31

24. ప్రభువు వాక్కిది
నన్ను విడనాడి నరుణ్ణి నమ్మేవాడు,
మనుష్యమాత్రునిమీద ఆధారపడేవాడు,
శాపగ్రస్తుడు
కాని నన్ను నమ్మేవాడు నా దీవెనలు పొందుతాడు -యిర్మీ 17, 5-7

24 A. అంజూరం పూత పట్టకపోయినా
ద్రాక్షతీగ కాయలు కాయకపోయినా
ఓలివు పంట నాశమైనా
పొలం పండకపోయినా
గొర్రెల గుంపులన్ని చచ్చినా
కొట్టంలోని పసులు నాశమైనా
నేను ప్రభువునందు ఆనందిస్తాను
నా రక్షకుడైన దేవునియందు సంతసిస్తాను - హబ 3, 17-18

25. ప్రభువునైన నేను మారిపోయేవాణ్ణి కాదు - మలాకీ 3,6

26. మోషే, దేవునితో ఫరోరాజు దగ్గరికి వెళ్ళడానికిగాని, యిస్రాయేలీయులను ఐగుప్తునుండి తీసికొనిరావడానికిగాని, నేనేపాటివాణ్ణి అన్నాడు. దేవుడు అతనితో నేను నీకు తోడైయుంటాను అని చెప్పాడు - నిర్గ 3, 11-12

27. మీ భారాన్ని ప్రభువు మీద మోపండి
అతడు మిమ్ము ఆదుకొంటాడు - కీర్త 55, 22
- మీ చింతలన్నీ ప్రభువుకే వదలివేయండి
అతడు మిమ్ము గూర్చి జాగ్రత్త పడతాడు - 1పేత్రు 5,7

28. దేవుడు తన్ను ప్రేమించేవాళ్ళకు అన్నీ అనుకూలంగానే జరిగి పోయేలా చేస్తాడు - రోమా 8,28

29. నేను సీలా, తిమోతి మీకు బోధించిన దైవపుత్రుడైన క్రీస్తు "ఔను" అనేవాడూ "కాదు" అనేవాడూ కాదు. అతడు దేవుని "ఔను" అని చెప్పాలి. దేవుని వాగ్దానాలన్నిటికిగూడ అతడు "ఔను" అనే సమాధానం అనాలి - 2 కొరి 1, 19-20

30. మనం విశ్వసనీయులం గాకపోయినా
క్రీస్తు విశ్వసనీయుడుగానే వుంటాడు
అతడు తన్నుతాను నిరాకరించుకొనడు - 2 తిమో 2, 13

31. యేసుక్రీస్తు నిన్నా, నేడూ, యెల్లప్పుడూ ఒకేరీతిగా వుంటాడు - హెబ్రే 13,8.

## 16. ప్రభువు రక్షణదాత

నరుడు ఆపదల్లో చిక్కుకొని భగవంతునికి మొరపెట్టుకొంటాడు. అతని నుండి రక్షణం పొందగోరుతాడు. ప్రభువు తన దేవళం నుండీ, తాను వసించే సీయోను పర్వతం మీదినుండీ, భక్తుని మొర ఆలిస్తాడు. అతని వెలుగూ, సత్యమూ దూతల్లా బయలుదేరి వెళ్ళి భక్తుని తోడ్కొని వస్తాయి. నరుడు పేదవాడే కావచ్చు. దీనుడే కావచ్చు. అతని మొరను మాత్రం ప్రభువు అనాదరం చేయడు. అతడు భక్తుణ్ణి కంటి పాపను కాపాడినట్లుగా కాపాడుతాడు. తల్లి పక్షిలాగ అతన్ని తన రెక్కలక్రింద దాచుకొంటాడు. భగవంతుడు ఆదుకోకపోతే, అతని ముఖకాంతి ప్రకాశించకపోతే, భక్తుడు ఎప్పుడో మృతలోకం చేరుకొనేవాడే. ఔను, ప్రభువు తన పావురాన్ని డేగపాలు చేయడు. ఆ పావురం వలలో చిక్కుకొని గూడ, ఆయన కరుణవల్ల తప్పించుకొంటుంది. ప్రభువు తన భక్తుణ్ణి దీర్ఘాయువుతో సంతృప్తి పరుస్తాడు. భక్తుడు ఆ ప్రభు రక్షణాన్ని పొంది సుఖిస్తాడు. యిస్రాయేలు దేవుడు నిద్రపోయేవాడూ కాదు, కునికిపాట్లు పడేవాడూ కాదు. నిత్యం మేల్కొని వుండి ప్రజలను గమనిస్తుంటాడు. రక్షిస్తుంటాడు. అలాంటి ప్రభుని నమ్ముకొని జీవించే నరుడు ధన్యుడు గదా!

1. నా బాధల్లో ప్రభుని మనవి చేసాను
నా దేవునికి మొరపెట్టుకొన్నాను
తన దేవళంనుండి ప్రభువు నా వేడుకోలు విన్నాడు
నా యాక్రందనం అతని చెవిని పడింది - కీర్త 18,6

2. ప్రభువు తన దేవాలయం నుండి నీకు సహాయం పంపునుగాక
సీయోను కొండమీదినుండి నిన్ను ఆదుకొనునుగాక - 20,2

3. నీ వెలుగునూ నీ సత్యాన్నీ పంపించు
అవి నీవు వసించే పరిశుద్ధ పర్వతానికి
నన్ను తోడ్కొని వస్తాయి - 43, 3

4. నేను కొండలవైపు పారజూచాను
ఎవరివద్ద నుండి నాకు సహాయం కలుగుతుంది?
భూమ్యాకాశాలను సృజించిన ప్రభువు నుండిగాని
నాకు సహాయం లభించదు - 121, 1-2

5. భూమ్యాకాశాలను సృజించిన ప్రభువు నుండి
మాకు సహాయం లభిస్తుంది - 124, 8
6. ఈ పేద నరుడు మొర్రపెట్టగా ప్రభువు ఆలించాడు
సకలాపదల నుండీ ఇతన్ని కాపాడాడు - 34, 6
7. నన్ను కంటిపాపను కాపాడినట్లుగా కాపాడు
నీ రెక్కల నీడలో నన్ను దాచి ఉంచుకో - 17,8
8. ప్రభువుపట్ల భయభక్తులను చూపేవాళ్ళను
ఆయన దూత కాపాడుతూంటాడు
సకలాపదలనుండి రక్షిస్తుంటాడు - 34, 7
9. ప్రభువే గనుక నన్ను ఆదుకోకపోయినట్లయితే, ఈపాటికెప్పుడో మృతలోకం జేరుకొని ఉండేవాణ్ణే - 94, 17
10. తప్పిపోయిన గొర్రెలాగ నేను త్రోవదప్పాను
ప్రభూ! ఈ నీ సేవకుణ్ణి వెదకడానికి రా
నేను నీ యాజ్ఞలను పాటించే భక్తుణ్ణి - 119, 176
11. నీ ముఖకాంతిని నా మీద ప్రకాశింపనీయి
నీ యాజ్ఞలను నాకు బోధించు - 119, 135
12. నీ జనమనే యీ పావురాన్ని డేగపాలు జేయకు
దీనులైన యీ నీ సేవకుల ప్రాణాలను మరచిపోకు - 74, 19
13. వేటగాని ఉరులలో జిక్కి తప్పించుకొన్న పక్షిలాగ
మేమూ ఆపదలనుండి తప్పించుకొన్నాం
ఉరులు తెగాయి, మేము తప్పించుకొన్నాం - 124, 7
14. నన్ను కరుణించు ప్రభో! నన్ను కరుణించు
అపాయాలన్నీ తొలగిపోయిందాకా నేను
నీ రెక్కల మరుగుననే దాగుకొంటాను - 57, 1
15. నీవు ఇంటిలోనికి వచ్చినా బయటికి వెళ్ళినా ఇప్పుడూ యెప్పుడూ
ప్రభువు నిన్ను కాపాడుతూనే వుంటాడు - 121, 8
16. నేనతన్ని దీర్ఘాయువుతో సంతృప్తి పరుస్తాను
అతడు నా రక్షణాన్ని చవిజూస్తాడు - 91, 16
17. యిస్రాయేలు ప్రజలకు కావలికాసే ప్రభువు
కునికిపాట్లు పడనూ పడడు, నిద్ర పోనూపోడు - 121, 4
18. నేనే ప్రభువుని
నేను తప్ప మరొక రక్షకుడు లేడు - యెష 43, 11

19. ఎల్ల జాతులు చూస్తుండగా
ప్రభువు పవిత్రమైన తన బాహుశక్తిని ప్రదర్శిస్తాడు
ఈ భూలోకమంతా మన ప్రభువు రక్షణాన్ని చూస్తుంది - యెష 52,10
20. నీవు అతనికి యేసు అని పేరు పెట్టాలి. అతడు తన ప్రజలను వాళ్ళ పాపాలనుండి రక్షిస్తాడు - మత్త 1, 21
21. ప్రజలందరి యెదుట నీవు సిద్ధంచేసిన రక్షణాన్ని నేను కన్నులారా చూచాను - లూకా 2, 30
22. దేవుడు లోకాన్ని యెంతో ప్రేమించి తన యేకైక కుమారుణ్ణి ప్రసాదించాడు. ఆ కుమారుణ్ణి విశ్వసించిన ప్రతివాడు నాశం చెందక నిత్యజీవం పొందుతాడు. దేవుడు తన కుమారుణ్ణి పంపింది లోకాన్ని రక్షించడానికిగాని ఖండించడానికిగాదు - యోహా 3, 16-17
23. మనుష్యకుమారుడు వచ్చింది తప్పిపోయినదాన్ని వెదకి రక్షించడానికే - లూకా 19,10
24. అతడు నలిగిపోయిన రెల్లుకాడను త్రుంచివేయడు, కునికిపాట్లుపడే దీపాన్ని ఆర్పివేయడు - మత్త 12,20
25. అతని వలన తప్ప మరి యెవరివలనా రక్షణం కలుగదు. ఈ నామం మీదిగానే మనం రక్షణం పొందాలి. ఆకాశం క్రింద మనుష్య లోకంలో ఈయబడిన మరి యే నామం మీదిగాను మనకు రక్షణం లేదు - అచ 4, 12
26. అప్పుడు ప్రభువు నామం మీదిగా ప్రార్థనచేసే వాళ్ళంతా రక్షణం పొందుతారు - అచ 2,21
27. నీవు ప్రభువైన యేసుని విశ్వసించు. అప్పుడు నీవూ నీ కుటుంబమూ రక్షణం పొందుతారు - అకా 16,31
28. మానవులందరూ రక్షణం పొందాలనే దేవుని కోరిక - 1తిమొ 2,4
29. అతడు తనకు విధేయులైనవారి కందరికీ నిత్యరక్షణ కారకుడయ్యాడు - హెబ్రే 5,9
30. ఇదిగో యిప్పుడే మిక్కిలి అనుకూలమైన సమయం. ఇదే రక్షణదినం - 2కొరి 6,24

## 17. ప్రభువు కరుణామయుడు

బైబులు భగవంతుని ప్రధాన లక్షణాల్లో కనికరంగూడ ఒకటి. అతడు కరుణామయుడు. ఓ తండ్రిలాగ, ఓ తల్లిలాగ తన ప్రజలను ఆదరించేవాడు. భక్తుణ్ణి సొంత తల్లి దండ్రులే యింటిలోనుండి గెంటివేసినా ప్రభువుమాత్రం అతన్ని ఆదరిస్తాడు. తన దేవళంలో చేర్చుకొంటాడు. మరో భక్తుడు చనిపోయి పాతాళలోకం చేరుకోవలసిన

సమయం వచ్చింది. కాని పాతాళంలో ప్రభువు నెవరూ స్తుతించరు. కనుక తన్ను భూమి మీదనే నిలపమని కోరాడు. తానా ప్రభువు కరుణను స్తుతిస్తానని మాటయిచ్చాడు.

ప్రభువు దీర్ఘశాంతుడు, క్షణమాత్రకోపి. ఆయన తాను కలిగించిన ప్రతిప్రాణిపట్లా కనికరం జూపుతుంటాడు. పైగా మన పాపాలకు తగినట్లుగా మనలను శిక్షింపడు. అలా శిక్షిస్తే మనమంతా యిప్పటికల్లా ఎక్కడుండేవాళ్ళమో! భూమికి ఆకాశం ఎంత ఎత్తుగా వుంటుందో ఆయన ప్రేమగూడ అంత మిక్కుటంగా వుంటుంది. పడమర తూర్పునకు ఎంత దూరమో మన పాపాలనూ ఆయన అంతదూరంగా తొలగిస్తాడు. వేయేల? తండ్రి తన బిడ్డలమీద కరుణజూపినట్లే భగవంతుడూ తన భక్తులమీద జాలి జూపుతూంటాడు. అతనిది పితృహృదయం, మాతృహృదయం.

1. మా అమ్మా నాన్నా నన్ను గెంటివేసినా
   ప్రభువు మాత్రం నన్ను ఆదరిస్తాడు - కీర్త 27, 10
2. నేను చనిపోతే నీకేమి లాభం?
   నేను పాతాళం జేరుకొంటే నీకేమి ఫలితం?
   అక్కడి మృతులు నిన్ను స్తుతిస్తారా?
   నీ మంచితనాన్ని కొనియాడతారా?
   కనుక ప్రభో! నా మొర ఆలించు
   కరుణతో నాకు తోడ్పడు - 30, 9-10
3. ప్రభువు కోపించేది ఓ క్షణకాలంమాత్రమే
   ఆయన అనుగ్రహమేమో జీవితాంతమూ వుంటుంది - 30,5
4. ప్రభువు ప్రేమహృదయుడు కరుణామయుడు
   అతడు సులభంగా కోపపడేవాడు కాదు
   అతడు ఎంతో మంచివాడు
   తాను చేసిన ప్రతి ప్రాణినీ కనికరించేవాడు - 145, 8-9
5. ప్రభువు ప్రేమహృదయుడు, కరుణామయుడు
   అతడు సులభంగా కోపపడేవాడు కాదు
   అతడు నిత్యమూ మనలను చీవాట్లు పెట్టడు
   అతని కోపం దీర్ఘకాల ముండేదికాదు
   మన పాపాలకు తగినట్లుగా మనలను శిక్షింపడు
   మన దోషాలకు తగినట్లుగా మనకు ప్రతిఫలమీయడు
   భూమికి ఆకాశం ఎంత ఎత్తుగా వుంటుందో
   ప్రభువుకి భయపడేవాళ్ళపట్ల

ఆయన ప్రేమ అంత మిక్కుటంగా వుంటుంది
పడమరకు తూర్పు ఎంత దూరమో
మన పాపాలను ఆయన అంత దూరంగా తొలగిస్తాడు
తండ్రి తన కుమారులమీద కరుణ జూపినట్లే
ప్రభువు తనకు భయపడేవాళ్ళమీద జాలి జూపుతాడు
మన మేలాంటివాళ్ళమో అతనికి తెలియకపోదు
పిడికెడు మట్టినుండి పుట్టినవాళ్ళమని అతడు గ్రహింపకపోదు - 103, 8-14

6. యావే యిస్రాయేలీయులమీద న్యాయాధిపతులను నియమించినపుడెల్లా తాను ఆ న్యాయాధిపతికి తోడుగా వుండేవాడు. అతడు జీవించినంత కాలమూ ప్రజలను శత్రువులనుండి కాపాడేవాడు. శత్రువుల దెబ్బకు తట్టుకోలేక ప్రజలు మొర్రపెట్టగానే యావే వారిని కరుణించేవాడు. కాని ఆ న్యాయాధిపతి చనిపోగానే ప్రజలు మళ్ళా దుష్టకార్యాలకు పూనుకొనేవాళ్ళు - న్యాయాధి 2, 18-19

7. దుర్మార్గుడు తన మార్గాన్ని విడనాడి
తన యాలోచనలను మార్చుకొనునుగాక
దుష్టుడు ప్రభువు వద్దకు మరలివస్తే
అతడు వానిని కరుణించి శీఘ్రమే మన్నిస్తాడు - యెష 55,7

7A. ప్రభువు కాపరివలె తన మందలను మేపుతాడు
గొర్రెపిల్లలను చేతులలోనికి దీసికొని
రొమ్ముమీద బెట్టుకొని మోసికొనిపోతాడు
వాని తల్లులను మెల్లగా అదిలిస్తాడు - యెష 40,11

7B. ప్రభువు ఈలా పల్కుతున్నాడు
నేను యెరూషలేంమీదికి
అభ్యుదయాన్ని నదివలె పారిస్తాను
జాతుల సంపదలను పొంగిపొరలే కాలువలాగా
ఆ నగరం మీదికి పారిస్తాను
యెరూషలేమనే తల్లి మీకు చంటిబిడ్డలకులాగే పాలిస్తుంది
మిమ్ము తన చేతులలోకి ఎత్తుకొంటుంది
తన యొడిలో కూర్చుండబెట్టుకొని లాలిస్తుంది
తల్లి కుమారునిలాగే నేను మిమ్ము ఓదారుస్తాను
యెరూషలేములో మిమ్ము ఓదారుస్తాను - యెష 66, 12-13

8. తిరిగి మనం ప్రభువు దగ్గరికి వెళ్దాం
అతడు మనలను కొట్టాడు, కాని మనకు చికిత్స చేస్తాడు
మనలను గాయపరిచాడు, కాని మన గాయాలకు కట్టుకడతాడు
– హోషేయ 6,1

8 A. ప్రభువు ఈలా అంటున్నాడు
యిస్రాయేలు బాలుడై యుండగా నేనతన్ని ప్రేమించాను
ఐగుప్తునుండి నా కుమారుని పిల్చాను
కాని నేనతన్ని పిల్చినకొలది
అతడు నానుండి వైదొలగాడు
నా ప్రజలు బాలుదేవతకు బలు లర్పించారు
విగ్రహాలకు సాంబ్రాణిపొగ వేసారు
యిస్రాయేలుకి నడవడం నేర్పింది నేనే
నేను వాళ్ళను నా చేతుల్లోకి తీసుకొన్నాను
ఐనా నేను తమ్ము కరుణించానని వాళ్ళు గ్రహించలేదు
గాఢమైన ప్రేమానురాగాలతో
నేను వాళ్ళను నా చెంతకు రాబట్టుకొన్నాను
వాళ్ళను పైకెత్తి నా బుగ్గల కానించుకొన్నాను
క్రిందికి వంగి వాళ్ళచే అన్నం తినిపించాను
ఐనా వాళ్ళు నా వద్దకు రావడానికి అంగీకరింపలేదు – హోషే 11, 1-5

8 B. యిస్రాయేలూ! నేను నిన్నెట్లు విసర్జించగలను!
నిన్నెట్లు పరిత్యజించగలను?
నేను నిన్ను ఆద్మావలె, సెబోయీమువలె, నాశం చేయగలనా?
నా హృదయం అందులకు అంగీకరించడంలేదు
నా యెదద జాలితో కంపిస్తూంది
నేను కోపంతో మిమ్ము శిక్షింపను
యిస్రాయేలును మరల నాశం చేయను
నేను దేవుణ్ణిగాని నరుణ్ణి కాదు
నేను మీమధ్య వున్న పవిత్రమూర్తిని
నేను మీ చెంతకు కోపంతో రాను – హోషే 11, 8-9

9. ప్రభూ! నీలాంటి దేవుడు లేడు
నీవు ప్రజల పాపాలు మన్నిస్తావు
నీ కోపం దీర్ఘకాలం నిలువదు
నీ కరుణను ప్రదర్శించడం నీ కానందం
మరల వొకసారి నీవు మామీద కరుణజూపు
మా యపరాధాలను నీ కాళ్ళక్రింద త్రొక్కివేయి
మా పాపాలను సముద్రగర్భంలోనికి విసరివేయి - మీకా 7, 18-19

10. ప్రభువుకి నీ పాపాలు తెలుసు
నీ వితరులమీద పగతీర్చుకొంటే
ప్రభువు నీ మీద పగతీర్చుకొంటాడు
కాని నీకు అపరాధం చేసినవాణ్ణి నీవు మన్నిస్తే
నీవు ప్రార్థన చేసినపుడు దేవుడు నీ తప్పులు మన్నిస్తాడు
నీ వితరులమీద కోపతాపాలు చూపుతూ
నిన్ను కరుణించమని ప్రభువుని ఎలా అడుగుకొంటావు?
నీ మట్టుకు నీవు పాపివి
ఐనా నీ వితరుల పాపాలు మన్నించడంలేదు
మరి దేవుడు నీ తప్పులను మన్నించాలని ఎలా అడుగుకొంటావు?
నరమాత్రుడవైన నీవు నీ కోపాన్ని అణచుకోలేకపోతే
నీ దోషాల నెవరు మన్నిస్తారు? - సీరా 28, 2-5

11. యేసు పడవదిగి జనసమూహాన్ని చూచాడు. కాపరిలేని గొర్రెల మందలావున్న ప్రజలపై కనికరం గలిగి వారికి అనేక విషయాలను బోధింపసాగాడు - మార్కు 6, 34

12. "నాకు కారుణ్యం కావాలికాని బలి అక్కరలేదు" అనే వేదవాక్యం భావం మీరు అర్థం చేసికొనండి. నేను వచ్చింది పాపులను పిలవడానికిగాని నీతిమంతులను పిలవడానికి కాదు - మత్త 9, 13. హోషే 6,6

13. ప్రజల పాపాల పరిహారార్థం భగవత్సేవలో విశ్వసనీయుడును దయామయుడనైన ప్రధాన యాజకుడు కావడానిగ్గాను, అతడు సర్వవిధాల తన సోదరులను పోలినవాడు కావలసివచ్చింది - హెబ్రే 3,17

14. నా సోదరుల్లో అత్యల్పుడైన ఏ వొక్కనికైనా మీరు ఇవి చేసినపుడు వీటిని నాకు చేసినట్లే - మత్త 25, 40

15. ఎవడైనా సరే ధనికుడై యుండిగూడ అక్కరలోవున్న తన సోదరుని గాంచి కనికరం జూపకపోతే, ఇక అతని హృదయంలో దైవప్రేమ వుందని యేలా చెప్పగలం? - 1 యోహా 3,17.

# 18. ప్రభువు పితృతుల్యుడు

యిస్రాయేలు ప్రజలూ క్రైస్తవ ప్రజలూ భగవంతుణ్ణి తండ్రిగా భావిస్తూ వచ్చారు. ఇది బైబులు మతానికి ప్రత్యేకం. ఆ ప్రభువుకి వర్తించే గుణాలన్నిటిల్లోను శ్రేష్ఠమైన గుణం పితృభావం. క్రీస్తు ద్వారా మనం పరలోకంలోని తండ్రికి బిడ్డలమౌతాం. అతని ద్వారానే ఆ తండ్రి దీవెనలు పొందుతాం.

1. యిస్రాయేలు నా కుమారుడు, నాకు మొదట పుట్టినవాడు. నన్నారాధించుటకు నా కుమారుని వెళ్ళనీయి. కాని అతన్ని పంపడానికి నీవంగీకరించడంలేదు. కావున నేను నీకు మొదట పుట్టిన కుమారుణ్ణి చంపివేస్తాను - నిర్గ 4, 22-23
2. యిస్రాయేలు బాలుడై యుండగా నేనతన్ని ప్రేమించాను. ఐగుప్తునుండి నా కుమారుణ్ణి పిలిపించాను - హోషేయ 11,1
3. ప్రభూ! నీవే మాతండ్రివి. మా పితరులైన అబ్రాహాము యాకోబు మమ్ము అంగీకరింపకపోయినా నీవే మా తండ్రివి. పురాతన కాలంనుండీ మమ్మల్ని రక్షిస్తూ వచ్చినవాడవు నీవే - యెష 63,16
4. ప్రభో! నీవే మా తండ్రివి. కుమ్మరి బంకమట్టితో కుండను చేసినట్లుగా నీవు మమ్ము చేసావు. మా మీద కోపించబోకు. మా పాపాలను గణించబోకు. మేము నీ ప్రజలంగనుక మా మీద కరుణజూపు - యెష 64, 8-9
5. మా అమ్మా నాన్నా నన్ను విడనాడినా
   ప్రభువు మాత్రం నాకు ఆశ్రయమిస్తాడు - కీర్త 37, 10
6. నాయనా! యావే శిక్షను తృణీకరించవద్దు
   అతని మందలింపులకు విసుగు జెందవద్దు
   తండ్రి తన కిష్టమైన కుమారుణ్ణి సవరించినట్లే
   ప్రభువు తన కిష్టులైనవాళ్ళను సరిదిద్దుతాడు - సామె 3,11-12
7. నీతిమంతుడు దేవుని కుమారుడైతే దేవుడతనికి సాయపడతాడు
   శత్రువుల బారినుండి అతన్ని కాపాడతాడు - జ్ఞాన 2,18
8. పరలోకంలోని తండ్రికి మీ యవసరాలన్నీ తెలుసు - మత్త 6,32

9. మీరెంత చెడ్డవాళ్ళైనా మీ బిడ్డలకు మేలి వస్తువుల నీయాలని మీకు తెలుసుగదా! పరలోకంలోని మీ తండ్రి తన్నడిగిన వాళ్ళకు ఇంకా యెంతటి మేలివస్తువుల నిస్తాడో ఊహించండి - మత్త 7,11

10. ఆకాశంలో తిరిగే పక్షులను చూడండి. అవి విత్తనాలు నాటవు. నూర్పిళ్ళు చేయవు. గాదెల్లో ధాన్యం నిల్వజేసికోవు. ఐనా పరలోకంలోని మీ పిత వాటిని పోషిస్తున్నాడు. ఆ పక్షులకంటె మీరు విలువైనవాళ్ళు కాదా? - మత్త 6, 26

11. ఈనాడుండి రేపు పొయ్యిలో కాలిపోయే గడ్డిపోచనే దేవుడు అలా పూలనే వస్త్రాలతో అలంకరిస్తుంటే, అంతకంటె అధికంగా ఆయన మీకు బట్టలీయడా!
- మత్త 6, 30

12. పరలోకంలోని మీ తండ్రిలాగే మీరూ పరిపూర్ణులై యుండండి - మత్త 5, 48
మీ తండ్రిలాగే మీరూ కనికరం గలవారై యుండండి - లూకా 6, 36

13. తండ్రి నా యందూ నేను తండ్రియందూ నెలకొని వున్నామని గ్రహించండి
- యోహా 10,38

14. నన్ను పంపిన తండ్రి ఆకర్షిస్తేనే తప్ప ఎవడూ నా వద్దకు రాలేడు - యోహా 6,44
- నామూలాన తప్ప ఎవడూ తండ్రివద్దకు రాలేడు - 14,6

15. క్రీస్తుని అంగీకరించి విశ్వసించినవాళ్ళందరికీ అతడు దేవుని బిడ్డలయ్యే భాగ్యం ఇచ్చాడు - యోహా 1, 12
- యేసు క్రీస్తుని విశ్వసించడం వలన మీరందరూ దేవుని కుమారులౌతున్నారు
- గల 3,26

16. తండ్రీ అని మొరపెట్టే తన కుమారుని ఆత్మను దేవుడు మన హృదయాల్లోనికి పంపాడు - గల 4,6

17. మనం దేవుని బిడ్డలమని పిలువబడుతున్నాం అంటే దేవుడు మనల నెంతగా ప్రేమించాడో ఆలోచించండి. ఔను, మనం నిజంగా దేవుని బిడ్డలమే
- 1 యోహా 3,1.

***



ఫాదర్ పూదోట జోజయ్య, S.J. గారు, పూదోట మరయ్య, చిన్నమ్మ దంపతులకు 1931వ సం॥ ఫిబ్రవరి 15న, గుంటూరు జిల్లాలోని కనపర్రు గ్రామంలో జన్మించారు. ఈయన ప్రాథమిక విద్యను కనపర్రులో, ఉన్నతవిద్యను ఫిరంగిపురంలో అభ్యసించారు. మద్రాసు లొయోలాలో కళాశాల విద్యను పూర్తిచేసి, ఆంధ్రవిశ్వవిద్యాలయంలో M.A. (సాహిత్యం) లో పట్టా పుచ్చుకున్నారు.

1955లో తమిళనాడులోని దిండిగల్ నందు యేసుసభలో చేరిన జోజయ్యగారు, అటుపిమ్మట కొడైకెనాల్‌లో తత్వశాస్త్రాన్ని, కర్సియాంగ్‌లో వేదాంతశాస్త్రాన్ని నిశిత పరిశీలనా దృష్టితో క్షుణ్ణంగా అధ్యయనం గావించారు. 1965, మార్చి 27న బిషప్ ముమ్మడి ఇగ్నేష్యస్ గారి చేతుల మీదుగా ఫిరంగిపురంలో గురుపట్టం పొందారు.

రోమునగరంలోని బిబ్లికల్ ఇన్‌స్టిట్యూట్‌లో బైబులు విద్యనభ్యసించిన జోజయ్యగారు ఆ తర్వాత తనదైన విశిష్టశైలిలో బైబులు సాహిత్యానికి ఎనలేని సేవ చేసారు. లొయోలా కళాశాలలో 2 సంవత్సరములు ఉపన్యాసకునిగా విద్యార్థులకు చక్కని శిక్షణను అందించారు. పుస్తకరచన, బైబులుబోధ, విద్యార్థులకు నాయకత్వ శిక్షణ వీరి ముఖ్య కార్యక్రమాలు.

**సాహిత్యరంగంలో వీరు నిర్వహించిన కొన్ని బృహత్తర కార్యక్రమాల వివరాలు :**

1. **అనువాదకునిగా** : అకుంఠిత దీక్షతో 17 సం॥లు అవిరళకృషిసల్పి క్యాథలిక్ బైబులులోని పూర్వవేదాన్ని జనరంజకంగా తెలుగులోనికి అనువదించారు.
2. **ఆధ్యాత్మికవేత్తగా** : ఆధ్యాత్మిక చింతనకు పెద్దపీట వేస్తూ ఆయన నడిపే బైబులు భాష్యం పత్రిక, బైబులు గ్రంథమాల ఆయన ఆధ్యాత్మికరంగంలో నిత్యకృషీవలుడని చెప్పకనే చెబుతాయి.
3. **విద్యార్థి బాంధవునిగా** : విద్యార్థిలోకాన్ని ఉత్తేజపరచడానికి, వారిలో నవచైతన్యం నింపడానికి ఆయన నడిపే చైతన్యవాణి పత్రిక, విద్యార్థిహిత గ్రంథమాల, విద్యార్థిలోకానికే నిర్దేశకాలు.
4. **వక్తగా** : ఆంధ్రరాష్ట్రమంతటా తిరిగి విద్యార్థులకు,ఉపాధ్యాయులకు, ఉపదేశకులకు సామాన్యప్రజానీకానికి వందలకొలది సదస్సులు నిర్వహించి, వారిలో నవ్యోత్సాహాలను నింపారు.